అంతర భారతీయ పుస్తకమాల

# తెల్లని రక్తం

రచన :

నానక్ సింగ్

అనువాదము :

పోకూరి శ్రీరాములు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
కొత్త ఢిల్లీ

మార్చి 1972 (చైత్ర 1894)



రూ : 4—75

*Original Title :* CHITTA LAHU (Punjabi)
*Telugu Title :* TELLANI RAKTAM

డిస్ట్రిబ్యూటర్లు :
ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్లు
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA, A-5 GREEN PARK, NEW DELHI 16, AND PRINTED BY MAHILA PRESS, ANDHRA MAHILA SABHA UNIVERSITY ROAD, HYDERABAD-44.

# తొలిపలుకు

భారతదేశం విశాలమైన దేశం. సాంస్కృతికంగా దేశమంతా ఒక్కటే అయినప్పటికీ మన జాతీయ శక్తిని బలపరచి దేశానికి కావలసిన అభ్యుదయాన్ని సాధించేందుకు ఈ సమైక్య సూత్ర సంధానాన్ని మరింత పటిష్టం చేయవలసిన అవసరం ఇంకా వుంది.

మనదేశంలో చాలా భాషలున్నాయి. ప్రపంచంలో మరి ఏ దేశంలోకూడా ఇన్ని భాషలు ఉన్నట్టు కనిపించదు. కాని మన ఇరుగుపొరుగు భాషలను గురించి తెలుసుకోవాలనే ఆసక్తి మనకు చాలా తక్కువ. ఇతర భాషలయందలి పరిజ్ఞానంకూడా మనకు తక్కువే. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ మొదలయిన యూరపీయ భాషా సారస్వతాలను గురించికానీ, ఆ భాషలు మాట్లాడేవారి సాంఘిక జీవితాన్ని గురించికానీ తెలిసినంతగా మనకు మన దేశభాషల సారస్వతాన్ని గురించి తెలియదు.

భావాత్మకంగానూ, సాంస్కృతికంగానూ, దేశంలో సమైక్యం సమకూర్చుకునేందుకు నాగరిక దేశమనిపించుకుంటున్న మనదేశంలోని వివిధ భాషల్లో వెలువడుతున్న సారస్వత రచనలను గురించి సమగ్రంగా తెలిసికొని, ఆయా భాషలు మాట్లాడే ప్రజల జీవిత విధానం, వారి ఆశయాలూ, ఆచారాలూ వారి సాంస్కృతిక దృక్పథం పూర్తిగా అవగాహనంచేసికోవటం చాలా అవసరం.

పాశ్చాత్య దేశాల్లో ఏ దేశానికి అది వేరుగా ఉన్న దేశాలెన్నో ఉన్నాయి. ప్రతి దేశానికీ ప్రత్యేకమైన ఒక భాష కూడా వుంది. అయినప్పటికీ ఆ దేశవాసులు తమ పరిసర భాషల్లో ఎప్పటికప్పుడు వెలువడే సారస్వతాన్ని గురించి

అవ్యవహితంగా సూక్ష్మ పరిజ్ఞానాన్ని సమకూర్చుకుంటారు. కాని మనకు మనదేశ భాషలనుగురించి అంతటి పరిచయం లేకపోవటం విరోధిభావంగా తోస్తుంది. యూరప్‌లో ఏ భాషలోనైనా ఒక ఉత్కృష్ట రచన జరిగితే అది వెంటనే అనువాద రూపంలో మిగిలిన భాషల్లోకి వచ్చి తీరుతుంది. కాని జాతీయత సమకూర్చుకున్న మన భారత దేశంలో మనకు మన ఇరుగుపొరుగు భాషల స్థితిగతులను గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి ఎక్కువగా కనిపించదు. ఈ పరిస్థితి కొంతవరకు మారుతున్నది. కాని, మారవలసినంత త్వరగా మారటంలేదు.

ఈ విషయాన్ని గమనించి భారత ప్రభుత్వం ప్రతిభారతీయ భాషనుండి ఉత్తమ సమకాలిక రచనలను సేకరించి వాటిని మిగిలిన భారతీయ భాషల్లోకి అనువదింప చేయాలని ఒక ప్రణాళిక తయారుచేసింది. ఈ ప్రణాళిక ననుసరించి సామాన్యంగా పాఠక లోకానికి ఆస్వాద్యంగా ఉండే రచనలు అంటే కథలు, నవలలు, మనోహరయాత్రావర్ణనలూ, స్వీయచరిత్రలూ – అనువాదానికి ఎన్నుకొనటం జరుగుతుంది. ఈ గ్రంథమాల క్రింద ప్రచురింపదలచిన రచనలు విస్తృత జనాదరణ పొందిన ఉత్తమ రచనలు అవడమేకాక, ఆయా భాషలకు సంబంధించిన సంఘ జీవితాన్నీ భావసంపదనూ, ఆశయాలనూ, ఆదర్శాలనూ, ప్రతిబింబించ గలిగేవిగా ఉండేలా చూడటం జరుగుతుంది.

భాషా బహుళమైన మన సమాజంలోని వివిధ భాషలమధ్య పరస్పర పరిచయం, అవగాహనం, భావసమన్వయం సమకూర్చేందుకు ఈ ప్రణాళిక చాలవరకు తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

వివిధ భారతీయ భాషలనుండి ఉత్తమ రచనలను ఎన్నుకొని వాటిని అనువదింప చేయటం అంత సుళువైన పనికాదు. ఈ విషయంలో మాకు సరియైన దారిచూపి, మాతో సహకరించిన సలహాదారులకూ, అనువాదకులకూ, మేము కృతజ్ఞులం. వారి సహకారమే లేకుంటే ఈపని ఇంత జయప్రదంగా సాగేదికాదు.

బాలకృష్ణ కేస్కర్.

# పీఠిక

కాలంతోపాటుగా మానవ ప్రవృత్తినిగూర్చి ఆలోచించడం పెరుగుతోంది. ప్రారంభంలో రచయితల్ని పెద్దపెద్ద సమస్యలే వేధించేవి. ఒక జాతి మరో జాతిమీద పెత్తనం చెలాయించడం, ఒక స్త్రీ బలహీనతను లోకువగా తీసుకుని ఆమె శీలాన్ని దోచుకోడానికి ఏ వ్యక్తి అయినా ప్రయత్నించినపుడు, ఏ పరోప కారో తన ప్రాణాలను ఒడ్డి ఆమెను రక్షించడానికి పూనుకోవడం – ఇటువంటి పెద్ద పెద్ద సమస్యలనే రచయితలు చేపట్టేవారు. కాని యీనాడు సామాజిక జీవితం మునుపటి మాదిరిగా సాఫీగా నడవడంలేదు. దీన్నిండా ఎన్నో చిక్కులు, మరెన్నో అర్థం కాని ముడులు. చదువువల్లా, పదిమందితో కలిసి తిరగడం వల్లా జీవితంలోకి ఎన్నో మంచిచెడ్డలు ప్రవేశించి విడదీయలేనంతగా కలిసి పోయి మనిషి ప్రవృత్తిని సులభంగా విప్పలేని ఓరాక్షస ముడిగా చేసేశాయి.

నవలా రచయిత పని కేవలం ఓ కథను అల్లుకపోవడమే కాదు. కథలో చిత్రించిన పరిస్థితులకు అనుగుణంగా ప్రతి పాత్రను మలచాలి. సాంఘిక ప్రవర్తనా దానితో పెనవేసుకపోయే స్త్రీ పురుషుల వ్యక్తిగత ప్రవర్తనా సంశ్లిష్టంగా తయారైతే నవలాకారుని పని చాల కష్టసాధ్యం అవుతుంది. మానవుని ప్రవర్తనను అర్థం చేసుకొనే అర్హత అతనికి వుండాలి. తన రచన ల్లోని హిందూ పాత్రలన్నీ భీరువులుగా, ముస్లిం పాత్రలన్నీ విలాస వైభోగాల్లో తేలిపోయేవిగా, సిక్కు పాత్రలన్నీ గురుదేవుల్ని స్మరించేవిగా – యిలా ఒకే మూసలో పోసినట్లు మంచి నవలాకారు డెప్పుడూ ఆలోచించడు. అలా చిత్రించడు. మంచివాళ్లు హిందువుల్లోనూ, ముసల్మానుల్లోనూ కూడా వుంటారనీ, చెడ్డవాళ్ళు సిక్కుల్లోనూ వుంటారన్న సత్యం అతను గ్రహించి వుండాలి. కేవలం వ్యాసాలు రాసేవారికి ఒకటీ రెండు శాస్త్రాల్లో పాండిత్యంవుంటే సరిపోవచ్చు నేమో కాని నవలా రచయితకు మాత్రం మతం, తత్వశాస్త్రం, ( ప్రత్యేకంగా

సైకాలజీ అనుకోండి) చరిత్రా, భూగోళం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం ఇవన్నీ తెలిసి వుండాలి. సామాజిక స్పృహ కలిగివుండాలి. ఇరుగుపొరుగు ప్రజల సాంఘిక జీవన పద్ధతులను అవగాహన చేసుకుని వుండాలి. వీటన్నిటినీ ఆకళింపు చేసుకోడానికి కొంతకాలం పడ్తుంది. ఆ కారణంచేతనేమో నవలా రచన యితర సాహిత్య ప్రక్రియల తర్వాతగానీ ప్రారంభం కాలేదు. సాంఘిక పరిస్థితులు ఒక ప్రత్యేక హద్దుకు చేరిన తర్వాతకానీ నవలా రచన ప్రారంభం కాదు. స్త్రీకి సముచితమైన స్థానంలేని జాతి జీవితంలో సాంఘిక వికాసానికి తావులేదు. అలాంటి పరిస్థితిలో నవలా రచన ఎలా జరుగుతుంది? సాంఘిక పరాయణత్వం రావాలంటే ఆడా—మగా ఇద్దరి మధ్యా స్నేహ సంబంధాలు యజమాని—సేవకుడి మధ్యవున్న మాదిరిగా వుండకూడదు. వారిద్దరి విధులూ, హక్కులూ రెండూ ఇంచుమించుగా సమపాళ్లలో వుండి తీరాలి. అలాంటి సమానత్వం తీసుకురావడంలో ఏదైనా లోటుపాట్లు దొర్లితే వాటిని సరిదిద్దుకోడానికీ సంస్కరించుకోడానికీ అవకాశం వుండాలి. ఒక జాతి మరో జాతిపై ఎప్పుడూ పెత్తనం చెలాయించడానికి వీలులేకుండా వుండాలి. స్వేచ్ఛగా వ్యవహరించడానికి సౌకర్యం వుండాలి. కనీసం వాళ్ళకాసౌకర్యం వుందన్న విషయాన్ని సంఘం గుర్తించైనా వుండాలి.

మనదేశంలో మొదట్లో ఈ అవసరం కలగలేదు. కాని ఇప్పుడిప్పుడు ఆ అవసరం కలుగుతోంది. సంఘం ఎదగని రోజుల్లో వచ్చే నవలలు చాలా వరకు సంఘ సంస్కరణకు సంబంధించినవిగానే వుంటాయి. భాయీ వీర్‌సింగ్‌జీ రాసిన "సుభాగ్ జీ కా సుధార్'' అనే నవల ఇందుకు ఉదాహరణగా పేర్కొవచ్చు. ఈ రచనలో స్త్రీ జాతి కష్టాలను రచయిత వర్ణించాడు. దానిలో బాబా నౌధ్‌సింగ్ పాత్ర కేవలం ఓ ఆదర్శప్రాయమైన పాత్రేకాదు. అతనిలో పక్షపాత రహితమైన దృష్టిని, సానుభూతి మనస్తత్వాన్ని రచయిత చూపించడంవల్ల బాబానౌధ్‌సింగ్ ఆ నవలలోని పాత్రగానేగాక అందరి సుఖదుఃఖాలు పంచుకునే ఓ సార్వజనీకమైన వ్యక్తిగా మనకు కనపడతాడు. అతని వ్యక్తిత్వంలోవున్న

సుగుణాలు, ఉత్తమ ఆదర్శాలూ ఇతర పాత్రలకన్న అతనికో విశిష్టతను సంతరించిపెట్టాయి. ఆ కారణంగా భాయీ వీర్‌సింగ్ రాసిన ఈ నవల అతని మునుపటి రచనలన్నింటిలోనూ శ్రేష్ఠమైనదిగానూ, నవలా నిర్వచనానికి సరిగ్గా సరిపోయేదిగానూ అనుపించుకో కలిగింది.

భాయీ నానక్‌సింగ్ నవలలు కూడా సంఘ సంస్కరణకు సంబంధించినవే. వీరు ప్రారంభంలో ''మీఠామహురా'' ''ప్రేమ్‌సంగీత్'', 'కాల్‌చక్కర్' మొదలైన నవలల్ని రాసి పంజాబీ సాహిత్యాభిమానులకు సుపరిచితులయ్యారు. అయితే యిటీవలి నవల ''చిట్టాలహూ'' (తెల్లని రక్తం) లో వారు అద్భుతమైన చమత్కారాన్ని ప్రదర్శించారు. భాయీ నానక్‌సింగ్ ఆదిలో సంఘంలో కనిపించే ఏ ఒకటో రెండో లోపాల్ని ఇతివృత్తంగా తీసుకొని నవలా రచన చేశారు. కాని ఈ రచనలో, భాయీజీ మొత్తం సంఘాన్నే దుయ్యబట్టారు. ఊడలతోసహా దాన్ని వూపేశారు. ప్రతి దృక్పథంనుంచీ శవపరీక్షచేసి దాన్ని చావుదెబ్బలు కొట్టారు. ఈ నవలా సందేశాన్ని దేశం నలుమూలలకూ తీసికెళ్ల గలిగితే సంఘాన్ని సంస్కరించడానికి వీలు కలుగుతుంది. ఈ నవలల్లో నిరక్షరాస్యత, అస్పృశ్యత, మత్తు పదార్థాల్ని సేవించడం, వివాహాది కార్యాల్లో అనాచారాలూ, స్త్రీ జాతిపై – ప్రత్యేకంగా భర్తలను పోగొట్టుకొన్న స్త్రీలపై సంఘం పేరిట జరిగే అత్యాచారాలూ, గురుద్వారాలపట్ల అశ్రద్ధ, చీటికి మాటికి తగాదాలు, కేసులూ కోర్టులూ ఇలాంటివి ఎన్నెన్నో అనాచారాల్నీ అక్రమాల్నీ రచయిత ఎంతో సునిశితంగానూ, సున్నితంగానూ చూపించారు. నవల చదువుతోంటే పాఠకుని మనస్సులో ఆ విషయాలు గాఢంగా నాటుకుపోతాయి.

నవలలోని నాయకీ నాయకుల్ని, ఇతర పాత్రల్ని మలచడంలో రచయిత కుశాగ్రబుద్ధి, అనుభవం, శిల్పవిజ్ఞానం ప్రస్ఫుటించాయి.

కోతుల్ని ఆడించి పొట్టపోసుకునే రోడూ పెంపుడు కూతురు – సుందరికి, చదువు నేర్చుకోవాలనే కోరిక కలిగి చదువుకోడం ప్రారంభిస్తుంది. బచన్‌సింగ్

అడుగడుగునా ఇచ్చే ప్రోత్సాహంతో చదువుకుని అతని సహచర్యంలో ఆమె ఒక మహోన్నత వ్యక్తిత్వాన్ని పొందుతుంది. అంత వ్యక్తిత్వాన్ని పొందిన తర్వాత కూడా కోతితోనూ, కోతుల్ని ఆడించే రోడుతోనూ మొదట్లో ఆమె కున్న సహచర్యం వెనకటి ఆలోచనలవైపు లాగుతుంటుంది. బచన్‌సింగ్ ప్రభావంచేత ఆమె మనస్సు సంఘసేవవైపు మొగ్గినా ఆమెలో మొదటినుంచీ నాటుకుపోయిన భావాలు, సంఘంవాళ్లపై జరిపిన అత్యాచారాలు ఆమెను వెన్నాడుతూ ఆమెలో ప్రతీకార వాంఛను మాటిమాటికీ రేపుతాయి. ఆమెలోని పాత వాసనలకూ ఆర్జించుకొన్న కొత్త సంస్కారాలకు మధ్య జరిగే ఘర్షణను రచయిత ఎంతో చాకచక్యంతో చిత్రించాడు.

రాధాకృష్ణ పంతుల్ని హాస్యరసభరితంగా చేయడమేకాకుండా అతని పాత్రను చిత్రించడంలో రచయిత అపూర్వమైన సమయస్ఫూర్తిని ప్రదర్శించాడు. అతడు సంఘం అనే పెద్ద వృక్షంపై పెరిగే పరాన్నభుక్కు. ఇతరులు చూస్తుండగా అంటరాని తనాన్ని పాటిస్తాడు. బోధిస్తాడు. కాని లోలోపల ముసల్మానులతోకూడా ఒకే పంక్తిలో ఒకే కంచంలో తినడానికి సందేహించడు. పైకి మాత్రం ఛాందస బ్రాహ్మణుడు. గ్రామంలో ఏ అన్యాయం జరిగినా, ఏ దొంగతనం జరిగినా, ఏ ప్రేమకలాపం నడిచినా అతని సలహా వుంటుంది. అతని ఆశీస్సులు వుంటాయి. మంచి చెడ్డల్ని నిర్ణయించడంలో, తీర్పు చెప్పడంలో అతను తన ఆధిపత్యాన్ని ఎప్పుడూ ప్రకటించుకుంటూ వుంటాడు. భాయీ దనౌంధాసింగు ఆకారాన్ని అతని పిరికితనాన్ని అజ్ఞానాన్నీ రచయిత చాలా ఆసక్తికరంగా చిత్రించాడు.

రచయిత తన సానుభూతినంతా రోడూతాతమీదే ఒలకపోశాడు. నిమ్న జాతుల్లో మనకు తరచుగా కనిపించే నిజమైన స్వాభావికమైన ప్రేమకు అతను చక్కని వుదాహరణ. ఒకానొక సమయంలో ప్రజలు తమ పిల్లల్ని ముద్దాడుతోంటే చూసి అతను నవ్వుకొనేవాడు; ఎగతాళిచేసేవాడు. కాని అతనికే ఓ పసికందు దొరకగానే ఆమె అంటే పడిచచ్చేవాడు. చివరకు ఆఖరి క్షణం

వరకు ఆమె అంటే మమకారం అతనిలో పొంగిపొరలేది. ఆ పసికందుపట్ల అతని ఆప్యాయత అతని జీవితాన్నే ఎలా పూర్తిగా మార్చివేసిందీ, ఆ ఆప్యాయతే సభ్యతాగంధంలేని అతని మనోవృత్తిని ఉన్నతభావాలూ, ఉన్నతాదర్శాలూ, బాధ్యతలు అంటే ఏమిటో ఎలా గ్రహించేలా చేసిందీ రచయిత అందంగా చూపించాడు.

రచయిత ఇతర పాత్రల్ని సృష్టించడంలో కూడా ఇదే ప్రతిభను ప్రదర్శించాడు. అతని దృశ్య చిత్రణలో కూడా ఈ నైపుణ్యాన్ని చూడొచ్చు. దేశంలో రచయితల దుర్గతి, పసిపాప సుందరికోసం రోడ్డూ ముక్కీ-ముక్కులూ, అతను పాడే లాలిపాటలూ జోలలూ, పాలాసింగూ అతని ముఠా భంగు తయారు చేయడం, ధర్మశాలలో మాటామాటా పెరిగి చివరకి అది చినికి చినికి గాలివానై జాటు రైతులు ఘర్షణపడుతూ కొట్లాటలోకి దిగడం, అన్వర్ మేజువాణీ కార్యక్రమం, సుందరి అన్వర్‌ను 'అమ్మా, అమ్మా' అని సంబోధిస్తూ ఆమె జీవితమార్గాన్నే మార్చేయడం - ఇటువంటి దృశ్యాలు ఇంతకుముందు పంజాబీ సాహిత్యంలో ఎక్కడా లేనంత సజీవంగా చిత్రించబడ్డాయి.

భాషలోనూ, శిల్పంలోనూ రచయిత ఉన్నత ప్రమాణాలు సాధించాడు. నవలా ప్రారంభమే కొత్త పద్ధతిలో వుంది. హాస్యరసాన్ని చిందించేటప్పుడు రచన నిగ్రహంతోనూ హుందాగానూ సాగింది. కష్టాన్నీ, ఆవేదననీ చిత్రిస్తున్నపుడు నవల గంభీరంతో, ఉద్రేకంతో, బాధతో నిండిపోతుంది, పండితులు మాట్లాడే భాషను ప్రయోగించడంలో చమత్కారం ప్రదర్శించాడు. జాట్లూ, ఇతర రైతులూ మాట్లాడుకొనే తీరులో కూడా సమాన ప్రతిభను ప్రదర్శించాడు. ఎంత దాచుకొందామని రచయిత ప్రయత్నించినా అక్కడక్కడ అతను చొప్పించిన నుడికారాలూ నానుడులూ రచయిత ఏ ప్రాంతానికి చెందినవాడో అన్న విషయాన్ని కూడా బద్దలుకొట్టి చెప్పుతాయి.

శైలి విషయంలోకూడా నానక్‌సింగ్ అపూర్వకౌశలాన్ని ప్రదర్శించాడు. దాన్నే సాహితీభాషలో నాటకీయ వ్యంగ్యము (DRAMATIC IRONY)

అని అంటారు. ఈ టెక్నిక్‌వల్ల రచయిత తాను చెప్పే ప్రతిమాటకూ వ్యంజనా శక్తిని పెంచుతాడు. చూడండి, అంటరాని వాళ్లంటే ఏవగించుకొనే రాధాకృష్ణ పంతులుగారు ముసల్మానుల చేత్తోనేమిటి – వాళ్ల వంటవాళ్ళు చేసిన పదార్థాలను కూడా భుజిస్తాడు – వాళ్ళ ఎంగిలి గ్లాసుల్లో మధువును కుమ్మరించుకొని నిస్సంకోచంగా తాగుతాడు. తన మతంలోనే ఎవరైనా స్త్రీ విధవరాలైతే ఆమెకు ఇంట్లో చోటు లేదంటాడు. సంఘంలో ఆదరణ ఇవ్వరాదంటాడు. కాని ఆ స్త్రీయే మహమ్మదీయ మతంలోచేరి వేశ్యగా మరొకరింటికి వస్తే ఆమె గుమ్మానికి కూడా మొకరిల్లుతాడు. ఎవరైనా హరిజనులు గురుద్వారాలో మొకరిల్లితే అక్కడ భక్తులకోసం వండిన ప్రసాదం అంతా అపవిత్రమైపోతుంది. కాని ఓ కుక్క మోతుబరి ఒడిలో కూర్చున్న కారణంగా ఆప్రసాదం అపవిత్రంకాదు. బచన్‌సింగు ఓ హరిజన బాలికతో తిరుగుతాడన్న కారణంగా పాలాసింగు అతనితో విరోధం పెట్టుకొన్నాడు. గ్రామస్తుల్ని కూడా అతనికి విరోధులుగా తయారు చేశాడు. కాని తీరా సుందరిని తానే పెళ్ళి చేసుకోవాలనుకోగానే అప్పుడు మాత్రం "పొండర్రా ఈ పనికిరాని మాటలు నా దగ్గర మాట్లాడకండి. ఇటువంటి మూఢనమ్మకాలతో సిక్కోళ్ళకు ఏంపని" అని తాను చెప్పిన సిద్ధాంతాన్నే త్రోసిరాజంటాడు.

ఈ నవల విషాదాంతం. పాఠకునిపై ఆద్యంతమూ చెరగని శోకముద్ర వేస్తుంది. బ్రిటిష్ పార్లమెంటు శాసనాలద్వారా సాధించలేని కార్యాన్ని డికెన్స్ రాసిన నవలలు సాధించాయని అంటారు. మన సంఘాన్ని నిర్జీవం చేస్తూన్న కుళ్ళును ఈ నవల ఎంతవరకు శుభ్రంచేసి మళ్ళీ దాని నరాల్లో ఎంత పరిశుభ్రమైన రక్తాన్ని ఎక్కించగలదో చూద్దాం.

తేజాసింగు

ప్రిన్సిపాలు

# మిగిలిన అధ్యాయం

"ఇదిగో పోలీస్! ఆ దొంగ వెధవను నిలెయ్యి" అంటూ టిక్కెట్టు కలెక్టరు ఇతర ప్రయాణీకుల టిక్కెట్లను తనిఖీ చేయసాగాడు. అది సాయంకాలం. ఏడు గంటలవేళ. ప్రయాణీకులు వొక్కరొక్కరే తమ టిక్కెట్టును గేటు దగ్గర నిలబడ్డ టిక్కెట్టు కలెక్టరు చేతిలోపెట్టి బయటకు వెళ్తున్నారు. టిక్కెట్టు కలెక్టరు చెప్పిన ఆ వ్యక్తిని ఒక్కత్రోపుతోసి గేటుకవారగా నిలబెట్టాడు పోలీసు. అతను గట్టిగా గుంజాడేమో అవ్యక్తి పొడుగాటి కోటులోని సగం చిరిగిన జేబులోనుంచి కాగితం ముక్కల కట్టొకటి అమాంతంగా జారి క్రింద పడింది. భంగాపుతో వెంటనే ఆ కట్టను తీసుకుని చేత్తో పట్టుకున్నాడా ప్రయాణీకుడు.

టిక్కెట్టు లేకుండా నిలబడ్డ ఆవ్యక్తి చూడ్డానికి యువకుడులా వున్నాడు. వయస్సు పద్ధెనిమిది సంవత్సరాలుంటుంది. వేషాన్నిబట్టి సిక్కు అని వూహించుకోవచ్చు. నూనూగుమీసాలు కూడా ఇంకా మొలవలేదు. మెడదగ్గిర కమీజు చిరిగింది. అతను వేసుకున్న కోటుగూడా ఇంచుమించు అదేస్థితిలోవుంది. కోటునిండా అతుకులు కనబడుతున్నాయ్. కాజాలు చిరిగి పెద్దవికావడంతో గుండీలు లేవేమో ఆరెంటినీ లావుపాటి దారంతో కుట్టుకున్నాడు. చలికి భయపడికాబోలు అతను కోటు రెండుభాగాల్నీ దారంతో దగ్గరగా కలిపికట్టాడు. ఒకజేబు పూర్తిగా చిరిగివుంది. రెండోది పర్వాలేదన్నట్టుగా అంతంతమాత్రంగా వుంది. తెల్లగానూ మంచిసౌష్టవంగావున్న అతని శరీరంలోని ప్రతి భాగం దారిద్ర్యం, దైన్యం, నిరాశానిస్పృహల్ని సూచిస్తున్నాయి.

ఆ పోలీసు విసురుబాటుకు ఆ ప్రయాణీకుడు అదిరి ఆపాదమస్తకం కంపించాడు. అతని సమక్షంలో వందలకొద్ది ప్రయాణీకులు టిక్కెట్లిచ్చి బయటకు వెళ్ళిపోయారు. కాని టిక్కెట్టు కలెక్టరు అతనివైపు చూసినంత భయంకరంగా, క్రూరంగా వారెవ్వరివైపూ చూడలేదు. ప్రయాణీకుల వాడి చూపుల్ని తట్టుకోలేక అతను గేటుకు దూరంగా రెండు మూడు అడుగుల ఆవలగా జరిగి ఒదిగి వీపుపెట్టి నిలబడ్డాడు. టిక్కెట్టులేకుండా పట్టుకున్నందుకు భయపడి ఎలాగైనా పారిపోవాలనే వుద్దేశంతో ఎత్తులు వేస్తున్నాడని ఆ పోలీసు గ్రహించి అతన్ని బెదిరిస్తూ అన్నాడు—"ఏరా, ఎక్కడకు పారిపోతున్నావ్. అక్కడనుంచి కదిలావంటే ముక్కలు విరగదంతాను. చర్మం ఒలిచేస్తా".

ఆ వ్యక్తి కిమ్మనకుండా మొదట నిలబడిన స్థలంలోకి వచ్చి నిలుచున్నాడు. ప్రయాణీకులంతా వెళ్ళడానికి సుమారు ముప్పావుగంట పట్టింది. వారందరూ వెళ్లగానే

ఆ వ్యక్తిని గద్దిస్తూ టిక్కట్టు కలెక్టరు "రూపాయ్ పదణాలు జేబులోంచి తీసియ్" అన్నాడు. టిక్కట్టు కలెక్టరు నిలదీసి అడగకముందే ఆ వ్యక్తి చేతులు కోటు జేబులోకి వెళ్లి వెదకసాగాయి, వెతగ్గా వెతగ్గా అతని చేతులకు అరిగిపోయి మోటుబారిన ఓ తెల్లని నాణెం తగిలింది. దప్పికతో ప్రాణాలార్పుకబోతోన్న మనిషి ముందు వుప్పు నీటి గ్లాసు పెట్టి తాగమన్నట్టుగా అయిపోయాడతను. ఇంతా వెదికితే జేబులో దొరికింది ముష్టి నాల్గణాల బిళ్ల.

"బాబుగారూ, కనికరించండి. చాలపేదవాణ్ణి. ఎంత ప్రయత్నం చేసినా టిక్కట్టుకు డబ్బు సంపాందించలేక పోయాను. విధిలేక టిక్కట్టు కొనకుండానే ప్రయాణం చెయ్యాల్సి వచ్చింది" అంటూ అతను చిన్న గొంతుకతో జంకుతూ భయపడుతూ ప్రాధేయపడ్డాడు.

అతని ప్రార్థన విని టిక్కట్టు కలెక్టరు వ్యంగ్యంగా నవ్వి అసహ్యాన్ని కనబరుస్తూ "అలాగా, టిక్కట్టు కొనడానికి డబ్బులేదేం! ఈ రైలు నీ తాత సొమ్మనుకున్నావా టిక్కట్టు లేకుండా ప్రయాణం చెయ్యడానికి? బేవర్సుగా ప్రయాణం చేసేప్పుడు శ్రీకృష్ణ జన్మస్థానానికి పోవాలన్న సంగతి మరిచిపోయావా?" అన్నాడు.

ఇంతలో పోలీసు అందుకున్నాడు - "వుండండిసార్, వాడి దగ్గర డబ్బే లేదనుకుంటున్నారా! వాడి గుడ్డలన్నీ వెతికితే బయటపడిపోతుంది వాడి భాగవత మంతా. నిజంగా పేదోడో, లేక మనల్ని మోసం చేయడానికే నటిస్తున్నాడో తేలిపోతుంది".

"వీళ్ల సంగతి నాకు తెలీదా! వీళ్లందరికిదో జాడ్యం. రైళ్లలో బేవర్సుగా తిరిగి ఎవరైనా అమాయకులు కంటబడితే వాళ్లను మోసగించి మూటా ముల్లె ఎత్తుకపోయి ఖపరంచేయడం వీళ్ల వృత్తి." అంటూ పోలీసును సమర్థించాడు టి. సి. మళ్లీ అతని వైపు చూస్తూ "ఏమిటి డబ్బిస్తావా, లేకపోతే కొట్లో పడేయమంటావా?" మరోసారి బెదిరించాడు.

భయంతో ప్రయాణీకుడు వణకిపోయాడు. రక్తం గడ్డకట్టినట్లయింది. ఏదో మాట్లాడాలని రెండు మూడుసార్లు ప్రయత్నించినా కంఠం పెగలటంలేదు. ఏమీ పాలుపోవడంలేదు. ధైర్యం చిక్కబట్టుకుని చివరకు అనగలిగాడు - "బాబుగారూ, నేనేం దొంగనూ కాదూ కే. డీ. నీ కాదు. కష్టాల్లో వున్నాను. తప్పనిసరై టిక్కట్టు లేకుండా ప్రయాణం చేయాల్సివచ్చింది. మీరేం చేయాలనుకుంటే అది చేయండి. కాని ముళ్లలాంటి మీ మాటలతోమాత్రం నా మనసును గాయపరచకండి". ఈ మాటలు అంటూండగా అతని కళ్లకొనల్లోంచి కన్నీరు చెక్కిళ్ల మీంచి జారిపోయింది.

టిక్కట్టులేకుండా ప్రయాణంచేసే వారు వేసే దొంగవేషాలూ, వారు అల్లే కట్టుకథలూ వినడం టి. సి. కి పరిపాటే. వాటన్నిటికీ అలవాటు పడ్డాడు అతను. అలాగే ఆ వ్యక్తి మాటల్ని విని కూడా సీరియస్‌గా పట్టించుకోలేదు. కాని అతను మాట్లాడుతూంటే జలజలకారే కన్నీటిని చూడగానే టి. సి. బిత్తరపోయాడు. కోపంతో ఆ ప్రయాణీకుని పెదవులు అదరసాగాయి. తెల్లగావున్న అతని ముఖమంతా ఎర్రబారింది.

పోలీసు కూడా ఇటువంటి వాటికి అలవాటుబడ్డ వుక్కుపిండమేమో అతని మాటలకు ఏమాత్రం చలించలేదు. కాని టి. సి. మాత్రం ఆ వ్యక్తి మాటలు విన్న తర్వాత చలించాడు. ఎందుకు మనస్సు నొప్పించానా అని బాధపడ్డాడు. కన్నార్పకుండా అతన్నే చాలాసేపు చూశాడు. అతని కళ్లు చూస్తోంటే తన మనస్సు మీద ఏదో చెరగని ముద్రవేస్తున్నట్లనిపించింది ఆ టి. సి. కి.

చేతిలోవున్న కాగితాల కట్టను గిభాలున చంకలో అదిమి పట్టుకున్నాడా ప్రయాణీకుడు. కాని మళ్ళీ ఏమనుకున్నాడో చంకలోంచి తీసి దాన్ని కోటు రెండో జేబులోకి పెట్టుకున్నాడుగాని మొదటిదానిలా రెండోజేబుకూడా చినిగిపోతుందన్న సందేహంతో గాబోలు జేబులోంచి తీసి యధాప్రకారంగా చేతిలోకి తీసుకొంటూ రకరకాలుగలవస్థ పడుతున్నాడావ్యక్తి.

టి. సి. తనఛార్జి ఇంకోవ్యక్తికి అప్పగించి "నావెంటరా" అంటూ అతన్నిచూసి స్టేషను బయటకు నడవసాగాడు. బహుశా అతని డ్యూటీ అయిపోయివుండొచ్చు. టి. సి.ని అనుసరిస్తూ ప్రయాణీకుడు స్టేషను బయటకొచ్చాడు.

తన్ను స్టేషను మాస్టరుకో, పోలీసు అధికారులకో అప్పగిస్తాడన్న భయంపోయింది. కాని టి. సి. బయటకు వచ్చి దగ్గరగావున్న ఖాళీస్థలంలో పచ్చికమీద కూర్చోడం చూసి ఆ ప్రయాణీకునికి టి. సి. మనస్తత్వం అర్థంకాలేదు. కూర్చోమని ప్రయాణీకుడికి సౌంజ్ఞ చేశాడు.

"ఎక్కణ్ణుంచి వస్తున్నావ్?" ప్రయాణీకుని కళ్లల్లోకి చూస్తూ ప్రశ్నించాడు టి. సి.

"లాహోరునుంచండి"

"ఇల్లెక్కడ?"

"ఇక్కడే, అమృతసర్‌లో"

"వింతగావుందే! అమృతసర్‌లో ఇల్లుంచుకుని పదణాలుకూడా లేకుండా ప్రయాణం చేస్తున్నావా! ఏం పనిచేస్తావ్ నువ్వు?"

దీనికి ఎలా సమాధానం చెప్పాలో అన్న ఇరకాటంలో పడ్డాడు అతను. "ఏం పనీ చేయడం లేదండి" అని కొంచెంసేపు ఆలోచించి జవాబిచ్చాడు.

టి. సి. కి అర్థంకానట్లుగా మళ్లీ రెట్టించాడు — "ఏమీపనిచెయ్యవు? మరి తిండి తిప్పలూ ఎలా?"

టి. సి. సందేహంగా అతనివైపు చూశాడు. కాని సందేహించడానికి ఏమాత్రం అవకాశం కనబడలేదు. ప్రయాణీకుని కళ్లలో ఏదోగూఢంగా ఆకర్షించేశక్తివుంది. తన్నాకళ్లు అతనివేపు లాగేస్తున్నాయ్. అతనిలో నిద్రాణమైవున్న ఆలోచనలు ఒక్కొక్కటిగా పురివిప్పసాగాయి.

"ఏమని చెప్పను నా తిండి తిప్పలు గురించి?" ఓక్షణం ఆగి మళ్లీ ఇలా అన్నాడు— "బాబుగారూ, మృత్యువు చాలా భయంకరమైందండి. మానవుడు మృత్యువంటే ఎందుకో విపరీతంగా భయపడతాడు. బ్రతుకంటే ఎందుకంతతీపి? భగవంతుడు మనిషిని—ముఖ్యంగా నాలాటి వాణ్ణి ఎందుకింత జంకూ, గొంకూ, సిగ్గూ, ఎగ్గులేనివాడిగా పుట్టించాడు. అంతా సర్వనాశనమైంది. అగౌరవం, అప్రతిష్ఠపాలయ్యాను. సంఘం దూసిన కత్తుల దెబ్బలు తగిలాయి. అయినా ఎందుకో నాలో జీవించాలనే కోర్కె చావలేదు. నావంటివాడు బ్రతికివుండడం జీవితానికే తలవంపు." ప్రయాణీకుని కంఠం బొంగురుపోయింది.

అతని చివరిమాటలు టి. సి. ని కదిలించివేసాయి. అతన్ని వూరడిస్తూ టి. సి.— "సర్దార్ జీ ధైర్యంగావుండు. నీకేదో కష్టాలన్నీ కలసివచ్చినట్లుగావున్నయ్. నాచేతనైనంతవరకూ సాయంచేస్తాను" అన్నాడు.

ప్రయాణీకుడు ఆలోచనలో పడ్డాడు. టి. సి. వూరడిస్తూ అన్నమాటల్ని వినిపించుకోకుండానే ఓనిట్టూర్పు విడుస్తూ "మహాశయా, మీరు నన్ను పోలీసులకు అప్పగించకుండా ఏమంత మంచిపనిచేయలేదు. జైలు కటకటాల్లో వుండవలసినవాడిని. నా విషయంలో మీరాపని చేసివుంటే బావుండేది" అన్నాడు.

అతను చెప్పిన మాటలు టి. సి. కి అర్థంకాలేదు. ఏమిటి చెప్మా అని అతని ముఖంలోకి చూశాడు. చటుక్కున అతనికో ఆలోచన తట్టింది. కొంపతీసి అతనికి మతిభ్రమించలేదుకదా?. పిచ్చివాడేమోనన్న సందేహంతోనే ప్రయాణీకుడ్ని ప్రశ్నించాడు. "మీరు ఆలాచేసివుంటే బావుండేది అంటున్నావు. అల్లాఅనడంలో నీవుద్దేశ్యం ఏమిటి?"

"నా ఈ మిగిలిపోయిన నవల్ని ముగించేవాణ్ణి" చేతిలో పట్టుకున్న కాగితాల కట్టను చూపిస్తూ అన్నాడావ్యక్తి.

"కొంచెం విడమర్చిచెప్పు. నాకు అర్థంకావడంలేదు". తన జీవిత రహస్యాన్ని విప్పుతూన్నట్లుగా ప్రయాణీకుడు చెప్పసాగాడు—

" ఈ పట్టణంలోనే భగతావారి దర్వాజా ఆవరణలో పాడైపోయిన ఓచిన్నగది అద్దెకు తీసుకునివున్నాను. అద్దె నెలకు ఎనిమిది అణాలు మాత్రమే అనుకోండి. కాని నాకు మాత్రం ఎనిమిది రూపాయలతో సమానం. నేను ఓచిన్న రచయితను లెండి. ప్రారంభంనుండి రచయితను కాదనుకోండి. కొన్నాళ్లనుండి మాత్రం సాహిత్యంపట్ల అభిరుచి యేర్పరచుకున్నాను, కొన్ని పుస్తకాలు కూడా వ్రాశాను. ప్రచురించబడ్డాయి కూడా. ఇదేకాక అనేక పత్రికల్లో కూడ కథలు వ్రాస్తూవుంటాను. నా రచనల్ని చదివి చాలామంది పాఠకులు విమర్శకులు ప్రశంసించారనుకోండి. కాని వాళ్లపొగడ్తలతో నా కడుపు నిండదుగా. నిజం చెప్పాలంటే ఏప్రకాశకుడూ నాలుగు రూపాయల కన్న ఎక్కువ ముట్టజెప్పితే ఒట్టు. వాటితో నా కనీసావసరాలు గూడ తీరవు".

అతను కొద్దిసేపు చెప్పడం ఆపి చేతిలోని కాగితాల కట్టను పైకెత్తిచూపిస్తూ మళ్లీ చెప్పడం మొదలెట్టాడు —"చూడండి బాబుగారూ, కొన్నిరోజుల క్రిందట దీన్ని రాయడం మొదలెట్టాను. అప్పుడు కూడ ఇలాగే గర్భదరిద్రుణ్ణి, చేతిలో చిల్లిగవ్వ లేదు. ఎవరూ అప్పయినా ఇచ్చేవారుకాదు. మొన్నటికిమొన్న నాదగ్గరవున్న కాగితాలు అయిపోయాయి. ఏమి చేయాలో తోచలేదు. నేను రాస్తున్న నవల ఆఖరి అధ్యాయంలో వుంది. నేనైతే ఆకలి దప్పులంకోర్చి ఏదోవిధంగా కాలం వెళ్లబుచ్చగలను. కాని కాగితాలు లేకుండా నవలను పూర్తిచేయడం ఎలా ?. రోజంతా కాగితాల్లేక మనస్సంతా వికలమై పిచ్చిపిచ్చిగా తిరుగుతూవున్నాను. తెలిసినవాళ్లెవరూ ఒక్క పావలా అయినా ఇచ్చిన పాపానపోలేదు. కాగితాలుకూడా ఇవ్వలేదు."

"నా నిస్సహాయతనుచూసి నాకే విరక్తి కలిగింది. ఈ తనువు చాలిస్తే మేలని ఆలోచించాను. కాని నేను రాస్తూన్న ఈ నవల ఎక్కడ అసంపూర్తిగా వుండిపోతుం దన్న సందేహంచేతనో, ఏదో ఆకర్షణ నన్నింకా ఈ జీవితం అనే మోహపాశంవైపు లాగుతుండడంచేతనో అలా చెయ్యలేకపోయాను.

"కాలు కాలిన పిల్లిలా బజార్లన్నీ తిరగసాగాను. ఒక వీధిలో చెత్తకుండీలో ఎవరో పడేసిన పాతకాగితాల దొంతర కనబడింది. కాగితాలన్నీ చెమ్మ తగిలినట్లుగా వున్నాయి. ఏ స్కూలు కుర్రాడో బహుశా రఫ్‌నోటుబుక్కు పనికిరాదని పారేసి వుంటాడు. జాగ్రత్తగా వాటిని తీసి ఒక్కొక్క పేజీ తిప్పసాగాను. ప్రతి కాగితం ఒక వైపే రాసివుంది. కాని ఒక వైపు వ్రాసిన సిరా రెండో వైపుగూడ యింకి కనిపిస్తోంది.

"కుట్లూడిన పుస్తకంలోని కాగితాలన్నిటినీ సేకరించి రూముకు చేరుకున్నాను. ఒక్కొక్క కాగితాన్ని దీపం ముందువుంచి వెచ్చచేశాను. చెమ్మంతాపోయి వ్రాయడానికి వీలుగా కాగితాలు తయారయ్యాయి.

"ఆరోజు అలాగే విడవకుండా ఏడు గంటలసేపు వ్రాస్తూ కూర్చున్నా. రెండో రోజుకే నేను సేకరించిన కాగితాలు అయిపోయాయి. అప్పటికి నా నవల ఇంచుమించు పూర్తి కావచ్చింది. చిట్టచివరి అధ్యాయం సగంపైగా రాసేశాను. దాన్ని ఎప్పుడు పూర్తిచేసి ప్రకాశకులకు అమ్మి వేద్దామా అన్న తొందర వేధింపసాగింది. దాన్ని త్వరగా ముగిస్తే నాకు చాలా డబ్బు లభిస్తుంది. ఆ డబ్బుతో నేను నా కర్తవ్యాన్ని నిర్వహించగల్గుతాను. ఆ కర్తవ్యం ఏమిటీ అని మీరు ప్రశ్నించవచ్చు. దయచేసి అదిమాత్రం అడగకండి. నాలో చెప్పే ధైర్యం కూడా నశించింది.

"ఇది నేను ఇంతకుముందు చేసిన రచనలన్నిటిలోనూ శ్రేష్ఠమైనది. దాన్ని లాహోరుకు తీసుకవెళ్తాను. ఎవరైనా విలువ తెలిసిన ప్రచురణకర్తకు చూపిస్తాను. కాని టిక్కెట్టు పైకంకూడా లేకుండా దగ్గరలోవున్న అమృత్‌సర్‌కు వెళ్లడం అన్నా నాకు కలకత్తాకు ప్రయాణం చేసినట్లేమరి.

ఎలాగో తంటాలుపడి నిన్న ఒక్క రూపాయి సంపాదించగలిగాను. ఇచ్చిన మహాత్ముడు జూదం నడిపే ఒక షావుకారనుకోండి. ఒక్క రూపాయి ఇచ్చి రెండు రూపాయలు అప్పు యిచ్చినట్టు నాచేత రాయించుకున్నాడు.

పొద్దుట్నుంచి విపరీతమైన ఆకలితో బాధపడుతూ నవల్ని వ్రాసుకుని లాహోరుకు వెళ్దామని బయలుదేరాను. బేరం కుదరగానే అతన్నే అడిగి కొన్ని కాగితాలు తీసుకుని అక్కడే ఏదో పార్కులో కూర్చొని ఆ మిగిలిన అధ్యాయాన్ని పూర్తిచేసి యిచ్చేద్దామనీ, అతను యిచ్చిన డబ్బుతో ఆకలి తీర్చుకోవచ్చనీ నా ఉద్దేశం.

"రైలు టిక్కట్టుకొని లాహోరు చేరాను. చాలామంది ప్రచురణకర్తల వద్దకు వెళ్లాను. ఎవరికి చూపించినా ఈ పర్యాయం నవలంతా క్షుణ్ణంగా చదివి వినిపించాలనుకున్నాను. అతనికి నచ్చిందంటే నాకు డబ్బుకూడా ఎక్కువ దొరుకుతుంది. అయితే ఏ ప్రచురణకర్త చూసినా నా యీ చెత్తకుండీ కాగితాల్ని చూడగానే గాభరాపడి పదీ పదిహేను రూపాయలకన్న విలువ కట్టలేదు. ఇంత స్వల్పధనంతో నా అవసరాలు తీరవాయె.

"నేను రోజంతా తిరగని దుకాణంలేదు. సరియైన విలువకట్టే ప్రచురణకర్త దొరకలేదు. అమృత్‌సర్ తిరిగివెళ్దామన్న ఆలోచన కల్గింది. ఆకలి

ప్రాణాన్ని తోడేస్తోంది. నా దగ్గిర ఒక్క పావలాబిళ్ళ మిగిలింది. తందూరీ దుకాణంలో దూరీ రొట్టెలు తిన్నాను. జేబులోంచి పావలాతీసి ఇచ్చాను. ఆ దుకాణదారుడు పావలాను రెండువైపులూ పరిశీలనగా చూసి నా మొఖాన గిరాటేసేసాడు. ఆ పావలా సత్తుది. నివ్వెరపోయాను. అక్కడ కూర్చొని తందూరీ రొట్టెల్ని తింటున్న వ్యక్తులు నన్నే చూస్తున్నారు. నా స్థితిపై దయతలిచిన వ్యక్తి ఒక్కడులేడు సరికదా నా వైపు చూస్తూ వాళ్ళలో వాళ్లు హేళనచేసుకుంటూ ఎత్తిపొడుపు మాటలు ప్రారంభించారు.

"దుకాణంవాడు నానామాటలూ అన్నాడు. కాని ఏంచేయను? జేబులో ఓ సిల్కు రుమాలు మాత్రంవుంది. అది నాకు ఎంత విలువకలదో మీకు ఎలా చెప్పడం? ఇది నా గతించిన జీవితానికి మిగిలిన ఒకే ఒక గుర్తు. గుండె బిగబట్టుకొని పావలా క్రింద ఆ సిల్కు రుమాలు అతనికి ఇచ్చేశాను. ఆ పవిత్రమైన చిహ్నాన్ని అతనికి ఇస్తూంటే ఏదో మనోజ్ఞమంజుల రూపం నాకళ్లముందు మెరిసింది. హారి ఘాతకుడా! నీ రక్తం కూడా ఇంత కరడుకట్టిపోయిందా అని ఆ రూపం కన్నీరు కారుస్తున్నట్లు కనిపించింది.

"అలాగే బరువు గుండెతో రైలు స్టేషను చేరుకొన్నాను. ప్లాట్‌ఫారంమీద రైలు సిద్ధంగావుంది. టిక్కెట్టు లేకుండానే వెళ్లి కూర్చున్నాను. రైల్లో కూర్చుని న్యూస్‌పేపర్ మార్జిన్లపై నా మిగిలిన నవలను వ్రాయడం ఆరంభించాను. కాని అక్కడ కూడా అది పూర్తికాలేదు. తీరా ఇక్కడకు చేరగానే మీ చేతిలో చిక్కాను.

"అందుకనే మహాశయా దమ్మరో మొదలే మనవి చేసుకున్నాను. మీరు జైలుకు పంపితే బావుండేదని. నా నవల ఎంతబాగా, అందంగా ముగిసేది! నవలకు తగ్గట్టు పేరు గూడ "తెల్లని రక్తం" అని పెట్టాను. ఇందులో చిత్రించిన పాత్రలందరిలో ఏ ఒక్కరిద్దరో తప్ప మిగిలిన వాళ్లందర్లో మలిన రక్తమే ప్రవహిస్తున్నట్లుగా వర్ణించాను. నా నవలలోని చివరిపాత్ర మీరే. మీలోకూడ ఆత్మీయత అనే భావం నశించినట్లయితే నా నవల ఓ గొప్ప ట్రేజెడీ అవుతుంది. ఇప్పుడు మరోరకంగా కథావస్తువును మరల్చాల్సి వుంటుంది."

అతను చెప్పడం ఆపి దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచాడు. నవలలోని చివర అంశమే అంత కరుణారస పూరితంగావుంటే మిగిలిన నవల ఇంక ఎంత వేదనా భరితంగా వుండేదో అని ఆలోచించిన టి. సి. కి ఆ ప్రయాణీకుని జీవితగాథ విని భావోద్రేకం కలిగింది. శ్రద్ధతోనూ, సానుభూతి, ప్రేమతోనూ నిండిన నేత్రాలతో అతణ్ణి మరల ఆపాదమస్తకమూ చూశాడు, అతని చేతిని ముద్దుపెట్టుకొని టి. సి. ఇలా అన్నాడు.

"సర్దార్జీ, మీరింత గొప్పవారని తెలుసుకోలేకపోయాను. నన్ను మన్నించండి. రండి. ఈ రోజు ఈ నిర్ధనుని గృహాన్ని పావనం చేయండి. ఈ రాత్రి నా దగ్గరేవుండి

పోండి. అభ్యంతరం లేకపోతే దయచేసి మీ నవల చదివి వినిపించండి. నవలలంటే నాకు మహాఇష్టం. దాన్ని అచ్చువేయించే ఏర్పాటు చేస్తాను ఎవరినైనా పట్టుకొని. ఇక్కడ నాకు తెలిసినవారు చాలామంది ప్రచురణకర్తలు వున్నారు."

టి. సి. లేచి నుంచుని యింటికి బయలుదేరాడు. అతను కూడా మాట్లాడకుండా టి. సి. ని అనుసరించాడు. టి. సి. కూడా దారిలో అతణ్ణి మరేమీ పలకరించలేదు. కొంచెంసేపటికి ఇద్దరూ యిల్లు చేరుకున్నారు. తాను ఒంటరి గాడాయె. అందుచేత ఇల్లు చేరీ చేరుకోవడంతోనే నౌకర్ని పిలిచి అతిథికోసం వంటచేయమని చెప్పాడు టి. సి.

ఇద్దరూ భోజనం చేశారు. గదిలోకి రాగానే టి. సి. "చూడండి సర్దార్‌జీ, తమరీ పక్కపై కూర్చుని ముందు మీరు వ్రాసిన ఆ నవల చదవండి వింటాను" అని అడిగాడు.

అప్పుడు రాత్రి తొమ్మిది గంటలైంది. ప్రయాణీకుడు కాగితంముక్కల కట్టకు చుట్టివున్న గుడ్డపేలిక ముడిని విప్పాడోలేదో చిన్నవీ పెద్దవీ రకరకాల కాగితాలు అతని చేతిలోంచి జారినేలమీద నలుపక్కలా చెల్లాచెదరయ్యాయి. ఖంగారుగా ఆ చెదరి పోయిన కాగితాల్ని ఏరుకుంటూ పేజీలవారిగా వరుసక్రమంలో సర్దాడు అతను. అన్నిటినీ పేజీవారీగా సర్దిన తర్వాత మొదటిపేజీ తీసి ముక్కాలిపీట మీద పెట్టాడు.

ముక్కాలిపీటమీద వుంచిన కాగితంలో ఏంవుందో అన్న కుతూహలంకొద్దీ టి. సి. మెడవంచి దృష్టిని ప్రసరించగానే అతని మనస్సు చటుక్కుమంది. కంగారుగా కుర్చీలోంచి లేచినిలబడ్డాడు. అప్పుడప్పుడు వాళ్ల ఆఫీసరు అకస్మాత్తుగా రాగానే గౌరవార్థం నిలబడినట్లు. మొదటిపేజీ టైటిల్ పేజీ. శీర్షిక ఇంతింత పెద్ద అక్షరాల్లో సింపుల్‌గా ఇలావుంది:

## తెల్లని రక్తం
రచన : "గుప్తేశ్వర్"

ఆ పేరు టి. సి. రక్తంలో అణువణువునా నిండివుంది. అతను గుప్తేశ్వర్ పుస్తకాలంటే అమితమైన శ్రద్ధాసక్తుల్తో చదువుతాడు. ఆరచనలు చదివి ఎంతో మానసిక సౌఖ్యాన్నీ, శాంతినీ పొందుతాడు. గుప్తేశ్వర్ రచించిన పుస్తకాల్ని ధర్మగ్రంథాల మాదిరిగా రుమాళ్లలోకట్టి భద్రపరుస్తుంటాడు.

"ఇతనేనా ఆ గుప్తేశ్వర్ ? ఎవరి ప్రతిమాట వేదవాక్కుగా భావిస్తానో ఆ మహావ్యక్తి నాముందు సాక్షాత్కరించింది ! ఇంతగొప్పరచయిత ఇట్టిదౌర్భాగ్యస్థితిలో వుండడమా !" ఈవిధంగా అతనిమనస్సు పరిపరివిధాలైన ప్రశ్నలతో అల్లకల్లోలమైంది.

వెంటనే కుర్చీలోంచిలేచి క్రిందకూర్చున్నాడు. టి. సి. తన రెండు చేతుల్ని ఆప్రయాణీకుని రెండుపాదాలపైవుంచి హద్దుకున్నాడు.

"మీరేనా ఆ మహారచయిత. నా రక్తంలోని ప్రతికణంలో మూర్తీభవిస్తూన్న ఆ గుప్తేశ్వర్ గారు మీరేనా ?" అంటూ అలమారిలో రుమాలులో కట్టి భద్రపరచిన అతని గ్రంథాలు తెచ్చి అతనిముందు విప్పుతూ —

"ఇవ్వన్నీ మీరచనలేనా ?" అని అమితాశ్చర్యంతో అడిగాడు. రుమాలులో గుప్తేశ్వర్ నేటివరకు రాసిన రచనలన్నీ వున్నాయి. అందులోవి కొన్నిపుస్తకాలు, మరికొన్ని పత్రికల్లో ప్రచురింపబడిన వ్యాసాల కటింగ్స్. సాధారణంగా పాఠకులు చేసే పొగడ్తలకు ఏరచయిత అయినా ఉబ్బితబ్బిబ్బై పోవడం సహజం. కాని ఆప్రయాణీకుడు మాత్రం కొంచెమైనా చలించలేదు. ఏమీ తొణకకుండ గంభీరంగా "అవును. అవన్నీ ఆ గురుపాదులు నాచేత రాయించినవే" అన్నాడు.

టి. సి. శ్యాందాస్‌బాబుకు తన యావత్ శ్రద్ధాభక్తినీ కుప్పగా ప్రోగుచేసి దానినంతా ఆ మహారచయిత పాదాలమీద సమర్పిద్దామనిపించింది. గద్గద కంఠంతో ఇలానివాళులు అర్పించాడు — "ప్రియమైన నా గుప్తేశ్వర్ మహాశయా, నేను దేనినైతే ఇన్నాళ్లూ జపిస్తున్నానో ఆ అమూల్యమైన వస్తువు నాకీనాడు అప్రియత్నంగానే దొరికింది. నేను చాల అదృష్టవంతుణ్ణి. మీరు నిజంగా నాకు మోక్షదాతలు. మీరు నాకు చేసిన ఉపకారం వర్ణనాతీతం. కొన్ని సంవత్సరాల క్రితం నేనూ ఓ కుక్క బ్రతుకు బ్రతికిన వాణ్ణే. ప్రపంచంలోని పాపం, కుళ్లు అంతా నాలోనే ఇమిడి వుండేది. దాన్నిచూసి నేను అహంకారంతో మదించి ఛాతీవిరుచుకొని నడిచేవాణ్ణి. కాని మీరచనల్ని చదవడం ప్రారంభించినప్పటినుండి నాలోక్రమంగా మార్పు వచ్చింది. వెతికి వెతికి మీ పుస్తకాలన్నిటినీ సేకరించాను. వివిధ పత్రికల్లో ప్రచురించబడిన మీ వ్యాసాలూ, కథలూ చదవాలనే కుతూహలంతో వాటన్నిటినీ తెప్పించసాగాను. మీరు మీరచనల్లో ఎంతో ఆధ్యాత్మిక చింతనను చొప్పించారు. ఎన్నోప్రవచనాల్ని వింపారు. మీరచనలనిండా ఎంతోతపన కనిపిస్తూ వుంటుంది. అవన్నీ నాజీవితాన్ని ఎలా మార్చివేశాయో నేను వర్ణించలేను. మీదర్శనం చేసుకోవాలని అనేకసార్లు ప్రయత్నం చేశాను. కాని లాభం లేకపోయింది. మీ అడ్రసే దొరకలేదు. అనతికాలంలో ఇంతపేరు ప్రఖ్యాతులు పొందిన ఆ అజ్ఞాత రచయితను ఎవరూ చూడలేదని ప్రతివారూ అంటుండేవారు.

"గుప్తేశ్వర్‌గారూ, మీరు కూర్చున్న ఈస్థానమే కొంతకాలానికి ముందు జూద గాళ్లకూ, తాగుబోతులకూ, ఇంకాఎన్నో పాపాలుచేసేవారికి ఆలవాలమై వుండేది. వారందరికీ నేను నాయకుడిగా వ్యవహరించేవాణ్ణి. మేము చేసిన ఆ పాపాలూ, అన్యా యాలూ, దురాచారాలూ అవన్నీ ఇప్పుడు తలుచుకుంటూంటే..."

బాబుశ్యాందాస్‌పై గుప్తేశ్వర్‌కు జాలికలిగింది. ఒకప్పుడు ఇన్ని అక్రిమాలకు ఒడిగట్టినవ్యక్తి నేడు తన్నుతాను సంస్కరించుకొని తన పాదాలముందు కూర్చోడం చూసి అతనిమీద ప్రేమ, సానుభూతి కలిగాయి. ప్రేమ పురస్సరంగా తన పాఠకుని జబ్బ పట్టుకొని లేపి కుర్చీమీద కూర్చోబెడ్తూ ఇలా అన్నాడు —

"మీరు నాకన్న పెద్దవారు. మీరు మిమ్మల్ని ఆపాపపంకిలంలోంచి బయటికి లాక్కున్నారు. ఇది నిజంగా నా మహద్భాగ్యం. నరక ప్రాయమైన ఆ మార్గంలోకి వెళ్ళినవారు సాధారణంగా బాగుపడడం అంటూజరగదు. మీరు బాగుపడ్డారంటే అదంతా ఆ పూజ్యపాదులవారి కృపాకటాక్షమే".

శ్యాందాస్‌బాబు నేడు అపరిమితానందభరితుడయ్యాడు. అతని మనస్సెంతో సంతో షంతో పొంగిపోయింది. కానీ కొద్దిసేపటి క్రితమే ఈ వ్యక్తితో నేను ఎంతో నీచంగా ప్రవర్తించానన్న భావన అతణ్ణి సిగ్గుతో కుంగదీసింది. గుప్తేశ్వర్ పాదాలను తాకుతూ "నన్ను క్షమించండి. మీపట్ల క్షమించరాని అపచారం చేశాను" అని ప్రార్థించాడు.

"మీరు నాకంటే పెద్దవారు. పితృతుల్యులు. ఇలా నా పాదాల్ని పట్టుకోడం మీకు తగదు" అంటూ అతని చేతుల్ని మెల్లగా పాదాలమీంచి తొలగించాడు.

"వయస్సు దృష్ట్యా మీరు చెప్పింది నిజమే. కాని ఏం లాభం? కాకిగా కలకాలం జీవించడం కన్న హంసగా ఆరునెలలు చాలు అని పెద్దలంటారు. మిగతా విషయాలు తర్వాత మాట్లాడుకొందాం. ముందు దయచేసి మీ నవల వినిపించి నన్ను కృతార్థుణ్ణి చేయండి".

"నేను వినిపిస్తాను. కాని ఇది చాలా దీర్ఘమైనది. నేను చదువుకు పోతూంటే మీకు విసుగు పుట్టిస్తానేమో".

"నాకు విసుగు పుట్టడమా! చదువుతూంటే మీకు విసుగు వస్తుందేమో చెప్పలేను కాని అది పూర్తిగా వినేవరకు పచ్చి మంచినీళ్లుకూడా ముట్టుకోను నేను".

"అయితే మీరు రాత్రంతా జాగారం చెయ్యాల్సి వుంటుంది. నేను వేగంగా చదువు తాను అనుకోండి. అయినా కనీసం ఎనిమిది, పది గంటలు పట్టేటట్లుంది".

"మీరు పదిరోజులు వినిపించండి. కన్నుకూడా మూయను",

"సరే, అలాగైతే వినండి".

శ్యాందాస్‌బాబు దీపాన్ని ఆయన ముందుకు వేలాడదీసి "మీరు ప్రారంభించండి" అని అన్నాడు.

గుప్తేశ్వర్ నవల చదవడం మొదలెట్టాడు.—

---

# [ 1 ]

శిశిరఋతువులో, అడవిలో, చెట్టుకొమ్మనుండి పండి ఎండిన ఆకు చుట్టూ వ్యాపించి వున్న నిస్తబ్ధతను చీల్చుకుంటూ గలగలమంటూ ధ్వనిచేసి రాలినా దాని శబ్దం ఆ అడవి లోని ప్రశాంతతను ఏమాత్రం భంగం చేయలేదు. అలాగే ప్రపంచమంతా వళ్లు మరచి నిద్రిస్తున్న అర్ధరాత్రి వేళ రెల్లుగడ్డితో అల్లుకున్న పూరి గుడిసెలో ఆపదల్లో చిక్కు కున్న ఓ యువతి వేడినిట్టూర్పు విడిస్తే అది ఆ దట్టమైన చీకటి వాతావరణంలో సన్నగా శబ్దంచేసినా దానిలోనే లీనమైపోతుంది.

అసలే నిర్జన ప్రదేశం. గాఢంగా అలుముకున్న చీకటి. ఊరిబయట తన ఖర్మానికి ఏడుస్తూ ఆమె ఒంటరిగావుంది. చుట్టుప్రక్కల ఎవరూ నివసిస్తున్నట్లు లేదు. సమీపం లోనే మోటబావి వుంది. దానిక్రింద చిన్న కమతం చేసుకుంటూన్న రైతులకు పూరిపాక వుంది. పగలు మాత్రం కొద్దిమంది హుక్కా త్రాగడానికో పుగాకు తాగడానికో అక్కడ చేరతారు. ఆ యువతి వయస్సు పద్దెనిమిది సంవత్సరాలకన్న ఎక్కువ వుండదు. తళతళ మెరిసే కంచుపాత్రకూడా పొగచూరే వంటింట్లో పెట్టినప్పుడు తన కాంతిని కోల్పోయి మలినమైపోతుంది. అలాగే ఆమెకూడా. ఆమె స్వతహాగా అతి సుందరై నప్పటికి ఆమె సౌందర్యాన్ని కష్టాలనే కారుమేఘాలు కప్పేశాయి. ఆమె కళ్ళ కింద భాగం నల్లగావుంది. చిక్కగావున్న ఆమె శిరోజాలు, చినిగి చింకిపోయిన ఆమె దుస్తులు చూస్తుంటే సైతాను కాలచక్రం క్రింద ఆమె యౌవనం నలిగి చీకిపోయి నట్లుగావుంది.

అమావాస్య కాళరాత్రి. ఎముకలు కొరికే చలి. మాఘమాసం. ఒకటే గాలి హోరు. ఆ హోరుకు ఎండి మొండైన వృక్షాలు కర్కశంగా కదలడం, ఒకదానికొకటి రాసు కోవడం - ఇవన్నీ కలిసి అసలే దుఃఖాగ్నిలో కాలుతూన్న ఆ పేదరాలి ముందు ఓ చిన్న ప్రళయాన్ని సృష్టిస్తున్నాయి. ఆమె శరీరం చలికి కంపించి వణికిపోతూన్నట్లు కనబడినా ఆమె హృదయంలో భగభగమంటూన్న దావానలం మంటలు కట్టెలతోను, కర్రలతోనూ, అంటుకున్నది కాకపోవడంవల్ల బయటి వాతావరణం దానిని ఏమాత్రం చల్లార్చలేక పోతూంది,

గతించిన సౌఖ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూన్నట్లుగా రాత్రి క్రమక్రమంగా తొలగి పోతోంది. రాబోయే ఆపదల్ని తలచుకొంటూన్నట్లుగా చలి, వర్షం ఎక్కువౌతున్నాయి.

ఆమె శరీరంలో స్పందన నశించింది. ప్రతి అవయవమూ మొద్దుబారి పోయింది. స్పృహతప్పి అక్కడే పేడతో అలికిన నేలపై బోర్లా పడిపోయింది. ఆమె దురవస్థ సహించలేక ఆకాశంలో నక్షత్రాలు కూడా నేత్రాలు మూసుకున్నాయి. మేఘాలు నల్లని దుస్తులు ధరించి కన్నీరు మున్నీరు కార్చాయి.

గాలి, వర్షం రెండూ కలిసి ప్రచండమైన తుఫానుగా మారాయి. ఆ దీనురాలు అలాగే నేలపై స్పృహలేకుండా పడివుంది. తీవ్రంగా వీచిన ఓ గాలి విసురుకు గుడిసె పైకప్పు ఎగిరి ఎక్కడో దూరానపడింది. కొంతరెల్లుగడ్డి, వాసాలుగా వుపయోగించిన చిన్నచిన్న కర్రలు ఆమెపై కరుణించి ఆశ్రయం ఇద్దామన్నట్లుగా నిలిచాయి. కాని కష్టాల్లో కనుమరుగయ్యే స్నేహితుల్లాగ అవి నైతం ఎప్పుడో ఎగిరి ఎక్కడ పడి పోయాయో జాడకూడా తెలియలేదు. ఇక ఆ దీనురాలు తలదాచుకోడానికి అనంతాకాశం మిగిలిపోయింది. హిమపాతం పడినట్లుగా చల్లని మంచుగాలి వీస్తూ నిర్జీవంగా పడివున్న ఆమెదేహంపై గాజుపొడి మాదిరిగా గుచ్చుకుంటోంది. నూనెవాసనకే నోచుకోని ఆమెదీర్ఘకేశాలు వర్షానికి తడిసి దుర్మార్గుడి హృదయం మాదిరిగా బిగుసుకపోయాయి. ఎవరో క్రూరంగా కొరడా దెబ్బలు కొడుతూన్నట్లుగా వుంది ప్రకృతి. అచేతనంగా ఆ ప్రకృతి మధ్య ఆమె పడివుంది.

---

# [ 2 ]

కొద్దిసేపటికి ఆమెకు మెల్లగా స్పృహ రావడం ప్రారంభమైంది. శరీరంలో చలనం కలిగింది. నెమ్మదిగా కనురెప్పలు రెపరెప కొట్టుకున్నాయి. క్రమంగా ఆమె కళ్లు తెరచి నాలుగు వైపులా చూసింది. చుట్టూవున్న వాతావరణం అంతా పొగమంచుతో నిండివుంది. ఏ వస్తువుపైనా ఆమె దృష్టి నిలవడంలేదు. అప్రయత్నంగా ఆమె చెయ్యి తలక్రిందకువెళ్ళి ఏదో వెదకసాగింది. అప్పటికిగాని ఆమెకు బాధ తెలీలేదు. రక్తంలో శిరోజాలు తడిసి వుండచుట్టుకుపోయాయి. తలదగ్గర కట్టు కట్టబడివుంది.

తాను ఏ పరిస్థితిలోవుందీ, అంతకుముందు ఏమి జరిగినదీ ఆమెకు జ్ఞాపకం రాసాగాయి. ఆమె పెద్దగా బాధతో మూలిగి మళ్ళీ స్పృహ తప్పింది. కాని ఈ పర్యాయం తెలివిలోకి రావడానికి ఎంతోసేపు పట్టలేదు. తేరుకొని లేవడంకోసం మంచంపట్టెను తడమసాగింది.

"ఒద్దు తల్లీ! అప్పుడే లేవకు" ఆమె చేయి పట్టుకుని సానుభూతిని కనబరుస్తూ ప్రేమగా ఓ స్త్రీ కంఠం పలికింది. ఆ స్వరం వచ్చినవైపు ఆమె కళ్లు తెరచి చూసింది. ఆ దయామూర్తిని గుర్తు పట్టడానికి ప్రయత్నించింది. కాని ఎక్కడ చూశాను అన్న విషయం ఆమెకు జ్ఞాపకం రాలేదు. ఇంతలోనే మళ్ళీ ఆ దయార్ద్ర స్వరం పలికింది—
"అమ్మాయి, అల్లా కనికరించి నిన్ను మళ్లీ బతికించాడు. నాకైతే ఎంతో హాందోలనగా వుండె. హేంజరుగుతుందో అని తల్లాఢిల్లీపోతున్నా. ఇదంతా ఆ భగవంతుడి దయ."

ఆమె జాగ్రత్తగా ఆ మాటల్ని వింటూంది. అల్లా, భగవాన్ దయ — ఈ రెండు మాటలు మాత్రం లౌడుస్పీకరు మాదిరిగా ఆమె సహజ కంఠంకంటె ఎక్కువ బిగ్గరగా ఆమె చెవుల్లో మారుమోగాయి. నేను ముసల్మానుల ఇంటిలో వున్నానా అన్న ఆలోచనతో ఆమె మరింత గాభరాపడింది. మళ్లీ స్పృహ తప్పేదేమో ఆమెకు. కాని తల దగ్గరగా ఆ వ్యక్తి కూర్చుని జలజల కన్నీరు కారుస్తూండడం గ్రహించి తెప్పరిల్లింది. "నా తల్లీ! భయపడకు. నాప్రాణం అడ్డువేస్తా, నీవు దిగులు పడకు. బాగా అవుతున్నావుగా." ఆమె తల ఒళ్లోకి తీసుకుని మాటిమాటికి ఆమె నుదురు ముద్దుపెట్టుకుంటూ సముదాయించింది.

ఆమెకు తన బాల్యంనాటి సంఘటన జ్ఞాపకమొచ్చింది. ఒకసారి తనకు తీవ్రంగా మలేరియా జ్వరం వచ్చింది. అమ్మ ఇంట్లోలేదు. కొంచెం సేపయిన తర్వాత వచ్చింది. వచ్చీ రావడంతో తన తలను ఒళ్లో తీసుకుని తన నుదుటను చాలా పర్యాయాలు ముద్దు పెట్టుకుంటూ ఇలాగే దీవెనలు పల్కింది. దాని తర్వాత జ్వరం త్వరగా తగ్గిపోయింది.

తెప్పరిల్లిన తర్వాత కూడా ఇంకా నిస్త్రాణగానే వున్నట్లనిపించింది. ఆ యిల్లు, ఆ గోడలూ - ఆ యింటిలో ప్రతివస్తువూ తన పుట్టింట్లోవున్న మాదిరిగానే తోచింది. ఇంకా తాను ఎనిమిదేళ్ల ప్రాయంలో వున్నట్లుగా తన తల్లి తల దగ్గరగా కూర్చొని కళ్లలో మమకారం నింపుకుని తన వైపు చూస్తూన్నట్లుగా అనిపించింది. మరచిపోయిన తల్లిప్రేమ మరోసారి ఆమె హృదయంలో పెల్లుబికింది. తన కష్టాలన్నీ మరచి ఆ పవిత్రతల్లిప్రేమలో పులకితురాలైంది.

తల దగ్గిర కూర్చొన్న ఆ మాతృమూర్తి వైపు ఓసారి చూసింది. తన రెండు చేతులూ వెనుకకుసాచి ఆమె మెడచుట్టూ పెనవేసి "ఎక్కడికి వెళ్లావమ్మా నన్ను వదలేసి. నన్ను తీసుకపో. నువ్వు నాకిక లేవుగా. నువ్వు చచ్చిపోయావని అంటోంది లోకం ... అవును. నా తండ్రే నీచితికి నిప్పంటించడం నేను కళ్లారా చూశాను. నన్ను గూడా నువ్వు ... ..." అంటూ విలపించిందామె. తనివితీరా మమతను మరోసారి చవి చూసిన ఆమె కంఠం, జీరపోయింది. ఆమె వెక్కి-వెక్కి ఏడ్వసాగింది.

ఆ మాతృమూర్తి మనోధైర్యం కట్టతెంచుకుంది. ఆమెను గుండెకు హత్తుకుని వూరడించింది — "నా చిట్టి తల్లివికదూ. నేను ఎప్పుడూ నీ దగ్గిరే వుంటాను. నిన్ను ఒదిలి ఎక్కడిక్కి పోనుగా. భగవంతుడు ... ఆ పరమేశ్వరుడు నిన్ను మంచిగ నయంచేస్తాడు".

ఆమె పూర్తిగా తెలివిలోకి వచ్చింది. ఇప్పుడు ఇంటిలోని ప్రతివస్తువూ స్పష్టంగా కనిపించడం మొదలెట్టింది. తాను ఇంతవరకు ఎవరినైతే తల్లిగా భావిస్తోందో ఆ మాతృమూర్తిఆకృతి మరో రూపాన్ని తొడుగుకున్నట్లనిపించింది. తాను ఇంతవరకు తన పుట్టిల్లని భావించిన ఆ ఇల్లు ఎవరిదో ముసల్మానులది. తన తెలివి తక్కువ మాటలు తలచుకొని సిగ్గుపడింది. "నేను ఎక్కడ వున్నాను?" అంటూ ఆశ్చర్యంగా అడిగింది. ఇంకా ఏమో మాట్లాడబోయింది. కాని ఆమె నాలుక పిడచకట్టింది. నీళ్లు కావాలని అడిగింది. ఆ వృద్ధమూర్తి ఆమెను మంచంమీద పండుకోబెట్టి "ఇప్పుడే వస్తాను" అంటూ గది లోంచి బయటికి వెళ్లింది.

ఆమెకు ఇప్పుడు బాగా స్పృహవచ్చింది. "ముసల్మానుల చేతినీరు ఎలా తాగడం?" తాను ఎన్నడూ ఆపని చేయదుగదా అని ఆలోచించసాగింది ఆమె.

ఇంతలో ఆ వృద్ధురాలు గదిలోకి వచ్చింది. ఆమె వెంట ఓ హిందూ మతస్తుల పిల్లవాడు చేతిలో మంచినీళ్లగ్లాసు పట్టుకుని నిలుచున్నాడు.

మంచినీళ్లు తాగిన తర్వాత మామూలు మనిషి అయింది ఆమె. "నేను ఇక్కడికి ఎలావచ్చాను?" అంటూ ప్రశ్నించింది. ఆమెమాట పూర్తికాకుండానే ఆ వృద్ధురాలు- "బీబీ, నేను అంతాచెప్తా. నీవు దిగులూ పడకు. ఇది నీ ఇల్లే అనుకో. మేం ముసల్మాన్‌లమే. కాని నీ మతాన్ని రొష్టుచెయ్యం. నన్ను నమ్మ!" అంది. కాస్సేపు ఆగి ఆమె మళ్లీచెప్పడం మొదలెట్టింది.

"నేనూ నా కొడుకూ ఈరోజే అంబాలానుండి వచ్చాం. నా పెద్దకొడుకు అక్కడ గుత్తేదారీ చేస్తాడ్. పెందరాళే నాలుగూ గంటలక్కి మేము రైలు దిగినాం. టాంగా మాట్లాడీ ఎక్కి ఒకటిన్నరా మైళ్లూ వచ్చీనామో లేదో రిహానావాలా గ్రామంకాడ నీవూ స్పృహతప్పి పడివుంటం టాంగావాలా సూశాడు. మొదల్ అయితే నీవూ సచ్చిపోయావని అనుకున్నాం. కానీ నా కొడుక్కి కొంతా వైద్యంవచ్చు. అమ్మా, ఈమె గుండెపై చేతినివుంచి చూడమ్మా. ఎలాకొట్టుకుంటుందో అని చెప్తే నేనూ చేతిని వేసి సూశాను. నెమ్మదిగా నీగుండె కొట్టుకుంటావుండె. "ఈమెను గ్రామస్తుల్‌వారికి హప్పగించివెళ్దాం అని కొడుకు అన్నాడు. లేకపోతే ఎవరికి తెలీకుండా ఈ హమ్మాయి దిక్కులేని చావుచస్తుందీ. ఎవరేనా మనిసి కనపడతాడేమో అని అటూ ఇటూ చూసాం. ఎవరూ కనపడలా. వర్షం కొద్దిగా పడ్తూవుంది. ఎవరేనా మనిసి కనపడితే ఆయనికి హప్పాచెప్పిపోదాం అనుకొంటిమి. మళ్లాపోసీ వూరిలోకి పోయి ఎవరికైనా చెప్పివద్దాం అనుకున్నాం. ఏమో, ఈ చలిలో ఇంటిలోంచి బయట అడుగైనా పెడ్తారా. అదీకాక పోలీసువాళ్లకు భయపడి ఇటువంటి విషయాల్లో రావడానికి జంకుతారు అన్న ఆలోచనావచ్చింది. నీ పరిస్థితి చూస్తే చెడ్డగావుంది. ఆఖరుకూ కొడుకు సెప్పినట్లు నిన్ను టాంగాలో హెక్కించుకోని మా హింటిక్కి తీసుకొచ్చాం. హింటిక్కి రాగానే డాక్టరు సాబును పిలిపించా. తడిసిముద్దైన నీ గుడ్డలు మారిచాం. కుంపటితెచ్చి నీకూ సెగపట్టాం. డాక్టరు సాబు హింతలోకి వచ్చాడు. రెండూ గంటలు నీ దగ్గర వుండి ఇలాజుచేస్తూవుండె. నీ తలమీద దెబ్బతగిలివుండె. రక్తంతో నీ జుత్తు అంతా తడిసి ముద్దకట్టిపోయింది. గాయాన్ని కుట్టీ కట్టూ కట్టాడు డాక్టరుబాబు. తర్వాత నేను హేమేం చెయ్యాలో చెప్పివెళ్లాడు. రాతిరి అంతా నీవు తెలివిలేకుండా వున్నావు. ఖుదా దయవల్ల ఇప్పుడే మేల్కున్నావ్"

కొంచెంసేపు సేద తీర్చుకుని వృద్ధురాలు మళ్లీ ఇలాచెప్పింది - " ప్యారీ బేటీ, నీవు నీ కథను చెప్పు. నీకూ ఇట్లా ఎందుకు జరిగిందో. హెవరు నిన్ను ఇట్లా చేసారో. ముందు నీ పేరు చెప్పూ. నిన్ను ఏమని పిలిచేది ? "

వృద్ధురాలు చెప్పిన మాటలు ఆమె వింటూ ఆమె ముఖకవళికపై ప్రతి మాటకూ కలిగే మార్పుల్ని గమనిస్తోంది. కోపంలో ఆమె ఎర్రబారడం, విద్వేషం, అసహ్యంతో ఆమె నుదురు పైభాగం ముడతలు పడడాన్ని ఆమె గమనిస్తోంది. చేసిన ఉపకారాన్ని తలచుకొని ఆమె కళ్లు కృతజ్ఞతాభావంతో మెరిసిపోతున్నాయి.

ఆ మాతృమూర్తి చెప్పినది విన్నదిగాని ఏమీ జవాబు ఇవ్వలేదు. వృద్ధురాలు మళ్లీ– " అమ్మాయి, నీవు విచారించకు. కష్టాలు హందరికీ వస్తాయి. అదురుష్టంముందు ఎవరి హాటాసాగదు. హన్నట్టూ మరచిపోయానూ, నీ పేరూ ఏమిటీ ? " అనిఎంతో. అప్యాయంగా అడిగింది.

" గుర్‌దేయీ " మేలిముసుగు కొంగుతో కళ్లు తుడుచుకుంటూ ఆ యువతి సమాధానం ఇచ్చింది.

" సరే, గుర్‌దేయీ ఓకే, ఇప్పుడూ నీ విషయం సవిస్తారంగా చెప్పు. నీ ఇల్లూ ఎక్కడ, నీవు ఎక్కడ వుండేదీ. మా బేటా గఫూరు చాలా తొందరా పడుతున్నాడు. త్వరగా ఆమె ఇల్లూ వాకిలీ తెలిస్తే హామెను దిగాబెట్టీ వస్తాన్ అంటాడు. చూడూ తల్లీ, పెపంచం చాలా చెడ్డది. నవ్వించినంతా కాలం ఎవ్వరూ హేమీఅనరు. కొంచెం ఏడిపిస్తే చాలు వెంటనే దుమ్మూ ఎత్తిపోసుకుంటార్ ". వృద్ధురాలు దిగబెట్టాలనే తాప త్రయంతో ఆమె అచూకీ గురించి ప్రశ్నించింది.

ఆ వృద్ధురాలు ప్రశ్నవిని గుర్‌దేయీ ఓ నిట్టూర్పు విడిచింది. " అమ్మా ! మీరు నా పట్ల ఎంతో దయచూపించారు. కాని మీరు నాకు ఈ మేలు చేయకపోతే ఎంతో బావుండేది. ఈ కష్టాల నుంచి నాకు విముక్తి కలిగేది. ఏంచేస్తాం. ఖర్మంకాలిన వారిని చూస్తే మృత్యువుకూడా వెనుకడుగు వేస్తుంది. నా ప్రారబ్ధంలో ఇంకా ఎన్ని కష్టాలు పడాలని వ్రాసివుందో ? " కళ్లల్లోంచి కారే కన్నీటికి ఆమె ముఖమంతా తడిసిపోయింది.

సౌఖ్యానికే నోచుకోని ఆ అదృష్టహీనురాలి మాటలు వింటుంటే ఆ వృద్ధమూర్తి హృదయం ద్రవించిపోయింది. ఆమె తలను తన చేతుల్లోకి తీసుకొని ధైర్యం చెప్ప సాగింది. మనస్సులోని వ్యథనంతా వెళ్లగక్కేసిందేమో గుర్‌దేయీ హృదయం కొంచెం తేలిక పడింది. నెమ్మదిగా ఆమె తన జీవితగాథను చెప్పడం ప్రారంభించింది,

"నా పుట్టిల్లు వైరావల్. పదిసంవత్సరాల వయసులోనే మా తల్లి చనిపోయింది. నాకు చెల్లెలూ తమ్ముడూ అంటూ ఎవ్వరూ లేరు. తండ్రే నాకు జీవనాధారం. కాని ఏమి ప్రయోజనం. అతను వున్నా లేనివాని కిందే లెక్క. చెడు సావాసాలుపట్టి అప్రయోజకుడిగా మారిపోయాడు. అమ్మవున్నన్నాళ్లూ రోజూ ఇద్దరికి కొట్లాట జరుగుతుండేది. సారా తాగవద్దంటే నాన్న అమ్మను చితకకొట్టేవాడు. ఆ మహాతల్లి ఈ కష్టాల్లోనే కరిగి కరిగి చివరకీ ప్రపంచాన్నే విడిచివెళ్లింది.

" అమ్మ చచ్చిపోగానే నాన్నకు పట్టపగ్గాలు లేకుండా పోయాయి. రాత్రింబవళ్లూ మద్యం సేవిస్తూ నిషాలో వుండేవాడు. ఆయనదగ్గర డబ్బున్నంతకాలం బెల్లానికి చీమలు పట్టినట్లు అంతా ఆయన్ను వెన్నంటితిరిగేవారు. తప్పతాగి తందనాలాడి ఆస్తినంతా పోగొట్టుకోగానే మెల్లగా ఒక్కొక్కరే జారుకున్నారు.

"నాకు పదిహేనోయేడు వచ్చినా ఆయన ఏమాత్రం పట్టించుకునేవాడు కాడు".

"అంత వయస్సు వచ్చేవరక్కు పెళ్లి ఎందుక్కుచేయ్యలేదు ?"; అని ప్రశ్నించింది వుండబట్టలేక ఆ వృద్ధురాలు.

"అమ్మైతే చేసేది. ఆమె ఉన్నప్పుడే ఓసంబంధం ఖాయంచేసింది. కాని నాన్నే అమ్మపోయాక ఆ సంబంధాన్ని కాదన్నాడు."

" ఏం ?".

" ఏమి చెప్పను ? తలాఒక కారణం చెబుతారు. అమ్మ బతికి వున్నంత కాలమూ ఎవ్వరూ ఏమి నోరు ఎత్తలేదు. అటు కన్ను మూసిందో లేదో తలా ఒకమాట విసరడం మొదలెట్టారు. నాకు చదువేమీరాదని వాళ్లు పెళ్లి మానుకున్నారని కొందరూ, మరి కొందరు నాన్నే వాళ్లను ఏదో డబ్బు అడిగితే వాళ్లీసంబంధాన్ని కాదన్నారనీ, ఇలా తలా ఒకరకంగా చెప్తారు ..."

మధ్యలోనే వృద్ధురాలు అందుకుంది— " అవును అమ్మాయి, నిన్నూ మీ నాన్న ఎందుక్కు చదువుకి పంపలేదు ? మీ హిందూకులంలో పిల్లల్ని పుట్టీపుట్టంగానే ఇస్కూలుకు పంపుతారే " ?

" మా నాన్న ఆ కోవకు చెందినవాడు కాదులెండి. నాకైతే చదవాలనే ఆశవుంది. కాని ఏమిచెయ్యడం ? నాన్న వద్దని పట్టుపట్టాడు. ఆడపిల్లలు చదువుకుంటే చెడిపోతారని అంటుండేవాడు. పైగా ఏడు తరాల నుంచీ మన వంశంలో ఎవ్వరూ చదువుకోనప్పుడు మనం వొక్కళ్లమే ఈతరంలో సంప్రదాయాన్ని ఒదిలి వారికి తలవంపులు ఎందుకు తేవాలి అని అంటూండేవారు ".

"హూఁ. తర్వాత ?"

"తర్వాత ఏముంది. సంబంధాలు వెనక్కి వెళ్లాయి. నాన్న మళ్లీ ఆపాత చదరంగమే ఆడడం మొదలెట్టాడు. మళ్లీ తాగుడు ప్రారంభించాడు".

"అంటే ?"

"అంటే వాళ్లంతా నచ్చచెప్పి ఓ సంబంధం కుదర్చాలని ప్రయత్నంచేశారు. కాని నాన్న ఒప్పుకోలేదు. విధిరాతను ఎవరు తప్పించగలరు ? ఎలాగైతేనేం నాన్నను ఒప్పించారు. మా నాన్న నన్ను రెండువేల రూపాయలకు ఓలిచ్చివేశాడు.

"కొన్ని రోజులకు నాకు వివాహమైంది అక్కడనుంచే నా కష్టాలు కూడా ప్రారంభమయ్యాయి. అత్తవారింటికి వచ్చాను. వారి వయస్సు నాన్న కంటె పెద్దది. ఆ కిందటి సంవత్సరమే మనుమడికి వడుగు కూడా జరిగింది. ఉబ్బసం ఆయన ఆరోగ్యాన్ని పాడుచేసింది. కోడలూ, మనుమలు, మనుమరాళ్లూ అందరూ వున్నారు. ఐశ్వర్యానికి అంతులేకుండావుంది. వ్యాపారస్తుల తరపున బ్రోకర్‌గా పనిచేస్తూ సరుకు అమ్మడం కొనడం, క్రయం చెయ్యడంలో ఆయనగారు చాల ధనాన్ని ఆర్జించాడు".

వృద్ధురాలు మళ్లీ ప్రశ్నించింది— "అయితే బీబీ, మీ బాపూ తప్పుచేసినాడు. మీ బంధువరగంవాళ్లూ ఎందుకూ అడ్‌గలా ఒంటెమెడలో గంట ఎందుక్కి కట్టుతావని ? కూతురు చేసుకున్న ప్రదానాన్నీ చెడగొట్టీ కూతురినీ అమ్మీవేసినందుక్కి వాళ్లంతా ఏమీ అనలేదూ ?"

"అమ్మా, వాళ్ల సంగతి ఎందుకు అడుగుతారు. అసలుకారకులే వాళ్లు. నాన్నకు నచ్చిన దుష్టచతుష్టయంలోని మనిషే మాబంధుకోటిలోని పెద్దమనిషి. వీళ్లు పట్టుకున్న వాళ్లు మళ్లీ కోలుకోలేరు. అదంతా ఒక విషవలయం. ఒక్కొక్కదాని గురించి చెప్పడం సాగిస్తే యుగములుకూడా చాలవు. అయినవాళ్లు నన్ను ముంచకపోతే నాకీనాడు ఈ దుర్గతి ఎందుకు పట్టుతుంది ?"

భూమాతను అంటుకొని చెవులు తాకుతా ఆవృద్ధమూర్తి "ఎంతపని చేశారూ" అని విస్తుపోయి "తర్వాత ఏం జరిగిందీ" అంటూ మళ్లీ అడిగింది.

"అనుకున్నదే జరిగింది. వివాహమై ఏడాదికాలేదు. నా జీవితం ఆటేకట్టింది. నెలకూ రెండునెలలకో వారికి ఉబ్బసంవచ్చేది. కాని ఆఖరుసారి ఆవ్యాధి ఏమంటూ వచ్చిందో ఎనిమిది జాముల్లోనే వారిని కబళించివేసింది. నేను నా ఖర్మానికి ఏడ్చాను.

"నన్ను వెంటాడుతోన్న దురదృష్టం ఇంతవరకే వెంటాడి వదిలేస్తే నేను కూడా మిగిలిన వాళ్లతోబాటు ఈ వైధవ్య జీవితాన్ని ఎలాగో గడిపివేసేదాన్ని. కాని నేను

దానికి కూడా నోచుకోలేదు. మొదటి సంబంధానికి ఇద్దరు మగపిల్లలు. రెండోవాడు చిన్నాడు. స్కూల్లో చదువుతున్నాడు. నా వ్యవహారంలో జోక్యంచేసుకొనే వాడు కాడు. కాని పెద్దకొడుకూ అతని భార్యా ఎప్పుడూ నామీదకారాలూ మిరియాలూ నూరుతుండే వాళ్లు. ఇష్టంవచ్చినట్లు బాధించే వాళ్లు. నాదీ తక్కువ నోరుకాదు. నాకూ పట్టుదల ఎక్కువ. ఒకటికి నాలుగు అంటే కాని నాకు శాంతివుండేది కాదు. పొట్టపొడిచినా అక్షరం ముక్కరాని దాన్ని. చదువే వచ్చిఉంటే నేనింకేదైనా దారి చూచుకునేదాన్ని మరి.

"రోజూ ఇంట్లో నా గురించి చర్చలు జరుగుతూవుండేవి. నామీద అనేక విధాలుగా నిందలు వేస్తుండేవారు. ఎవ్వరూ నాతో ముక్కుసూటిగా మాట్లాడేవారు కాదు. మొదట్లో నానాతిట్లు తిట్టి తృప్తిపడేవాళ్లు. కాని పెద్దకొడుకు రానురాను కోపంవచ్చినప్పుడెల్లా భార్య చెప్పుడుమాటలు విని కొట్టడంగూడ ప్రారంభించాడు.

"నేను వుక్రోషంతో చాలా రోజులు భోంచేయడం మానివేసేదాన్ని. నన్ను ఎవరు ఓదారుస్తారు? చివరకు నేనే దిగివచ్చి ఆత్మను చంపుకుని ఎంగిలి పడేదాన్ని.

"ఇలాగే కష్టాలు తలచుకుంటూ మరికొంతకాలం గడిపాను. ఒకరోజు నాన్నకు జబ్బుగా వుందని కబురు వచ్చింది. నాన్నను చూద్దామని పుట్టింటికి బయలుదేరాను.

"నేను వెళ్లడానికి సన్నాహం చేసుకుంటూండగా నా పెద్దకొడుకైన కరమ్‌చంద్ నా దగ్గరకు వచ్చాడు. ఎంతో ప్రేమ నటిస్తూ నాన్న ఆరోగ్యం గురించి వాకబుచేశాడు. మళ్లీ మెల్లగా బయటపెట్టాడు— "రోజూ ఇంట్లో దెబ్బలాడుకోవడం మనస్తాపాలు పెంచు కోవడం మంచిదికాదు. నీవు సమ్మతిస్తే పెద్దల్ని పిలిచి ఆస్తి పంచుకుందాం అన్నాడు.

"నేను ఒప్పుకున్నాను. కొంచెం సేపయినతర్వాత కరమ్‌చంద్ నలుగురైదుగురు పెద్దమనుషుల్ని తీసుకొని వచ్చాడు. అందులో ఆ వూరిలోని పంతులుగారూ వున్నారు. ఏదో కాగితం రాసితెచ్చి నన్ను వేలుముద్ర వేయమన్నాడు. కాగితం ఇలా వున్నట్లు చదివాడు—

'ఇంటి యావత్తు ఆస్తీ నగదుఅంతాకలిపి అరవైవేల రూపాయలక్రింద తేల్చడ మైంది. ఇందులో యిరవైవేల రూపాయలు గుర్‌దేయీకి, యిరవైవేలు కరమ్‌చందుకూ మిగతా యిరవైవేలు చిన్నవాడికి. రెండో కుమారుడు చిన్నవాడైనందువ ఆ సొమ్ము డిపాజిటుగా పెట్టవలెను. ఇదికాక గుర్‌దేయీ, కరమ్‌చంద్ భార్యా ఇద్దరి ఒంటిమీద ఆభరణాలూ కలిపి మూడు భాగాలుగ చేయవలెను. అందులో ఒక భాగం గుర్‌దేయీకి

రెండోభాగం కరమ్‌చంద్ భార్యకూ, ఇక మూడోవాటా చిన్న కొడుక్కూగాను డిపాజిట్టు చేయవలెను.

"ఆ కాగితంపై వాళ్ల నా వేలుముద్ర వేయించుకొని చాలా మంది సాక్షి సంతకాలు తీసుకున్నారు. వాళ్ల చెప్పిన ప్రకారం ఈ రుద్రాక్షమాల మెడలో వేసుకొని నా నగ లన్నీ వారికి ఇచ్చేశాను. నువ్వు పుట్టింటికి వెళ్లిరా అప్పటివరకు నగల కిమ్మత్తుకట్టి ఆస్తిలో నీకు రావలసిన వాటాతోసహా నీపరం చేస్తాము" అని అన్నారు.

"ఆ రోజే సాయంత్రం నాన్నవూరు వెళ్లాను. నాన్న పరిస్థితి అధ్వాన్నంగా వుంది. చేతిలో చిల్లిగవ్వలేదు. అతని ఆస్తిఅంతా స్నేహితులు స్వాహాచేశారు. నేను వెళ్లిన మర్నాడే ఆయన కన్నుమూశాడు. అంత్యక్రియలూ మిగతా తతంగాలు జరిగాక నా వాటా తీసుకుందామని అత్తారింటికి వచ్చేశాను.

"నిన్న సాయంత్రమే నేనావూరికి వచ్చాను. కొద్దిగా వర్షం కురుస్తోంది. తుఫాను గాలి వీస్తోంది. చలికొరికేస్తోంది. ఇంటికి వచ్చి చూతునుగదా అందరి ముఖాలు మారి పోయినాయి. నాగది తాళం పగలగొట్టి అన్ని పెట్టెలూ తీసుకపోయారు. నాకు మతి పోయింది. కోడల్ని అడిగితే విరుచుకపడ్డది — "వాటన్నిటితో నాకు ఏమిసంబంధం వుంది? ఎక్కణ్ణుంచి వచ్చావో అక్కడికేపో" అంటూ.

"నిప్పులమీద కూర్చున్నట్లయింది నాపని. ఏడుపులూ పెడబొబ్బలూ ప్రారంభిం చాను. వీధిలోని ఇరుగు పొరుగు వాళ్లంతా ఏకమయ్యారు. కరమ్‌చంద్‌గూడా వచ్చాడు. అతనివెంట వూళ్లోని పెద్దలు కొంతమంది వున్నారు.

"ఏడుస్తూ జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పాను. కోడలు పెట్టెలోంచి నేను వేలుముద్రవేసిన కాగితాన్ని తీసి నాకాళ్లముందు విసరివేసింది. అక్కడచేరినవాళ్లలో ఒకరు ఆ కాగితాన్ని చేతుల్లోకి తీసుకుని చదివాడు. "నేను నా భర్త ఆస్తిలో మూడో వంతు తీసుకుని తీర్థయాత్రలకు వెళ్లుతున్నా. ఇక ఈ యింటిలోని ఏవస్తువుతోనూ నాకు ఎట్టి సంబంధంలేదు" అని కాగితంలో రాసివుంది.

"వినగానే నాకు ఒళ్లు మండింది. కాని అక్కడ నా మాట వినేదెవ్వరు? ఇంటిలోనివాళ్లూ బయటివాళ్లూ నన్నే ఆడిపోసుకుని ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లిపోయారు. నేను తిట్లు లంకించుకుని పెద్దగా అరుస్తూ ఆకాశాన్ని నేలనూ ఒకటిచేస్తున్నా. ఇంటిలో వున్న ముగ్గురూ కోపంలో పిచ్చి వాళ్లలాగా నా పైకి కలియబడ్డారు.

"నేను ఈ ఇంటి ముందే పడిచస్తాను అని బెదిరించాను. వాళ్ల క్రోధం, ఆవేశం మరింత రెట్టింపయింది. పంచాయితీ వాళ్లకు అండదండలు మొదలే

ఇచ్చిందాయె. వాళ్లు ముగ్గురూ నా మీదకు వచ్చారు. నా కోడలు చపాతీలు చేసే కర్రతీసుకుని తలమీద బలంగా కొట్టింది. రక్తం మడుగుకట్టింది. నేను కిందపడి పోయాను. నోటిలో గుడ్డ తురిమి కాళ్లూచేతులూ విరిచికట్టి నన్ను చాలా దూరంగా తీసుకపోయి ఓ గోతిలో గిరాటేసి వెళ్లిపోయారు.

"అప్పుడు బాగా వర్షం కురుస్తోంది. తెలివిరాగానే చూసుకొన్నాను. నా బట్టలన్నీ రక్తంలోను వర్షంలోను తడిసిపోయాయి. పడుతూలేస్తూ, తూలుతూ బయలుదేరాను. ఇద్దరుముగ్గురు తెలిసినవారి ఇళ్లకు వెళ్లి తలుపు తట్టాను. ఎవ్వరూ తలుపుతెరిచిన పాపాన పోలేదు.

"ఇంక జీవించి ఏమిచేయడం? నుయ్యిలో దూకి ప్రాణాలు విడవడం నాకు చాలా తేలికైనపని. వూరిలోంచి బయలుదేరి, నుయ్యివైపుకు నడుస్తూ వెళ్లాను. చీకటి రాత్రి. మేఘాలు గర్జిస్తున్నాయి. ఉరుములూ మెరుపులూ. దానికి తోడు వర్షం జోరుగా కురుస్తోంది. నుయ్యి ఇంకా చాల దూరంలోవుంది. గాలి విసురు నన్ను తోస్తూవుంది. వర్షధారలు నా దారికి అడ్డుతగులుతున్నాయి. కాళ్లు శరీరాన్ని ఈడ్వలేక పోతున్నాయి. అట్టి పరిస్థితిలో ఒక్క అడుగూ ముందుకు వేయడం అసాధ్యంగా తోచింది. కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కటికచీకటిలో నుయ్యి ఎక్కడ వుందో కూడ తెలియలేదు. మెరుపు మెరిసినపుడెల్లా దారిచూసుకుంటూ నడిచేదాన్ని. దురదృష్టం అక్కడ కూడా నన్ను వెంటాడడం మానలేదు. ఎదురు గాలీ, వర్షానికీ, ఓ అడుగు ముందుకుపడితే రెండడుగులు వెనక్కు పడుతున్నాయి.

"చిట్టచివరకు నుయ్యికి దగ్గిరేవున్న ఆ పూరిపాకలో స్పృహతప్పి పడిపోయాను. తర్వాత ఏం జరిగింది నాకు తెలియదు. తీరా ఇప్పుడు తెలివివచ్చి చూస్తే నేను ఇక్కడ వున్నాను".

గుర్‌దేయీ దీన చరిత్ర విన్న ఆ ముసలావిడ హృదయం కరుణతో, ప్రేమతో రెపరెపలాడింది.

# [ 3 ]

రాధాకృష్ణ పంతులుగారంటే ఆ గ్రామంలో ప్రతిపిల్లాడూ చెబుతాడు. ఇక ఆ వూళ్లో వున్న రసశేఖరులైతే వారిని దేవతగా కొలుస్తారు. వారిలో ఒక వర్గం పంతులుగారిని '' హాతిమ్‌తాయ్ '' గాను '' భట్టి విక్రమాదిత్యుడి '' గానూ వర్ణిస్తారు. లోక కళ్యాణం చేయడం అంటే ఆయనకు మహాఇష్టం. ఏ వ్యవహారమైనా కానీండి, ఎవరింట్లో కలహమైనా కానీండి. గ్రామస్తులు, ముందు పంతులుగారిని వెతుక్కుంటూ బయలు దేరుతారు. ఒకవేళ వారు పొరపాటున అతన్ని శరణువేడకపోతే పాపం పంతులుగారే ఎన్ని పనులున్నా సరే విడిచిపెట్టేసి పిలవని పేరంటమయినా పనిగట్టుకుని బయలు దేరుతారు. ఆ వ్యవహారాన్ని ఏదోవిధంగా పరిష్కారం చేయడానికి నడుం బిగిస్తారు.

ఓ పర్యాయం ఒకపాలేరు తాలూకు దున్నపోతు ఖానేషాగారి పొలంలో పడితే రాధాకృష్ణ పంతులుగారి వ్యవహార కుశలతవల్లనే ఇరవైరూపాయల స్టాంపు అప్పటికప్పుడే తెప్పించి రాతకోతలు జరిగాయి. అతని బుద్ధికుశలతకు ఇది మచ్చుతునక. ఆ పశువు యొక్క యజమాని మూర్ఖుడేమో పంతులుగారి ప్రతిభను గ్రహించలేక ఎదురుగానే మాట్లాడేశాడు. వెంటనే పంతులుగారు వాణ్ణి శపించారు. పాపం వాడికి పై ప్రాణం పైనే ఎగిరిపోయింది. ఈ సంఘటన జరిగి ఆరు సంవత్సరాలైనా ఈ నాటిక వాడు అప్పు తీర్చలేకపోయాడు. ఆ అప్పు తీర్చడంలోనే అతని ఆవు, దూడా రెండూ అమ్ముడు పోయాయికాని ఖానీషాగారి అప్పుమాత్రం అలాగే వుండిపోయింది.

పంతులుగారి భక్తులు అతణ్ణి గురించి ఎన్నో అద్భుతాలు చెప్పి అతను పెద్ద సిద్ధుడని గ్రామస్తులకు నమ్మకాన్ని కల్గించారు. అన్నింటికన్న మించిన అద్భుతం ఏమిటంటే ఆయనకు ఏ వ్యాపకమూలేదు. జాతకం కూడ రాయాల్సిన అవసరంలేదు. ఐనా ఆయన ఇంట్లో నవనిధులూ ద్వాదశ సిద్ధులూ చోటు చేసుకున్నాయి! వివాహం చేసుకున్న ప్రారంభంలోనే, వయసులోవున్నప్పుడే భార్యను ఇంట్లోంచి వెళ్లగొట్టి ఆయన పుణ్యం సంపాదించుకున్నారు. అతని దృష్టిలో భార్య చాలా దుర్మార్గురాలు, నీచమైనది. ఇంట్లో వున్న సగంధాన్యం బీదలకు పంచిపెట్టుతుండడం, కార్యార్థం ఇంటికి వచ్చినవారి దగ్గర ధాటిగా డబ్బు వసూలు చేయలేకపోవడం, అన్నిటికన్న శూద్ర జాతిస్త్రీ లక్షణాలు కలిగివుండడం ఇవి ఆమె అపరాధాలు. ఎవరికైనా కష్టం వస్తే

చాలు క్రింది తరగతి స్త్రీల మాదిరిగా తనకు తానే కల్పించుకుని వెంటనే వాళ్లకు సేవ చేయడానికి సిద్ధపవుతుంది. ఇలావుండగా పంతులుగారికి కలలో ఆకాశవాణి చెప్పిందట. అతని భార్య క్రిందటి జన్మలో శూద్రజాతిస్త్రీ అని. అంతే. ఆరోజు నుండి సహాయ నిరాకరణ ప్రారంభించి నేటివరకు ఆమె ముఖం చూస్తే ఒట్టు. వాచాలత్వంలో పంతులుగారు మంచి చతురుడు. జీవితం అంతా పుస్తకాలకు అంటుకుని కూడా సంపాదించలేని రహస్యవిద్య పంతులుగారు అక్షరజ్ఞానం లేకుండానే, ఏపుస్తకం ముట్టుకోకుండానే సంపాదించి సర్వజ్ఞుడూ, వేదాంతీ అయి కూర్చున్నాడు. శాస్త్రచర్చలో ఆయన్ను ఎవరూ ఓడించలేరు. అవిద్య అనే అంధకారంచేత ప్రజానీకం ఏదైవిక గుణాల్ని మరచిపోయిందో వాటిని మళ్లీ వెలుగులోనికి సరికొత్త రూపంలో తీసుకురావాలనే అతని మనోరథం నెరవేరుతూవుంది. శివుని ప్రేయసి అంటూ భంగు గురించి ప్రచారం చేయడం, మద్యాన్ని దేవతల పథ్యాలుగా అలంకారమైన సోమ రసంగా వర్ణించి దాన్ని సేవించడం అందుకు ఉదాహరణలు. కురుపాండవులే జూదం ఆడారు, దాన్లో తప్పులేదని చెప్తూ ప్రజల్ని అందుకు ప్రోత్సహించడం, ఇలాంటివే అనేకమైన వుపకారాలుచేసి పంతులుగారు ఈ జన్మకు సార్థక్యాన్ని చేకూర్చు కున్నాడు.

వూళ్లోవున్న డబ్బున్నవాళ్ల పిల్లలు గురుకులంగా వ్యవహరింపబడే పంతులుగారింట సమావేశమైనప్పుడు పంతులుగారు గురుపీఠాన్ని అలంకరించి శాస్త్రసంబంధమైన విషయాలనూ, రాజకీయాలనూ విమర్శచేస్తూంటే శ్రోతలు ప్రశంసించని రోజులేదు.

అటువంటి సమావేశమే పంతులుగారింట్లో ఆరోజు జరిగింది. రాత్రి ఎనిమిది గంటలైంది. చలి విపరీతంగానేవుంది. కాని పంతులుగారి వాడీవేడైన ప్రతాపం ముందు దాని ప్రభావం ఏమీ పనిచెయ్యడంలేదు. గదిలో చలివుండదు. కారణం అక్కడ ఖణఖణమంటూ కుంపటిమండుతూంది. అక్కడ కొంతమంది చేపవేపుడూ, కోడిపులావూ వండుతున్నారు. ఇక ఆయన భక్తుల విషయంలోనూ అంతే. సోమరసాన్ని సేవించే మనిషంటే చలికి భయంకదా.

తొమ్మిదికొట్టగానే వందిమాగధులంతా సభామందిరంలో ప్రవేశించి వారివారి స్థానాల్లో కూర్చున్నారు. తర్వాత నెమ్మదిగా పంతులుగారు వచ్చి పీఠాన్ని అలంకరించారు. పంతులుగారు రాగానే ఆయన భక్తులు స్వాగతం పలికారు. ఇంతలో ఓ భక్తుడు గబగబావచ్చి తినుబండారాలు ఓచోటపెట్టి సీసాకార్కుతీసి ప్రారంభోత్సవం చెయ్యమని పంతులుగార్ని అర్థించాడు.

సభనంతా ఓసారి కలియ చూశాడుపంతులుగారు. ఉపన్యాసం ప్రారంభించాడు — " మిత్రులారా, కొంచెం ఆగండి. మన సభకు రత్నంలాటి ఖ్వాజాసాహెబుగారు ఇంకా దయచేయలేదు. ఇక్కడిపేడుక గురించి వారికి కబురు వెళ్లనట్లు తోస్తోంది."

పంతులుగారి మాటలకు అడ్డంతగులుతూ ఓ సభ్యుడు "కాదండి, నేను స్వయంగా వారి ఇంటికి రెండుపర్యాయాలు వెళ్లివచ్చాను. వారు బయలుదేరుతూండగా ఎవరో ఇద్దరు గ్రామస్థులు వూడిపడ్డారు. అందువల్ల సాహెబుగారు వారితో మాట్లాడుతూ వుండిపోయి వుంటారని నావుద్దేశ్యం. లేకపోతే ఇంతఆలశ్యం చెయ్యరు". అని విన్నవించుకున్నాడు.

అంతలో సభామందిరం బయట బూట్లచప్పుడు వినిపించింది. " అదిగో వచ్చేశారు " అంటూ పంతులుగారు లేచి ఖ్వాజాసాహెబుగారిని ఆహ్వానించడానికి గుమ్మంలోకి వెళ్లాడు.

ఖ్వాజాసాహెబుగారి పూర్తిపేరు ఖ్వాజాషేర్‌ఖాన్. సబ్‌ఇన్‌స్పెక్టరు, సుమారుమూడు సంవత్సరాలున్నుండీ ఈవూరిలో పనిచేస్తూ వూరిగౌరవాన్ని పెంచేస్తున్నారు. ఆయన రాగానే పంతులుగారిని ఆలింగనం చేసుకుని వారిపక్కస్థానంలో వచ్చికూర్చున్నాడు.

" చెప్పండి, ఖ్వాజసాహెబ్, మీకోసరం ఎదురుచూసి మాకళ్లు కాయలు కాశాయి. ఇంకో అర్ధగంటలో మీరు దయచేసి వుండకపోతే నేడీ సమావేశాన్ని రద్దుచేసేవాళ్లం. మీరేచెప్పండి సైన్యాధిపతి లేకుండా ఎక్కడైనా సైన్యం రాణిస్తుందా ?" పంతులుగారు తన స్వాగతోపన్యాసం ముగించాడు.

సమాధానం చెప్పడానికి ఖ్వాజసాహెబు లేచాడు. టోపీమీద వున్న కుచ్చు సర్దుకుంటూ "నా పంతుల్‌గారూ, మీరు వుండగా ఏమీ పొరపాటు వుంటుంది. నేనూ హైతే హప్పుడే వచ్చేవాడిన్ని. కాని పనికొంచెం వుండడంవల్లా కొంచెం ఆలస్యం హైపోయింది."

పంతులుగారు ఆయనకు దగ్గరగా జరిగి ఆయన చెవికి తన నోరు పెట్టి "ఏం, ఏదైనా కొత్తకేసు పట్టారా ?" అని అడిగాడు.

ఖ్వాజాసాహెబుగారు టోపీని తీసి అక్కడే కూర్చున్న ఓమనిషికి అందించి బోడి తలపై చేతిని పోనిచ్చి నిమురుకుంటూ " అవును. ఖుదా ఓకేసును పంపాడు" అని చెప్పాడు.

" చెప్పండి. బరువు బాగా అందివుంటుందే. ఏం వ్యవహారమేమిటి ?"

" మామూల్దే, అంతా పెద్దది కాదు ".

"ఏదైనా ఖూనీకేసు వచ్చిందేమో అనుకున్నా"

"అబ్బ! అంత అదృష్టమా? ఆరునెల్లకో సంవత్సరానికో కానీ అంతపెద్ద కేస్ రాదూ. రోజూ ఆకేసుల్ వస్తుంటే బంగార్ ఉయ్యాల హూగమా?"

"అయినా వ్యవహారం నాలుగైదు వందలకు తక్కువ వుండదనుకుంటా".

"అబ్బే. రెండువందలే"

"ఏమిటీ విషయం?"

"ఏమీలేదు. పక్కనున్న సుల్తాన్‌పూరు వూళ్లలోని కొంతమంది [1]జాట్లు బందిపోటుకు పోతారట."

మీసాలు దువ్వుతూ పంతులుగారు అన్నాడు— "అలాగా. ఇప్పుడు మొక్కుకొని వెళ్లారన్నమాట. కోరిక నెరవేరిందంటే బరువు బాగానే ముట్టుతుందే."

"ఆసా వుంది. నాల్గోవంతు ఫైసలా అయింది".

"మంచిది. పరమాత్ముడు ఏవో రూపంలో కటాక్షిస్తుంటాడు. ఖ్వాజాసాహెబు గారూ, సర్వేశ్వరుడు అనంతుడు. రాళ్ళమధ్య జీవించే జీవరాసులకు కూడా ఆహారం ఏర్పాటు చేస్తాడు". కరమ్‌చంద్ మక్లీ సాహెబుగారి వైపుచూస్తూ "నేటి సమావేశం ఇక్కడ ఎందుకు జరుపుతున్నామో మీకు తెలిసేవుంటుంది. ఈ రోజంతా మన యీ సభ్యుడు భరించే పూచీ తీసుకున్నాడు. ఖ్వాజాసాహెబ్, ఈయన చాల మంచివాడు. చచ్చి స్వర్గానవున్న వీరి తండ్రిగారితో నాకు మంచి పరిచయము ఉండేది. వారి కుమారరత్నం కూడా మర్యాదమన్ననలు కలిగినవారే" అని "హరి ఓం" అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

చిరునవ్వు నవ్వుతూ ఖ్వాజాసాహెబుగారు కరమ్‌చంద్ వైపు చూశాడు. కరమ్‌చంద్ వెంటనే లేచి ఓ నమస్కారం పెట్టాడు. అతన్ని కూర్చోమని సౌంజ్ఞచేస్తూ ఖ్వాజా సాహెబుగారు "వీరు ఆడమనిసి యవ్వారంలో వచ్చినట్లుగ్నాపకం. ఆఁ అదే. పంతులు గారూ హీయన మనకు తెలుసు. ఆడమనిసిని ఎల్లాగొట్టి అచ్చాకామ్‌కియా. ఎక్కడికీ పోయిందో జాడా తెలిసిందా?" అని ప్రశ్నించాడు.

అధికారికి గ్లాసు అందిస్తూ పంతులుగారు చెప్పాడు— "ఇంకా సరిగ్గా జాడ తెలియ దనుకోండి. ఎవరో బురఖావేసుకున్న ఓ ముస్లిం మహిళ ఆమెను టాంగాలో కూర్చో

1 పంజాబులో ఓ జాతి

బెట్టుకొని తీసుకెళ్లినట్లూ ఆమె వెంట ఓ యువకుడు వున్నట్లూ మధ్యాహ్నం కూర గాయల తోటవాడు చెప్పాడు."

"ఏమన్నారూ, ముసల్మానులతోనా" గడగడగ్లాసు తాగి ఓపక్కన వుంచుతూ అన్నాడు ఖ్వాజాసాహెబు.

"అవునండి"

వెంటనే తోటమాలి జ్వాలాసింగు అందుకున్నాడు— "అవునుసార్, మాచేను దగ్గరనుండే టాంగా వెళ్లడం నేను స్వయంగా చూశాను"

ఖ్వాజాగారు రెండోగ్లాసును పట్టించారు. దాంతో ఆయన గుర్రమెక్కారు ఆమైకంలో తన తలను నిమురుకుంటూ ఆ ప్రసంగాన్ని ఇంక ఆపండి. పీడావదిలింది, ఇక మనం మజాచేసుకుందాం."

ఆయన చెప్పటమే ఆలస్యం, ఖంగుమంటూ సీసాలు ఒక్కసారిగా మోగినయ్. కార్కులు తీసి ఒక్కొక్కరే మందుపట్టించడం మొదలెట్టారు.

చేపవేపుడులోంచి ముల్లు ఏరుతూ పంతులుగారు అన్నాడు— "ఖ్వాజాసాహేబుగారూ, మీవంటాడు నలభీమపాకం విద్యలో నేర్పరిలాగున్నాడు సుమా. చేపవేపుడు బ్రహ్మాండంగా వుంది; లోపలికి దిగనంటుంది."

"అవును పంతులూ, నాదగ్గర అయిదు సంవత్సరాల నుండీ పనిచేస్తూ వున్నాడు. వీడి తండ్రి వీడికన్నా గొప్ప వంట చేసేవాడు. మాంసం వండడంలో వీడి చాక చక్యం అంతా. మేజర్ బర్టన్ దొరగారి కిచన్‌లో నాలుగు ఏళ్లు వున్నాడు".

ఈ పాటికి అందరికి సారామత్తు ఎక్కింది. అందరు ఈ మైకంలో ఎవరికి ఇష్టం వచ్చినట్లు వాళ్లూ మాట్లాడుతున్నారు. తూలుతూ పంతులుగారు మళ్లీ లేచి ఇలా అన్నాడు— "మిత్రులారా, పరస్పరప్రేమ, జాతీయ ఐకమత్యం ఇక్కడ కానరావడం ఎంత అదృష్టం. నిజంగా హిందువులూ ముసల్మానులూ, కలిసి తినీ తాగుతూంటే నా మనస్సు పులకిస్తుంది. యావత్ భారతదేశంలో ఇలాగే మైత్రీ, స్నేహం వర్ధిల్లుగాక".

"పంతులూ, ఇదంతా ఆ మందు ఫలితం, ఖుదా ప్రసాదించిన వరాల్లో సారా ఒకటని అంటుంటారు. దీనివల్ల ప్రేమ ఎంతా పెరుగుతూందీ వాళ్లకు ఏంతెలుసూ?"

పంతులుగారు మళ్లీ అందుకున్నాడు - "సాహెబుగారూ, మైత్రీ, స్నేహం వీటి అర్థం వాళ్లకేం తెలుసు? ఆః మీరు చాలసార్లు కోరారు కూడ. ఇవ్వాళ మీకో కొత్త కానుక."

" ఏమిటీ ? "

" అదే ఇంట్లో ఘాటుగా తయారు చేయించాను." అంటూ ప్యారాసింగు వైపుచూచి "అరే, వెళ్లితీసుకురారా. ఖ్వాజా సాహెబుగారికి రుచిచూపిస్తానని రోజూ అంటున్నానే. త్వరగా తీసుకరా" అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం' అంటూ ప్యారాసింగు దగ్గరేవున్న మేనల్లుడైన ధన్నాసింగు బుజం కొట్టుతూ అన్నాడు– "అరే, ధన్నా, వెళ్ళి అత్తకు చెప్పు. గడ్డి వేసిన గది తలుపు తెరిచి మూలనే మంచంకోళ్లూ పట్టెలు వున్నాయి. వాటి కింద ఓ చిన్నకుండ వుంది. దానిపై గిన్నెబోర్లగా వుంచి మూతకట్టివుంది. జాగ్రత్తగా తీయి. తీసుకొని వచ్చేప్పుడు ఏదైనా తగిలి పడేవు సుమా. '

చూస్తూండగానే ధన్నాసింగు కుడండచ్చి ఖ్వాజాసాహెబు ముందు పెట్టాడు. మొదలే మైకంలో పూర్తిగా గుర్రమెక్కాడు ఖ్వాజసాహెబు. ఈ కొత్త కానుకను చూసి సంతోషంతో ఒక్కసారి గంతువేశాడు. మొదట కుండలో వేలుముంచితీసి రుచి చూశాడు. రుచి తగలగానే దోసిట్లో పోసుకుని తాగడం ప్రారంభించాడు. లొట్టలు వేస్తూ " పంతులూ, ఎంతబావుందీ " అని ప్రశంసించాడు ఖ్వాజాసాహెబు.

" మరి నేను అబద్ధం చెప్పానా ? "

" ఇంతకూ ముందూ మీరుహెన్నడూ తెప్పించలేదు. "

" మీరు ఏమైనా అంటారో అన్న భయంవల్ల తెప్పించలేదు. లేకపోతే... '

" వాహేవా, పంతుల్జూ, నేనంటే నీకూభయం ? ఒట్టు. మీరు నాకు భాయీ. ఇది చాలు. ఇదే నాకూ యిస్తూ వుండు " కుండలో గ్లాసు ముంచి పంతులుగారికి ఇస్తూ " వల్లాహ్, ఎంతమంచి సరుకు ? ఎక్కడా దొరకదు " అన్నాడు.

రాత్రి పన్నెండువరకూ సభ నడిచింది. అప్పటికి సమాప్తమైంది. ఎవరు ఎట్టి పరిస్థితిలో వున్నారు, ఎవరు ఎలా గుర్రం ఎక్కిందీ చెప్పడం కష్టం.

---

# [ 4 ]

చీకటి నాల్గువైపులా వ్యాపిస్తూవుంది. ఆ వేళలో ఎదురుగావున్న రోడ్డు నుంచి ఓ టాంగా గ్రామంలోకివచ్చి గ్రామకచేరి ముందు ఆగింది. దానిలోంచి ఓ మహమ్మదీయ యువకుడు టాంగా నుండి దిగుతూ దారినపోయే ఓ దానయ్యను కేకేసి "రాధాకృష్ణ పంతులుగారి ఇల్లెక్కడ" అని ప్రశ్నించాడు.

"ఇదే ఈ కనపడే హవేలీయే" అని ఆదానయ్య చెప్పి "ఏం, మీకేంపని" అంటూ ఎదురు ప్రశ్నించాడు.

"వారితో తొందర పనివుంది" టాంగా లోపల కూర్చున్న యువతిని చూస్తూ ఆ యువకుడు సమాధానం యిచ్చాడు. కొంచెం దగ్గరగా వెళ్ళి "రాండి చెల్లాయిగారూ, మిమ్మల్ని పంతులుగారింట్లో దిగబెట్టి వస్తాను" అని అన్నాడు.

ఓ యువతి టాంగాలోంచి దిగి ఆ యువకుని వెంట నడవసాగింది. కొద్ది నిముషాల్లోనే ఇద్దరూ పంతులుగారి ఇంటికి చేరుకున్నారు. యువకుడు తలుపు తట్టగానే ఓపిల్లాడు వచ్చి తలుపుతీసాడు. "ఏం పనిమీద వచ్చారు" అని ప్రశ్నించాడు.

"పంతులుగారు ఇంట్లో వున్నారా? వారితో పనివుంది" అంటూ యువకుడు సమాధానం ఇచ్చాడు.

"ఆఁ వున్నారు. ఇప్పుడు పూజలో వున్నారు. ఎవరినీ కలుసుకోరు"
"ఫర్వాలేదు. ఇక్కడే కొంచెంసేపు వుంటాం. వారికి తీరిక ఎప్పుడు అవుతుందీ?"

"ఓ గంట తర్వాత."

"పూజలోంచి వచ్చిన తర్వాత మనవి చేయండి".

"సరే" అంటూ పిల్లాడు లోపలికి వెళ్లాడు.

సుమారు ముప్పావుగంట తర్వాత పంతులు "హరి ఓం" అంటూ బయటికి వచ్చాడు. యువకుడు లేచి వెంటనే సలాంచేశాడు.

గొంతు కొద్దిగా పెద్దదిచేసి "తలుపు అవతలగా నిలబడూ ముందు. ఇది బ్రాహ్మణుని గృహమని తెలీదా?" అని తన బ్రాహ్మణీకాన్ని వెలగపెట్టాడు.

"పొరపాటైంది. క్షమించండి. నేను నిజంగా తప్పే చేసినాను" అంటూ ఆ యువకుడు తను చేసిందానికి సిగ్గుపడ్డాడు.

తర్వాత యువకుడు మొదలెట్టాడు - "ఈమె నిన్న తెల్లవారుతుండగా వూరిబయట తెలివితప్పి వుండగా చూచాం. చుట్టుపక్కల్లో ఎవరూ లేకుండె. ఆమె ఆరోగ్యమూ ఏమీ బాగాలేకుండె. అందుకని నేనూ, నా అమ్మా ఆమెను మా ఇంటికి తీసుకెళ్ళాం. లాలామిట్టామల్ భార్యను అని చెప్పింది. మిగతా విషయాలు మీరే విచారించి ఎట్టాగైనా ఆమె వారసులను ఒప్పించి ఆమెను ఇంట్లోవుండే ఏర్పాటు చేయండి. మీకు పుణ్యం వుంటుంది".

యువకుని మాటలు వినగానే పంతులుగారి చెంపలు ఎరుపెక్కాయి. "వేషాన్నిబట్టి నువ్వు చదువూ సంధ్యా వున్నాడిలా కనపడుతున్నావ్. కాని మాటలుచూస్తే విద్యాగంధం వున్నట్లు కనపడడం లేదు' అంటూ విమర్శించాడు.

హైరానుపడుతూ "చిత్తం, మీలాంటి పెద్దాళ్ళముందు నేను నిజంగా చదువురాని వాణ్ణే. ఏదో ఎఫ్. ఏ, పాసయ్యానులెండి. అమర్యాదగా మాట్లాడితే మన్నించండి". అని యువకుడు తొట్రుపాటుపడుతూ సమాధానం చెప్పుకున్నాడు.

"నేను గ్రహించాములే" నవ్వుతూ పంతులుగారన్నాడు : ఈ ఆంగ్లభాషుంది చూశావూ, భారతదేశం పుట్టి ముంచివేసింది. నీవు ఆమ్లేచ్ఛభాష చదవకవున్నట్లయితే, ఒక హిందూ కన్యను సోదరి అని సంబోధించేవాడివి కావు. నీతో టాంగాలో కూర్చో పెట్టుకుని ఇంటికి తీసుకొనిపోయి ఆమెను ధర్మభ్రష్టురాలిగా చేసేవాడివికావు".

పంతులుగారి మాటలు విని యువకుడు ఆలోచనలో పడ్డాడు. ఎలా సమాధానం చెప్పటమా అని. తీవ్రంగా ఆలోచించి చివరకు "నా అపరాధాలన్నీ క్షమించండి. దయచేసి ఈ దీనురాల్ని వాళ్ళ ఇంటికి పంపేయండి. ఆమె చెప్పిందీసూస్తే ఆమెకు చాల అన్యాయం చేసారని తెలుస్తుంది" అన్నాడు.

తీవ్రమైన ధోరణిలో పంతులుగారన్నాడు— "వద్దు. ఈమె ధర్మభ్రష్ట అయింది." మళ్ళీ పళ్లమధ్య వేలుపెట్టుకుని ఎదో జ్ఞప్తికివచ్చి "ఈమెని ఏ విధంగా కూడా ... ఆమె పరిస్థితి చూస్తుంటే జాలివుట్తోంది. ఈమె సవతి పిల్లలు ఇంట్లోంచి వెళ్లగొట్టారన్న విషయం విన్నప్పటినుంచి నేను ఆహారమే తీసుకొనడం మానివేశాను." అంటూ గుర్దేయీ వైపుచూస్తూ" అమ్మాయ్, నీవు లోపలికివెళ్ళి కూర్చో. నేనా దుర్మార్గుల్ని పిలిచి ఇప్పుడే చివాట్లు వేస్తాను. నీవు చింతించకు, హరి ఓం" అన్నాడు.

క్రోధంగావున్న పంతులుగారు కృపావృష్టిని కురిపించడం చూసి యువకుడు పరమానంద భరితుడయ్యాడు. పంతులుగారి కాళ్ళకు నమస్కరిస్తూ 'మీరు సాక్షాత్తు దేవతలండి' అని అన్నాడు.

నమస్కారం చేస్తుండగా పంతులుగారు "చూడు, నా పాదాలు తాకవద్దు. ఈ విపరీతమైన చలిలో మళ్లీస్నానం చేయాల్సివస్తుంది" అంటూ రెండడుగులు వెనక్కి జరిగాడు.

తన తొందర పాటుకు యువకుడు సిగ్గుపడ్డాడు. దూరాన్నుంచే చేతులు జోడించి పంతులుగారికి నమస్కారం చేశాడు. వెళ్తూ వెళ్తూ ఆ యువతివైపు తిరిగి "సరే" అని ఎదో మాట్లాడబోయి మళ్లీ తన తప్పిదం జ్ఞప్తికివచ్చి మారు మాట్లాడకుండా టాంగాలో వెళ్ళి కూర్చున్నాడు. టాంగావాడు కొరడా దెబ్బ తగిలించగానే గుర్రం పరుగెత్త సాగింది. టాంగా కనిపించేవరకు గుర్‌దేయీ కళ్లలో కృతజ్ఞతను నింపుకుని చూస్తూ నిలబడింది.

తర్వాత గుర్‌దేయీ లోపలికి వెళ్ళింది. ఎదురుగావున్న గదికి ఎడమచేతి వైపుగా పంతులుగారి పూజామందిరంవుంది. పూజకువెళ్ళి గుర్‌దేయీని చూసి "తల్లీ, నీవు ఎదురుగావున్న బల్ల మీద కూర్చో. నేనిప్పుడే పూజ ముగించుకుని వస్తా. హరి ఓం..." అంటూ చెప్పిపోయాడు.

సంకోచంగా గుర్‌దేయీ ఓ మూల ఒదిగి కూర్చుంది. ముందు సంధ్యావందనం, తర్వాత రుద్రాక్షలు చేతిలో తీసుకుని చాలా సేపటివరకు జపిస్తూ వుండిపోయారు. ధ్యానం ముగిసిన తర్వాత ఏవో మంత్రాలు గొణుక్కుంటూ గుర్‌దేయీ వున్న చోటికి వచ్చి మంచంమీద కూర్చున్నారు.

"ఆ, ఇప్పుడు చెప్పుతల్లీ, నీ వ్యవహారం అంతా" అని ప్రశ్నించాడు. వెంటనే ఎలా ఏమి చెప్పాలో తోచక ఆ యువతి నేలమీద కాలిబొటనవేలితో రాస్తూ" అంతా తమకు తెలిసిన వ్యవహారమే అయ్యగారూ" అంది.

"హరి ఓం" అంటూ పొట్టసవరించుకుని పంతులుగారు మరోతేపు తీశారు. "అవును, నాకు మా నౌకరు లేఖూ రాజారాం, నిన్న వ్యవహారం చెప్పాడు. కరమ్ చంద్ నిన్ను తన్ని తరిమివేశాడట. నేను పూజలో వున్నాను. అతన్ని పిలిచి అడగడానికి వ్యవధిలేక పోయింది. "హరి ఓం తత్".

సంకోచాన్ని కనబరుస్తూ "మీకు జ్ఞాపకం వుండకపోవచ్చు. ఈ సంఘటన జరిగినప్పుడు మీరు అక్కడే వున్నారుస్వామీ. మీరే కరమ్‌చంద్ చెవిలో ఏదో చెప్తున్నారు" అని గుర్‌దేయీ బయటపెట్టింది.

పంతులుగారు తికమకలో పడ్డారు కొంతసేపు. ఏదో జ్ఞాపకం చేసుకుంటూన్నట్లు చెంపను చేతితో గోక్కొనసాగారు. మళ్ళీ ''ఆఁ, జ్ఞాపకం వచ్చింది. శివ శివ, మతికి జ్ఞాపకశక్తి తక్కువై పోయింది. రాత్రి ఏం తిన్నది కూడాజ్ఞాపకంవుండదు. అవును అప్పుడు పూజాద్రవ్యాలు తెస్తున్నా. మీ ఇంటిముందుగా పోతూంటే ఎవరో ఏడుస్తూన్నట్టు శబ్దం వినిపించింది. ఆఁఆడమనిసి మీద దౌర్జన్యం చేయకు కరమ్‌చంద్ ఆమె వాటా ఆమెకు ఇచ్చేయి అని అతనిచెవిలో చెప్పాను. కాని వాడు దుర్మార్గుడు, ఎవరుచెప్పినా వినడు. అవునూ, తర్వాత ఏం జరిగింది ?'' అని ప్రశ్నించాడు.

తర్వాత జరిగిందంతా గుర్‌దేయీ పూసగుచ్చినట్లు పంతులుగారికి చెప్పింది. అబ్దుల్ గఫూర్, అతని తల్లి ఆమె పట్ల ప్రదర్శించిన ఔదార్యం గుర్‌దేయీ చెప్తూంటే పళ్ళు పట పట కొరుకుతూ పంతులుగారు ''తల్లీ వాళ్ళ ఎత్తులు నీకింకా తెలియవు. వాళ్ళే నిన్ను ధర్మభ్రష్టురాల్ని చేసింది. ఇంకా ఏమేమి దురంతాలు చేస్తారో తెలియదు. మహమ్మదీయ యువకుడు నిన్ను ఆ పరిస్థితిలో వాళ్ల గ్రామానికి తీసుకవెళ్ళాడని తెలిసీ తెలియగానే నేను తత్తరపడి పోయాననుకో. ఒక హిందూ కన్య పట్ల మ్లేచ్ఛులు ఇంత అన్యాయం చేస్తారా ? ఆ పిల్లను వెంటనే మన యింటికి తీసుకరా. లేకపోతే ఈ గ్రామమేదగ్ధం అవుతుంది అని అరుస్తూ మా నౌకరుకు గుఱ్ఱానిచ్చి పంపాను. ఇప్పుడేమో ఆదుర్మార్గుడు కిమ్మనకుండా నిన్ను ఇక్కడ వదిలేసి, వెళ్లాడు హరి ఓం'' అంటూ పంతులుగారు మళ్లీ లేవతీశాడు.

పంతులుగారి మాటలు విన్న గుర్‌దేయీకి కోపం వచ్చింది. ఆవేశంతో ఏదో మాట్లాడేద్దామనుకుని మళ్ళీ ఏమనుకుందో నిగ్రహంచూపుతూ ఇలా అంది ''అది కాదండి నేనే చెప్పాను''

''ఏమని ?''

''అదే, నన్ను నా ఇంటికి తీసుకునిపోకుండా పంతులుగారింటికి తీసుక వెళ్ళమని. మీరు కరమ్‌చంద్‌ని పిలిపించి నచ్చచెప్పిన తర్వాత అతనే అంగీకరిస్తాడు.''

''మంచిది. నీవూ చెప్పావు. అంటూనేనూ కబురు పంపాను. ఎందుకు తెచ్చి దిగబెట్టడూ. జరిగిందేదో జరిగిపోయింది. ఇక నువ్వు చెప్పు నన్నేం చేయ మంటావు ?''

''ఏమీలేదండి. నావాటా నాకు ఇప్పించండి''.

''నువ్వు మామూలుగానే ఇంట్లో వుండడానికి సమ్మతమేనా ?''

''వాళ్ళు నన్ను ఒక్క ఘడియకూడ వుండనివ్వరు.''

"సరే. నీవు వెళ్ళి పై గదిలో కూర్చో. నేనిప్పుడే వారిని పిలవనంపుతాను" ఆలోచిస్తూ పంతులుగారు సలహా ఇచ్చాడు.

గుర్‌దేయీ పంతులుగారికి నమస్కారంచేసి పైకి వెళ్ళింది. "శ్రీరామ శ్రీరామ" అని కుట్టిన వుత్తరీయాన్ని బుజాన వేసుకుని పావుకోళ్ళు ధరించి పంతులుగారు బయటకు వెళ్లాడు.

---

# [ 5 ]

లాలా కరమ్‌చంద్ ఇంటి ముందుగదిలో పంచాయతీ సమావేశమైంది. దానికి అధ్వర్యం వహిస్తున్నది మన పంతులుగారే.

చౌదురీ దిత్తామల్ హుక్కా పీలుస్తూ కూర్చున్నాడు. ఒక గుక్కలాగి హుక్కాను పక్కకు జరిపి కరమ్‌చంద్‌ను చూస్తూ "భాయీ కరమ్‌చంద్, ఆ వ్యవహారం ఏమయింది" అని ప్రశ్నించాడు.

కరమ్‌చంద్‌కు ఏమిచెప్పాలో అర్థంకాలేదు. తలగోక్కుంటూ "చౌదరిగారూ, అంతా మీ సమక్షంలోనే జరిగిందికదా. ఇవ్వాళ పంతులుగారు ఓ కొత్తకబురు పట్టుకొచ్చారు. అదికూడా వినండి" అన్నాడు.

హరి ఓం అంటూ పంతులుగారు దీర్ఘంగా తేపాడు. రాగంలాగ మాటను సాగదీస్తూ "చౌదరిగారూ, ఏమని చెప్పను? చెప్పడానికి కూడా ఏం విశేషం వుందని? ఇది కలికాలం. ఈ ఘటాన్ని ఇన్ని సంవత్సరాలూ ధర్మపరాయణత్వంతో లాక్కొచ్చాం, ఈ అనర్థాలు చూడకముందే మమ్మల్ని తీసుకపో తండ్రీ అంటూ రెండుచేతులూ ఎత్తి పరమాత్మణ్ణి ప్రార్థిస్తున్నాను. ప్రారబ్ధంలో ఏమి రాసివుందో మరి" అని మళ్లీ ఒకసారి తన మంత్రాన్ని ఎప్పటి మాదిరి జపించాడు.

సమావేశంలో కూర్చున్న సభ్యులంతా ఆ కొత్త విషయం తెలుసుకోవాలని ఉత్సాహపడ్డారు. "అదేదో చెప్పండి" అంటూ సభలో కలవరం బయలుదేరింది.

పంతులుగారు కోపోద్రిక్తులై "సోదరులారా, ఏం చెప్పను? ఇదంతా మీరు చేసే దుర్మార్గాలకు ఫలితం. రోజు రోజుకు ధర్మాన్ని, నీతి నియమాల్నీ విడిచి పెట్టడం, పూజా పునస్కారం, సంధ్యావందనంలాంటి అనుష్ఠానాల నుంచి విముఖులై దురాచారాల్లో, చెడ్డ పనుల్లో తలదూర్చడం చేస్తూంటే ఈ గడ్డపై ఇటువంటి అనర్థాలు జరక్కపోతే మరేం జరుగుతుందిలే అని అనిపిస్తోంది" అంటూ ఓసారి కరమ్‌చంద్ వైపు చూసి "కరమ్‌చంద్, ఆ చెడ్డదాన్ని నెత్తిపైకి ఎక్కించుకోవద్దు, దానికి బుద్ధిచెప్పమని నీకు ఎన్నిసార్లు నెత్తినోరు పెట్టుకొని చెప్పాను. విన్నావూ? అనుకున్నదే చివరికి జరిగింది. ఆ కులట ముసల్మాన్ల ఇళ్లల్లోకి దూరి పీఠం జమాయించింది. ఏనాడైతే

ఈ ఘోరం చెవినపడిందో ఆనాటినుండి లోలోపలే కుళ్లిపోతున్నాను. మనం ఈపట్ట ణంలో వుండగా మనకళ్లముందే ఈ అనర్థం జరుగుతుంటే సహిస్తున్నాం. మన మను గడకే అది తలవంపు... " అంటూ పంతులుగారు ధర్మోపదేశం చేశాడు.

సంఘంపట్ల పంతులుగారికుండే ఔదార్యం, దయ చూసి అక్కడివారంతా "మీరు ధన్యులు" అంటూ ఒక్కసారిగా అరిచారు.

పంతులుగారు కరమ్‌చందు, సోహన్‌లాల్‌లవైపు చూస్తూ మళ్లీ ప్రారంభించాడు— "ఈ రోజుల్లో కుర్రాళ్లకు బాగా మతిచెడిపోయింది. ఇష్టం వచ్చినట్లు మాట్లాడేస్తారు. అరే భడవల్లారా, ముందే నన్ను సంప్రతిస్తే ఏమి ఆపదవచ్చేది? ఈ బ్రాహ్మణుడు మీ శత్రువుకాదుకదా. మీ పెద్దవాళ్ల ఉప్పుతినేకదా ఇన్నాళ్లు బ్రతుకుతోంది. మంచి సలహా ఇవ్వలేకపోతేపోనీ, చెడుసలహా మాత్రం ఇచ్చేవాణ్ణికాదుగా. అవునులే, నాకెందుకు ఎవరెలాపోతే. ఈ కలహాలూ జగడాలతో నాకేమి సంబంధం? ఇష్టంవచ్చినట్లు ఆనందించండి, ఇష్టంవచ్చినట్లు చేయండి. మధ్యలో మాకేంపని అడ్డంతగలడానికి?'

ఉపన్యాసం ముగించి పంతులుగారు మోకాళ్లు పట్టుకొని లేచి సమావేశంలోంచి పోవడానికి ఉద్యుక్తులయ్యారు. పంతులుగారు లేచి వెళ్తారనే భయం పట్టుకుంది అక్కడ కూర్చున్నవారికి.

"లేదు పంతులుగారూ, మా మాట వినండి. ఎందుకు కోప్పడతారు?" అంటూ కేకలు వేస్తూ ఆయన్ను చుట్టుముట్టారు. ఒకడు ఆయన కాళ్లమీద పడితే మరొకడు అతని చేతిలోంచి కర్రలాక్కున్నాడు. కొంతమందైతే ఆయనదారికి అడ్డుగానే నిలబడిపోయారు.

పంతులుగారు బలవంతాన కూర్చోవలసి వచ్చింది. అంతలో కరమ్‌చంద్ మెడలో తువ్వాలు వేసుకొని పంతులుగారి పాదాలమీదపడి ఇలా ప్రాథేయ పడ్డాడు— "అయ్యా, మా గౌరవాన్ని మీ చేతిలోపెట్టాం. దీనికేదో పరిష్కార మార్గం మీరే సూచించండి. లేకపోతే బంధుకోటి వూళ్లోనే వుండనివ్వదు".

"అవును పంతులుగారూ, పాపం ఇతడు అనవసరంగా అపఖ్యాతి పాలౌతున్నాడు" దగ్గరగా కూర్చున్న ఓ మనిషి అన్నాడు.

కూర్చున్నవారిలో మున్షీదేవీదయాళ్ కుమారుడు కూడా వున్నాడు. వాడు డి. ఏ. వి. కాలేజిలో చదువు మానేసి గ్రామానికి వచ్చివున్నాడు. పంతులుగారిని చూస్తూ, "పంతులుగారూ ఒకరకమైన వుపకారం మీరు చేశారు. మీలాంటి మహాత్ములవల్లనే ఈ క్లిష్ట సమస్యలు పరిష్కారానికి వస్తాయి. మీరు ప్రయత్నించేస్తే ఆమెను తిరిగి రప్పించవచ్చు".

ఏమిటీ చెప్తున్నావ్ " అంటూ పంతులుగారు ఓమారు చుట్టూ పరకాయించి చూశాడు. మళ్లా ఆ కుర్రాడివైపు చూస్తూ " చూడండి ఈ మూర్ఖుడి తెలివితేటలు. మన ఆర్యులు నేర్పిన విద్య ఇదేనా ? పిట్టకొంచెం కూతఘనంగా వుండరాదు. పెద్దవాళ్ల వ్యవహారంలో జోక్యం చేసుకోవడంలో నీ వుద్దేశ్యం ? వెనుకటికి సామెత చెబుతారు ఊరిలో పెళ్లి కుక్కలకు హడావుడి " అన్నాడు.

అందరూ వంకరగా మోహన్‌లాల్‌ను చూడసాగారు. కాని మోహన్‌లాల్ వారి చేష్టల్ని ఖాతరు చెయ్యకుండా మళ్లీ మొదలెట్టాడు— " క్షమించండి పంతులుగారూ, నేనేం చెడ్డమాట అనలేదు. ఆమెను మళ్లీ సంఘంలో కలుపు కోవటానికి ఏమిటీ ఆక్షేపణ ? పాపం ఆమె విధవరాలు. కరమ్‌చంద్ ఆమెను పోషించేభారం వహించకపోతే ఎవరైన మంచి వరుణ్ణి చూసి... "

పంతులుగారికి క్రోధం రెట్టింపు అయింది. అతణ్ణి పూర్తిగా మాట్లాడనివ్వకుండానే విరుచుకపడ్డాడు— ఏయ్‌కుర్రకుంకా, ఇటువంటి అప్రాచ్య శబ్దాల్ని మళ్లీ ప్రయోగించకు. గాడిదను శుద్ధిచేసినంత మాత్రాన ఎక్కడైనా గంగిగోవు అవుతుందా ? హిందూ ధర్మ శాస్త్రంలో విధవ వివాహం ప్రసక్తి తెచ్చి ఈ పవిత్రమైన జాతికే కళంకం తెస్తున్నావు. నీకు సిగ్గులేదూ ? " అని ఓమారు తల బాదుకొని మళ్లీ " స్నేహితులారా, మనకు నిజంగా చీకటి రాత్రులు వచ్చాయి. ఈ ఆర్యసమాజీయులూ, అకాలీలూ కలసి భారత దేశాన్ని ముంచేస్తున్నారు " అంటూ తన అక్కసుమ వెళ్లగక్కాడు.

" సరే పంతులుగారూ, మీమాట ప్రకారం గాడిద గంగిగోవు కాలేదు. మరైతే గంగిగోవు గాడిద ఎలాఅవుతుంది ? " మోహన్‌లాల్ మళ్లీ పంతులుగార్ని ఎదురొక్కన్నాడు.

అప్పటికి చాలా మంది అరుస్తు మోహన్‌లాల్ వెంటపడి అతని నోరు మూయించారు. లాలాకన్హయిలాల్ మోహన్‌లాల్‌ను ఉద్దేశిస్తూ గర్జించాడు " ఇదిగో అబ్బాయ్ ! నోరుమూసుకో. హద్దులు మీరుతున్నావు. ఒక గౌరవనీయుడి విధవరాలు గురించి ఇలా మాట్లాడడానికి నీకు సిగ్గులేదూ ? ఇంత చదువుకొన్న వాడివి. మన ధర్మశాస్త్రాలు ఏమని ఘోషిస్తున్నాయో ఆలోచించు ". అంటూ గొంతు చించుకున్నాడు. వెంటనే పంతులు గారివైపు చూస్తూ " పంతులుగారూ, మీరు మీపనిచేసుకపోండి. వాళ్లది కుర్రతనం లెండి. వీటివి కోపగించుకోకూడదు. ఇప్పుడేం యేర్పాటు చేయాలో చెప్పండి " అని అడిగాడు.

కన్నయిలాల్ మాటలయిపోగానే కరమ్‌చంద్ లేచి నిలుచున్నాడు. "పెద్దల్లారా, నాదొక చిన్న మనవి. అసలు ఆమె ఈ వైధవ్య జీవితాన్ని గడపాలనుకుంటే నాయింట్లో ఏమికొదువ ? కాని నేనూ చూస్తున్నా. కొన్ని రోజులనుండి ఆమె ప్రవర్తన ఏమీ సంతృప్తికరంగా వుండడంలేదు. అయినా ఎంతో ఓర్పు వహిస్తూ వచ్చాను. మనల్నేం చేస్తుందిలే అనుకున్నాను. చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ. కాని ఎవరో అన్నట్లు చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నమాదిరిగా తయారైంది విషయం. మాపూర్వీకుల గౌరవ ప్రతిష్ఠల్ని చెరిగిపారేయడానికి పూనుకొంది. నన్నెందుకు అడుగు తారూ కడుపులో ఎన్నాళ్లనుండి దాచుకుంటూ వచ్చానో ? ఇల్లాంటి మాటలు ఇతరులకు చెప్పుకొనతగినవేనా ? అప్పటికీ ఓర్పు వహిస్తూవచ్చాను. మీరే చెప్పండి. నేనేంచేసేది. ఇక గొలుసులతో బంధించడమే మిగిలింది. ఇప్పుడు ఆమె ఏ విధంగా లేచిపోయిందీ మీ అందరికీ తెలుసుకదా."

కరమ్‌చంద్ ముగించగానే నాలుగువైపులనుండీ "అతను చెప్పింది నిజం. ఇతనికి ఆమె పరాయిదే. కడుపున పుట్టినోళ్లు కూడా ఇంతకన్నా ఆమెకు మేలు చేయరు. దాని విధివ్రాత అలావుంటే అతనిదోషం ఏముంది" అంటూ కేకలువేశారు.

"ఇప్పుడు ఏం చెయ్యాలి" ఆలోచిస్తూ పంతులుగారు పెద్దల అభిప్రాయం ఏమిటోనన్నట్లుగా అడిగాడు.

తలపాగాను సర్దుకుంటూ బాబారాధాసింగు లేచి "ఇంకేంచేసింది ? మతాన్ని పోగొట్టు కున్నప్పుడే వూరూ పోగొట్టుకుంది. కళకళలాడుతూన్న ఇట్లోంచి వుట్టిచేతుల్తో ఎప్పుడు వెళ్లిందో, ఆమె ఖర్మఆమెదే. ఆమె ఇప్పుడు ఎక్కడవుందో అక్కడే వుండనివ్వండి. ఆమె పాపం ఆమే అనుభవిస్తుంది" అన్నాడు. "అదే వుత్తమమైనపని. బాబా లక్షల విలువకలిగే మాటచెప్పాడు" అని అందరు బాబా చెప్పినట్టు చేయాలని తీర్మా నించారు.

"ఆ కులటను అక్కడేవుండనివ్వాలని నా వుద్దేశ్యంకూడాను. కాదని వేరేమార్గం కూడా లేదు. భాయీ కరమ్‌చంద్, ఏమిటి నీ వుద్దేశ్యం" అంటూ పంతులుగారు తాళంవేశాడు.

కరమ్‌చంద్ లేచి పంతులుగారివైపు చూస్తూ నమస్కారం చేశాడు. ఇదే అతను పన్నిన పన్నాగం నెరవేర్చుకోటానికి మంచి అవకాశం అనుకుని వెంటనే శ్రుతికలి పాడు. "పంతులుగారూ, మీ సలహాయే నా సలహా కూడా. మీరు అన్నీ ఎరిగిన వారు. ఆమె యీ యింటిగుమ్మంలో అడుగుపెట్టకూడదు".

సభాసదులంతా వాళ్లిద్దరు చెప్పినదే సరైనదని తలలు వూపారు. పంతులుగారి ఔదార్యాన్నీ కరమ్‌చంద్ మేధాసంపత్తినీ కొనియాడుతూ సభ ముగిసింది. " హరి ఓం " అంటూ పంతులుగారు లేచి వెళ్లడానికి సిద్ధమయ్యారు. గబగబా పంతులుగారి వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చాడు కరమ్‌చంద్. ఎవరూ చూడకుండా ఆయనచేతిలో వెండినాణాలు వుంచుతూ " మమ్మల్ని కనిపెట్టివుండండి " అన్నాడు. ఒకచేతిని జేబులోనికిపోనిస్తూ రెండోచేతితో కరమ్‌చంద్ బుజం పట్టుకొని " ఎందుకూ, నీ దగ్గరేవుంచు " అని " అవును భాయీ, నేను చెప్పింది... ... " ఆగిపోయాడు.

" ముందు నేను ఖ్వాజాసాహెబుగారి దగ్గరకు వెళ్లాను. మొదట వారుస్వీకరించలేదు. మీపేరు చెప్పిన తర్వాత ఒప్పుకొన్నారు "

" మంచికే జరిగింది. ఎంతలోనో...? "

" ముందు ఏభైరూపాయలు రొఖ్ఖం ఇచ్చాను. కేసు పూర్తి అయిన తర్వాత మరియేభై ఇస్తాను అని మాటిచ్చాను ".

" చౌకలోనే కొట్టేశావు. "

" ఆ. అంతా మీ చలవ. లేకపోతే... "

కరమ్‌చంద్‌ని ఆశీర్వదించి కర్ర ఆడించుకుంటూ పంతులుగారు ఇంటికి బయలుదేరాడు. పంతులు వెయ్యిళ్లపూజారి. ఇంటికే తిన్నగా వెళ్తాడని ఏమిటి నమ్మకం? దారిలో ఏఏ యింటిలో దూరి ఏఏ మంతనాలు చేశాడో ఎవరికి తెలుసు? ఎవరికి పట్టింది గనుక.

---

# [ 6 ]

గుర్‌దేయీ విచారసముద్రంలో మునుగుతూ తేలుతూవుంది. పంతులుగారు వచ్చిన విషయం గమనించలేకపోయింది. పిచ్చాపాటీ మాట్లాడిన తర్వాత పంతులుగాడు ప్రసంగం ఎత్తాడు — "తల్లీ, నీగురించి వూరంతా కాళ్ళకు బలపం కట్టుకొని తిరిగాను. పెద్దల్ని పోగుచేశాను. చూడనివాణ్ణికూడా చూశాను. ఆశ్రయించనివాణ్ణికూడా ఆశ్రయించాను. ఏంచేయమంటావ్ ? భగవంతుడు వాళ్ల జ్ఞాననేత్రం తెరిపించలేక పోయాడు. ఎట్లా తంటాలుపడినా వాళ్లు లొంగిరాలేదు" అంటూ ఓ కథనుఅల్లాడు.

పంతులుగారి కల్లబొల్లి మాటలు వాస్తవం అనే నమ్మి గుర్‌దేయీ మరొక పర్యాయం నమస్కారం చేసింది — "నాలాంటి దీనురాలికోసం మీరుతప్ప ఎవరు కష్టపడతారు స్వామీ ?"

"కానీ నా మనోరథం యీడేరుతున్నట్లు సూచనలు కనబడడంలేదు."

"ఎందుకని స్వామీ ?"

"కరమ్‌చంద్ సుతరామూ ఒప్పుకోడంలేదే. మాకురాని ఇచ్చింది. మమ్మల్నేంచేయ గలదు అని విర్రవీగుతున్నాడు".

గుర్‌దేయీ ఓవేడి నిట్టూర్పు విడిచింది. మళ్ళీ ఏదోతట్టినట్లు "బంధువర్గానికి చెప్పి చూస్తే ?" అని అంది.

"తల్లీ, బంధువర్గం ఏంచేయగలదమ్మా? వాళ్ళు దౌర్జన్యంగా అతన్ని ఒప్పించ గలరా?ఇదేమైనా కోర్టా కచేరా మనం అనుకున్న ప్రకారం కార్యం నెరవేర్చు కోడానికి?"

"ఐతే నన్నిప్పుడు ఏం చేయమంటారు? "

దీనికి తరుణోపాయం ఏమిటి చెప్మా అని ఆలోచన్లో పడ్డాడు పంతులుగారు. ఏదో దొరికినట్లు "వ్యవహారం చాలక్లిష్టమైంది. కేసుపెడ్దామన్నా కుదరదు. దానికి బోలెడంత డబ్బుకావాలి" అని అన్నాడు.

"ఎంత కావాల్సివుంటుంది ?"

"కనీసం మూడు వందలైనా కావాల్సి వుంటుంధి"

చేతికున్న బంగారం మురుగులపై గుర్‌దేయీ దృష్టిపడింది. పంతులుగారికి మురుగును చూపిస్తూ "దీని వెల ఎంతుంటుంది" అని అడిగింది.

బంగారం వస్తువును చూడగానే పంతులుగారికి నోటిలో నీళ్లు వూరసాగాయి. లో లోపలే సంతోషిస్తూ "వుండొచ్చు ఓ నూటఏబది రూపాయలు" అని సమాధానం ఇచ్చాడు. ఆమాట వినేసరికి గుర్‌దేయీకి నిరుత్సాహం కలిగింది.

"అమ్మా, నువ్వు చింతించకు. కొరవ పడితే నేను పూర్తిచేస్తాను" అంటూ ధైర్యం చెప్పాడు పంతులుగారు.

అమాయకురాలైన గుర్‌దేయీ సంకోచించకుండా చేతి మురుగును తీసి పంతులుగారి పాదాలముందు పెట్టింది, భక్తుడు కరుణించమని దేవరపాదాలపై పుష్పద్రవ్యాలు వుంచినట్లు. తలను నేలకు తాకిస్తూ పంతులుగారిని ప్రార్థించింది— "తమరే నాకు నీడ. మీరే నాయీ నిరాధారంగావున్న జీవిత నౌకను ఒడ్డుకు ఎక్కించాలి."

పంతులుగారు ఆప్యాయంగా గుర్‌దేయీ తలను చేతితో నిమురుతూ "అమ్మాయీ, భగవంతుడు నీ కార్యాన్ని తప్పక నెరవేరుస్తాడు. ఇవ్వాళ నుండి ఈకేసు బాధ్యత నేను స్వీకరిస్తున్నాను. చాలాతొందరలోనే నీకు సాఫల్యం లభించగలదని నేను నమ్మకంగా చెబుతున్నా. కాని నువ్వు ఇక్కడవుంటే పనికి ఆటంకం కలగవచ్చు" అంటూ తేపుతూ హరినామాన్ని జపించాడు.

"ఎక్కడికి వెళ్లను స్వామీ? పోనీ పుట్టింటికి పొమ్మంటారా? అక్కడ ఎవరూ లేరు కాని వుండడానికి మాత్రం ఓ ఇల్లంటూవుంది".

"వద్దులే తల్లీ. నువ్వు చింతించకు. సియాల్‌కోటలో నాస్నేహితుడొకడు వున్నాడు. నువ్వు ఊఁ అంటే అతని వద్దకు పంపగలను".

"స్వామీ, నేను మిమ్మల్ని ఆశ్రయించాను. పాలముంచినా మీరే దిక్కు నీట ముంచినా మీరే దిక్కు".

పంతులుగారు వెంటనే మురుగుతీసి కళ్లకద్దుకుని జేబులో వేసుకున్నాడు. గుర్‌దేయీకి ధైర్యంచెప్తూ "ఇప్పుదే ఏర్పాటుచేసి వస్తాను. నువ్వు భోజనం చేసి కాస్త విశ్రాంతి తీసుకో ఇంకేమీ బెంగ పెట్టుకోకు" అని పలికాడు.

"మీరు స్వయంగా పూనుకున్న తర్వాత నాకేమిటి దిగులు? ఈ దీనురాలికి సహాయంచేయడానికి స్తంభం చీల్చుకొని బయటపడినట్లుగా ఆదుకున్నారు. మీ ఉపకారాన్ని ఎలా తీర్చుకుంటానో!"

"హరి ఓం తత్" అంటూ పంతులుగారు క్రిందకు వచ్చాడు. కొంచెంసేపు తర్వాత భోజనం తీసుకుని పని పిల్లవాడు వచ్చాడు. ఏదో కొంచెం ఎంగిలి పడి ఆ గదిలోనే మంచంమీద వాలింది గుర్‌దేయీ. ఎంత ప్రయత్నించినా చాలా సేపటివరకు గురు దేయీకి నిద్రపట్టలేదు. అప్పుడప్పుడే కునుకు పట్టోందో లేదో ఎవరో పైకి వచ్చినట్లు చప్పుడు అయింది. పంతులుగారు ఆయన వెంట పొడగరి, యువకునిగా కనబడుతూన్న ఓ వ్యక్తి కనిపించారు.

"తల్లీ! నువ్వీరోజే ఈతని వెంట సియాల్‌కోట వెళ్ళు. అక్కడ నువ్వు వుండ డానికి అన్ని ఏర్పాట్లూ చేశాను. ఏమీ అసౌకర్యం వుండదు" అని పంతులుగారు క్లుప్తంగా వివరించాడు. కళ్లల్లో కృతజ్ఞత నింపుకుని "మీ మేలు ఈ జన్మలో మరవను" అంటూ గుర్‌దేయీ ఆ ఆగంతకునితో ప్రయాణంకావడానికి తయారైంది.

---

# [ 7 ]

సియాల్‌కోట వెళ్లిన కొద్దిరోజుల్లోనే పంతులుగారు ఆడిన నాటకం తెలిసిపోయింది గుర్‌దేయీకి. రహస్యం ఎన్నాళ్ళు దాగుతుంది ? ఏ పంతులుగార్ని దేవతా స్వరూపులుగా భావించి పూజించిందో అతనే పక్కలో బల్లెం అయ్యాడు. తన ఆభరణాన్ని స్వాహాచేసింది చాలక పంతులు ఆమెను తారాచంద్ అనే ఓ యువకునికి అమ్మేశాడు. తనతో సియాల్‌కోట వచ్చి విడచివెళ్లింది బ్రోకరన్నమాట. అసలే ఖర్మంకాలిన గుర్‌దేయీ తలబాదుకోటం మినహా ఏమీచేసే స్థితిలోలేదు. తారాచంద్ ఆమెకు ఏవేవో స్వప్నాలు చూపించాడు. ఆమె తన జీవిత లక్ష్యానికి చాలా దూరంగా వెళ్లిపోయింది. తారాచంద్ పన్నిన వలలో అమాయకురాలైన గుర్‌దేయీ చిక్కుకొని పోయింది.

తారాచంద్ కొద్దోగొప్ప చదువుకున్నాడు. ఏదో ఆఫీసులో గుమాస్తాపని. జీతం నెలకు ముప్ఫయ్ రూపాయలు. తనవూరు గుజరావాలా అనీ అక్కడ తనకు లక్షలు విలువచేసే ఆస్తివుందనీ అయితే తన తండ్రికి తనకూ భేదం వచ్చిన కారణంగా తాను తండ్రిమీద అలిగి ఇక్కడకువచ్చి ఈ చిన్న ఉద్యోగం చేస్తున్నాననీ చెప్పాడు. కాని అబద్ధం ఎన్నాళ్ళు దాగుతుంది ?

కొన్నిరోజుల తర్వాత అతని రహస్యం బయటపడింది. తారాచంద్ ఇంట్లోలేని సమయంలో అతని తల్లివద్దనుండి ఓ వుత్తరం వచ్చింది. గుర్‌దేయీ దాన్ని పొరుగింటివారితో చదివించింది. వుత్తరంలోని విషయం —

" నువ్వు అక్కడికి వెళ్లినప్పట్నుంచి నాకు ఒక్క చిల్లిగవ్వయినా పంపలేదు. కూలీనాలీ చేసుకుని పొట్టను పోషించుకొంటున్నాను. నువ్వెవరినో తీసుకొని వచ్చి వుంచుకొన్నావని తెలిసింది. నీవ్యవహారం ఏమీ బాగాలేదు... "

గుర్‌దేయీ తలపై పిడుగుపడినట్లయింది. ఆమె నిస్పృహాయురాలైంది. అటుకన్నవారింట్లోనూ ఇటుమెట్టినవారి ఇంట్లోనూ ఆమెకు చోటులేకుండా పోయింది.. బ్రతుకు తెరువుకు కావలసిన తెలివితేటలు అసలేలేవు. ఎవరేమి చెప్పినా మూర్ఖంగా నమ్మింది. తన ఈ గుడ్డినమ్మకమే తన స్వాభిమానాన్ని బజారున కుదువబెట్టి తనశీలాన్ని దోచుకుంది. స్త్రీత్వం అనే ఎత్తయిన శిఖరాన్నుంచి ఆమె పెద్ద అఘాతంలోకి పడిపోయింది. ఒకరకంగా వర్షమే ఇటువంటి దౌర్భాగ్యపు స్థితిలోనైనా వుండగల్గింది.

ఆ ఎండిపోయిన రొట్టెముక్క-కూడా దొరక్క-పోతే ఏంచేయడం ? కాని దురదృష్టం ఆమెను నీడలాగ వెంటాడుతూందని ఆమెకు తెలియదు.

అదేసమయంలో గవర్నమెంటు కొంతమంది ఉద్యోగుల్ని రిట్రెంచు చేసింది. తారాచంద్ ఎండిన కొమ్మలాగా ప్రభుత్వ వృక్షాన్నుంచి పీకి వేయబడ్డాడు. పరిస్థితులు కొట్టే కొరడా దెబ్బలకు తాళలేక గుర్‌దేయీ అస్వస్థురాలైంది. మంచానికి అతుక్కు-పోయింది .

ఒకనాడు ఈ తారాచందే ఆమెఅంటే పడిచచ్చేవాడు. కాని సంవత్సరం తిరక్క-ముందే గుర్‌దేయీ వాసన అంటే అసహ్యించుకోవడం మొదలెట్టాడు. ఆమెపొడ అంటే గిట్టటంలేదు. ఆమెకు మందూ మాకూ ఇప్పించడం మానేశాడు. అతను అసలే దుర్మార్గుడు, దురహంకారి, జగడాకోరు. భార్యజుట్టుపట్టుకొని కర్రతో చితకకొట్టని రోజంటూలేదు.

గుర్‌దేయీ జీవచ్ఛవంలాగ అయింది. ఏంచెయ్యగలదు గనక? మొదలే లోకం నిందిస్తూంది కులటని. ఇంట్లో మగాడు చూస్తే తిక్క-శంకరయ్య. చాలనట్టు దరిద్రం కూడ పట్టుకుంది. అన్నిటికన్నమించి ముందు ముందు తను ఇంకా ఎన్ని కష్టాల్ని అనుభవించాలో ! జరుగుతూన్న వర్తమానమే ఇంత భయంకరంగా వున్నప్పుడు రానున్న భవిష్యత్తు ఇంకెంత భయంకరంగా వుంటోందన్న ఆలోచన ఆమెను ఆపాద మస్తకం కంపింపజేసింది. తారాచంద్ మీద ఏమాత్రం ఆశ కూడా పెట్టుకోడం నిరర్థకం. వెనకటికి చావని ఎవరో భయపడి పారిపోబోతే ఆ చావే అతనికి ప్రత్యక్ష మైందట. కడుపులో పెరుగుతూన్న పాపాన్ని ఎక్క-డికని మోసుకెళ్లడం ? మిగిలిన జీవితాన్ని ఎక్క-డ గడపడం ? ఎలాగడపడం ? వడగండ్లవానగా కురుస్తూన్న అన్ని ప్రశ్నలకు ఆమెదగ్గర ఒక్క-టే సమాధానం — ఏమీలేదు.

ఆమె అనుమానిస్తూన్న ఆరోజు చివరకురానే వచ్చింది. తీవ్రంగా జ్వరంతో బాధ పడుతూ మూసినకన్ను తెరవకుండా పడివుంది. జ్వరం ఆమెను చాలా రోజుల్నుంచి పట్టి విడవకుంది. ఆ రోజు అర్ధరాత్రి జ్వరంబాగా కాగిపోతూంది. మంచినీళ్ళు తాగించే దిక్కు- కూడాలేకుంది. తారాచంద్ వెళ్లి రెండురోజులైంది. తిరిగివస్తాడన్న నమ్మకం కూడాలేదు. 'నా మీద ఆశపెట్టుకోకు' అని వెళ్లేముందు చెప్పిమరీ వెళ్లాడు. "బతుకు తావో చస్తావో నీ ఇష్టం. నా తాత ఆసుపత్రేమీ కట్టించలేదు. నేనే కూడూ గుడ్డాలేక చస్తున్నా. ఇక నిన్నేం పోషించను ? ఎక్క-డికేనా వెళ్లి బ్రతుకుతాను. నీ పీడైనా విరగడౌతుంది" అంటూ నానా దుర్భాషలు ఆడాడు. గుర్‌దేయీ జ్వరం మైకంలో

వుందేమో ఇదే మంచి అవకాశం అనుకుని ఇంటిలో వున్న సామానంతా వూడ్చి పట్టు కెళ్లాడు.

దీనికి తగ్గట్టు ఆమె వుంటున్న ఇంటి చుట్టుపక్కల ఒక్క హిందూ కుటుంబంకూడా లేదు.

దాహంతో నాలుక పిడచకడ్తూంటే అలాగే మంచంమీంచి మెల్లిగాలేచి తూలుతూ నీళ్ళున్న చోటికి నడిచింది. కుండ ఖాళీగావుంది. గ్లాసులోమాత్రం కొంచెం నీళ్ళు బురద బురదగా వున్నాయి. వణుకుతూన్న చేతితో గ్లాసు తీసుకొని నోటిలో పోసుకుంది. అలా పోసుకోడంలో కొంచెం నీళ్ళు కిందపడిపోయాయి. కొద్దిగా మాత్రమే నీళ్ళుగొంతులోకి పోయాయి. తిరిగి మంచందగ్గరకు వెళ్లలేక పోయింది. కళ్ళుతిరిగి అక్కడేపడి పోయింది. అలాగా చాలాసేపు స్పృహతప్పి పడివుండిపోయింది.

---

# [ 8 ]

ఆశ్వీయుజమాసం. పగలంతా కోతిని ఆడించి 'రోడూ' గూటికి చేరుకున్నాడు, జోలిలో కాసిన్ని రొట్టెముక్కలూ, కొంచెం పిండేవుంది. ఓ చినిగిపోయిన కంబళి, రెండుమట్టిగ్లాసులూ, రెండు మట్టి తెపాలాలు, పొడుగాటి గుడ్డసంచి ఇటువంటివే పనికి రాని లాడు బూడూ వున్నాయి. ఇవే అతని సర్వస్వం. ఇక అతని కుటుంబంలోని ప్రాణులు రెండు. ఒకటి అతను, రెండోది రోజూ అతను ఆడించే కోతీ. నా అనే వాళ్ళు ఎవరూలేరు. తల్లిపాలు తాగే వయస్సులోనే అమ్మా నాన్నా ఇద్దరూ ప్లేగువచ్చి చచ్చిపోయారు. ఒకకన్ను మెల్ల. అందుకేనేమో పెళ్లికాలేదు అతనికి.

రోడూకు ఇప్పుడు అరవైఏళ్ళు. మమతలు, మమకారాలు అంటే అతనికి ఏమీ తెలియదు. ఎవరైనా ఫలానా అమ్మాయిని ప్రేమించాడని వింటే వూసుబోని కబుర్లక్రింద జమకట్టి ఎగతాళిచేస్తాడు, మనిషి అనేవాడు పుడతాడు, చస్తాడు. ఈ రెండే అతను జీవితం నుంచి నేర్చుకొన్న పరమార్థం. అయితే భగవంతుడన్నా గురువులూ దేవతలన్నా అతనికి శ్రద్ధవుంది. హరిజనుడైనా హిందూమతంపట్ల శ్రద్ధాభక్తులు కనబరుస్తాడు.

జోలెతీసి గుడిసెమధ్యకు వేలాడుతూన్న కర్రమేకుకు తగిలించాడు. కోతిని తాడుతో కట్టాల్సిన అవసరంలేదు రోడూకు. అతనితోటిదే దాని జీవితం కూడా. రోడూ అంటే దానికి అంతులేని ప్రేమ.

దానంతట అదే మర్రివూడల మధ్యవెళ్ళి నీడలో పడుకుంది. నుదురుపైవున్న చెమటతుడుచుకొని చెమటలో తడిసి చీకిన అతుకుల చొక్కా విప్పాడు.

చల్లగాలికి అతని ఒంటిమీదవున్న చెమటంతా ఆరిపోయింది. రోడూలేచి కుండ లోంచి నీళ్ళు గ్లాసులో పోశాడు. సంచిలోంచి ఓబెల్లం ముక్కతీసి రాయితో మెత్తగా నూరాడు. గ్లాసులో బెల్లంపొడిపోసి బాగా కలిపి పానకం తయారుచేశాడు. సగానికి పైగా తాను త్రాగి మిగతాది కోతికి ఇవ్వడం కోసం దానివైపు చూశాడు. రోడూ తాగడం కోతి చూస్తూనేవుంది. ఒకపరుగులో వచ్చి అగ్లాసు ఖాళీచేసి మళ్లీ మర్రివూడల క్రిందకు చేరింది.

అంతలో ఎక్కడ్నుంచో కుక్కలగుంపు అక్కడకు చేరుకుంది. కుయ్ కుయ్ మంటూ అవన్నీ రోడూ చుట్టూ ప్రదక్షిణం చేయసాగాయి. రోడూ లేచి మేకుకు తగిలించిన జోలిలోంచి రొట్టెముక్కలు తీసి కుక్కలకు వేశాడు.

ఇవ్వాళ భోజనం ఆలస్యంగా వండాలనుకొన్నాడు. కాళ్ళుసాచి పండుకోగానే కునుకు పట్టేసింది. కొంచెం సేపటికి పక్కకు ఒత్తిగిల్లాడు. అలాచేయడంలో కొద్దిగామెళకువ వచ్చింది. కానివెంటనే మళ్లీ నిద్ర పట్టేసింది. కాని అంతలోనే ఏదో శబ్దానికి అతను లేచి కూర్చున్నాడు. చెవిదగ్గిరగా చెయ్యిపెట్టి ఏదో వినడానికి ప్రయత్నించాడు. శబ్దం ఇప్పుడు మరింతస్పష్టంగా వినిపించసాగింది. ఖంగారుగా లేచి శబ్దంవస్తున్నవైపు నడవ సాగాడు. యజమాని లేచి వెళ్తుండడం చూసి లచ్చో కూడా అతని వెనకాలే బయలు దేరింది.

కొంచెందూరంవెళ్లి రోడూ ఓ పొద దగ్గిర ఆగిపోయాడు. పొదలోంచి చంటిపిల్ల ఏడుపు వినిపించింది. పొదలోకి వంగిచూశాడు రోడూ. ఏదో ఎర్రని వస్తువొకటి అతని కళ్లకు కనిపించింది. ఇంకాస్తదగ్గరకు వెళ్లాడు. ఎర్రని గుడ్డపేలికల్లో ఓచంటిబిడ్డ 'ఉవాఁ ఉవాఁ' అంటూ ఏడుస్తోంది. రోడూ ఆ పాప ఏడవడం చూసి వుండబట్టలేకపోయాడు. వెనుకాముందు ఆలోచించకుండా పొత్తిళ్ళతో సహా ఆ పిల్లను చేతిలోకి తీసుకొని తన గుడిసెకు తీసుకెళ్లాడు. వాతావరణం చల్లగానేవుంది. కాని చంటి పిల్ల కావడంచేతనేమో ఆమాత్రపు చల్లదనాన్ని కూడా ఓర్చుకోలేక పొత్తిళ్ళలోవున్న ఆపాప శరీరం బిగుసుక పోయి పెదవులు నల్లబడిపోయాయి.

ఆలోచనా పాలోచనా లేకుండా పిల్లనైతే తీసుకొచ్చాడు. కానీ తీరా తెచ్చినతర్వాత అతనికి గాభరాపట్టుకుంది. ఈ పాపను ఏం చెయ్యాలి? ఎక్కడికి తీసుకెళ్లాలి? ఎలా కాపాడడం? కోతికి పిల్లలంటే మహాప్రేమ అంటారు. అది ఆ పాపవైపు మరీమరీ దగ్గరగా వస్తోంది. అతను లచ్చోను తీక్షణంగా చూస్తున్నాడు దగ్గరగా రావద్దని. కాని లచ్చోమాత్రం అతని చేతిలోంచి ఆపసికందును లాక్కోవాలని గంతులు వేస్తోంది. తొందరగా రోడూ బొంతను పరిచి దానిపై ఆ పసికందును పడుకోబెట్టాడు. ఆ పసి కందు ఎన్నాళ్లనుంచి ఆకలిగావుందోనన్న ఆలోచన వచ్చింది. దానికి పాలు కావాలి. బొంతలో ఆ పాపని కప్పివేసి గ్లాసుతీసుకుని పాలకోసం వూళ్లోకి పరుగెత్తాడు. కాని అతనికో సందేహం వచ్చింది. కోతిలాంటి అతి చంచలమైన జంతువు దగ్గిర ఒంట రిగా పడవేసి వచ్చాడు. తను పొరపాటు చేశాడేమో, తన వెంటనే ఆ కందునూ తీసుకురావలసింది. తన్నేవరేమని అంటారు. అథవా ఎవరైనా అడిగితే చుట్టాలమ్మాయి అని ఛెప్తే సరిపోతుంది. అంటూ పరిపరి విధాలా మనస్సుపోసాగింది. వెంటనే వెళ్లి

పోదాం అనుకున్నాడు. కానీ పసిది ఆకలిగావుందన్న విషయం జ్ఞాపకం వచ్చి అతని కాళ్ళు వెనక్కు లాగలేక పోయినాయి. చేతులురెండూ జోడించి మనస్సులోనే దేవునికి నమస్కారంచేసి ముందుకు నడిచాడు.

చాలా వేగంగానే వెళ్లాడు. అయినా వెళ్లిరావడానికి అర్థగంట పట్టింది. పాలు పోయించుకుని తిరిగి వస్తూంటే గుండె దడదడమని కొట్టుకోసాగింది. తన తెలివితక్కువ తనంవల్ల పరమాత్ముడు సృష్టించిన ఒక జీవిని నిష్కారణంగా బలి తీసుకుంటానేమో అన్న ధర్మభీతి కలిగింది అతనికి.

గుడిసెలో అడుగుపెట్టగానే బిత్తరపోయాడు. లచ్చో ఒళ్లో పసికందువుంది. బొంత ఓమూల పడేసింది. పసికందు ఏడ్పుమాని కళ్లుతెరచి చూస్తూవుంది. యజమానిని చూడగానే లచ్చో పాపను తిరిగి బొంతమీద పడుకోబెట్టి భయంతో ఓపక్కకి వెళ్లి బిటుబిటుపగా చూస్తోంది.

రోడూ బొంతదగ్గరకొచ్చి దానిలోంచి దూదిలాగి పాలలోముంచి కొద్దిగా ఆపాప నోట్లో పిండసాగాడు. పసికందు ఆకలిగావున్నదేమో గుటకలువేస్తూ కొంచెంతాగి ఆకలితీరిన తర్వాత మెల్లగా నిద్రపోయింది. రోడూ మనస్సు కుదుటపడింది.

రాత్రికి రోడూ ఎప్పటిలాగే మూడు రాళ్లను పొయ్యి ఆకారంలో కూర్చి మూడు రొట్టెలు తయారు చేశాడు. రెండేమో అతనుతిని ఒకటి లచ్చోకు ఇచ్చాడు. రోజూ బొంతమీద పడుకునేవాడు కాని ఇప్పుడు ఓచిన్న అతిథి అతనింట్లోవుంది. బొంతను రెండుగా చించాడు. ఒకదానిమీద ఆపాపను పడుకోబెట్టి మిగతా సగంతో ఆమెకు కప్పాడు. అర్థరాత్రి పక్కకు వత్తిగిలినప్పుడు పక్కన పసిపాపవున్న విషయం జ్ఞాపకం వచ్చింది అతనికి. కంగారుగా లేచాడు. చంటిబిడ్డ ఎలావుందో చూద్దామన్న కుతూహలంతో పిల్ల మీద పరిచిన బొంతను తొలగించాడు. పిల్లకనపడలేదు. రోడూకు ముచ్చెమటలు పోశాయి. కొంపతీసి ఏదైనా క్రూరమృగం ఎత్తుకపోలేదుకద అని ఆలోచించాడు. నిజంగా అతనిపాప వన్యమృగం ఒడిలోనేవుంది. ఆ పాపని లచ్చో తన ఒళ్లోపెట్టుకుని దూదిని పాలలోముంచి అచ్చంగా రోడూ చేసినట్లే చంటిబిడ్డ నోట్లో పిండుతూవుంది.

భగవత్ స్వరూపమైన సృష్టిలోని ఈ అద్భుతంచూసి రోడూకు నవ్వువచ్చింది. భగవానుడు అనంతుడు. అతని లీలలు అనంతములు. మానవ స్వరూపిణి అయిన తల్లి ఒడిలోంచి వన్యమృగరూపంలోని తల్లిఒడిలోకి పసికందుల్ని ఎంత అవలీలగా పంపిస్తాడు. అని అనుకున్నాడు రోడూ.

ఆరోజు మమకారం అనే కాంతికిరణం ఒకటి చీకటి కవాటాల్ని తెరుచుకుని రోడూ హృదయంలోకి నెమ్మదినెమ్మదిగా చొచ్చుకుని వెళ్లింది. ఆ మసక వెలుతురు వేడినీ, ఓజస్సునూ అతను జీవితంలో మొట్టమొదటిసారిగా అనుభవించాడు. ఆ కిరణాన్ని అతను సుందరి అని ప్రేమతో పిలుచుకున్నాడు.

రోజులు దొర్లుకుపోతున్నాయి. సూర్యునితోపాటు పందెం కట్టుకొని సమానంగా నిద్రపోయి మేలుకొనే రోడూ, క్షణక్షణానికి ఇప్పుడు లేస్తున్నాడు. రాత్రిళ్లు సుందరి మారాంచేస్తే భుజాలమీద వేసుకుని గంటలకొద్దీ విడువకుండా తిప్పుతున్నాడు. తిప్పుతూ తిప్పుతూ "చిన్నారి నాతల్లి నాయింటికొచ్చింది, చిరుతచేతులతోనె చీకటిని తోలింది," అని జోలపాట పాడుతున్నాడు. రోజుకో కొత్తభావం. రోజుకో కొత్తరాగం. ప్రజల నోట్లో జోలపాటలు విని ఒకప్పుడు హేళనచేసే రోడూకు ఇవ్వాళ జోలపాటలు పాడుతుంటే ఆనందపరవశత్వం కలుగుతోంది. మృత్యుగహ్వరంలో ఎవరో ఆ పసి పాపను ఒదిలేసి వెళ్లారు. కాని ఆ పాప నొసటిమీద ప్రపంచం చూడాలని రాసివుంది. అందుకని ఆ చిట్టితల్లి బతికింది. శూన్యంతోనిండిన రోడూ మనోమందిరంలో మమత అనే దీపాన్ని వెలిగించమని ఆమెనుపంపితే ఆమె తన చమత్కారం ప్రదర్శించకుండానే ఎలా వదలిపోతుంది?

పసిదాని కన్నులూ, ముక్కూ తీర్చిదిద్దినట్లుగా వున్నాయి. నల్లని కాటుకకళ్ళూ, తెల్లని దేహకాంతీ, పట్టువస్త్రంలాంటి బంగారుఛాయగల ఆ జుట్టూ ప్రకృతి శిల్ప నైపుణ్యానికి ప్రత్యక్షదృష్టాంతాలు. బహుశా ఆమె అందాన్నిచూసే ఆమెకు సుందరి అని రోడూ పేరుపెట్టి వుండొచ్చు.

ఎన్నాళ్ళనుంచో ముసురుకున్న ప్రశ్నలకు ఈనాడు సమాధానం దానంతట అదే దొరుకుతోంది. అటువంటి ప్రశ్నలు వచ్చినప్పుడు ఒకప్పుడు రోడూ హేళనగా అంటుండేవాడు. "సంతానంకోసం ప్రపంచంలోని జంజాటాలన్నీ మెడకు తగిలించుకోడం ఏమంత సబబు? మానవులు అనవసరమైన భ్రమలోపడి మమత మమకారం అంటూ వల్లిస్తుంటారు. మమత అనే వస్తువు అసలు ప్రపంచంలోవుందా?" అని. అటువంటి రోడూ – కేవలం రెండు ప్రాణులు జీవించడానికి కావలసినంత మేరకే ఆహారం యాచించి చెట్లనీడని కాళ్ళుసాచి నిశ్చితంగా నిద్రించే రోడూ ఈనాడు పెందలాడే లేస్తాడు. చీకటిపడకముందే వూరంతా తిరిగి నాలుగు రొట్టె ముక్కల్ని, పిండిని సంపాదించుకుని గూడు చేరుకుంటాడు. ఇప్పుడు కేవలం రొట్టెలు చేసుకుంటానికి కావలసిన పిండేకాదు, అతనికి కావలసింది. డబ్బుకూడా అవసరమౌతోంది. ఇంతకు ముందు రొట్టెముక్కల్ని కుక్కలకు వేసేవాడు. కాని ఇప్పటి పరిస్థితివేరు.

కొద్దికాలంలోనే రోడూ డబ్బు పోగుచేసాడు. దానితో ముందు సుందరి కోసం ఓచిన్నమంచం, కొన్ని గుడ్డలూ రెండు మూడు బొమ్మలూ కొన్నాడు. ఇంతకుముందు దొరికిందానితో సంతృప్తిపడేవాడు. కాని ఇప్పుడు "అయ్యా, పిల్లకోసం ఏదైనా ఓ చింకిపాత పడేయండి, చంటిదానికి పాలుకోసం మీకు తోచింది ధర్మంచేయండి". అని బ్రతిమాలుతున్నాడు.

సుందరి అంటే రోడూకు ప్రేమవుండనేవుంది. కాని అతని కంటే లచ్చోకు ప్రేమరెట్టింపు. లచ్చో సుందరి ఒక క్షణంపాటు కూడ కనబడకపోతే ఒప్పుకోదు. మొదట్లో ఆపనిది అతనికి పంచప్రాణాలు. ఇప్పుడు యాచించడానికి ఎక్కడకు వెళ్లినా సుందరినివెంట తీసుకెళ్తాడు. మొదట అతని దగ్గిర ఒక కోతిపిల్లేవుండేది. ఇప్పుడు రెండయ్యాయి. పిల్లమీద జాలివేసి ప్రజలు ఏదో ఒకటి ఇస్తుండేవాళ్లు. కాని ఏడుపు మొఖంపెట్టి "అయ్యల్లారా, దీన్నికనగానే దానమ్మ చచ్చిపోయింది. తల్లిలేని ఈ పిల్లను కనికరించండి" అని రోడూ అంటూంటే వాళ్ల మనసు మరింత కరిగిపోయేది.

సుందరి ఇప్పుడు రేండేళ్లదయింది. కోతుల్ని ఆడించే ఆ యానాది గుడిసెలో చీకటినిచీలుస్తూ భగవంతుడు వెలుగును పంపాడు. సుందరిని ఎంతచూసినా తనివితీరేది కాదు రోడూకు. లచ్చో సావాసంవల్లనేమో సుందరి అలవాట్లు గూడ కోతికన్న కొంటెగా వుంటున్నాయి. లచ్చోమాదిరిగా ఆమెకూడ గెంతుతుంది. రెండు చేతులూ నేలపై ఆనించి కాళ్లు ఆకాశంవైపుకు పెడ్తుంది. గుడిసె వాసాన్ని పట్టుకొని కప్పుపైకి ఎక్కడానికి ప్రయత్నిస్తుంది. కోతి ఏంచేస్తె అలాగే సునాయాసంగా చేష్టలు చేస్తుంది. చుట్టుపట్ల పిల్లలతో సుందరి ఆడుతూవుండడం, సుందరంటే అందరు పిల్లలూ మహాఇష్టంగా వుండడం చూసి రోడూ ఉప్పొంగిపోయేవాడు. ప్రకృతి ప్రసాదించిన అందంతోపాటు సుందరికి తెలివితేటలు కూడా భగవంతుడు ప్రసాదించాడు. ఒకసారి చూస్తేచాలు వెంబడే అనుకరించేస్తుంది. ఒకసారివింటేచాలు అలాగే మాట్లాడేస్తుంది. రోడూకు ఆమె పోషణలో తీరికే దొరకటంలేదు.

రోడూ ఇంటికివచ్చేటప్పుడు సుందరికి రోజూ ఏదో ఒకటి తీసుకవస్తాడు. అసలు అలా చేయడం అతనికో అలవాటుకింద మారిపోయింది. ఇంటికి వచ్చేటప్పుడు అతని చేతిలో ఏదైనా వస్తువువుంటేచాలు అతని నడకలో మెరుపుతీగవేగం వస్తుంది. అతని హృదయంలో ఏదో బలీయమైన కోరిక సుళ్ళు తిరుగుతూ పరవళ్ళుతొక్కుతుంది.... ఇల్లుచేరుతూండగా సుందరిచూసి పరుగెత్తి అతనికాళ్లకు పెనవేసుకొని అతను ఒంటిమీద వేసుకున్న దుప్పటి చివరలు వెతుకుతుంది. ఎగిరి కేరింతాలు కొడుతూ "నాకిచ్చెయ్" అంటూ అల్లరిచేస్తుంది. ఇవన్నీ చూస్తుంటే రోడూకు ఎంతో ఆనందం కలుగుతోంది.

అంత ఆనందం, ఆమెకు అన్నంకలిపిపెట్టేటప్పుడు కూడ బహుశా అతనికికలగదేమో! దోపవ్వటి కొంగు ముడివిప్పి మిఠాయి పొట్లం ఆమె చేతిలో పెట్టిపెట్టడంతోనే సుందరి ఆత్రంపట్టలేక ఆడుతూ ఇతరపిల్లలదగ్గిరకు తన పొట్లం చూపించడానికి పరుగెత్తుతూంటే చూసి రోడూకు ఓ విధమైన పారవశ్యంకలిగేది. అతను సంతోషంలో వళ్ళుమరిచే వాడు. రాజులు మహారాజులకు కూడ అంత పారవశ్యం, ఆనందం కలగదేమో!

పిల్లల్తో ఆడుకొనేప్పుడు సుందరి వాళ్ల తల్లుల్నీ కూడా చూసేది. పిల్లలు పోట్లాడు కుని వాళ్ల అమ్మలవద్దకు వెళ్ళి "చూడమ్మా నన్నుకొడ్తున్నాడూ. నా గులకరాళ్ళు ఇవ్వడంలేదూ. అని ఇంకా ఎన్నెన్నో పితూరీలు చేస్తూవుండేవారు.

సుందరికి "అమ్మ" అనే శబ్దానికి అర్థంతెలిసేదికాదు. రోడూ, లచ్చోవాళ్లే ఆమెకు ప్రపంచం. కాని తల్లులు వాళ్ళ పిల్లల్ని ముద్దాడడం. వాళ్ళకు జడవేయడం, తలదువ్వటం వాళ్లకు రకరకాల వస్తువులు ఇస్తూంటే చూసి ఎవరి దగ్గరైనా బొమ్మ చూడగానే మారాం చేసినట్లు అమ్మకోసం మారాంచేసేది.

వెన్నెలరాత్రి రోడూ తాత గుడిసె బయట గోనెసంచీమీద పడుకొని సుందరిని మోకాళ్లమీద వుయ్యాలవూపుతూ సన్నగా పాడుతున్నాడు. అతను ఒక్కోచరణం పాడి ఆపుతూంటే "మళ్లీ" అంటూ సుందరి హఠంచేసేది. మళ్లీ పాడుతూ మోకాళ్ల మీద వుయ్యాలవూపేవాడు రోడూ. అలా వూపి వూపి అలసిపోయేవాడు. అలా కాదని సుందరిని కూచోపెట్టి అరచేతిని చూపించమని అంటూ ఒక్కొక్కవేలు పట్టుకొని "ఇది పప్పు, ఇది బెల్లం" అని కితకితలు పెడ్తూంటే సుందరి ఒకటేనవ్వేది. ఆమె అలా కిలకిలమని నవ్వుతూంటే అమృతాన్ని గుటకలు వేసినట్లుగా వుండేది రోడూకు. అలా ఒక రోజు రోడూ సుందరిని కితకితలు పెడ్తుండగా దూరంగా ఎవరో పిల్లాడు "అమ్మా, అమ్మా" అని బిగ్గరగా అరవడం విన్నది సుందరి. నవ్వడం మానేసి రెండు అరచేతుల్నీ రోడూ గెడ్డం క్రిందకు పోనిచ్చి "తాతా అమ్మ ఏదీ?" అని అడిగింది.

ఆ పసిహృదయం అడిగిన ప్రశ్నకు ఏమి చెప్పాలో తోచలేదు రోడూకు. అతని మనసుకు బాధకలిగింది. సుందరిని ముద్దు పెట్టుకుంటూ.

"తల్లీ, మీ అమ్మ పోయింది" అన్నాడు.

"అమ్మ ఎక్కడకు పోయిందీ?" అని తిరిగి అడిగింది.

"నీ అమ్మ దూరంగా పోయింది తల్లీ"

"తాతా. అమ్మదూరంగా... ..."

సుందరి అప్పుడు పడుకోని ఆకాశంవైపు చూస్తోంది. పైకి చూస్తూ మళ్ళీ అడిగింది.

"తాతా, అమ్మ ... ... '

"అవును తల్లీ ... ..."

"తాతా అమ్మ పైన ... ... '

"అవును తల్లీ, పైకిపోయింది"

"తాతా, చందమామ ... ..."

"అవును తల్లీ, చందమామ దగ్గరకు"

"తాతా, గద్దా ... ..."

అవును తల్లీ, గద్ద తన్నుకు పోయింది"

"తాతా, గద్ద అమ్మను దూరంగా తీసుకుపోయిందా ?"

"అవును తల్లీ, అమ్మను దూరంగా తన్నుకుపోయింది"

అలాగే కాసేపు అడుగుతూ సుందరి నిద్రపోయింది. రోడూకూ కూడా నిద్ర పట్టేసింది.

# [ 9 ]

[ పది పన్నెండు సంవత్సరాల తర్వాత ]

ఉత్సాహం అనేది రెండువైపులా పదునువున్న కత్తిలాంటిది. అది మంచికి వుపయోగపడుతుంది, చెడుకూ వుపయోగపడుతుంది. ఉత్సాహం ఒక నీటిబిందువు. ''నేరేడు'' పండుగా మారి పాలను పెరుగు కింద మారుస్తుంది. అదే బిందువు ''గంజి'' గా మారి ఆపాలనే పనికిరాని విధంగా విరగ్గొట్టుంది.

దివాన్‌పుర్ జమీందార్ జీవాసింగు కుమారుడు బచన్‌సింగు మొదట్లో మామూలు వ్యక్తే. అయితే అకస్మాత్తుగా ఆయన జీవితంలో ఓ మెరుపు మెరిసింది. ఓ చినుకు రాలింది. ఆ చినుకే ఉత్సాహంగామారి ఆ జీవితం ఓ ముఖ్యమైన మలుపులోకి మళ్లించింది. పదవక్లాసు పాసై ఖాల్సా కాలేజిలో చేరిన తర్వాత అతనికి వుత్సాహం పట్టుదలా కలిగాయి. ఆవుత్సాహమే ఆయనకు ఓ మహనీయుని పరిచయం కలిగించి అతని జీవితాన్నే మార్చేసింది.

బచన్‌సింగు వయస్సు పద్దెనిమిది - పంతొమ్మిది సంవత్సరాలు వుంటుంది. చాలా సంవత్సరాల్నుంచీ అతను అమృత్‌సర్‌లో వుంటున్నాడు. ఇన్ని సంవత్సరాలూ అమృత్‌సర్ కలుషిత వాతావరణంలోవున్నా అతని నరనరాల్లో గ్రామస్తుల తాజా రక్తమే ప్రవహిస్తోంది. ఒడ్డూపొడుగూ కలవాడు. నిండుముఖం. నూనూగు మీసాలు అతని ముఖసౌందర్యాన్ని నాలుగింతలుచేసాయి. నిశ్చలంగావుండే అతని కళ్లూ, మాట్లాడుతూంటే ముత్యాలు కురిపించే అతని మృదుభాషిత్వమూ, అతను చదివిన స్కూల్లో అతన్ని నాయకుడిగా చేసాయి. అలాకావడానికి ప్రబలమైన కారణంవుంది. కవిత్వం వ్రాయడమన్నా స్టేజిపై ఎక్కి వుపన్యాసాలు చేయడం అన్నా అతనికి మహా సరదా. బచన్‌సింగు స్కూలు యూనియన్‌కు లీడర్‌గా వుండేవాడు. విద్యార్థులు జరిపే ప్రతికార్యక్రమంలోనూ, సభలూ సమావేశాల్లోనూ అతను ఎప్పుడూ ముందుగా వుంటుంటాడు. ఇదేకాక ఎక్కడైనా మహా సభలు జరిగితే అక్కడ కూడా అతనికి ప్రవేశంవుంది. కొద్దోగొప్పో ప్రఖ్యాతివుంది. పెద్దపెద్ద సమావేశాల్లో అతనుపాడే పాటలకు ప్రాముఖ్యాని ఇస్తారు. అతను ఉత్కృష్టమైన రచనలు చేస్తాడని కాదు. రచన

లైతే సాధారణంగానే వుంటాయి. కాని ఆయన గొంతుఎత్తి పాడితే అతని కంఠ మాధుర్యంచేత ఇత్తడి కూడా మేలిమి ధర పల్కుతుంది. భావోద్రేకంతో అతను పాడుతూంటే శ్రోతలు శిలాప్రతిమల్లాగ మంత్రముగ్ధులైవింటుంటారు.

బచన్‌సింగు జీవితం ఓమలుపుతిరిగింది. అది అతని జీవితంలో ఓ కొత్త విప్లవాన్ని తెచ్చింది. దానికో చిన్న చరిత్రవుంది. ఆరోజుల్లో గ్రామాల్లోనూ, పట్టణ ప్రాంతాల్లోనూ గ్రామాభ్యుదయంపై చాలా చోట్ల సమావేశాలు సమ్మేళనాలూ జరుగుతుండేవి. గ్రామాల్లో పాతుకుపోయిన దురాచారాలను, దుబారాను నిర్మూలించడం ఈ మీటింగుల ఉద్దేశ్యం.

ఇటువంటిసభే ఒకరోజు అమృత్‌సర్‌లోని జలియావాలాబాగ్‌లో జరిగింది. సుమారు పదివేల మంది జనం ఆ సభకు వచ్చారు. మీటింగు సెక్రటరీ స్టేజీపైకి వచ్చి బచన్‌సింగు పేరు ప్రకటించాడు. అతనిపేరు ప్రకటించగానే శ్రోతల్లో సంచలనం బయలు దేరింది. సభాసదుల కేకలమధ్య బచన్‌సింగు స్టేజీమీదకు వచ్చాడు. బచన్‌సింగు తన కవిత్వాన్ని వినిపించాడు. శ్రోతలు కిమ్మనకుండా విన్నారు. మళ్లీ ఒకసారి చదవమని వాళ్లంతా కోరారు.

తన కారోజు లభించిన సాఫల్యానికి బచన్‌సింగుకు పరమానందం కలిగింది. నేల మీద నడుస్తూన్నా ఆకాశంలో తేలిపోతూన్నట్లుగా వుంది అతనికి. సభసమాప్తమైంది. జనం పల్చబడ్డం మొదలెట్టిన తర్వాత జనసమూహంలోంచి యాభై, అరవై సంవత్సరాల వయస్సుగల వ్యక్తి అతనిదగ్గరకు వచ్చాడు. తెల్లబడిన పొడుగాటి గడ్డం, తేజస్సును వెదజల్లుతూన్న ముఖమండలం. తెల్లని ఖద్దరు వస్త్రాల్లో ఎక్కడినుంచో దిగివచ్చిన దేవతాలా గున్నాడు అతను.

బచన్‌సింగు దగ్గరకు ఆ వ్యక్తివచ్చి అతని చెయ్యి పట్టుకుని జనసమర్దంలోనుండి దూరంగా తీసుకెళ్లాడు. ఓ పచ్చికమైదానంలో కూర్చుంటూ "నాయనా. నీ కవిత్వం నన్ను నీదగ్గరకు లాక్కొచింది" అని అన్నాడు ఆనందంతో. "తాతాగారూ. అదంతా మీదయ. మీరు చాలా శ్రమతీసుకుంటున్నారు." ఆయనకు దగ్గిరగా కూర్చుంటూ బచన్‌సింగు సమాధానం ఇచ్చాడు.

అతను మాటలను ముగించకముందే వృద్ధుడు అన్నాడు — "నేను అంత ఎక్కువ చదువుకోలేదు నాయనా. నీ కవిత్వానికి అర్థం ఏమిలో నాకు చెబుతావా?"

ఆ వ్యక్తిచేతిలో కాగితంవుంది. కవిత్వాన్ని ఇలాచదివాడు

"తేరే చరణోంకే కసమ్, ఏ హింద్ మాతా
తేరీ సేవామే జిందగీ బితా దూంగా మై
ఘూమ్‌కర్ దేశ్‌కే గలియోం ముహల్లోంమే
సబ్ కు రీతియోం కో మిటా దూంగామై!"

నీపాదముల యాన ఓ భారతాంబా!
నీ సేవ కంకితము నా జీవితమ్ము;
ప్రతి నగరి, ప్రతిపల్లె, ప్రతిచోటు తిరిగి
మన దురాచారముల మాయమ్ముచేసి

మూఢ విశ్వాసముల మురికి పేటలను
నిర్మూలనలోచేసి నిలిపెద కీర్తి
నీపాదముల యాన ఓ భారతాంబా
నీసేవ కంకితము నాజీవితమ్ము

దాన్ని బచన్‌సింగు ఇంతకుముందు జరిగిన సభలో చదివాడు. కవిత్వం అయితే ఇంకా చాలవుంది కాని, ఆ వృద్ధుడు ఆ నాలుగు పంక్తులు మాత్రమే రాసుకున్నాడు.

"తాతగారూ, వీటి అర్థం చాలా తేలిక" అన్నాడు బచన్‌సింగు.

ఆ పెద్దమనిషి బచన్‌సింగువైపు ఔదార్యంతోనూ, ప్రేమపూర్వకంగానూ చూసి "లేదు నాయనా. తేలికకాదు. చాలాకష్టం. మళ్ళీ ఆలోచించు" అని కోరాడు.

బచన్‌సింగు ఆలోచనలో పడ్డాడు.

"నీ పాదాలపై ఆన..." "ఈ పద్యానికి అర్థం ఏమిటి నాయనా"? అని తాతగారు ప్రశ్నించాడు.

అసలు విషయం ఏమిటో అతనికి అర్థమైంది. మరోసారి తాతగారి కళ్ళల్లోకి చూశాడు. కాని ఆకళ్ల తీక్షణతను అతని కళ్లు తట్టుకోలేక క్రిందికి వంగినాయి. తాతగారికి జవాబు ఇవ్వలేకపోయాడు బచన్‌సింగు.

బచన్‌సింగు భుజం తట్టుతూ "ఒట్టుపెట్టకూడదు తెలుసా. పాపం అంటుకుంటుంది నాయనా" అన్నాడు.

కిందకుదించిన కళ్లు ఎత్తకుండానే నిలుచున్నాడు బచన్‌సింగు.

"నాయనా, సేవలోనే జీవితం గడపాలనేదావి వుద్దేశ్యం ప్రశంసలందుకోవడం కాదు!"

అప్రయత్నంగా బచన్‌సింగు శిరస్సు అతని పాదాలపై వంగింది.

"నిజంగా నీలో వేదనా, వేడీ వుంటే బడాయిక్కబుర్లుమాని ఆచరించి చూపించు" అతని వీపుపై చేతిని నిమురుతూ తాతగారు అన్నారు.

బచన్‌సింగు కళ్లు తెరిచాడు. ఆ పంక్తులు అర్థం తీయడం వాస్తవంగా కష్టంగా వుంది. ఆవేశపూరితమైన రచనలు చేసి వాటిని ప్రజలముందు చదవడం ద్వారా వారిలో తపన కలిగించడం, భారీ పొగడ్తలు అందుకొని ఆనందించడమే సేవ అనీ, మహోపకారం అనే నేటివరకూ భావిస్తూ వచ్చాడు. సేవఅంటే ఇంతవరకూ ఇదే అని అతని దృక్పథంగావుంటూ వచ్చింది. కాని అతను చేస్తూన్నదంతా కృత్రిమమైందనీ, పైపూతమాత్రమేననీ ఈనాడు గ్రహించాడు. ఈకనిపించే జీవితం కాక ఇంతకన్న ఉత్కృష్టమైందీ మహోన్నతమైందీ మరో జీవితం కూడా వున్నదని అతను ఇంతవరకూ అనుకోలేదు.

ఆ చిన్న పరిచయం తర్వాత తాతగారు అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు. కాని వెళ్తూ వెళ్తూ బచన్‌సింగు మనోఫలకంమీద చెరగని ఓ ఉత్సాహముద్ర వేసాడు. తాతగారు వెళ్లిపోతున్నప్పుడు బచన్‌సింగు ఆయన వూరుపేరూ అడిగాడు. ఆయనపేరు దీదార్ సింగు అట. కొద్దిరోజుల క్రితమే అమృత్‌సర్ వచ్చాడట.

ఆ రోజునుండి బచన్‌సింగు జీవితంలో ఓ కొత్త అధ్యాయం ప్రారంభమైంది. దీదార్‌సింగు అమృత్‌సర్‌లో వున్నంతకాలం రోజూ ఆయనదగ్గరకు బచన్‌సింగు వెళ్ళేవాడు. ఆ కొన్నినెలల సాంగత్యం బచన్‌సింగు జీవితాన్ని మార్చివేసింది. పూర్వం బచన్‌సింగుకూ ఇప్పటి బచన్‌సింగుకూ ఆకాశానికి పాతాళానికి వున్నంతతేడా ఏర్పడింది. కవిత్వం అతను ఇప్పుడుకూడా రాస్తూవున్నాడు కాని, ప్రపంచంకోసం కాదు. తనకోసం రాస్తున్నాడు. "నీ పాదాలపైన అన... ..." అని జ్ఞానీ దీదార్‌సింగు రెట్టిస్తూ పలికిన ఆ పంక్తి అతని జీవితంలో చిరస్థాయిగా ముద్రవేసుకుంది.

---

# [ 10 ]

ఆ సంవత్సరం వేసవి శలవులకు ఇంటికి వెళ్లాలనిపించలేదు బచన్‌సింగుకు. తన కవిత్వంలో కొత్తకొత్త అనుభవాలను చొప్పించడానికి గ్రామీణ ప్రాంతాలు తిరిగి వద్దామనుకున్నాడు. కాని తండ్రికి సుస్తీగావుందన్న వుత్తరం చూసిన తర్వాత వుండ బట్టలేక శలవులు ఇవ్వగానే ఇంటికి వచ్చేశాడు.

కుమారుని వాలకంచూసి తండ్రికి ఒళ్ళుమండింది. సూటూ బూటూ టయ్ వేసుకొనే కొడుకు యిలా అకస్మాత్తుగా ఖద్దరుచొక్కా, పైజమా, కాళ్లకు పన్నెండణాలు ఖరీదు చేసే పాదా అకుజోళ్ళు ధరించాడు. కుమారుని అవతారంచూసి జీవాసింగు లోలోపల చాలా కోపగించుకున్నాడు. కాని ఏం చెయ్యడం? ఒక్కగానొక్కకొడుకు. ఎదురుగా చెప్పాలంటే సాహసం చాలదు. కోప్పడితే ఒకవేళ ఇంట్లోంచి వెళ్ళినావెళ్ళిపోవచ్చు. ఎలాగైతేనేం చివరకు చదువూ సంధ్యా మాన్పించి కొడుకును ఇంటిపనుల్లో పెట్టాలని నిశ్చయించుకున్నాడు. ఇంకా చదివిస్తే కుర్రాడే దక్కకపోవచ్చుమరి.

బచన్‌సింగుకు సాంఘికసేవ ఒక వ్యసనంగా తయారైంది. కాని తల్లితండ్రుల మనోవ్యధను సహించలేక మనస్సును చంపుకుని ఇంటిపనులు చూడసాగాడు.

ఒకరోజు పొలానికివెడ్తూ గురుద్వారా ముందుగా వెళ్లాడు. గురుద్వారాకు తాళం వేసివుండడం చూశాడు. సిక్కులు ఇంతమందివున్న ఈ వూళ్ళో గురుద్వారాకు ఇలా దుర్గతి ఎందుకు పట్టిందా అని ఆలోచించాడు. అదగ్గర్లోవున్న ఓ పిల్లాణ్ణి పిలిచి "ఈ గురుద్వారాలో [1] గ్రంథిలేడా?" అని అడిగాడు.

"అదుగో చూడండి. పైన కిటికీలో కూర్చున్నాడు ఆయనే" అని పైకి వేలు చూపించాడు పిల్లాడు.

బచన్‌సింగుకు చాలా బాధకలిగింది. తన పొలంలో తను కాపలాకాస్తుండగానే పశువులు పడిమేస్తూంటే వాటిని చూసినప్పుడు తనకు కలిగినబాధే ఆయనకు యిప్పుడూ కలిగింది. మళ్లీ అతను ఆ కుర్రాడిని - "మరైతే గురుగ్రంథ సాహెబు పారాయణం జరుగుతోందా ఇక్కడ" అని అడిగాడు.

---

1 సిక్కుల మతగ్రంథమైన "గురుగ్రంథసాహెబు" ను పఠనంచేసే వ్యక్తి.

"ఏమిటీ? ప్రసాదమా, దాన్ని గురుపర్వంనాడు ఇస్తారుగా"

కుర్రాడుచెప్పిన సమాధానం అతనికి అర్థంకాలేదు.

పిల్లాడికి తను అడిగింది అర్థం అవనట్లు అతను గ్రహించాడు. అతనే స్వయంగా రెండు మూడు పర్యాయాలు గ్రంథిని కేకవేసి పిలిచాడు. భాయీజీ చాలా నిర్లక్ష్యంగా కిటికీలోంచి తల బయటకుపెట్టి చూశాడు. కింద జమీందారు జీవాసింగు కుమారుడు నిలబడి వుండడంచూసి గబగబ పరుగెత్తుకుంటూ దిగివచ్చాడు. దిగిరాగానే తీగెలా రెండడుగులు ముందుకు వంగిపోయి ఎంతో అప్యాయంగా 'రండి సర్దార్జీ, వాహే గురూజీ కాఖాల్సా! శ్రీ వాహేగురుజీకి ఫతహ్! తమరు ఇక్కడకాలుపెట్టి ఈ బీద కుటీరాన్ని పావనం చేశారు. పదండి, పైకివెళ్లి దర్శనం చేసుకుందురుకాని" అంటూ ఆహ్వానించాడు.

గ్రంథితో మాట్లాడడానికి అవకాశంకోసం బచన్‌సింగు ఎదురుచూస్తూన్నాడు. కాని "బీదకుటీరం" "కాలుపెట్టి" ఈ రెండు పదాలు విన్న తర్వాత తిరిగి వెళ్లిపోదామని పించింది. మళ్ళీ ఏమనుకున్నాడో భాయీజీవెంట పైకి ఎక్కివెళ్ళాడు.

భాయీజీ ఎత్తు ఆరు ఆరుంబావు అడుగులుంటుంది. అతన్ని చూస్తుంటే అతను తీసుకునే ఆహారం అంతా మాంసకండరాల్లోకి వెళ్లకుండా ఎముకల గూడులోకే సరాసరి వెళ్లివాటినే బాగా పెంచుతున్నట్లు కనపడుతుంది. ఇక బుగ్గలు సొట్టలూ, గుంటలో ఓచిన్న బంతిని పెట్టొచ్చు. పొట్టగురించి చెప్పనే అక్కర్లేదు. పొత్తికడుపును కొంచెం ఒత్తితే వీపునవున్న వెన్నుపూసకు అతుక్కుంటుంది. కిందదవడైతే ఒక్కపన్ను కూడా లేక సంరక్షించే దిక్కులేని గురుద్వారాలాగా బోసిగావుంది. దవడ పైభాగంలో మాత్రం రెండువైపులా కలిపి మొత్తం నాలుగుపళ్లు కోరల్లాగ వున్నాయి. ఈ యావత్ప్రపంచమూ వరాహంయొక్క రెండు కోరలమీద నిలబడివుందని అంటారు. కాని గ్రంథిగార్ని చూస్తుంటే ఇంత ఎత్తుగావున్న ఆమహాకాయం దేనిమీద నిలబడి వుందో గుర్తించడం కష్టమే.

బొడ్డు పొట్టలోంచి బొటనవ్రేలు ప్రమాణంలో బయటకు పొడుచుకు వచ్చింది. బక్కచిక్కిన ఆయన పొట్ట చూస్తూంటే వెడల్పాటి పళ్లెంమీద మసిగుడ్డ పరచినట్లనిపిస్తుంది. చెవిరంధ్రాలు బాగా పెద్దవయ్యాయి. ఒక్కొక్క రంధ్రంలోంచీ ఒక్కొక్క ముల్లంగి దుంపను సులభంగా దూర్చవచ్చు. వెదురుబొంగుల్లాగా వున్న అతని కాళ్లను చూస్తుంటే వర్తకుని విషయంలోనే కాక ఈతని విషయంలో కూడా సృష్టికర్త రెండోసారి తప్పు చేసినట్లు అనిపిస్తుంది. భాయీజీ శరీరనిర్మాణం పనిని ప్రకృతీమాత ఠోజుకూలీకి బదులు కంట్రాక్టరుకు అప్పచెప్పినట్లుంది.

భాయీజీ రోజూ తలకింద పెట్టుకొని పండుకునే తలగడలోకి అతని తలలోని మురికి అంతా పాకి చీకిపోయిన గోనెసంచి గుడ్డలా వుంది. లోపలికి వెళ్లగానే భాయీజీ వెంటనే మంచంమీద వున్న తలగడను దానికింద దాచి ఓచినిగిన బొంతను రెండుగా మడచి మంచంపై పరచాడు. పై పెదిమను ముందుకుసాచి బయటికివచ్చిన పళ్లను దాచుకుంటానికి ప్రయత్నిస్తూ "రాండి సర్దార్జీ, దయచేయండి. ఇది మీ గృహమే అనుకోండి. తమరి దర్శనమేకాదు, ఇవ్వాళ భగవంతుడే చీమ గూటికి అతిథిగా వచ్చినట్లుంది" తని మర్యాదచేసాడు.

"అంతా తమ కటాక్షం" అంటూ బచన్‌సింగు గది నాలుగువైపులూ కలియ చూశాడు. గురు గ్రంథసాహెబును[1] ఎక్కడ ప్రదర్శిస్తున్నారు? అని ప్రశ్నించాడు భాయీజీని.

"ఏం చెప్పను సర్దార్జీ" గురుద్వారాలోకి ఎవరైనా పొరపాటున కూడా తొంగిచూడరు కదా" కొంచెం ఆలోచించి, "క్రిందనే ప్రదర్శిస్తుంటాం. ఇవ్వాళ ఆరోగ్యం బాగా లేదు. అందుచేత బయటికి తీయలేదు" అని సమాధానం చెప్పుకున్నాడు.

భాయీజీ చెప్పిన సమాధానం గుడ్డిగా నమ్మడానికి మూర్ఖుడూకాదు, అమాయకుడూ కాదు. ఇతను భట్రాజు పొగడ్తలు చేయడాన్ని గమనించాడు. సత్యాన్ని అతని నోటనే వెళ్లగక్కించాలనే వుద్దేశ్యంతో "కిందకు వెళ్దాం పదండి. మీకు శ్రమేఅనుకోండి. క్రిందకు వెళ్ళి తలుపు తెరుద్దాం. గ్రామానికి వచ్చి యిన్ని రోజులైనా ఒక్క రోజు కూడా గ్రంథసాహెబు పారాయణం చేయడానికి కుదరడంలేదు" అని కదిలించాడు,

భాయీజీ వదిలిన బాణం లక్ష్యాన్ని ఛేదించలేక పోయింది. విధిలేక కిందకుదిగాడు. ఐదారు నిముషాలు వెతికితే తాళంచెవి దొరికింది. తీరా తాళంలోకి చెవిని పెట్టి ఎంత తిప్పినా తాళం తెరుచుకోడంలేదు.

"కొంపతీసి వేరే తాళం చెవిని తేలేదుగా" విసుక్కుంటూ బచన్‌సింగు అన్నాడు.

"ఇక్కడే వుండండి. తాళంచెవి పొరపాటున మారిందేమో" అని ఎముకల గూడును వూపుకుంటూ పైకి వెళ్ళి నూనెదీపంలో ఆ తాళం చెవిని ముంచి మళ్ళీ క్రిందకు దిగాడు. తాళంకప్ప తెరుచుకుంది. తలుపు తెరుస్తూ—

---

1. సిక్కు మతగురువులు చెప్పిన సూక్తుల సంగ్రహం. సిక్కు మత గ్రంథము.

"అదీ సంగతి! తాళం ఎందుకురావడం లేదా అనుకున్నా. అసలు చెవేమో అలమారీలో వుండిపోయింది. నేనేమో పైగ్గది తాళం చెవిని తెచ్చేసాను" అని సర్ది చెప్పాడు.

ఎలాగైతేనేం గురుద్వారాలోనికి ఇద్దరూ వెళ్లారు. ఆ లోపలి పరిస్థితి చూడగానే బచన్‌సింగూ, భాయీజీ యిద్దరు కంపించడం మొదలెట్టారు— బచన్‌సింగు క్రోధంతోనూ, భాయీజీ తన బండారం బయటపడిపోయిందన్న భయంతోనూ.

తర్వాత గురుద్వారా సంరక్షణ విషయం గురించి భాయీజీకి ఎన్నో చీవాట్లు పెట్టి ఆఖరుమాటగా చెప్పివెళ్లాడు బచన్‌సింగు.

---

# [ 11 ]

భాయీజీని చూడగానే సత్‌శ్రీ ఆకాల్ అని సంబోధిస్తూనే "ఏమండీ గ్రంథీగారూ, ఈ మధ్య మీ వ్యవహారం మహాజోరుగా వుందే" అన్నాడు పాలాసింగు.

భాయీజీ గురుద్వారా ముందున్న వాకిలిని వూడుస్తున్నాడు. చీపురు నిలబెట్టి దుమ్ము కొట్టిన చేతుల్ని చొక్కాకు పూసుకుంటూ "ఏమి చెప్పను మహాశయా, సర్దార్ జీవాసింగువాళ్ల అబ్బాయి బచన్‌సింగులేడూ- ఈ మధ్య నాకీ వెట్టిచాకిరి తగిలించాడు. పట్టణం నుంచి వచ్చినప్పటి నుండి నా ప్రాణాలను తోడేస్తున్నాడనుకో, నాకసలే భయం. ఏమీ మాట్లాడలేను. ఏం చెప్ప మంటావ్? వున్నవాడు ఏదన్నా చెల్లుతుంది" అని తన అక్కసంతా వెళ్లబోశాడు.

పాలాసింగు ఆ గ్రామంలో పేరుమోసిన రౌడీ. అతని అనుచరులు పాలాసింగును "పీరు"గా భావించి పూజిస్తారు. అతనికి తల్లీతండ్రీ ఎవరూలేరు. వాళ్లిద్దరు కన్ను మూయగానే వున్న కొద్దిపాటి పొలాన్నీ తాగుడూ తిరుగుళ్ళలో తగలేశాడు. అతను మొదటి ఒకటోరకం కేడీ. అతనంటే గ్రామస్తులందరికీ మహాభయం. గ్రామంలో దెబ్బలాటజరిగినా, కొట్లాటజరిగినా అతని మద్దతు అడిగిందే తడవుగా పాలాసింగు తన ముఠాతో హాజరవుతాడు.

అయితే పాలాసింగులో ఒక సుగుణం వుంది. అతను ఏది లూటీచేసినా అన్యాక్రాంతంగా సంపాదించినా తాను ఒక్కడే అనుభవించడు. తనకువున్న దానిలో పది మందినీ పిలిచి పంచిపెడతాడు. ప్రతి పదిహేనురోజుల కొకసారి అతను దొంగతనానికి వెళ్లేముందు గురుద్వారాలోకి వచ్చి మొక్కుకొని మరీ వెళ్తాడు. ఆ కారణంగా భాయీజీకి పాలాసింగంటే ఇష్టం. తన పనిలో బాగా లాభించిందంటే పాలాసింగు దేగిశాల నిండా ప్రసాదం వండించి పంచిపెడ్తాడు. ఇదేకాక ఎడతెరపిలేకుండా 1 టండాయి, 2 లంగరు తన ఖర్చుతోనే ఇస్తాడు.

కొన్ని రోజుల క్రితం పాలాసింగు జందిపోటుకు వెళ్ళి తిరిగి వచ్చాడు. ఈ పర్యాయం అతనికి బేరం బాగా లాభించింది.

---

1. బాదం, పిస్తా మొదలైన దినుసులతో రుబ్బి తయారుచేసిన ఓ రకమైన షర్బతు.
2. అన్నదానంచేసే సత్రం.

పాలాసింగుకు జీవాసింగంటే చెప్పలేనంత ఈర్ష్య. ఆపేరు వింటేనే మండిపడ తాడు పాలాసింగు. ఆయన ఎదురవుతే పళ్లు పటపటమని కొరుకుతాడు. జీవాసింగు మీద పగ తీర్చుకోడానికి తగిన అదనుకోసం వెతుకుతున్నాడు అతను. మొత్తం గ్రామంలో జీవాసింగు ఒక్కడే అతనికి వ్యతిరేకి. పైగా ఒక పర్యాయం జీవాసింగు అతని దూర్మార్గాల్ని అధికారులముందు బయటపెట్టి అతని పరువు పీకిపారేశాడు. జీవా సింగువల్ల అతనికి ఎప్పుడైనా అపాయం కలగవచ్చు. అతని కొడుకు బచన్‌సింగు అన్నా అతనికి పడదు. ఇప్పుడు తన ప్రాభవానికి బచన్‌సింగు కూడా అడ్డుతగలడం ప్రారంభించాడు.

"మీకు పాఠాలు నేర్పడానికి ఆ అర్భకుడికి ఎంత సాహసం? మిమ్మల్ని ఏరొం పిలో దింపాడో చెప్పండి, నేను వాడి పని పడ్తాను" అంటూ ముందుకొచ్చాడు పాలా సింగు.

"ఏమి చెప్పమంటావ్, ఆసంగతే అడగొద్దు. కొత్తగా చదువుకొని వచ్చాడుగా, ఏమాట మాట్లాడినా తలకిందులుగా మాట్లాడతాడు. రోజూ వుదయాన్నే లేచి గురుగ్రంథ సాహెబు పఠనం చెయ్యాలట. రెండుపూటలూ శుభ్రంగా ఉడ్చాలట. సాయంత్రం [1]రహరాస్ పారాయణం చెయ్యాలట. ఇదయ్యా సంగతి".

పాలాసింగుకు వళ్లుమండింది. కళ్లెగరేస్తూ "వాడికి బుర్ర పనిచేస్తున్నట్టులేదే. అమృత్‌సర్ అనుకున్నాడా ఏం మనవూరిని? పొలం పనులు మానుకొని రోజూ గురుద్వారాకు ఎవరు వెళ్తారనుకుంటున్నాడు?"

"ఏ అమావాస్యకో, పున్నానికో ఓగంటో అరగంటో వెళ్లడం సబబు. అయినా భాయీజీ, నేనంటే మీకు కోపం వస్తుంది కానీ, మీరు మరీ మెత్తగా వుంటారు. జీవాసింగు మీకేమైనా జీతం ఇచ్చి పోషిస్తున్నాడా చెప్పండి ఆయన చెప్పినట్లు చేయ డానికి?"

పాలాసింగు తన్ను సమర్థిస్తూ పలికే సరికి, భాయీజీకి భయంపోయింది. ధైర్యం తెచ్చుకొని ఏకరువు పెట్టాడు— "లక్షలు విలువచేసే మాట చెప్పావు. నీ భార్యా బిడ్డలు పదికాలాలు చల్లగావుండాలి". కుర్రకుంక కదూ. అతనికి ఎవరు నచ్చచెప్ప గలరు? ఇక నేనంటారా — ఉన్నానుగా పాపాలభైరవుణ్ణి. అందరికి నేనే లోకువ. ఏం చెయ్యగలం? నాలుగువేళ్లూ లోపలికి వెళ్లాలి కదా! ఎవరిమాటైనా కాదంటే పొగరుమోతంటూ ఆడిపోసుకుంటారు. వూరుకోడం కన్న ఉత్తమంలేదు. జరిగినంత

1. సాయంత్రం చేసే గురుగ్రంథ సాహెబు పారాయణం.

కాలం జరగనీండి. అదీకాక ఎన్ని పేచీల్లో తలదూరుస్తూ కూచుంటాం? ఇక్కడ ఒక్కడుకూడా ఓ ఎండిన రొట్టెముక్కైనా ఇవ్వడు కదా. ఏదో మీబోటి దాతల అనుగ్రహంవల్ల మా జీవితం యిలా వెళ్లిపోతూంది. ఎప్పుడైనా ఎవరైనా ఏకేసులోనో గెలుస్తే నెలకు ఒకటీ అరా తడవలు మా మొహాన నాలుగు పైసలు పడేస్తారు. లేక పోతే ఎవరొస్తారని రోజూ పెందలకాడే నిద్రపాడుచేసుకుని గురుద్వారా తెరిచి కూర్చో దానికి?"

"మీ మెత్తదనం చూసే ప్రతి ఆనామకుడూ మిమ్మల్ని లోకువ చేస్తాడు. ఇలా గైతే ఎలాచెప్పండి. మీరు కటువుగా సమాధానం చెప్పేయండి. ఏమిచేస్తాడో నేనూ చూస్తాను. నేనుండగా మీ వైపు కన్నెత్తి చూడడానికి ఎవడికంత ధైర్యం?" భాయీజీకి ధైర్యం చెప్పాడు పాలాసింగు.

పాలాసింగు మాటలకు భాయీజీలో నిద్రిస్తోన్న ఉద్రేకం మేలుకొంది. పౌరు షంగా "లేదు సర్దార్జీ, ఆయన మాటంటే నాకేంలక్ష్యం? రేపు నువ్వుకూడా అతనుచెప్పిన మాటలు నమ్మినన్నే నిందిస్తావని మాట్లాడక వూరుకుంటున్నాను. లేకపోతేనా ఆరోజే ఒక్క విదలింపుతో తేల్చుకునేవాణ్ణి. ఏమిటోనయ్యా. నాదా — నిద్రమొహం. నిషా పట్టించానంటే తెల్లారితేగాని తెలివిరాదు. దానికితోడు యీ మధ్య నాకు ఇంకోపితలాట కాన్ని కూడా తగిలించాడు."

"ఏమిటో"?

"భాయీజీ, పగలంతా ఖాళీగా కూర్చుని మంచం అరగొట్టకపోతే మన వూళ్లో పిల్ల లకు చదువు నేర్పగూడదా అన్నాడు"

పాలాసింగుకు కోపం తారస్థాయినందుకుంది. కోపంతో పెదవికొరుకుంటూ బచన్ సింగు మీద విరుచుక పడ్డాడు — "ఏం అక్కర్లేదు. చదువూ గిదువూ ఏమీవద్దు. చూస్తూనేవున్నాం పన్నెండుసంవత్సరాలు పుస్తకాలతో కుస్తీపట్టి ఆయన ఏం సాధించిం దీవి. ఎంత మంచి పిల్లాడు! గౌరవం యిచ్చి మాట్లాడేవాడు. స్కూళ్ళో చేరినప్ప ట్నుంచీ ఆ వున్న తెలివితేటలుకూడా నాశనమైనాయి. ఎలావున్నాడో చూడూ వాడూ వాడి వేషాలూనూ. జాటు వంశంలో పుట్టి బికారిలాగ ఏమిటా వేషం? ఖాల్సా కాలేజీలో చదువు బాగా చెప్తారంటారు. అన్నట్టు మీరు ఏమీటీ చెప్తున్నారు?"

"నేనేం ఆయనింట్లో వారాలు చేస్తున్నానా ఆయన చెప్పినదానికల్లా తల ఆడించ దానికి? చూడయ్యా, రోజంతా నేను ఆ పిల్లలకు చదువుచెప్తూ నా బుర్రపాడుచేసుకో లేను అని నిర్మొహమాటంగా చెప్పేశాను. నాకేమో మధ్యాహ్నం అవగానే నల్లమందూ

బంగూ పట్టించాలి. పోనీ ఆ తర్వాత చెబుదామంటే ప్రకృతి అనుష్ఠానాల్ని తీర్చు కొనే సైము అది. ఈ తలనొప్పి వ్యవహారాల్లో మునగడానికి నాకిక తీరికెక్కడ ?

నల్లమందు పదాన్ని ఒత్తిపలుకుతూ పాలాసింగు మొదలెట్టాడు — "ఈ మధ్య మీరు ఒంటరిగానే పట్టిస్తూన్నట్లుంది. భాయీజీ యింట్లో మళ్ళీ తీర్థం సేవించుదాం అంటూ పొద్దున్నుంచి ధ్యానసింగూ, నారాయణసింగూ నావెంట పడ్డారు !"

"ఏదీ, బంగుపట్టించికూడా చాలా రోజులైంది. ఏవేళ ఆ బచన్‌సింగు ఊడి పడ్తాడో అని యీమధ్య బొత్తిగా ముట్టుకోడంలేదనుకో."

"మళ్ళీ అదే అంటారు. ఆ అర్భకుడి గురించిమీరు పట్టించుకోవద్దు అని చెప్పానుగా. నేను వాడి విషయం తేల్చుకుంటాను. ఇవ్వాళమీరు కొంచెంభంగు తయారు చేయాలి"

"సరే. అయితే పాతలోటు కూడా తీర్చుకుందాం. వస్తావుకదా ?"

"తప్పకుండా"

"అలా అయితే త్వరగా రావాలిమరి - చీకటిపడేలోగానె వాళ్లకూడా వస్తున్నారు కదూ ?"

"అవును. వాళ్ళునన్ను ఒదిలిపెట్టరుకదా?"

"అలాగే కానివ్వు"

"మరివస్తా. వాహే గురూజీకి ఫతహ్" అంటూ పాలాసింగు వెళ్లిపోయాడు. వూడుస్తూన్న చీపురును అక్కడే వదిలేసి భాయీజీ భంగు తయారుచేసే పనిలో మునిగి పోయాడు. పొద్దున్నే రెండుమూడు చిటికెలు గంజితో భాయీజీ పట్టించాడు. నిషా కూడా బాగానే ఎక్కింది. కాని వాములుమింగే స్వాములకు పచ్చగడ్డి ఫలహారమా ! మోకాళ్ళపై చేతులు ఆనించి వుండలు మింగుతూంటే వచ్చే అమజా చిటికెల్లో ఎక్కడుంటుంది ?

# [ 12 ]

అపరాహ్నం. సుమారు మూడు గంటలు. గురుద్వారా పైగదిలో భాయిజీ, అతని ముఠా కూర్చొనివున్నారు. భాయీజీ ఒకపక్కగా కూర్చొని చాలా తాపీగా కచ్రమ శుభ్రంచేస్తున్నాడు. బచన్‌సింగు ఎక్కడచూస్తాడో, అతనినోట ఏమి వినాల్సివస్తుందో అన్న భయంతో భాయీజీ దాన్ని శుభ్రం చేయాలన్న విషయంకూడా ఇన్నాళ్ళూ మరిచాడు.

పైన కప్పుకున్న దుప్పటి కొంగులోంచి ఓబెల్లంముక్కతీసి పక్కగావుంచుతూ పాలాసింగు భాయీజీని కాస్త త్వరగా తెమల్చమని చెప్పాడు.

"ఇదిగో అయిపోయింది. నువ్వు కొంచెం బెల్లాన్ని పాత్రలో కలుపుతూండు, నేనిప్పుడేవెళ్లి బంగు తీసుకొచ్చేస్తాను."

ముఠాలోంచి ఓ యువకుడు లేచి బెల్లం కలపసాగాడు. రెండోవ్యక్తి నల్లమందును నీళ్ళతో కడగడం ప్రారంభించాడు. భాయీజీ తడిగావున్న చేతుల్ని చొక్కాతో తుడుచుకొని బజారు వెళ్లడానికి సిద్ధంకాగానే పాలాసింగు దుప్పటికొనలో ముడివిప్పి పావలా బిళ్ల ఇస్తూ చెప్పాడు — "బాగాచేసి ఇమ్మనిచెప్పండి. రెండణాలు బంగాకూ, రెండణాలు బాదామూ".

"బాదం తీసుకరానక్కర్లేదులెండి" అంటూ జేబులోంచి ఓ నలిగిన పొట్లంతీసి విప్పుతూ గోపాలసింగు చెప్పాడు. పొట్లంలో సుమారు మూడుపావుల బాదంగింజలు దాకా వున్నయ్.

"అలాగైతే ఆ నాల్గణాలకూ బంగే పట్టుకురాండి" అని పాలాసింగు భాయీజీని వుద్దేశించి అన్నాడు.

"సత్ బచన్" అని అంటూ భాయీజీ బజారుకు బయలుదేరాడు. ఈ జాటు బైతులకు రోజురోజుకి బుర్రమందగిస్తూందే అనుకుంటూ బజారు చేరుకున్నాడు. అక్కడ రెండణాల బంగుమాత్రమే కొన్నాడు. మిగిలిన రెండణాలూ చొక్కాజేబులో వేసుకొన్నాడు. బంగుతీసుకుని గురుద్వారా చేరుకునేసరికి పాలాసింగుముఠా బాదంకాయలు పగలకొడ్తూంది.

"భాయీజీ, మీరక్కడే కూర్చోండి. ఆ పొట్లం ఇలా ఇవ్వండి" అని దేవాసింగు భాయీజీవైపు చెయ్యిసాచాడు.

చొక్కా జేబులోంచి పొట్లంతీసి దేవాసింగుకు ఇస్తూ "పరుగెత్తుకొని వచ్చేసరికి నాతాతలు దిగొచ్చారు" అంటూ లేనిపోని ఆయాసాన్ని అభినయించసాగాడు భాయీజీ.

భాయీజీ మాటలకు అక్కడివాళ్లు ముసిముసిగా నవ్వుకున్నారు పొద్దున్న పట్టిచ్చిన బంగునిషా ఇంకా దిగినట్లులేదని అనుకుంటున్నారు వాళ్లల్లోవాళ్లు. పొట్లం తీస్తుండగా బంగుఅంతా భాయీజీ జేబులోనే వుండిపోయింది. ఒట్టికాగితం మాత్రమే దేవాసింగు చేతిలోకి వచ్చింది. కాగితానికి అంటుకున్న కొద్దిపాటి బంగు పొట్లం వూడిపోయిన కారణంగా నేలమీద చెల్లాచెదురుగా పడిపోయింది.

తనుచేసిన పనికి వాళ్లు నవ్వుతూంటే భాయీజీ సిగ్గుపడ్డాడు. జేబులోంచి బంగుతీసి కల్వంలోవేస్తూ "చూడండి. ఈ తెలివి తక్కువ వ్యాపారదద్దమ్మలకు సరిగ్గా పొట్లం కట్టడం కూడా చేతకాదు. పుట్టీపుట్టగానే దుకాణాల మీద వచ్చి కూర్చుంటారు" అన్నాడు వేళాకోళంగా.

భాయీజీ చుట్టూ మిత్రులందరు కూర్చున్నారు. ఒకరు మార్చి ఒకరు నూరడం మొదలెట్టారు. బంగు బాగా నలిగి మెత్తగా అవడానికి సుమారు ముప్పావు గంట పట్టింది. "ఇంక చాలు. రాత్రంతా నూరుతూ కూర్చుంటారా ఏమిటి!" అని లక్కాసింగు అన్నాడు.

వాళ్లకు దగ్గిరే కూర్చుని భాయీజీ గ్లాసు కడుగుతున్నాడు. గిన్నెలో కొద్దిగా నెయ్యి అంటుకుని వుండడం చూసి వేళ్లతో దాన్ని గోకి కాళ్లకు రాసుకుంటూ—

"అప్పుడే నూరడం ఆపేయకండి. రెండు మూడు సార్లు నూరండి. వెనకటికి పెద్దలేమన్నారంటే—

"సుక్కా ఘోటన్‌సైన్‌మే, జేతా కరో విలంబ్
తేతాహీ బహుగున్ కరే, కహే శివశంభూ ఆప్"—

(కల్వంలో బంగు ఎంతనలిగితే అంతమజా వుంటుందని శివశంభూ చెప్పాడు.)

నిర్మలా మార్గానికి చెందిన ఓ బైరాగి కూడా ఆరోజు గురుద్వారాకు వచ్చి ఆ ముఠాకి కొంచెం దూరంగా భావరసామృతం టీకా తాత్పర్య సహితంగా చదువుతూ కూర్చున్నాడు. భాయీజీ చదివిన పద్యాన్ని వినగానే పుస్తకం మూసి వాళ్లవైపు తిరుగుతూ "భాయీజీ మీరేమీ అనుకోకపోతే ఓమాటచెప్తాను. చూడ్డానికి మీరు కవిపుంగవుల్లా కనబడుతున్నారు, కాని ఇప్పుడు చదివిన పద్యంలో ప్రాసకుదరలేదు" అన్నాడు నమ్రతగా.

సాధువు మాటలకు భాయీజీ ఇరకాటంలో పడ్డాడు. అయినా తన గొప్పతనాన్ని చాటుకుంటూ -

"మహాత్మా, దీన్ని సిర్ఖండీ వృత్తం అంటారు. పెద్ద పెద్ద కవులంతా ఈవృత్తం లోనే కావ్యసాధన చేశారు. చూడండి ఓ మహాకవి ఏమని చెప్పాడంటే-

"ముఖ్‌పర్ గంగ్ సహాయ్, విశ్వనాథ్ కైలాస్‌పత్
జోవు భజేసుఖ్ పాయే, చిత్ సేల్ ధ్యాన్ ధర్"

(కాశీనాధుడు కైలాసపతి
ముఖమండలంపై గంగమ్మ తల్లి
చిత్తాన్ని అవధరించి మనస్పుతో
ఎవరు భరిస్తారో, సుఖాన్ని పొందుతారు.)

భాయీజీ చెప్పిన కవిత్వం అక్కడి ముఠాకు అర్ధంకాలేదు. కాని సాధూ మహారాజ్ మాత్రం వుండబట్టలేక పోయాడు. నవ్వుతూనే ఆయన "భాయీజీ, ఇది సోరతా. మీరేదీన్ని రాసినట్లుంది. ముఖ మండలంపై గంగమ్మ తల్లి" అన్న పదం వుంది చూశారూ. అబ్బ! ఎంత మంచి అలంకారాన్ని చొప్పించారండీ. నాకు తెలీక అడుగుతానూ, గంగాదేవి శివుని శిరస్సు నుండి పుట్టిందా, లేక మీరు సెలవిచ్చినట్లు అతని ముఖంలోంచా?"

ఈ దద్దమ్మల్లో కూడా ఓ జ్ఞాని కూర్చుని వున్నాడనే విషయం గమనించకుండానే భాయీజీ చటుక్కున తన కవితా ప్రతిభను వెలిగిద్దామనుకున్నాడు. తీరా తన మిడిమిడి జ్ఞానం బట్టబయలు అయేసరికి ఎలా తప్పించుకోవటమా అని ఆలోచనలో పడ్డాడు. ఇప్పుడు గౌరవంగా బతికి బయటపడటంఎలా? పాదాలు గీరుకుంటూ, "మహాత్మా సిర్ఖండీ... సోరతా... అదే... రెండూ ఒకటే. కేవలం పేర్లే వేరువేరుగా వున్నాయి.అంతే—" అంటూ సమర్థించుకున్నాడు.

భాయీజీ తన అజ్ఞానం కప్పుకోవడానికి తంటాలు పడ్తూండటం చూసి నిర్మలా సాధువుకు సానుభూతివేసింది. "అవును పండితోత్తమా. నేను గ్రహించాను. రెంటి లక్షణాలూ మాత్రలూ ఒకటేగా. తమరు పెద్ద కవిశేఖరులాయే" అని నర్మగర్భితంగా అన్నాడు... ...

సాధూ అన్న నర్మోక్తులు పాలాసింగ్ ముఠాకు అర్ధంకాక తర్కంలో భాయీజీయే గెలిచాడని వారంతా కరతాళ ధ్వనులు చేసి తమ హర్షం ప్రకటించారు.

అర్ధగంట గడిచింది. కల్వానికి అంటుకున్న భంగును గోకితీస్తూ "భాయీజీ, ఇంక చాలా? ఇంకా ఎంతసేపు నూరాలి?" అని పారాసింగు అడిగాడు.

"ఇంక చాలు. ఆపండి" అంటూ చిలక్కొయ్య నుండి అంగవస్త్రం తీసి వాళ్ల దగ్గరకొచ్చి కూర్చున్నాడు భాయీజీ. అతను కూర్చుంటుంటే వెదురు కర్రల్లాంటి అతని కాళ్ల కీళ్ళు టకటక మని శబ్దం చేశాయి. ఎవరో టపాకాయ కాల్చినంత శబ్దం అయింది. పళ్ళెంలో బెల్లం ముక్కల్ని వేలి మొనలతో చిదుపుతూ పాలాసింగు "అవును భాయీజీ, ఈ రోజు రెండు రకాల భంగు తయారు చేయండి. ఒకరకం పక్కా సిపాయీలకూ, రెండోది కొత్తగా చేరిన సిపాయీలకూ. వీరు చూడండి. సర్దార్ గండాసింగు గారి అల్లుడుగారు. ప్రప్రథమంగా మొన్నే అత్తారింటికి వచ్చారు. కొంచెం చూసి ఇవ్వండి. ఎక్కువా తక్కువా ఐతే మళ్ళీ అత్తారింటి మొఖమే చూడ రేమో! అదిగో వారిద్దరు మన బృందంలో కొత్తగా చేరారు. ఆయన వసావాసింగూ, ఈయన మానసింగూ."

"సత్ బచన్" అంటూ వారి ముగ్గురిని పరిశీలనగా చూసి భాయిజీ తన పనిలో మునిగిపోయాడు. కొంచెం సేపటిలో అంతా సిద్ధమయింది.

గండాసింగు అల్లుడు ప్రతాపసింగు వుండేది పట్నంలోనే అయినా చదువూ సంధ్యా అంతగాలేదు. కాని కాలరూ నెక్ టైలో అతన్ని చూసిన వారికి కనీసం బి. ఏ గానీ, ఎం.ఏ గాని చదివి వుంటాడన్న అనుమానం కలుగక మానదు. పాపం అతను ఇంతకు ముందు ఎప్పుడూ భంగూ తాగి ఎరగడు. ఇవ్వాళ తాగుబోతుల మధ్య చిక్కుకున్నాడు. ఏమిటిచేయడం? ఆ భగవంతుడే తన్ను కాపాడాలని మనస్సులోనే స్మరించుకున్నాడతను.

అందరూ వరుసగా తమతమ వంతును పట్టిస్తున్నారు. ప్రతాపసింగు వంతువస్తోంది. వాళ్లందరిముందూ తన చిన్నతనాన్ని కప్పిపెట్టుకోటానికని లేని ఉత్సాహంతో భాయిజీ వెనుకగా కూర్చున్న అతను భాయిజీ వీపును వేలితో పొడుస్తూ "భాయిజీ, కొంచెంబాగా తగిలించండి" అన్నాడు.

ప్రతాపసింగు మాటల్లోని మర్మాన్ని భాయీజీ గ్రహించలేక పోయాడు. పైగా అట్టి గూఢార్థాలకు భాయిజీ చాలాదూరం. అతడు వ్యంగ్యార్థాన్ని గ్రహించకుండా ఎక్కువగా పొయ్యమని అంటున్నాడని అనుకున్నాడు. అదీకాక భంగు తాగేవాళ్లకు ఓ దురలవాటుంది. భంగుతాగేటప్పుడు నాకు బాగా తగిలించండి. నేను తాగి తట్టుకోగలను అని ఎవరైనా బీరాలు కొట్టారంటే బాగా ఘాటుగా తగిలించి వాడి పొగరు అణిగిస్తేగాని వాళ్లకు తృప్తి వుండదు. వాడికి గర్వభంగం కావలసిందే.

ప్రతాపసింగు విషయంలో కూడా అదే జరిగింది. కప్పుకు బదులు ఓ పెద్ద గ్లాసులో బాగా చిక్కగా కలిపి గ్లాసునిండా ఇచ్చాడు.

"కొంచెం తగ్గించండి అంతవద్దు" అని ప్రతాపసింగు అంటూనే వున్నాడు. భాయీజీ అతని మాటల్ని లక్ష్యపెట్టక ఓగుక్క మాత్రం తగ్గించి గ్లాసును ప్రతాపసింగుకు అందిచ్చాడు. పదిమందిలో పరువుపోతుందనీ భయంకొద్దీ ప్రతాపసింగు ఎలాగో తాగేసాడు. అయినా ఇంకో నాల్గోవంతు గ్లాసులో ఉండనే వుండిపోయింది.

అందరికీ తీర్థం పంచిపెట్టిన తర్వాత మిగిలిన రెండుగ్లాసులూ భాయీజీ ఒక్కడే పట్టించాడు.

కొంతసేపటివరకూ అక్కడి ముచ్చట్లూ ఇక్కడ ముచ్చట్లూ చెప్పుకున్నారు. అకస్మాత్తుగా తల నిమురుకుంటూ ఉజాగర్‌సింగు "ఆహా, భాయీజీ, ఇవ్వాళ వూపులు ఎంతబాగా వస్తున్నాయో. స్వర్గంలో వుయ్యాల ఊగుతున్నట్లుంది. నాలుగువైపులా పూలతోటలు పండివున్నాయి. ..." వాగుడు ప్రారంభించాడు.

ఉజాగర్‌సింగు అన్న మాటలు విని ఇందర్‌సింగు నోరు వెడల్పూ, కళ్ళు చిన్నవీ చేస్తూ "ఏమన్నావ్? పూలతోటలు పండివున్నాయా? ఇంతవయస్సువచ్చినా నువ్వు పిడకలు చేయడానికి తప్ప మరి దేనికి పనికిరావు. ఓరేయ్! పేడముఖం, పూలతోటలు పూస్తాయా? లేక పండుతాయా? పండేది కాయగూరలురా" అంటూ ఎగతాళిచేసాడు.

ఖాన్‌సింగు కళ్ళు, నిషా ఎక్కుతూంటే మరీచిన్నవైపోతున్నాయి. బొటనవేలు చూపుడువేలూ చేర్చి కంటిని బలవంతంగా పెద్దదిగాచేస్తూ పాలాసింగువైపుచూసి అన్నాడు. "అరే పాలాసింగూ, నువ్వేంటి మరీ అంతతొందరగా గుర్రం ఎక్కేస్తున్నావ్. నువ్వు పాటసరుకేగా. తాగీతాగడంతోనే నీకళ్ల చిన్నవైపోతున్నాయేటీ?"

నోటిలో వస్తోన్న తెమడను మింగుతూ "ఒరే ఖాన్‌సింగూ, నన్నంటున్నావ్ కాని, కొంచెం నీ సంగతి చూసుకో. నీకళ్లుకూడా మూసుకుపోతున్నాయి," అంటూనే పాలాసింగు వుయ్యాల వూగడం మొదలెట్టాడు.

"ఏమన్నావ్?" అని ఖాన్‌సింగ్ ఏవో మాట్లాడబోయాడు. కాని అతనిలోవున్న మత్తుపదార్థం నరనరాలకు వ్యాపిస్తూ అతని నోటిని కట్టేస్తోంది. కష్టంతో నిగ్రహించుకుని "అలాగా ఏమో, నాకేమీ తెలియడంలేదు" అని మాత్రం అనగలిగాడు.

"వాడు మాట్లాడేది కొంచెం విను. నీకళ్లే చెప్తున్నాయి."

"సరేలేరా. నీయిష్టం వచ్చింది అడుగు. నేను సరిగ్గా సమాధానం చెప్పలేకపోతే అప్పుడు అను. నీకే నమ్మకం కలుగుతుంది - నాకు మత్తు ఎక్కిందీ లేనిదీ".

"అదికూడా నిజమే" అన్నాడు పాలాసింగు. మళ్లీ ఏదో ఆలోచించి "సరేకాని కాలాసింగు కేసులో ఎవరు సాక్ష్యం ఇచ్చారు?" అని అడిగాడు.

ఏం సమాధానం చెప్తాడో అని పాలాసింగు ఖాన్‌సింగువైపు చూస్తూండగానే ఖాన్ సింగ్ కళ్లు మూతలుపడ్డాయి. తాను గెలిచానని చంకలు చరుస్తూండగానే అతని నర నరాల్లోకి జంగుప్రభావం పాకిపోయింది. తను ఏమడిగిందీ తనే మరచిపోయాడు. ఏమిటి చెప్మా అని తీవ్రంగా ఆలోచిస్తూండగా అసలు ప్రసంగంకూడా మరిచి పోయాడు. మరింత తీవ్రంగా ఆలోచిస్తూంటే ఎవరితో మాట్లాడుతున్నదీ కూడా మరిచాడు. ఎంతో ప్రయత్నంచేసిన తర్వాత ఏదో పోగొట్టుకున్న వస్తువు లభించి నట్లయింది. మళ్లీ ఎప్పుడు మరిచిపోతానో అన్న తొందరకొద్దీ "ఆఁ చెప్పు. ఎవరు సాక్ష్యం ఇచ్చారు?" అని రెట్టించాడు ఖాన్‌సింగుని.

ఖాన్‌సింగు మైకంలోంచి కొంచెంసేపు బయటపడ్డాడు. కాని ఏమి అడిగిందీ జ్ఞాపకంలేక 'ఏమన్నావ్?" అని పాలాసింగును తిరిగి ప్రశ్నించాడు.

కళ్ళనుబాగా పెద్దగాచేస్తూ "నేనేమీ అనలేదు" అని సమాధానం ఇచ్చాడు. మళ్లీ బలవంతంగా ఆలోచించడం మొదలెట్టి "ఆఁ, అన్నాను కదూ. ఆ లక్కావంగు ఎద్దుతో ఇంక దున్నొద్దు. రాత్రంతా బావిలోంచి నీళ్ళుమోసి అలసినట్లుగా వుంది".

పెదాలపై నాలుక తిప్పుతూ ఖాన్‌సింగు "అరెపోరా, నువ్వు అన్నది ఏంటంటే..." అంటూ ఏదో చెప్పబోయి ఏంచెప్పదలచుకున్నదీ మర్చిపోయాడు. మళ్ళీ జ్ఞాపకం చేసుకుంటూ "నువ్వేమన్నావంటే... ఆఁ దొరికింది... కాని వాడు నా దగ్గర బాకుగ క్రింద రెండు రూపాయలు..." అని కొంచెం ఆగి మళ్ళీ, "ఆఁ వెళ్ళిపోయింది" అంటూ నవ్వుతూ ముగించాడు.

పట్టిచేత్తో ముఖాన్ని తుడుచుకుంటూ "భాయీ మానసింగూ, ఇవ్వాళ నాకు బాగా ఎక్కినట్లుంది. ముందెప్పుడూ ఇంతగా లేదుసుమా" అన్నాడు.

అలా మాట్లాడుతుండగా పాలాసింగుకు ఏదైనా కొంచెం తినాలనిపించింది. ఆకలేస్తోంది. అంతకుముందు వారికి ఎదురుగా సుమారు శేరుబెల్లం వుండేది. అంతా తినేశారు. భాయీజీని చూస్తూ "భాయీజీ, ఏదైనా తింటానికి కొంచెంతేండి" అని పాలాసింగు అన్నాడు.

ముందే భాయీజీ మత్తులో బాగా తూలుతున్నాడు. మారుమాట్లాడకుండా వాళ్లదగ్గర రూపాయితీసుకుని బజారుకు బయల్దేరాడు. సందుమలుపు తిరిగాడో లేదో తాను బజారుకు ఎందుకు వెళ్తున్నదీ మరచిపోయాడు. కాస్తప్రయత్నంచేసేసరికి జ్ఞాపకంవచ్చింది.

మళ్ళీ ఎక్కడ మరచిపోతానేమోనని చరచరానడచి దుకాణానికి చేరుకున్నాడు. ఎనిమిది అణాలు బెల్లం జీళ్ళు తూయించి ఎలాగైతేనేం జాగ్రత్తగా ఇల్లుచేరుకున్నాడు. అప్పటికి కొత్తవాళ్లంతా పూర్తిగా ఒళ్ళు తెలీకుండా ఒరిగిపోయారు. పాతకాపుల్లో ఒకడు గురుద్వారా కప్పు చూస్తోంటే మరొకడు వెకిలిగా తనలోతానే నవ్వుకుంటున్నాడు. ఇంకొక సభ్యుడు బొమ్మలాగ కూర్చుండిపోతే నాలుగోవాడు ఎవర్నో పిలుస్తూ పిలుస్తూ అక్కడే తూలికుప్పలాగ కూలిపోయాడు.

నిద్రపోయినవాళ్ళు నిద్రపోగా మేల్కొన్న వాళ్లకుకూడా భాయీజీ తెచ్చిన జీళ్ల చాలలేదు. భూతాలమాదిరిగా వాళ్ళు జీళ్లపై విరుచుకు పడ్డారు. పాలాసింగు మరోరూపాయి తీసిచ్చాడు భాయీజీకి. మామూలుగా అయితే భాయీజీ బజారుకెళ్లడానికి నిరాకరించేవాడే. కాని ఇందాక తెచ్చిన జీళ్లల్లో ఒక్కటి కూడా తనకు దక్కలేదు. అదీకాక ఈ రూపాయిలో ఎనిమిదణాలు కమీషన్ కూడా కొట్టేయొచ్చు. ఆ ఆశతోనే రూపాయి తీసుకుని భాయీజీ బజారుకు బయలుదేరాడు.

ఈ సారి తనను బజారు ఎందుకుపంపిస్తున్నారన్న విషయం ఎక్కడ మరుస్తానో అని చాలా జాగ్రత్తగా వల్లించుకుంటూ నడుస్తున్నాడు. మైకంలో దారికూడా మరవవచ్చు. ట్యూబు పెట్టుకుని ఈతనేర్చుకొనే వ్యక్తి అదిజారిపోతే మునిగిపోతానన్న భయంతో నీటిలో వున్నంతకాలం దాన్నే అంటిపెట్టుకుని వుంటాడు, అలాగా భాయీజీ కూడ జీళ్లను మననం చేసుకుంటూ నడుస్తున్నాడు.

తను జీళ్లు కట్టించుకొని వచ్చిన కండవా ఎక్కడవుందా అని భుజాలు తడిమి చూసుకున్నాడు. భుజంమీద వేసుకున్న కండువా కనపడలేదు. ఎక్కడ వదిలాను చెప్మా అనుకుంటూ మంచం క్రిందకు దూరి వెతకసాగాడు.

భాయీజీ చాలాసేపటివరకు జీళ్ళు లేకపోయేసరికి పాలాసింగుకు తానుజీళ్ళు తెమ్మనమని భాయీజీని బజారుకు పంపిన విషయం జ్ఞాపకంవచ్చింది. అతను కూడాలేచి బజారుకు వెళ్లాడు. కాని అతనూ తిరిగిరాలేదు.

ఈ వ్యవహారంలో నిర్మలా సాధు కొంచెం గడసరి. ఓ గంట అయిన తర్వాత అతనికి మైకం వదిలింది. జీళ్లు తెమ్మనమని ముగ్గుర్నిపంపితే ఎవరూ తిరిగి రాలేదన్న మాట జ్ఞాపకం వచ్చింది. పరోపకారం చేద్దామన్న భావం అతణ్ణి కూడా అక్కణ్ణుంచి లేపి బజారుకు ఈడ్చుకపోయింది.

దీపం వెలిగించేవేళ అయింది. సాధువు ఆ ముగ్గురికోసం ఎంతవెతికినా ఎవరూ కనపడలేదు, విసిగివేసారి గురుద్వారాకు తిరిగివచ్చేస్తున్నాడు. దారిలో ఒకచోట

మయ్యివుంది. దాని పక్కనే నీరు నిలవచేరి బురదమడుగుగా తయారైంది. తీరా చూస్తే ఆబురదలో పాలాసింగు బోర్లాపడివున్నాడు. అక్కడ చాలామంది జనం చేరి అతణ్ణి కొట్టివూపుతున్నారు. పాలాసింగు మాత్రం తన ధోరణిలో తానుమాట్లాడుక పోతున్నాడు. —

"ఓరేయ్ నాగుడ్డలకు నిప్పంటుకుందిరా, తగలబడిపోతున్నయ్, పొట్టను మాత్రం నీళ్ళుపోసి ఆర్పేశాను. వీపు తగలపడిపోతోంది. ఒక బొక్కెన నీళ్ళు చల్లండిరా వీపుమీద, ఒరేయ్ ... నేను చచ్చిపోతున్నాన్రోయ్, నేను కాలిపోతున్నాన్రోయ్ " అని పిచ్చిపిచ్చిగా వాగుతున్నాడు.

సాధువు అంతా చూశాడు. కిమ్మనకుండా గురుద్వారాకు వచ్చాడు. భాయీజీజాడ ఎక్కడా తెలియండంలేదు. మంచంమీద కాసేపు పడుకుందామని కూర్చోగానే కాలికి ఏదోవస్తువు తగిలింది. క్రిందికి వంగి చూశాడు. మంచం క్రింద భాయీజీ చుట్టగా చుట్టుకొని పడివున్నాడు. అతని గుప్పిట్లో రూపాయి బిళ్ళవుంది !

సాధువు క్రిందకు బాగావంగి భాయీజీని వూపాడు. బయటికి లాగాలని ప్రయత్నించాడు. అతను లాగేకొద్దీ భాయీజీ లోపలికి ముడుచుకుపోతూ "పట్టుకోండి అడుగో బచన్‌గాణ్ణి పట్టుకోండి. పాలాసింగ్, నువ్వు వాడి భరతం పడ్తానన్నావుగా !" అని వాగుతున్నాడు. సాధువు అలాగే అతన్ని చూస్తూ మోకాళ్ళ మీద కూర్చున్నాడు. "త్వరగా పట్టుకోండి. అదుగో నా గొంతు నులిమేస్తున్నాడు". థూ అని వుమ్మేసి "నన్ను చంపేస్తున్నాన్రోయ్. పరుగెత్తుకొనిరాండి. నానోరంతా ఇసుకతో నిండి పోతూంది. నా నోరుఎండిపోతూంది ! నా నోట్లోంచి ఇసుక తీయండరా" అంటూ ఒకటే వాగుడు.

అందరూ మైకంలో శవాల్లా పడివున్నారు. ఇక భాయీజీ పెడబొబ్బల్ని అరుపుల్ని ఎవరూవినేది !.

రాత్రి అవుతోంది. వాళ్లను ఏంచేసేటట్లు అని సాధువు ఆలోచించసాగాడు. ఒక్కొక్కరిదగ్గర కెళ్ళి వాళ్ళను తట్టి లేపాడు. మిగతా వాళ్లంతా తూలుతూ మూలుగుతూ ఎలాగోలేచి బయటకు వెళ్లారు. కాని ఎంత ప్రయత్నించినా ప్రతాపసింగు మాత్రం కొంచెంకూడా కదల్లేదు. సూటిగా అతని ముఖంలోకి చూశాడు సాధువు. అతనికి భయంవేసింది. గాభరాతో కమండలమూ, పులిచర్మమూ చేతిలోకి తీసుకొని బయల్దేరబోయాడు. కాని అంతలోకే మళ్ళీ ఆలోచించి ఈ పరిస్థితిలో వెళ్ళటం కూడ కష్టమే అనుకుని అక్కడే పడుకున్నాడు.

మర్నాడు బాగా పొద్దు ఎక్కిన తర్వాత నిర్మలా సాధువు లేచాడు. ఒళ్లు విరుచు కుంటూ నాలుగువైపులా కలియజూశాడు. భాయీజీ ఎక్కడా కనపడలేదు. అతనికి అంతా అగమ్యగోచరంగావుంది. రాత్రి జరిగిన సంఘటనను జ్ఞాపకం చేసుకొన్నాడు. భాయీజీని రాత్రి మంచంకింద మైకంలో పడివుండగా అతను స్వయంగా చూశాడు. తీరా ఇప్పుడు చూస్తే లేదు. భాయీజీయే కాక రాత్రి నేలమీద బోర్లగా ఓయువకుడు పడి వుండడం కూడా అతను చూశాడు. అతను కూడా ఇప్పుడు కనబడటంలేదు.

సాధువుకు అవన్నీ తలుచుకుంటూంటే తగని భయంవేసింది. చల్లగా అక్కడ్నుంచి జారుకున్నాడు. వూళ్లోంచి అరమైలు దూరం వెళ్లాడో లేదో బచన్‌సింగు తన వీపుమీద భాయీజీని వేసుకొని వెళ్తోండడం కనిపించింది. తను బచన్ కంటబడితే ఏం ప్రమాదం వస్తుందో అని మరోదారి పట్టాడు.

---

# [ 13 ]

పాలాసింగు అతని ముఠావాళ్లూ క్రితం రోజు గురుద్వారాలో బంగుతాగారన్న వార్త మెరుపు తీగెలా గ్రామంలో వ్యాపించింది. ఏయింట చూసినా ఏనోట విన్నా అదేచర్చ. భంగు తాగినవాళ్ల తాలూకు ఇళ్ళలో మాత్రం అందరు చప్పుడు చేయకుండా తేలుకుట్టిన దొంగల్లావున్నారు. కానీ గండాసింగు యింటిల్లిపాదీ గొల్లుమన్నారు. పెళ్ళయిన తర్వాత అల్లుడు మొదటిసారిగా వచ్చాడాయె. రాత్రినుండి మూసిన కన్ను తెరవలేదు. ఏం సంగతి అని బచన్‌సింగును గండాసింగు అడిగితే, గురుద్వారా వెళ్ళి మీ అల్లుడు భంగు తాగాడని బచన్ చెప్పాడు. రాత్రి గురుద్వారానుండి గండాసింగు అల్లుణ్ణి ఆ అప స్మారకంలో అతనే తన వీపుమీద వేసుకుని వాళ్ళకు అప్పగించి వెళ్లాడు. తాను గురు ద్వారాకు వెళ్ళినపుడు అక్కడ భాయీజీ కనపడలేదనీ, ఓ సాధువు ఆ మంచంపై పడుకొనివున్నాడనీ, వాళ్ళ అల్లుడు ప్రతాపసింగు మాత్రం మంచం క్రింద పడివున్నా డనీ, బచన్‌సింగు చెప్పాడు.

ప్రతాపసింగును స్పృహలోకి త్రవడానికి గండాసింగు కుటుంబంవాళ్ళు చాలాసేపు ప్రయత్నించారు. చెవుల్లో నూనె పోశారు. తలకు మాలిష్ చేయించారు. నోటిలో ఊర గాయ కారం వుంచారు. కాని ఏవస్తువుకూడా మింగుడు పడడంలేదు. పాలూనెయ్యి కలిపి నోట్లోపోశారు. అన్నీ బయటికొచ్చేశాయి.

కొంచెం సేపటికి ప్రతాపసింగు పరిస్థితి దిగజారడం. మొదలెట్టింది కళ్ళుతేలిపోయి, అతని మొహం అంతా నల్లబారిపోయింది. శరీరమంతా బిగుసుకుపోయింది. అందరూ ఖంగారుపడ్డారు. పక్కగ్రామంలో ప్రభుత్వంవారి ధర్మాసుపత్రి ఉంటే ఉదయాన్నే ఒక మనిషిపోయి డాక్టర్ని పిలుచుకొచ్చాడు. డాక్టరు ప్రతాపసింగును పరీక్షించి విష ప్రయోగం జరిగిందని తేల్చాడు. వెంటనే అతన్ని ఆసుపత్రిలో చేర్చారు. ప్రతాప్ సింగు పరిస్థితి బాగాలేదని విని పాలాసింగు ముఠాకు ముచ్చెమటలు పోశాయి. ఎటుపోయి ఎటువస్తుందోనని భయపడి పోతున్నారు. అందరికన్నా పాలాసింగుకు ఎక్కువ భయం పట్టుకుంది. కితంరోజు జరిగినదంతా పోలీసులకు తెలుస్తే ఆనేరంఅంతా తనమీద రుద్దు తారు. ముందే తను రెండు మూడు సంవత్సరాల నుంచి కే. డీ లిస్టులో వున్నాడు. పోలీసుశాఖ వారికి ఎన్నో దణ్ణాలు, డబ్బూ దస్కం సమర్పించుకొని ఆలిస్టులోంచి తన

పేరు తీసివేయించుకోడానికి తల ప్రాణం తోకకు వచ్చింది. అతను కూడా గండాసింగు ఇంటికి వెళ్ళివచ్చాడు. ప్రతాపసింగును చూసివచ్చిన తర్వాత నిజంగా అతని పైప్రాణాలు పైనే పోయినట్టయ్యాయి.

ఈఆపదలోంచి బయటపడడం ఎలాగా అని దీర్ఘంగా ఆలోచించాడు. అతనికోచిన్న వుపాయం తట్టింది. ఒక్కబాణంతో రెండు పిట్టల్ని కొట్టొచ్చు. వెంటనే పోలీసు స్టేషనుకు వెళ్లి జీవాసింగు కొడుకు బచన్‌సింగే నిన్న ప్రతాపసింగుకు భంగులో విషం కలిపి ఇచ్చాడని రిపోర్టుఇచ్చాడు.

మధ్యాహ్నం అయేసరికి పోలీసులు అక్కడకు చేరుకున్నారు. జీవాసింగు ఇంటి గుమ్మం దగ్గర ఒక కాన్‌స్టేబిలును కాపలావుంచి ఇనస్పెక్టరు ఎంక్వైరీ చేయడానికి గండాసింగు ఇంటికి వెళ్ళాడు.

ఒక హవల్దారు జీవాసింగు యిల్లు సోదాచేస్తుంటే మరో హవల్దారు గురుద్వారాలో తవిఖీకి దూరాడు. అతనితోబాటు చాలామంది గ్రామస్తులు గురుద్వారాలోకి వెళ్ళారు. బచన్‌సింగు, భాయీజీ తలకు మాలిష్ చేస్తూవుండడం, భాయీజి నిలబడలేక తూలిపో తూడడం అందరూ చూశారు.

పోలీసు బచన్‌సింగునూ, భాయీజీని కస్టడీలోకి తీసుకొన్నాక గురుద్వారా సోదాచేశారు. వారు ఏవస్తువుకోసం గాలిస్తున్నారో అది ఎక్కువ శ్రమలేకుండానే పోలీసులకు దొరికి పోయింది. ఓమూలగా అంగవస్త్రంచుట్టగా పడివుంది. దాన్ని విప్పితే బంగు వడ పోయగా గుడ్డలో మిగిలిన ఆకుపొట్టూ కనబడ్డాయి. బంగు వడపోసిన తర్వాత భాయీజీ దాన్ని అక్కడే వదిలేశాడు. తొందరపాటులో అతను అడుగున మిగిలిన ఆకుపొట్టూ విసిరిపారేయడం మరిచి పోయాడు. పరీక్షచేయడానికని పోలీసువాళ్ళు డాక్టర్ని పిలిపిం చారు. డాక్టరు ఆ ఆకును విదిలించిచూడగా దానిలోంచి అరిగిపోయిన రెండు రాగి నాణాలు క్రిందపడ్డాయి. రాగిపైసలు బాగా అరిగిపోయి సగం బరువుకూడా వున్నట్లు లేదు.

ఆ నాణాలనే రాత్రి బంగులోనలిపి దాన్ని ప్రతాపసింగుకు తాగించారన్న విషయం పోలీసుకూ, డాక్టరుకూ తెలిసిపోయింది. వెంటనే భాయీజీకి. బచన్‌సింగుకూ చేతులకు బేడీలువేసి స్టేషనుకు తీసుకపోయారు. బచన్‌సింగుని పోలీసువాళ్ళు పట్టుకుపోయారన్న వార్త వినగానే జీవాసింగు యింట్లోవాళ్ల గొల్లుమన్నారు.

జీవాసింగు ఇంటికి దగ్గరలోనే పాలాసింగూ అతని ముఠా కూర్చుని ఏం జరుగు తుందోనని చూస్తూవున్నారు. భంగు పట్టింది క్రితంరోజు అయినా వాళ్ళకు ఈరోజు

కూడా తల తిప్పుడు తగ్గనేలేదు. ఏకొంచెం బెసిగినా పట్టుపడిపోతామన్న భయంతో చాలా జాగ్రత్తగా వున్నారు వాళ్లు. అంగవస్త్రానికి అతుక్కున్న బంగులోంచి రాగి నాణాలు బయటపడటం చూసి వాళ్లకు మతిపోయింది.

నాణాన్ని ఎవరు దానిలోవేశారో వాళ్ళకు ఎంతమాత్రం అంతుచిక్కలేదు. ఎలా గైతేనేం తమను తప్పించుకోవడానికి బచన్‌సింగును ఇరికించడానికి వాళ్లకు మంచి అవకాశం దొరికింది.

పోలీసువారికికూడా బచన్‌సింగే అపరాధి అనడానికి చాలా ఆధారాలు దొరికాయి. అదీకాక బచన్‌సింగును నేరం జరిగిన స్థలంలోనే పోలీసులు పట్టుకున్నారు. ప్రతాపసింగు అత్తారింటి తరఫువాళ్ళు కూడా అతన్ని బచన్‌సింగే భుజాలమీద వేసుకొని రాత్రి తొమ్మిది గంటలకు తమ యింటికి తీసుకవచ్చి వదిలి వెళ్ళాడని పోలీసువాళ్ళకు చెప్పారు. ఈ రెంటికి తోడు, పాలాసింగు ముఠావాళ్లు పోలీసులకు బాగా లంచాన్ని తినిపించారు.

బచన్‌సింగు, భాయీజీలపై పోలీసులు కోర్టులో కేసు దాఖలుచేశారు. జీవాసింగు మంచానపడి కదల్లేకుండా వున్నాడు. అన్ని వ్యవహారాలు చూసుకోవడానికి, బచన్‌సింగు తరఫున వాదించడానికి ఓ వకీలును పెట్టాడు. ప్రాసిక్యూషన్‌వారు అభియోగాన్ని సమర్థించుకోడానికి కొంతమంది సాక్షుల్ని హాజరు పరిచారు. ప్రాసిక్యూషన్ సాక్షుల్లో పాలాసింగు ఉన్నాడు. అతను కోర్టులో ఈ విధంగా సాక్ష్యం చెప్పాడు—

"ఆ సంఘటన జరిగినరోజు నేను ఇంట్లోనే వున్నాను. సాయంత్రం అయిదు గంటలకు గురుద్వారాకేసి వెళ్లాను. అక్కడ బచన్‌సింగూ, ప్రతాపసింగూ ఇద్దరూ భంగు నూరడం చూశాను. భాయీజీ పారాయణంచేస్తూ వున్నారు. కాస్సేపు అక్కడ వుండి తిరిగి ఇంటికొచ్చేశాను. రాత్రి తొమ్మిది గంటలకు బచన్‌సింగును చూశాను. ప్రతాపసింగును భుజాలమీద వేసుకుని అతను వెళ్తున్నాడు. నేను చాలాసార్లుఅతన్ని కేకేసిపిలిచాను. కాని అతను వినిపించుకోకుండా వెళ్లిపోయాడు".

తర్వాత పాలాసింగు ముఠావాళ్ళుకూడా సాక్ష్యం ఇచ్చారు. ఆ సాక్ష్యాలసారాంశం ఇంచుమించూ పాలాసింగు ఇచ్చినదాన్నే పోలిఉంది.

ఇక భాయీజీని బోనులో ఎక్కించి అతని సాక్ష్యంకూడా తీసుకున్నారు. సాక్ష్యం ఎలా చెప్పాలో భాయీజీకి ముందుగానే నూరిపోశారు. వాటినే చిలకపలుకుల్లాగ భాయీజీ అక్కడ వల్లించాడు— "బచన్‌సింగే నన్ను భంగు నూరమని చెప్పాడు. భంగు తెమ్మనమని అతనే పావల నాకిచ్చాడు. నేనే రెండణాలది,... అంటూ భాయీజీ నీళ్ళు నమిలాడు.

కాస్సేపు దిక్కులు చూసిచూసి, "బంగుతెమ్మంటె తెచ్చాను. అంతే, ఇందులో నాదోషం ఏమీలేదు. మీరు ఏ ప్రమాణం చేయమన్నా చేస్తాను ' అన్నాడు.

బచన్‌సింగు వకీలు చాలా తెలివికలవాడు. క్రాసుపరీక్ష చేయడంలో మంచిదిట్ట. ఖాయీజీని ప్రశ్నలడగడం మొదలెట్టారు.

"మీరు బంగు ఎక్కడ కొన్నారు ?"

"దేవీ దయాళ్ దుకాణంలోఅండి. వాళ్ళబ్బాయే ఇచ్చాడండి."

"మీరు అతనికి ఏం ఇచ్చారు ?"

"పావలా బిళ్ళండి,"

"అతను తిరిగి మీకెంత ఇచ్చాడు ?"

"రెండణాలండి,"

"సరే. రెండణాలకుగాను అతను మీకు ఎన్నిపైసలిచ్చాడు ?"

వెనుకనుంచి పాలాసింగు రెండువేళ్లు చూపిస్తూ రెండని సౌంజ్ఞచేసాడు ఖాయీజీకి. కాని ఖాయీజీ ఎడ్డిమొగమాయె. అతనికేమీ అర్థంకాలేదు. "ఎనిమిది పైసలండి" అని సమాధానం ఇచ్చాడు.

"వాటినేం చేశారు ?"

"వాటిని నాచొక్కా జేబులో వేసుకున్నానండీ."

"మరి బంగు కట్టిచ్చిన పొట్లం ?"

"దాన్నిగూడా జేబులోనే వేసుకున్నానండి."

"గురుద్వారాకు వెళ్లినతర్వాత ఆపైసలు మీరు ఎక్కడపెట్టారు ?"

ఖాయీజీకి ఏదో మరిచిపోయిన విషయం జ్ఞాపకం వచ్చినట్లుంది. ఖంగారుపడుతూ అతను నా జేబులోంచి ఆరుపైసలు కిందపడిపోయాయండి. బహుశా ఆరెండు పైసలూ కల్వంలో ... లేదు ... నిజంగా అవి నేలమీదే పడివుంటాయండి."

"మరి వడపోసిన గుడ్డలోంచి బయటపడిన పైసలు ఎక్కణ్ణుంచి వచ్చాయి ?"

ఖాయీజీ కాళ్లు వణకడం మొదలెట్టాయి. రెండు మోకాళ్ళు ఒకొదానికొకటి రాచుకోసాగాయి. రహస్యం బయటపడిపోవడం చూసి గాభరా పడ్డాడు.

"నిజం చెప్పావంటే బతికిపోతావ్. లేకపోతే జీవితం అంతా నీకు శ్రీకృష్ణ జన్మస్థానమేగతి. జీవితాంతం నీ ఖర్మకు నువ్వు ఏడవాల్సి వస్తుంది" సూటిగా అతని కళ్లలోకి చూస్తూ అన్నాడు ప్లీడరు.

ప్లీడరన్న మాటలను భాయీజీకి వణుకు పుట్టింది. రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ "అయ్యా క్షమించండి. నిజం చెప్పేస్తాను. భంగు పొట్లాన్ని జేబులోంచి తీస్తుండగా ఈ రాగిపైసలు కల్వంలో పడిపోయాయండి. తర్వాతకానీ నాకాసంగతి అర్థం కాలేదు" అని జరిగింది జరిగినట్లుగా చెప్పేశాడు.

భాయీజీ చెప్పింది వినగానే పాలాసింగూ, అతని అనుచరులకూ మొహాల్లో నెత్తురు చుక్కలేదు. వాళ్ళు ప్రయాణం చేస్తున్న పడవ చేతకాని సరంగు చేతిలోవుంది. ఎప్పుడు ముంచుతాడో అన్నట్లుగావుంది వాళ్ళ పరిస్థితి.

ప్లీడరుగారు భాయీజీ నిజాయితీని మెచ్చుకుంటూ అన్నాడు. "శభాష్! మీరిచ్చిన స్టేటుమెంటు నాకు పరమ సంతోషంగా వుంది. సిక్కు మతస్థులు— అందులో మీవంటి గ్రంథీలు అబద్ధం ఆడాలన్నా ఆడలేరు సుమా! ప్లీడరుగారు తనని ఆకాశానికి ఎత్తుతున్నాడన్న విషయం గ్రహించలేదు. భాయీజీ అదేపనిగా మొత్తం ఏకరువుపెట్టేశాడు. బచన్‌సింగుకు ఈ వ్యవహారంలో ఏమీ జోక్యంలేదని స్పష్టంగా చెప్పేశాడు.

తర్వాత బచన్‌సింగు స్టేటుమెంటు తీసుకొన్నారు— "సంఘటన జరిగిన రోజు నేను వుదయం ఏడు గంటలకు తాలూకా ఆఫీసుకెళ్ళాను. ఒకపొలం తగాదా సందర్భంగా పార్టీతో రాజీ చేసుకోమని నాన్నగారు నన్ను పంపించారు. పట్నం నుంచి తిరిగివచ్చే సరికి ఎనిమిదీ ఎనిమిదింపావైంది. వూళ్లో పిల్లలకు చదువు నేర్పడానికి స్కూలు తెరిచే సందర్భంలో భాయీజీతో మాట్లాడవలసివుంది. అందుచేత వెళ్తూ వెళ్తూ వారిని కలుసుకుని పోదామనుకొని అటువైపు వెళ్ళాను.

"భాయీజీ వుండే పైగదిలోకి వెళ్లాను. అక్కడ భాయీజీ నాకు కనపడలేదు. ఒక్క నిర్మలా సాధువు మాత్రం మంచంమీద కన్పించాడు. మంచం క్రింద ప్రతాపసింగు పడున్నాడు. ఇద్దర్నీ లేపడానికి ప్రయత్నించాను, కానీ లాభంలేకపోయింది. వాళ్ళకు దగ్గిరనే భంగు నూరిన కల్వం కనిపించేసరికి వాళ్ళిద్దరూ భంగు తాగివుంటారని నిర్ధారణ చేసుకున్నాను. ప్రతాపసింగు పరిస్థితి చూసి నాకు భయంవేసింది. మావూరి అల్లుడాయె. వూరికే అప్రతిష్ఠ. వెంటనే అతడ్ని భుజాన వేసుకొని ఆదరాబాదరాగా అతని అత్తారింటికి తీసుకెళ్ళాను.

"మర్నాడు వుదయం పొలంవైపుకు వెళ్ళాను. చెరువుగట్టు మీద ఎవరో సిక్కు చచ్చిపడివున్నాడని దారిలో కొంతమంది చెప్పారు. వాళ్లు చెప్పిన ఆనవాలు ప్రకారం గట్టుమీదకు వెళ్ళాను. అక్కడ భాయీజీ స్పృహలేకుండా పడివున్నారు. వారిని ఎత్తుకొని గురుద్వారాకు తీసుకొచ్చాను. వారికి తెలివి తెప్పించడానికి చాలా విధాల

ప్రయత్నంచేశాను. కొద్దిసేపటికి వారు తెప్పరిల్లుకున్నారు. ఏం జరిగిందని భాయీజీని అడిగాను. వారు నాకిలా చెప్పారు— "నిషాలో మంచం క్రిందకు ఎప్పుడు దూరానో నాకే తెలియదు. సాయంత్రం సుమారు ఏడు గంటలకు నాకు ప్రకృతి అవసరాలు తీర్చుకోవాల్సివచ్చింది. అలాగేపడ్తూ లేస్తూ వూరిబయటికి వెళ్ళాను. దగ్గరలోనే ఆర్య సమాజంవారి తోపువుంది. అక్కడే నేను ప్రకృతి అవసరాలు తీర్చుకొని బయటకు వచ్చేసరికి నేను ఎక్కణ్ణుంచి వచ్చానో ఎక్కడికి వెళ్ళాలో అన్న మాటే జ్ఞాపకంలేదు. నేను ఎప్పుడు ఎలా యీ చెరువుగట్టుకు చేరి స్పృహతప్పి పడిపోయానో నాకేమీ తెలియదు" అని భాయీజీ నాకు చెప్పాడు.

తర్వాత ప్రతాపసింగు సాక్ష్యం తీసుకొన్నారు. అతను ఇంకా ఆసుపత్రిలోనే వున్నాడు. చాలాకష్టంమీద వాఙ్మూలం ఇవ్వగలిగాడు. ముఠావాళ్ళు నేర్పించిన మాటల్నే అతను చిలకలాగా చెప్పాడు. ఏవేవో కల్లబొల్లి కథలు అల్లాడు. కాని అవి అన్నీ ప్లీడరుగారి క్రాసు పరీక్ష ముందు నిలువలేకపోయాయి.

కేసు నడకే తారుమారైంది. కోర్టువారి తీర్పుప్రకారం పాలాసింగునూ, గ్రంథినీ, ముఠాలోని ఐదుగుర్నీ నిర్బంధించారు. కోర్టువారు ఈవిధంగా తీర్పు ఇచ్చారు—

"బచన్‌సింగును నిర్దోషిగా భావించి విడుదల చేస్తున్నాం. భాయీజీగా పిలవబడే దనౌంధాసింగు నిర్లక్ష్యంగా వ్యవహరించి ఒక ప్రాణానికి ప్రమాదం తెచ్చినందుకు ఒక సంవత్సరం ఖైదు, తప్పుడు రిపోర్టు చేసినందుకుగాను పాలాసింగుకు సెక్షను 177 కింద రెండేళ్ళ జైలూ, మిగిలిన ఐదుగురికి తప్పుడు సాక్ష్యం చెప్పినందుకుగాను సెక్షన్ 196 కింద ఆరునెలలు జైలూకోర్టువారు విధిస్తున్నారు".

---

# [ 14 ]

పాలాసింగూ, అతని అనుచరులూ, భాయీజీ, వీరుచేసిన తప్పుడుపనికి తగినశాస్తి జరిగింది. కానీ, దీనివల్ల పాలాసింగు ముఠాకు బచన్‌సింగుపై కక్ష మరీ ఎక్కువైంది. వాళ్లు బచన్‌సింగుపై పళ్ళుకొరకడం మొదలెట్టారు. ఇక పాలాసింగు ప్రాణస్నేహితులైతే, ఎప్పుడు తమ నాయకుడు జైలునుండి విడుదలైవస్తాడు, ఎప్పుడు ఆ బచన్‌సింగు గాడిమీద కసితీర్చుకుందామా అని వేచిచూస్తున్నారు. బచన్‌సింగే భంగులో రాగి నాణాలువేసి పాలాసింగుతో వైరం తెచ్చుకున్నాడనీ, అతనే భాయీజీ సాక్ష్యాన్ని తెప్పించి అమాయకుల్ని ఇరికించాడనీ వూరంతా టాం టాం చేసారు.

కాని బచన్‌సింగు వాటిని పట్టించుకోలేదు. అతను ఆలోచించే పద్ధతేవేరు. విద్యాగంధంలేని కారణంగా వీళ్ళంతా పాడైపోతున్నారనీ, దాని కారణంగానే గురుద్వారాల్లాంటి పవిత్ర పూజాస్థానాల్లో కూడా భంగు మొదలైన మత్తుపదార్థాల్ని సేవించడం మొదలెట్టారనీ, రాబోయే తరాల్నిగూడా ఈరకంగా వీళ్లు పాడుచేస్తున్నారనీ అతని అభిప్రాయం. వారి అజ్ఞాన తిమిరాలను తొలగించి గ్రామస్తులమధ్య సౌభ్రాతృత్వాన్ని పెంచడానికి వీలుగా ఏదైనా నిర్దిష్టమైన కార్యక్రమాన్ని చేపట్టాలని ఆలోచించాడు.

అంతకుముందు అమృత్‌సర్ నుండి తాను ఇంటికి వచ్చేటప్పుడు జ్ఞానీ దీదార్‌సింగును కలుసుకొని తమ వూరు రావలసిందిగా ఆహ్వానించాడు. తప్పక రాగలనని ఆయన వాగ్దానం కూడా చేశాడు. ఇదే సదవకాశంగా భావించి ఆమర్నాడే బచన్‌సింగు అమృత్‌సర్‌కు మనిషిచేత కబురంపాడు. కబురు అందీఅందగానే జ్ఞానీ దీదార్‌సింగు రెక్కలు కట్టుకొని వాలాడు దివాన్‌పూరులో.

జ్ఞానీ దీదార్‌సింగు జన్మస్థానం సియాల్‌కోట. అతనికి ఇద్దరుకొడుకులు. వాళ్లిద్దరూ ఏదో పనీపాటా చేసుకుంటూ అక్కడే వుంటున్నారు జీవితంలో సగభాగానికి పైగా గృహస్థాశ్రమంలోవున్న జ్ఞానీ దీదార్‌సింగు ఇక మిగిలిపోయిన జీవితాన్ని సంఘసేవకు అంకితం చేయాలని చాలా రోజులక్రితమే సంకల్పించుకొన్నాడు. మేం ఎక్కడున్నా నీకు మాత్రం చెరి పదిరూపాయలు పంపిస్తాం నాన్నగారూ అని ఇద్దరు కొడుకులూ జ్ఞానీజీకి చెప్పారు. అదీకాక, అంతకుముందు ఆయన కొద్దో గొప్పో డబ్బు దాచుకున్నాడు కూడాను.

జ్ఞానిజీతన మాటవిలబెట్టి వచ్చినందుకు బచన్‌సింగు చాల సంతోషించాడు. తన వూరును గురించీ, ఆ చుట్టుపక్కలవూళ్ల వెనుకబడిన తనాన్నీ వాళ్లమూఢనమ్మాకాల్నీ, ఎంతో ఆవేదనతో చెప్పాడు. అవన్నీ విన్న జ్ఞానిజీ కళ్ళు చెమ్మగిల్లాయి. బచన్ సింగు మీద తప్పుడు కేసు పెట్టినసంగతంతా విని నొచ్చుకున్నాడు. బచన్‌సింగు నిజాయితీనీ, సాహసాన్నీ, నిర్భయత్వాన్నీ అతను మెచ్చుకున్నాడు. చదువుకొనే రోజులకు యిప్పటికీ అయనలో వచ్చినమార్పును గుర్తించాడు. బచన్‌సింగుతో కలిసి గురుద్వారా చూద్దామని వెళ్లాడు. గురుద్వారా కళావిహీనమై బావురు మంటూండడంచూసి అతను సహించలేకపోయాడు. బచన్‌కోరిన ప్రకారం కొన్ని రోజులు దీవాన్‌పూర్ గ్రామంలోనే వుండిపోవడానికి నిశ్చయించుకున్నాడు.

జ్ఞానీజీ సరళస్వభావం కలవ్యక్తి. మృదుభాషి. సిక్కుమతంలో దీక్షపొందిన వాడు. గురుబానీ [1] సాహిత్యం అంటే మంచి అభిరుచి అతనికి. ప్రతి రోజూవేకువ జామునేలేచి స్నానంచేసి గుర్‌బానీ విధిగా పారాయణం చేస్తాడు. పారాయణం పూర్తి కాగానే గురుగ్రంథ సాహెబును తెచ్చి పవిత్రపీఠంమీద వుంచే వాడు జ్ఞానీజీ. ఆ వూళ్లో అడుగుపెట్టినతర్వాత ఆ వూరి రైతులకు కూడా ఎంతో ఉపయోగకరంగా అనిపించింది. వేకువజామున్నే అతను లేచి బావివద్దకు వెళ్ళిస్నానం చేస్తూంటే ఆ బావి గిలక చప్పుడు వూరిరైతులకు మేలుకొలుపులావుండేది. కాడె భుజానవేసుకుని పొలానికి బయలుదేరేవారు వాళ్ళు.

జ్ఞానీజీగారి ప్రభావం ఆ వూరి ఆడవాళ్లమీదకూడా ప్రసరించింది. కూరగాయలు కోయడానికి వెళ్లేప్పుడూ, అన్నం తీసుకుని పొలం వేళ్లేటప్పుడూ వారు గురుద్వారా దర్శనం చేసుకుని నమస్కారం చేసి మరీ వెళ్లేవారు. వాళ్లలో కొంతమంది కొంచెం పత్తికాయల్నో, మొక్కజొన్నకండెల్నో తీసుకునివచ్చి సమర్పిస్తుండేవారు కూడాను.

బచన్‌సింగు కృషివల్ల అక్కడ రైతుల పిల్లలంతా చదువు నిమిత్తం పోగయ్యారు. వాళ్ళకు విద్య నేర్పడానికి జ్ఞానీజీ కంకణం కట్టుకున్నాడు. ఓ వడ్రంగిని పిలిపించి అతనితో పది పన్నెండు కొయ్యపలకలు తయారు చేయించాడు. కలంపుల్లల కోసం పది ఒడ్డుకువెళ్ళి ఓ మోపు జొన్నదంట్లు కోసుకు వచ్చాడు. వూళ్లోని కుమ్మరిని అడిగి కొంచెం ఎర్రమన్ను తీసుకొని మట్టిదీపాలు చేయించుకున్నాడు. వాటిని పిల్లలకు పంచి పెట్టాడు. అల్లరిచిల్లరగా తిరగడానికి అలవాటుపడిన ఆ పిల్లలకోసం మొదట్లో రోజంతా కూర్చోవాల్సివచ్చేది. గొర్రు తోలడంకన్న కూడా ఆ పని కష్టంగా అనిపించేది.

1. గురు గ్రంథ సాహెబు

అయినా జ్ఞానీజీ ఎంతో ఓర్పును ప్రదర్శించేవాడు. సహన స్వభావం, ప్రేమపూర్వకమైన ప్రవర్తనవల్ల ఆయన తొందరలోనే పిల్లల్ని ఆకట్టు కొనగలిగాడు.

ఓ విధంగా చూస్తే జ్ఞానీజీకి కూడా కాలక్షేపంగా ఓ వ్యాపకం దొరికింది. పగలంతా పిల్లలకు చదువుచెప్పడంలో మునిగివుండేవాడు. ఆయన దగ్గిర రకరకాల పిల్లలు చదువుతుండేవారు. ఒకడికి అక్షరాలు రాసిచ్చిదిద్దమని చెప్తూంటే రెండోవాడు "చూడండి జ్ఞానీగారూ, మంగూ నా కలంపుల్ల ఇరగ్గొట్టాడు" అని పితూరీచేసే వాడు. వెంటనే ఆ పిల్లాడికి ఇంకో కలంపుల్లను తయారుచేసి ఇచ్చేవాడు జ్ఞానీ. ఇంతలోనే ఇంకొకడు "చూడండి గురూజీ! వాడు నన్ను ఎగతాళి చేస్తున్నాడు" అని చాడీలు చెప్పేవాడు. ఇక దూరంగా గోనెపై కూర్చున్న ఆడపిల్లలు వాళ్లల్లో వాళ్లపోట్లాడుకుని కలియబడుతుండేవాళ్లు. వాళ్ళను పిలిచి మంచి మాటలతో వాళ్ల తగాదాల్ని పరిష్కారం చేసేవాడు జ్ఞానీజీ.

పిట్టల్లాగ కిలకిలమని తిరుగాడే ఆ బాలబాలికలకు చదువు చెప్పడానికి జ్ఞానీజీ ఎంతో శ్రమపడేవాడు. వాళ్లకు కూర్చునే అలవాటు నేర్పడానికి రెండు నెలలు పట్టింది. జ్ఞానీజీ పొడుగాటి తెల్లనిగడ్డం అతని ఛాతిమీద వేలాడుతూంటే తుంటరి పిల్లలు కిచకిచమని నవ్వుతుండేవాళ్లు. జ్ఞానీజీ కొంచెంసేపు బయటికి వెళ్ళితే చాలు, తలమీద కప్పుకున్న ఓణీలు తీసిపారేసి వాటిని గుండ్రంగా బంతుల్లా చుట్టి పలకలమీద ఎగరేస్తూ 'థాల్'[1] ఆడేవారు. లేదా జడలు వేసుకొని భంగడా[2] ఆడేవాళ్ళు. జ్ఞానీజీ ఏవో పెద్దపెద్ద ఆశలు పెట్టుకున్నాడు. ఎప్పుడో ఒకప్పుడు అవి నెరవేరకపోతాయా అని ఆయన వుద్దేశ్యం.

ఓ రోజు జ్ఞానీ దీదార్‌సింగూ, బచన్‌సింగూ యిద్దరూ కూర్చుని ఏదో విషయం చర్చించుకుంటువ్నారు. ఎదురుగా చాపమీద కూర్చుని పిల్లలు చదువుకుంటున్నారు. "సంఘసేవ ఎలా చెయ్యాలి" అనేది వారు చర్చించుకుంటూన్న విషయం. సంఘసేవ చేయడం చాలా కష్టాలతో కూడుకుంది. మనమంతా ఏ పనిని సంఘ సేవ అని భావిస్తున్నామో నిజంగా అది సంఘసేవ అనిపించుకోదు. ఒక రకంగా అది నటనే అని జ్ఞానీజీ చెప్తున్నారు.

జ్ఞానీజీ చెప్పే ప్రతిమాట బచన్‌సింగు హృదయంలో చొచ్చుకొనిపోయి చెరగని ముద్ర వేస్తోంది. బచన్‌సింగు ఏవో అడగాలని అనుకున్నాడు కాని అంతలోనే అతని

---

1 పిల్లలు ఆడే ఆట.

2 పంజాబీ జానపద నృత్యం.

దృష్టి తలుపుమీదకు మళ్ళింది. చాలాసేపటి నుంచి ఓ పిల్ల గుమ్మం బయట నిలబడి వుండడం చూస్తున్నాడు అతను. ఆ అమ్మాయి వయస్సు పన్నెండు–పధ్నాలుగు సంవత్సరాలుంటుంది. ఆ పిల్ల తలమీద చెత్తాచెదారంతో గంప ఒకటి వుంది. అది బరువుగావుందేమో మోయలేక ఇబ్బందిగా పట్టుకుంది. మధ్య మధ్య మెడనొప్పి పుట్టినప్పుడెల్లా తలమీద గంపను చేతుల్లోకి తీసుకొని అలసట తీర్చుకుంటోంది. తీరైన ముఖం. అయితే దారిద్ర్యం అనే కారుమబ్బులు ఆమె చంద్రబింబంలాంటి ముఖాన్ని కప్పేశాయి.

తలుపు దగ్గిర కూర్చుని చదువుతోన్న పిల్లలు ఆ పిల్లను చూస్తూ తమలో తాము ఏదో చెప్పుకుని నవ్వుకోవడం బచన్‌సింగు గమనించాడు. ఓ పిల్ల చెరుకు ముక్కను నమిలి ఆ పిల్లవైపు విసిరి పారేసింది. మరోపిల్ల చాప పుల్లల్ని తీసి అటువైపు విసురుతోంది. ఇంకోపిల్ల అచేదో పని వున్నట్లు వెళ్ళి ఆ అమ్మాయిమీద వుమ్మివేసి వచ్చింది.

కాని గుమ్మం అవతల నిల్చున్న ఆ అమ్మాయి వాళ్ళుచేసే తుంటరి చేష్టల్ని గమనించడంలేదు. ఆమె దృష్టి అంతా ఆ పిల్లల కొయ్యపలకలమీదా, అక్షరాలమీదా, వాళ్ళు వర్ణాలు ఎలా రాస్తున్నారనే విషయంమీదా లగ్నమైవుంది. ఆమె మళ్ళీ తలమీద నుంచి చేతుల్లోకి గంపను తీసుకుంది. అలాచేయడంలో గంప కింద వుంచిన చుట్టకుదురు చటుక్కున క్రిందపడింది. దాన్ని పిల్లలు చూశారు. ఆ అమ్మాయిని గేలిచేయడానికి వాళ్ళకు మరోసారి అవకాశం దొరికింది. నవ్వాపుకోడానికి వాళ్ళెంత ప్రయత్నంచేసినా వాళ్ళలో ఇద్దరు ముగ్గురు పిల్లలు పకపకమని బిగ్గరగానే నవ్వేశారు. వాళ్ళు నవ్వడం జ్ఞానీజీ చెవుల్లో పడింది. ఆయన అటువైపు చూసీ చూడకముందే పాపం ఆ పిల్ల సిగ్గుపడి అక్కణ్ణుంచి పారిపోయింది.

జ్ఞానీజీ వాళ్ళను వారించాడు. కొయ్యపలకలు ముఖానికి అడ్డంగా పెట్టుకుని ఆ పిల్లలు నవ్వు ఆపుచేసుకోకలిగారు. ఈ కొంటె పిల్లలు ఆ బీదమ్మాయిని ఎలా ఏడ్పిస్తూవుందీ అంతా సమగ్రంగా చెప్పాడు బచన్‌సింగు. జ్ఞానీజీకి వాళ్ళు నవ్వడం చూస్తే కోపం వచ్చింది. మిగతా సంగతులు ఆయన గమనించలేదు. "ఏయ్ ! ఏమిటా యికయికలూ పకపకలూను. నోరు మూస్తారా మూయరా ?" అంటూ వాళ్ళను గద్దించాడు. బచన్‌సింగు వైపు తిరిగి "మహా అల్లరి పిల్లలు. వీళ్ళతో వేగలేక నా బుర్ర వేడెక్కిపోతోంది. ఎంత చెప్పినా ఒక్క ముక్కకూడా బుర్రలో ఇమడదుకదా. మనవాళ్ళు వూరికే అన్నారా పిల్లా, పిట్టా, మేకా కదలకుండా అరక్షణమన్నా వుండలేవని.

జ్ఞానీజీ మాటకు అడ్డు తగుల్తూ "ఎలాగో వాళ్లను నూరినూరి నాలుగు అక్షరం ముక్కల్ని ఇమడ్చ గలిగారు. అదే ఘనకార్యం" అన్నాడు. బచన్‌సింగ్ ఆ వెంటనే మళ్లీ "ఈ కుర్రాళ్లను చూడండి. వీళ్లకి అదికూడా రాదు. వీళ్లకు గొడ్ల వెనకాలపడి "హే... హే" అనడం తప్ప ఇంకేమీ తెలియదు" అంటూ పిల్లాళ్ళను దుయ్యబట్టాడు.

బచన్‌సింగు మరి కాసెపు మాట్లాడి వెళ్లిపోయాడు.



# [ 15 ]

రోడూ తాత కోతిని ఆడించి సాయంకాలం ఇంటికి తిరిగి వస్తున్నాడు. దారిలో అతనికి చాలారోజులనుండి సుందరికేమీ కొనివ్వలేదన్న విషయం జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఆగిపోయాడు. ఓసారి తలపాగా తడుముకున్నాడు. పాగాలోంచి మూడు యేగాణీలు ఒక కానీ దొరికినయ్. నడుంచుట్టూ ఓసారి తడుముకున్నాడు – చిల్లర ఏమన్నా దోపుకున్నాడేమోనని. ఎంతవెతికినా ఏమీదొరకలేదు. తర్వాత భుజంమీది పంచిలోంచి ఓ పాతగుడ్డతీసి దాని చివరకట్టిన ముడివిప్పాడు. అపక్కనేవున్న అరుగు మీద తాపీగా మూటలో చిల్లరంతా లెక్కపెట్టాడు. చిల్లరంతాలెక్కిస్తే మొత్తం మూడు అణాలయాయి. వీటితో ఏంకొందామా అని చాలాసేపు ఆలోచించాడు. ఊదుకొనే బూరా కొనిపెట్టమని రోజూ సుందరి మారాంచేస్తూందన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే బొమ్మల దుకాణానికి వెళ్ళాడు రోడూ. రెండున్నర అణాలుపెట్టి బూరా కొన్నాడు. అపక్కనేవున్న మిఠాయి దుకాణంలో యాగాణీపెట్టి బర్ఫీకొన్నాడు. అక్కణ్ణుంచి తొందరతొందరగా యింటికి బయలుదేరాడు.

ఇల్లుచేరగానే లచ్చీను తలుపుదగ్గిరే వదిలివేసి " సుందరీ, సుందరీ " అని పిలుస్తూ గదిలోకి వెళ్ళాడు. మామూలుగా రోజూ అతను వచ్చేసమయానికి సుందరి గుడిసె బయట నిలబడి అతనికి ఎదురువచ్చేది. కాని ఇవ్వాళ అలా ఎదురురాలేదు. హడా వుడిగా రోడూ బయటికి వచ్చాడు. చాలాసార్లు కేకవేసాడు. కాని సుందరి జాడ కన పడలేదు. కోపంతో రోడూ చిందులు తొక్కడం మొదలెట్టాడు. అతనికోపంలో ప్రేమ, తపన, తాపత్రయం ఎన్నిపాళ్లలో కగిసివున్నాయో చెప్పటం కష్టం.

రోడూ గుడిసె వెనక్కెళ్లి చూశాడు. అక్కడ మంచాన్ని అడ్డుగా నిలబెట్టి దాని వెనుక సుందరి నేలమీద ఏదోరాస్తూవుంది. సుందరిని చూడగానే రోడూకు ప్రాణంలేచి వచ్చింది. అతన్ని చూడగానే సుందరి నవ్వుతూ వచ్చి అతని నడుమును చేతుల్తోచుట్టి లాగడం ప్రారంభించింది. " తాతా, ఇవ్వాళ నీకు నేను ఓ తమాషా చూపిస్తాను. తొందరగా ఇటురా " అని తాతను లాగుతూ ఆ ప్రదేశానికి తీసుకునివెళ్లి కూర్చోపెట్టింది. రెండు అరచేతుల్తోనూ అతని కళ్ళుమూసి గభాల్న తీసి "ఇటు చూడు తాతా" అంటూఅతని ముందుకువచ్చి లంకబిందెలు దొరికినంత సంతోషంతో గంతులువేయడం మొదలెట్టింది.

సుందరి ఆటల్ని రోడూ మంత్రముగ్ధుడై చూస్తూ కూర్చున్నాడు. ఆప్యాయంగా సుందరిని దగ్గరగా తీసుకుని ఆమె నుదురు ముద్దు పెట్టుకుని "ఏందమ్మా. పులులూ మేకలూ గీస్తున్నావా ?" అని అడిగాడు.

మళ్ళీ సుందరి అతని దృష్టిని నేలమీద రాసివున్న అక్షరాల వైపు మళ్లిస్తూ "ఇవి పులులూ మేకలా ! ఇది చూసు తాతా ఈ అక్షరం 'ఓ' ఇది 'న' అని మళ్ళీ తర్వాత అక్షరం గుర్తురాక ఓ నిముషం ఆలోచించి ఇది "మః" అని పూర్తి చేసింది.

'ఓ' అంటే ఏమిటో 'న' అంటేఏమిటో రోడూకు ఏమి తెలుసు ? "మాబాగా సదివేత్తున్నావే" అని కేరింతాలు కొడ్తూ" తల్లీ, ఇయన్నీ ఇట్లా రాస్తారని నీకెట్లా తెలుసమ్మా ?" అని అడిగాడు సుందరిని.

"అవును తాతా వాళ్లిట్లాగే రాస్తూంటారు".

"ఎవరమ్మా ?"

"ఆ పిల్లలు తాతా ! ఇంకెవురనుకున్నావ్ ?"

"ఏ పిల్లలమ్మా ?"

"వాళ్లే తాతా, గురుద్వారాలో చదవడం లేదూ ?"

"నీకెలా తెలుసు తల్లీ వాళ్లిట్టాగే రాస్తున్నారని ?"

"నాకు తెలీదా ! నేను రోజూ చూస్తూంటే. ఇవ్వాళగూడా చూసొచ్చాను. నేను చెత్తగంప పారేయడానికి పోలేదూ. అప్పుడు."

"రాస్తే రాసేరు. నీకెందుకులే ?"

ఏడుపు ముఖంపెట్టి మారాంచేస్తూ "లేదు తాతా, నేను కూడా రాస్తాను" అని మొండికెత్తింది.

సుందరి అన్న మాటలు విని రోడూకు నవ్వు వచ్చింది. మళ్ళీ ఏదో ఆలోచనవచ్చి అతని ముఖం కళాహీనమైంది. ఆమె మునిగడ్డం పట్టుకొని "బయల్దేరిందోయ్ ఇద్వాంసురాలు ! పిచ్చిపిల్ల ! చదువూ సంధ్యా మనలాంటోళ్లకు ఎట్టా కుదురుతుందంట?" అని ఓ నిట్టూర్పు విడిచాడు.

తాత యిచ్చిన సమాధానం విని సుందరికి నిరాశ కలిగింది. ప్రశ్నార్థకంగా రోడూ వైపు చూస్తూ" ఐతే ఎవరికి కుదురుతుంది?" అని అడిగింది.

"తల్లీ వాళ్ల సర్దారోళ్ళ బిడ్డలు. మనం పేదవాళ్లం. బికారులం. ఈ సదువులవీ మనకెలా కుదురుతాయమ్మా?"

ఆ మాటవిన్న సుందరికి ఆశాభంగం అయింది. తను గొంతెమ్మ కోర్కె కోరుతున్నదేమోనని ఆలోచించసాగింది. " తాతా, మనం నిజంగా చదువుకో కూడదా?" అని ఏడుస్తూ అడిగింది రోడూను.

"తల్లీ, వున్నవాళ్లకు అన్నీ చెల్లుతాయి. కడజాతివాళ్లు కూడా చదవడం మొదలెట్టే యిక పనులు చేసేదిఎవరు?"

సుందరికి ఆ సమాధానం నచ్చలేదు. మారాంచెయ్యడం ప్రారంభించింది. "లేదు తాతా, నేను చదువు నేర్చుకుంటాను. ఇంట్లోనేవుండి చదువు కొంటాను. వాళ్లకెలా తెలుస్తుంది? పొద్దున చెత్తపారేయడానికి పోయినప్పుడు వాళ్లు ఎట్లా రాస్తున్నారో చూసి వస్తాను. రాత్రికి..."

ఆమె మాట పూర్తిచేయకుండానే రోడూ సుందరిని గదిమాడు. "చదువూలేదు గిదువూలేదు. ఆ పిచ్చివన్నీ పట్టించుకోకు. ఇదిగో ఈ బొమ్మ తీసుకో" అంటూ సుందరికి బూరా, మిఠాయిపొట్లమూ ఇచ్చాడు.

ఏ బూరా తెమ్మని సుందరి ఇన్నాళ్లనుంచీ అడుగుతూ వచ్చిందో అది ఈ రోజు దొరికింది. ఇక సుందరి సంతోషానికి పట్టపగ్గాలుండవని రోడూ అనుకున్నాడు. కాని సుందరి అయిష్టంగా ఆ రెంటిని చేతిలోకి తీసుకొని యింట్లో ఓమూల పెట్టివచ్చింది.

---

# [ 16 ]

బచన్‌సింగు నిత్యమూ జ్ఞానీజీ దగ్గరకు నియమం తప్పకుండా వచ్చి కూర్చొని అనేక విషయాల గురించి ఆయనతో చర్చిస్తుండేవాడు. ఆ చర్చల్లో అనేక నిగూఢమైన విషయాలు బయటపడేవి. అలాటి చర్చల్లో పాల్గొనడం అంటే బచన్ సింగుకు మహా సరదా. జ్ఞానీజీ సహచర్యంవల్ల ఆయనలో ఎంతో మార్పు రాసాగింది. అతని జీవిత ప్రవాహమే మలుపు తిరిగిపోయింది.

విరిగిన గంపను కాసేపు చేతుల్లోనూ మరికాసేపు తలపైనా మార్చుకుంటూ గుమ్మం అవతల ఓ అమ్మాయి చాలాసేపు నిలబడి పిల్లలు రానే తీరుతెన్నుల్ని కళ్లార్పకుండా చూడడం రోజూ అతను గమనిస్తూనే వున్నాడు.

ఒకరోజు మధ్యాహ్నం బచన్‌సింగు గురుద్వారాకు వెళ్లాడు. పిల్లల్ని చదువుతూ వుండమని చెప్పి జ్ఞానీజీ ఎక్కడికో వెళ్లబోతున్నాడు.

" ఎక్కడికో వెళ్తున్నట్టున్నారు " అంటూ పలకరించాడు బచన్‌సింగు. " రండిరండి మీ రాకకోసమే ఎదురుచూస్తున్నాను. బట్టలు బాగా మాసినయ్. నుయ్యిదగ్గిరకెళ్లి వుతుక్కుందామని బయలుదేరబోతున్నాను. మీరుకూడా వస్తారా ? అలాకాసేపు షికారూ చేసినట్లుంటుంది " అని జ్ఞానీజీ అన్నాడు.

సరే పదండని బచన్‌సింగు ఆయన వెంట బయలుదేరాడు. ఇద్దరూ గుమ్మం దాటగానే చెత్తగంప పక్కన పెట్టుకుని గోడవైపు మొహంపెట్టి కూర్చుని నేలమీద ఏదో రాస్తోన్న అమ్మాయి వారికి కనపడింది. ఆమె దగ్గిర ఓచినిగిన కాగితంవుంది. దాన్ని చూస్తూ ఆమె నేలమీద రాస్తోంది. ఆ అక్షరాలు ముత్యాల సరాల్లా అందంగా వున్నాయి. ఆమె రాతచూసి వాళ్లు ఆశ్చర్యపోయారు. ఆమె చూసిరాస్తోన్న కాగితం బాలబోధినిలో మొదటిపుట. దానిలో పంజాబీ వర్ణమాల అంతావుంది. చిత్తుకాగితం. పైగా చినిగింది. చినిగినభాగాల్ని ఆమె పిండితో జాగ్రత్తగా అతికించినట్టు తెలుస్తోంది. ఆమె ఆ కాగితాన్ని ప్రభుత్వం వారి ఆజ్ఞాపత్రికలాగ ఎంతో జాగ్రత్తగా పట్టుకొంది.

జ్ఞానీజీ బచన్ ఇద్దరూ తీర్చిదిద్దిన ఆ అమ్మాయి రాతచూచి ముచ్చటపడ్డారు. చివరి అక్షరం రాయడానికి ఆమె ఆ కాగితం వైపు చూసేసరికి ఎదురుగావున్న వాళ్లిద్దరూ ఆమెకు కనుపించారు. భయపడిపోయి గంపనుకూడా అక్కడే వదిలేసి పారిపోయింది ఆమె.

ఆ అమ్మాయి పదడుగులు వేసిందోలేదో జ్ఞానీజీ "ఓ అమ్మాయ్" అని కేకేసాడు. కేకవినగానే ఆమె కాళ్లు ముందుకు సాగలేదు. ఆమె అక్కడే నిలబడి పోయింది. "తల్లీ, భయపడకు. నిన్నుకొట్టనులే. ఇలారా, ఓ మాట చెప్తావిను" అని జ్ఞానీజీ ఆప్యాయంగా పిలిచాడు. ఆ మాటలు విన్న తర్వాత ఆమెకు ప్రాణంలేచొచ్చింది. మెల్లగా వాళ్లముందుకు వచ్చి తలవంచుకుని నిలబడింది.

"పాపా, ఈ అక్షరాలు నువ్వు ఎక్కడ నేర్చుకున్నావు?"

సమాధానం చెప్పడానికి ఆ పిల్లభయపడింది. అబద్ధం చెప్పడానికి ఆమెకు సాహసం చాల్లేదు. నిజం చెప్పలేక మౌనంగా వుండిపోయింది.

ఆమె తలను చేత్తో నిమురుతూ దగ్గరకు లాక్కొని జ్ఞానీజీ ఆప్యాయంగా మళ్లీ అడిగాడు — "పాపా. నువ్వు భయపడవద్దు. నిన్నేమననులే. నీ దస్తూరీ చూసి నాకు చాలా సంతోషంకలిగింది. ఎక్కడ నేర్చుకున్నావ్?"

ఇప్పుడు ఆమెకు కొంచెం భయం తగ్గింది. సంకోచంలేకుండా "నా అంతట నేనే చూసిరాస్తుంటాను" అంది నమ్రతగా.

ఈ దృశ్యాన్నంతా బచన్‌సింగు కళ్లప్పగించి చూస్తున్నాడు. ఆ అమ్మాయి చెప్పిన సమాధానం విని ఆశ్చర్యంతో "సొంతంగానే రాశావా? ఎవరి దగ్గిరా నేర్చు కోలేదూ?" అని అడిగాడు.

ఆమె లేదని చెప్పేసరికి ఇద్దరికీ పరమానందమైంది.

"మరి ఈ అక్షరాలు ఏవిటో నీకు తెలుసా?" అని జ్ఞానీజీ ప్రశ్నించాడు.

"తెలుసండి."

"అయితే చదువు చూద్దాం".

వెంటనే తడుముకోకుండా ఆ పిల్ల వర్ణమాల మొత్తం చకచకా అప్పచెప్పేసింది.

"నాకు గుణితం కూడ వచ్చండి" అని అడగకుండానే ఆనందంపట్టలేక అనేసింది.

బచన్ వైపు చూసి "సరే రాయడమైతే కాగితం చూసి నేర్చుకుందనుకుందాం. మరి చదవడం ఎలా నేర్చుకుంది?" అని జ్ఞానీజీ అన్నాడు.

"రోజూ మధ్యాహ్నం వేళ యిక్కడ పిల్లలు గుణింతం చదువుతూంటారు కదండీ. అప్పుడు నేమా వింటూవుంటాను" అని జవాబిచ్చింది.

ఆ అమ్మాయి వీపు నిమురుతూ "శభాష్ పాపా! శభాష్! నీకు మంచి తెలివితేట లున్నయ్. నీకు బాలబోధినీ, పలకా తెచ్చి ఇస్తాను. నువ్వు చదువుకొందువుగాని. అవునుగాని నీపేరేమిటి పాపా?" అని అడిగాడు జ్ఞానీజీ.

"నాపేరు సుందరి అండీ".

బచన్‌సింగ్ అందుకున్నాడు – "తాతగారూ, ఈమె హరిజనుల పిల్ల అయివుంటుంది. మీరామెను తాకుతున్నారు. నాకైతే అలాంటి పట్టింపేమీ లేదనుకోండి. కాని మన వూరివాళ్లు – అసలే వక్రబుద్ధులు".

"ఇటువంటి ఉజ్వల భవిష్యత్తుగల పిల్లల్ని అంటుకోడానికి, చదువూ సంధ్యలు నేర్పడానికి వూళ్లో అభ్యంతరం పెట్టారంటే ఘోరమైన అన్యాయం. అటువంటి వారిని నేను లెఖ్ఖచేయను" అని జ్ఞానీజీ లోపలికి వెళ్లి బాలబోధిని, కొయ్యపలక తెచ్చి ఆ పిల్లకు యిస్తూ "తల్లీ, ప్రతిరోజూ మానేయకుండా చదవాలి. ఇవి తీసుకో, నువ్వు రాదలచుకుంటే ఇక్కడకువచ్చి చదువుకొని వెళ్లొచ్చు". అని చెప్పాడు.

ఆప్యాయతతో నిండిన ఆయన కరుణారసపూరితమైన మాటలు వింది. ఆయన మాట్లాడుతుంటూంటే పుట్టిగుడ్డివానికి కళ్లు వచ్చినట్లుంటుంది. అంత మధురమైన వాక్కులు ఆయనవి. గనుకనే ఆమె ఆయన యిచ్చిన పలకా పుస్తకం తీసుకుంది.

బచన్‌సింగూ, జ్ఞానీజీ అక్కడనుంచి ముందుకు కదిలిపోయారు. సుందరి కూడా కడుపునిండా సంతోషాన్ని నింపుకుని ఇంటివైపు బయల్దేరింది.

సుందరి కాళ్లకు ఎవరో రెక్కలు తగిలించినట్లుగా ఆమె పరుగులంకించుకుంది.

---

# [ 17 ]

"తాతా, ఓతాతా, ఇవిగో, నేనేం తెచ్చానోచూడు!" అంటూ ఎగురుతూ సుందరి తాను తెచ్చిన వస్తువులన్నీ ఒక్కొక్కటే రోడూకు చూపించడం మొదలెట్టింది. "వాళ్ల కొడ్తారూ, నువ్వు చదువుకోడానికి వెళ్ళొద్దన్నావు కదూ. నువ్వు చదువుకో. మేం నీకు చదువు నేర్పుతాం అంటున్నారు వాళ్లు. నువ్వేమో ఇలా...చూడు తాతా ఈపలక ఎంతబావుందో! బాలబోధినీ, రెండు కలంపుల్లలూ, సిరా చేసుకొంటానికి ముల్తానీమట్టి." అంటూ తాతకి చూపించి మళ్ళీ అంతలోనే 'ఇలాఇయ్యి. ఈ సిరాబుడ్డిలో మెత్తగా దంచివేస్తా. చూసుకో, నేను ఇకనుంచి నేలమీద రాయను. పలకమీదే రాసుకుంటా" అని సుందరి సంతోషపడిపోతోంది.

సుందరి తెచ్చిన వస్తువుల్నిచూసి పరమానంద పడిపోయాడు రోడూ. కాని వెంటనే గాభరాపడ్డాడు. ఎక్కణ్ణుంచైనా దొంగిలించి తేలేదుకదా అన్న సందేహం పట్టుకుంది అతనికి.

"ఎవరి వస్తువులు తెచ్చావ్? వెళ్ళుతల్లీ, వాళ్ళవి వాళ్ళకు తిరిగియిచ్చేసిరావూ. నా బుర్రపగలకొడ్తారు తల్లీ వాళ్ళకు తెలిసిందంటే" అంటూ సుందరిని హెచ్చరించాడు.

"లేదుతాతా, ఆ దేవుడుమీద ఒట్టు. నేనేం దొంగిలించితేలేదు. జ్ఞానీజీగారే యిచ్చారు ఇవన్నీ. కావాలంటే అడుగుదాం పద" రోడూ చేతిని పట్టుకుని ముందుకు లాగింది సుందరి.

రోడూ సుందరి ముఖంలోకి చూశాడు. ఆమె మాటల్లోని దృఢత్వం, నిర్భయత్వం మొహంలో స్పష్టంగా కనబడుతున్నాయి. ఆమె చెప్పినదానిమీద నమ్మకం కల్గింది. తర్వాత సుందరి జరిగిందంతా వివరంగా చెప్పేసరికి రోడూకు పూర్తి నమ్మకం కుదిరింది.

ఆరోజు నుండి సుందరికి చదువుకోడానికి అవకాశం దొరికింది. ఇంట్లో పనయిపోయాక తీరికగా చదువుకొనేది. రాత్రి నిద్రపోయేటప్పుడు కూడా చదువుకొనేది. జ్ఞానీజీ దగ్గరకువెళ్లి రోజూ రెండుగంటలుపాటు చదువుకొని వచ్చేది. సుందరికూడా మిగతా పిల్లలతో పాటు కూర్చుని చదవాలని జ్ఞానీజీకి మనస్సులో అనిపించేది కానీ, దాని వల్ల వచ్చే పరిణామాలు ఊహించి గుమ్మానికి అవతలగానే గోనెసంచివేసి కూర్చోబెట్టే వాడు. అక్కడే కూర్చుని ఒంటరిగా సుందరి చదువుకొనేది. అదే ఆమెకు బావుంది'

ఒకవేళ వాళ్లతో కూర్చుని చదివివుంటే వాళ్ళుచేసే గోలకు అసలు యింతపిసరైనా చదువు ఆమెకు వంటపట్టేది కాదేమో. దూరంగానే కూర్చుని చదువుకుంటున్నప్పటికీ అదికూడా సరిగా కొనసాగలేదు. పిల్లలు బయటనుంచి వస్తూనో లేక బయటికిపోతూనో ఆమెతో వూరికే గిల్లికయ్యం తెచ్చుకొనేవాళ్ళు. ఏ ఆకతాయిపిల్లో పక్కనున్న అమ్మాయిని సుందరిమీదకు ఒకతోపుతోసేది. అలాతోసేసి అంటరాని పిల్లను తాకినందుకు ఆ అమ్మాయిని ఎద్దేవ చేస్తూంటే సుందరిమీద పడిన పిల్ల మొండిగా మిగతా పిల్లల్ని ముట్టుకోడానికి వాళ్ళవెంట పడేది. ఒక్కొక్కప్పుడు ఆమె సిరాబుడ్డిని తన్ని సిరా అంతా ఒలకపోసేవారు. ఆమె రాసే కలంపుల్లనుంచి ఒక ముక్కతీసి దాన్ని బాణంలా వంచి ఆమె ముఖంమీద లాగి వదిలేవాళ్ళు. కాని సుందరి మాత్రం ఎప్పుడూ వీటిని పట్టించుకొని గురువుగారికి పితూరిచేసేది కాదు. అందుచేతేమో వాళ్లు రోజూ ఆమెను ఏడిపించడమూ మానలేదు.

ఆమె మనస్సంతా చదువుమీదే లగ్నంచేసేది. అడుగడుగునా తోటిపిల్లలుపెట్టే ఆటంకాల్ని అవలీలగా అధిగమించేది. కాని ఆమెకు ఇప్పుడు మరో ఆటంకం వచ్చిపడింది. వూళ్లో ఆడా మగా ఆమె చదువుగురించి పట్టించుకోవటం మొదలెట్టారు. గుసగుసలు బయల్దేరాయి. ఈ రట్టంతా ఎవరు లేపారు? అందరికీ తెలుసు. పారాసింగు ముఠావాళ్లే ఈ గొడవ లేవదీసారు. ఏదో వంకన జ్ఞానీజీని బెదిరించేవాళ్ళు, అదిలించేవాళ్లు. కానీ జ్ఞానీజీ తొణక్కుండా బెణక్కుండా సుందరికి నిరాఘాటంగా చదువు చేప్పేవాడు.

ఈ మాట క్రమంగా ఆనోటా ఆనోటా పాకుతూ వూరంతా అల్లుకుంది. చందాసింగు తల్లి చచ్చిపోతే ఆమె శవాన్ని చూడడానికి వూళ్ళోజనం అంతా పోగయ్యారు. అప్పుడు కూడా చందాసింగు తల్లి విషయం వొదిలేసి సుందరి చదువుగురించే వాళ్లంతా చర్చించడం ప్రారంభించారు.

అసలు చర్చ డాక్టర్లు నూతిలో మందు చల్లుతున్నారనే ప్రసంగంతో బయలుదేరింది. ఈ ప్రసంగాన్ని జ్వాలాసింగేలేపాడు. "మందులు మన ఆరోగ్యంకోసమే వాళ్లు చల్లుతున్నారంట. మందు చల్లితే నీళ్లల్లోవుండే క్రిములవీ చచ్చిపోతాయని ఆరోజు బచన్ అన్నాడు" అంటూ బచన్‌సింగ్‌ను సమర్థిస్తూ సుందర్‌సింగు అన్నాడు.

సుందర్‌సింగును ఖండిచాడు నత్థాసింగు — "అది అబద్ధం. మందుచల్లితే రోగాలు ఇంకా ఎక్కువవుతాయి. కిందటి సంవత్సరం ప్లేగు ఎందుకొచ్చిందో తెలుసా? తెల్ల దొరలు ప్రతిచోటా అవేవో మందులూ మాత్రలూ చల్లారు. ఇంకేముంది? అవితిని ఎలుకలన్నీ చచ్చిపోయాయి. అంతే, ప్లేగువ్యాపించి వూళ్లకు వూళ్లుపాడుపడ్డాయి."

"మనకు చదువూసంధ్యాలేదు. ఎవరేంమాట చెబితే అవును గాబోలనుకుంటాం. అదే నమ్ముతాం. ఇటువంటి విషయాలు చదువుకున్నోళ్లకు తెలుస్తుంది" అని సుందర సింగు పత్తాసింగును అందించడం ఇష్టంలేక సర్దాడు.

ఖాన్‌సింగు తాతగారు అసలే మాటకారి. వెంటనే అందుకున్నాడు. "పొందర్రా, ఈ చదువుకున్నోళ్ళ బాగోతం ఎవరికి తెలీదర్రా. నిజం చెబితే మీకు కోపంవస్తుంది. కాపీ, నిజం చెప్పందే ఈనరంలేని నాలుక వూరుకోదు కదా. జీవాసింగు పిల్లాణ్ణి చదువుకోసం పట్నం ఏం పంపించాడోకాని వాడికి వున్న బుద్ధికూడా మందగించిందర్రా' ఈ పిల్లోళ్లు ఇంగ్లీసు చదువుకొని వచ్చి రావడంతోనే ఎరుకలూ ఏనాదోళ్ళను మనలో కలుపుకొంటాం అంటూ వీళ్లే కంకణం కట్టుకున్నట్లు మాట్లాడుతారు. రాత్రి మనోడు అంటూంటే విన్నా. ఆ బచన్‌గాడు చెప్పితే ఈ ధర్మశాలా మనిషి కోతులాడించే ఆరోడూ ముసలాడి మనవరాలికి చదువుచెప్పడం మొదలెట్టాడంట."

అంతలో మరోవ్యక్తి అందుకున్నాడు — "వేలకు విలువచేసే మాటన్నాడు తారా సింగు. నేనుకూడా ప్రతిరోజూ ఆపిల్ల గురుద్వారా దగ్గర కూర్చోడం చూస్తున్నాను. జీవాసింగుకు వెళ్ళి చెప్దాం. ఆ జ్ఞానీగార్నికూడా అడిగిచూద్దాం అని చాలాసార్లు అనుకున్నా. మనదారిన మనం పోదాం. దారినపోయే తద్దినమా, మా ఇంటికి రా అన్నట్టు ఈ తలనొప్పి మనకెందుకులే అనుకొని వూరుకున్నా. జీవాసింగు మంచంలో పడ్డాడు. అతనికి చెప్పినా ఏం ప్రయోజనం? కాని ఇలాఎన్నాళ్లు జరగడం? ఇవ్వాళ గురుద్వారా వెళ్తోంది, రేపు బావికాడికి రాదని నమ్మకం ఏమిటి?"

రెండోవాడు మొదటివాణ్ణి సమర్థిస్తూ అన్నాడు — "నువ్వు చెప్పింది ముమ్మాటికి నిజం. ఈ నీచజాతులు అంతటితో ఆగరు. అంత సులభంగా వూరుకోరు. రవాణీ గ్రామంలో ఎంత కొట్లాట జరిగిందో తెలుసా? ఖాల్సా సాంప్రదాయం వాళ్లు మీటింగు పెట్టి ఈ ఎరుకలూ ఏనాదుల్ని శుద్ధిచేస్తాం అంటూ మొదలెట్టాడు."

మూడోవాడు మిత్రుడు. ఇద్దరికీ మద్దతు ఇస్తూ "నేను వున్నమాట మొహంమీద అనేస్తాను. ఇప్పటికి మించిపోలేదు. ఈ జ్ఞానీగారిని వారించకపోతే అక్కడి మాదిరిగానే ఇక్కడా కొట్లాట అయ్యేటట్టుంది. ఒకటీ ఒకటీ కలిసి పదకొండు అవుతాయి. అసలు బచనే అటువంటి వాడనుకుంటే ఆయన చాలదన్నట్లు ఈ జ్ఞానీ కూడా ఆయన పంచచేరాడు" అన్నాడు.

"అందుకే అన్నారు పావాన దోషం అని. మంచివారితో చేరితే తరిస్తారు. చెడ్డ వారితో చేరితే మునుగుతారు. భాయీజీ దేవతాస్వరూపులు. ఎవరిపై పల్లెత్తుమాటా

అనేవారుకాదు. అన్ని సమయాల్లోనూ ఎవరికేం పనిపడితే ఆక్కరదిద్దేవారు. ఎవరేం చెప్పినా ససేమిరా అనేవాళ్ళుకాదు. ఎంతమంచివారు?" అన్నాడు ఇంకోమనిషి.

ఆయన చెప్పింది రెండోవాడు — "అందుకే వూళ్లోకి వచ్చీరావడంతోనే బచన్ ఆయనతో వైరం పెట్టుకొన్నాడు. పిల్లలకు చదువు చెప్పరాదా అనీ, గ్రంధసాహెబు పారాయణం చెయ్యి అని, అదిచెయ్యి ఇదిచెయ్యి అని భాయీజీని నానా తిప్పలూ పేట్టే వాడు. కాని భాయీజీ ఆయనమాటలు ఎప్పుడూ వినలేదనుకో... ఆయన... ..."

ఇదే అదను అనుకొని మూడోవాడు అందుకున్నాడు. "అందుకే మనస్సులో యిదంతా పెట్టుకొని పాపం భాయీజీని జైలుకు పంపించాడు బచన్. భాయీ ఈ మధ్య నడచిన తతంగం మాకేం తెలుసు? పిల్లల్ని చదువుకోడానికి రోజూ గురుద్వారాకు పంపమని యింటింటికి వచ్చి చెబుతుండేవాడు. అతని మాటలు నమ్మి పంపించాం."

"అవును" అన్నాడు నాలుగోవాడు. "పోనీ అనుకుందాం. ఇన్ని రోజుల్నుంచీ వీళ్ళు చెప్పిన చదువు ఏమిటంట? అంతకు ముందూ ఆపనీ ఈ పనీ చిన్న చిన్న పనులు చేసే పిల్లలు ఇప్పుడు బొత్తిగా చేయడమే మానేశారు. భాయీ, మేం పిల్లల్ని మళ్లీ చదువుకోడానికి పంపిస్తే ఇదిగో యీ చెవి కోసుకుంటాను" అన్నాడు.

ఇందాకటినుంచి వూరుకున్న ఐదోవాడు ఆవెంటనే అందుకున్నాడు — "నువ్వుపంపించకపోతే మేం కూడా పంపమనుకో! నేను వెళ్లి ఆ పలకలన్నీ బావిలోపడేసివస్తా. ఆడపిల్లలు ఇంట్లో ఆపనీ ఈ పనీ చేసేవాళ్లు. ఇదిగో యీ చదువుజంజాటంలోపడి నప్పటినుంచి బొత్తిగా పనికే శ్రీకారం చుట్టారు. పనిపాటలులేవుకదా. జొన్నరొట్టె పట్టుకుని ఏ మూలకోపోయి కూర్చోడం తప్ప ఆపుల్ల యిటుతీసి పెట్టరుకదా".

పాలాసింగు జైల్లో వుండకపోతే ఆ చాపలన్నీ చుట్టచుట్టి అవతల విసిరి పారేసే వాళ్ళం".

"భాయీ, నోరు దాటితే వూరుదాటుతుందంటారు. నేనైతే ఈ నోటితో ఏమీ చెప్ప దలచుకోలేదు. అయినా ఎవరికీ తెలియంది గనకనా యిది! పాలాసింగూ"...

"పోనిరా, మానిన కురుపును మళ్లీ ఎందుకు కెలుకుతావ్? ఖైదు ఏన్నాళ్ళు? అపీలులోనే విడుదలకావచ్చు. అతను వచ్చినతర్వాత ఏవి నీళ్ళో ఏవిపాలో అన్నీ తెలుస్తయ్. మాకేం దురద?"

అలావాళ్ళు చాలా నేపటి వరకు మాట్లాడుకొన్నారు. కాని ఏ నిర్ణయానికి రాలేక పోయారు. అందుకు కారణంగ్రామానికే తలమానికం అయిన పాలాసింగూ, అతని మూఠావాళ్ళు జైల్లోవుండడమే!.

# [ 18 ]

ఏడాదిన్నరపాటు మంచానపడి జీవాసింగు చివరకు కన్నుమూశాడు. ఇంటిభారం అంతా బచన్‌పైనే పడింది. బచన్‌సింగుమీద ఆశపెట్టుకుని అతనితల్లి యింకా జీవించి వుంది. ఒక్కడే సంతానం ఆమెకు.

పాలాసింగు అతని ముఠావాళ్ళు జైలుశిక్ష అనుభవించి ఒక్కరొక్కరే విడుదలయ్యారు. భాయీజీ దనౌంధాసింగు కూడా విడుదలయ్యాడు. బచన్ మరో గ్రంథిని గురుద్వారాలో తెచ్చిపెట్టాడని జైల్లోవుంటూండగానే అతను విన్నాడు. ముందు ఆ గ్రంథిని చాపా చుట్టా చంకనపెట్టించి అవూళ్లోనుంచి తరిమివేస్తేగానీ నిద్రపోగూడదనుకున్నాడు. పాలా సింగూ అతని ముఠావిస్పందేహంగా భాయీజీ కోర్టులో యిచ్చిన స్టేట్‌మెంట్ ఆధారం గానే జైలుకు వెళ్లవలసివచ్చింది. కాని ఇదంతా భాయీజీ స్వతహాగా చెయ్యలేదని కోర్టులో అతని తెలివితక్కువతనం వల్లనే వాళ్లు పోవలసివచ్చిందనీ వాళ్ళకు తెలుసు. అందువల్లే అతను చేసిన అపరాధాన్ని వాళ్లు క్షమించారు. అదీకాక భాయీజీవల్ల వాళ్లకు ఎన్నోపనులు కావాల్సివుంది. అందుకని మళ్లీవాళ్లే భాయీజీని పిలిపించి కలుపుకొన్నారు".

జైల్లోంచి పాలాసింగు విడుదలై వూరికి తిరిగొచ్చిన రోజు ఏకొందరో మినహాయించి దాదాపు వూరిలో వాళ్ళందరూ అతనికి హృదయపూర్వకంగా స్వాగతం ఇచ్చారు. భాయీజీ తిరిగివచ్చింతర్వాత మరింత గౌరవం, ఆదరణ, గుర్తింపూ వచ్చాయి. ఎవరి నోట విన్నా ఒకేమాట. "చూశారా, ఏపాపమూ ఎరగని భాయీజీని జైలుకిపంపినందుకు ఆ బచన్‌సింగుకు తగినశాస్తే జరిగింది. ఆ పాపం వెళ్ళి ఆయన తండ్రిని కొట్టింది. ఆయన గుటుక్కుమన్నాడు. భగవంతుడనేవాడు లేడూ ? ఇంతటి అన్యాయాన్ని చూస్తూచూస్తూ వూరుకుంటాడా. వాడి ప్రతాపానికి అందరు లొంగవలసిందే. పేదవాని వుసురు వూరికే పోతుందా ? అని".

జ్ఞానీజీ అంటే వూరి వాళ్ళకు అసలు కిట్టడంలేదు. అంతకుముందు కొంతమందికి అతనిపట్ల సానుభూతి వుండేది. ఇప్పుడు వాళ్లు కూడా అతనికి విరోధులయ్యారు. చాలా మంధి తమ పిల్లల్ని గురుద్వారాకు చదువుకోడానికి పంపించడం మానేశారు.

వూరంతా తనపై కత్తికట్టడం చూసి జ్ఞానీజీకి బాధకలిగింది. చివరకు ఈ పీడ నుండి విముక్తిపొందటమే ఉత్తమం అనుకుని ఓ రోజు వూరువదలి వెళ్ళిపోయాడు. బచన్‌సింగు ఎంతచెప్పినా వినలేదు. ఇంక తాను వూళ్లోవుంటే వ్యవహారం ముదిరి కొట్లాటల వరకు పోతుందనిపించింది అతనికి. అందుకే అతను అవూరునుంచి వెళ్లి పోయాడు.

గురుద్వారాలోంచి జ్ఞానీజీని వెళ్ళగొట్టడానికి దెబ్బలాటకు దిగాల్సివస్తుందని పాలా సింగు ముఠాఅనుకుంది. కాని అంతవరకు రాకుండానే వ్యవహారం పరిష్కారం అయి పోయింది. భాయీ దనౌంధాసింగు చల్లగా గురుద్వారాలోకి వచ్చి పీఠం వేసుక్కూర్చు న్నాడు.

పరాయిచోటు నుంచి ఓ వ్యక్తి వచ్చి గురుద్వారాను బాగుచేస్తానని నడుం బిగించడం అతనికి కంటకప్రాయంగా కనపడింది. జ్ఞానీజీ కన్నా ఎక్కువగా గురుద్వారా శోభను పెంచి అయన్ను మించాలని అనుకున్నాడు భాయీజీ. ఇలాచేస్తే గ్రామంలో జ్ఞానీజీ అంటే సానుభూతి వున్న కొద్దిమందిని కూడ తనవైపు తిప్పుకోవచ్చు.

గురునానక్‌దేవ్ గురుపర్వం వస్తోంది. ఆనాడు భజనకీర్తనలు పాడేకూటాన్ని పిలి పించడానికి ఏర్పాట్లుచేశారు. దానివల్ల గురుద్వార పలుకుబడి పెరుగుతుందికదా!

భాయీజీ గురుద్వారాలో అడుగు పెట్టగానే "బచన్‌సింగే అధికారులకు లంచం ఇచ్చి కోర్టులో తనచేత తప్పుడు సాక్ష్యం ఇప్పించాడనీ, దానివల్లనే అమాయకులైన పాలా సింగు ముఠా జైలుపాలు కావలసివచ్చిందనీ పుకారు లేవశాదీడు. దాంతో భాజీయీ అంటే వూరివాళ్ళకు గౌరవం ఏర్పడింది. బచన్‌సింగంటే కోపం వచ్చింది. ఎంత తొందరగా బచన్‌ను తమకులాన్నుంచి వెలివేస్తే అంతమంచిదని వాళ్లు భావిస్తున్నారు. కోతులు ఆడించే రోడూ మనుమరాలితో రోజు రోజుకూ అతని సంబధం పెరుగుతోందని గుసగుసలు బయలుదేరాయి. నెమ్మదిగా ఆ నిప్పురాజుకోడం మొదలెట్టింది. ప్రతిరోజూ చదువు చెప్పాలనే మిషతో బచన్, రోడూ గుడిసెకు వెళ్తాడు. గంటలకొద్ది అక్కడే పడివుంటాడు. దానికి విరుగుడు కనిపెట్టాలని అందరూ అనుకొసాగారు. గురుపర్వం నాడు అందరు గురుద్వారాలో ఒకచోట చేరినప్పుడు ఈ విషయాన్ని చర్చించి ఏదో నిర్ణయం తీసుకోవాలి అని అందరూ ఒక నిశ్చయానికి వచ్చారు.

ఇప్పుడు సుందరిలో కూడా చాలా మార్పు వచ్చింది. కాస్తోకూస్తో చదువు వంట బట్టింది. జ్ఞానీజీ బచన్‌ల సత్సాంగత్యం ఆమె ప్రతిభను మరింత ప్రకాశింప చేసింది. ఇప్పుడు ఆమె సిక్కు మత సిద్ధాంతాల్ని, సిక్కు సాహిత్యాన్ని, సిక్కు చరిత్రనూ

త్వరంగా అర్థంచేసుకుంటోంది. బచన్‌సింగు తల్లి పాతకాలపు మనిషి. అవకాశం దొరికి నప్పుడెల్లా పొరుగింటి అమ్మలక్కలు చిలవలూ పలవలూ కల్పించి బాగానూరిపోసే వాళ్లు. ఆమెను తెచ్చకొట్టడానికి విశ్వప్రయత్నాలు చేసేవాళ్లు. కాని బచన్‌సింగూ, జ్ఞానీజీ ఇద్దరూ ఆమెను వెనకేసుకొస్తూండడంవల్ల అమ్మలక్కలవాడీలు ఆమెమీద ఏమీపనిచేయ లేదు.

[1]గురుపర్వం దగ్గరపడ్తోంది. ఆ అలౌకిక దృశ్యం చూడాలని సుందరి మనస్సు ఉవ్విళ్లూరుతోంది. గురువుల ఘన కార్యాలూ, మృతవీరుల బోధనలూ జ్ఞానీజీ నోట విని గురుభక్తి మహాసముద్రంలా ఆమె హృదయంలో హోరుపెడ్తోంది. ఆ అలౌకిక దృశ్యాన్ని తాను చూడడం ఎలా అన్న ఆలోచన వచ్చినప్పుడల్లా ఆమె బాధతో కుంగి పోయేది. అందరికన్నా ఎక్కువగా ఆమె తాత రోషూయే ఆమెను భయపెట్టాడు. అయినా అందరు చూస్తూండగానో, దొంగతనంగానో ఎలాగో ఓలాగు గురుపర్వం రోజున సద్గురు దర్బారులో శిరస్సు వంచి నమస్కరించాలన్న కోరికను మాత్రం అణచుకోలేకపోయింది.

గురుపర్వానికి ఇంక ఒక్కరోజేవుంది. గురుద్వారాలో పెద్ద ఎత్తున సన్నాహాలు చేస్తు న్నారు. రేపు పెందలకడనే రాగీలు[2] వచ్చి కీర్తనలు పాడ్తారని సుందరి వింది. ఆరాత్రి ఆమె గంటలులెక్కపెడ్తూ నిద్రపోలేదు. సావాసదోషంగాబోలు ఆమె మనస్సు కూడా కోతిలా గెంతులువేస్తోంది. 'రేపు గురుద్వారా తలుపు తీయగానే ఎవరు చూడకుండా లోప లికి వెళ్తాను. ముంగిట్లో వున్న రేగిచెట్టు ఎక్కి ఎవరికి కనపడకుండా దట్టంగావున్న కొమ్మమీద కూర్చుంటాను''— అని అనుకుంది. మళ్ళీ అంతలోకే అలాకాదు. అలా చేస్తే ఎవరైనా చూస్తారు. పైగా సద్గురు దర్బారులో నేను వాళ్ళకన్న ఎత్తుగా ఎలా కూర్చుంటాను అని మరోసారి అనుకుంది. ఏదోవిధంగా తనను ఎవ్వరు చూడకుండా వుండే వుపాయం వెతకాలి. ఆలోచనలతో ఎప్పుడో మెల్లగా ఆమెకు తెలియకుండానే కునుకు పట్టేసింది.

ఉదయం మెలకువవచ్చి చూసేసరికి గుడిసెలోకి వెలుతురు తొంగిచూస్తోంది. ఇంత వళ్లుతెలీకుండా నిద్రపోయినందుకు ఆమెనొచ్చుకుంది. ఒక్క క్షణం కూడా ఇంట్లోవుండ లేకపోయింది. తాత పడుకొన్నవైపు చూసింది. రోషూ తాత ఇంకా గుర్రుపెట్టి నిద్ర పోతున్నాడు. మెల్లిగా అడుగుల్లో అడుగు వేసుకుంటూ బయటికి వచ్చి నేరుగా గురు

1. గురునానక్ జయంతి లేక వర్ధంతి.
2. సంకీర్తనంచేయు భజన కూటమి.

ద్వారావైపుకు వెళ్ళింది. దూరంలో వుండగానే బాజాలూ. పాటలూ వినబడతాయని అను కుంది. కాని ఆమె అక్కడకు వెళ్ళి చూసేసరికి ఆ అభిప్రాయం సరికాదని అర్థమై పోయింది. గురుద్వారా తలుపులు ఇంకా మూసేయున్నాయి. యింకా పొద్దుపొడవలేదనీ, వెన్నెల వుండడంవల్ల తెల్లారిపోయినట్లు భ్రమపడిందని తెలుసుకుంది.

ఎలాగైనా లోపలికెళ్ళే వుపాయం గురించి సుందరి ఆలోచించ సాగింది. గురుగ్రంథ సాహెబువుండే చోటుకు పక్కగానే గడ్డితో నిండిన ఓగది వుంటుందనీ అది తెరచి వుంటూందని ఆమెకు జ్ఞాపకం వచ్చింది. ఆ గది తలుపు గురుగ్రంథసాహెబు వున్న గదిలోకి తెరచివుంటుంది. బయట నుండీ వసారాలో నుండీ గదులు ఎలావున్నవీ అనేక సార్లు ఆమె చూసింది.

ఇక ముంగిట్లోవున్న గుమ్మంలోంచి లోపలికి దూరడమే తరువాయి. ఆమె వెళ్ళ డానికి వెన్నెల పెద్ద ఆటంకంగా పరిణమించింది. ఆలోచిస్తూ గురుద్వారా వెనుక భాగంలోకి వెళ్ళింది. అక్కడ గోడలో గూడు ఒకటి కనిపించింది. ఆమె వెంటనే ఒక్క అదటున దానిపై ఎక్కి ఒకకాలు కన్నంలో పెట్టి కప్పుమీదకు ఎగబాకింది. కప్పుపైనుంచి రేగిచెట్టు కొమ్మను అందుకుని వేలాడుతూ ప్రాంగణంలోకి దూకేసింది. ఆ వెంబడే గడ్డికొట్టంలోకి దూరి మూల కూర్చుండిపోయింది. గురుగ్రంథసాహెబు వున్న గదిలోకి వెళ్ళే తలుపు వేసివుందోలేదో చూద్దామని వట్టినే అలా తోసేసరికి మెల్లగా అది తెరుచుకుంది. పర్వాలేదనుకుంది. గదిలో గడ్డి ఎక్కువగా వుందేమో ఆమె తోపుకు సులభంగా తలుపైతే తెరుచుకుంది. కాని దానితోబాటు చాలాగడ్డి గురుగ్రంథసాహెబు గదిలోకి కుప్పగా వచ్చి పడింది.

సుందరికి ఎవరైనా మేల్కొని వున్నారేమో అని భయం వేసింది. కాని అదృష్ట వశాత్తు అక్కడ నిద్రపోతున్న ముగ్గురిలోనూ ఏఒక్కరూ తెలివిలోలేరు. అదీ కాక ఆగదిలో చీకటిగావుంది. చిన్న కిటికీగుండా వెన్నెల ఆగదిలో ఓమూలపడుతోంది. తలుపుదగ్గరగా వున్న గడ్డిని కొద్దికొద్దిగా తీసి వెనక్కు కుప్పగా వేయసాగింది. వరుసగా గంటసేపు అలావేయగా ఆమెకు నిలబడడానికి సరిపడా చోటు ఏర్పడింది. ఆమె వెనుక నిలువెత్తున గడ్డిపోగైంది. ఆతర్వాత రెండోవైపువున్న గడ్డి కూడా సాపుచేసి తలుపు మూసుకొని లోపల కూర్చోంది. కాసేపటిలో ఆమెకు కునుకు పట్టింది.

ఆ నిద్రలో బచన్‌సింగు ఆమెకు నేర్పిన గురునానక్ సాఖీలు[1] ఒక్కొక్కటిగా రూపం ధరించుకుని ఆమె కళ్లెదుట నర్తించాయి. తాను స్వయంగా చూస్తున్నట్లుగా ఒక్కొక్క

1. అధ్యాత్మిక కీర్తన.

దృశ్యం ఆమె కళ్ళలో తిరగసాగింది. సరిగ్గా ఆరోజే ఆ మహాత్ముడు అవతారం ఎత్తాడు. ఆ ఆలోచనే ఆమె ముందు దివ్యసుందర రూపం ధరించి నిలబడింది. రోయే తోయేకి తల్వండి.[1] ఏదో మహా ఉత్సవం జరుపుకొంటోంది. కాలూ పట్వారీ ఇల్లు కోటి మణిదీపాల వెలుగుతో ఉజ్వలంగా ప్రకాశిస్తోంది. ప్రకృతి తన సౌరభాన్నంతా వెదజల్లి ఆ ప్రాంతాన్ని ఘుమఘుమలాడేట్టు చేస్తోంది. చీకటి కమ్ముకొన్న హృదయాన్ని చీల్చి దానిలో జ్యోతి వెలిగించే సూర్యునిలా చల్లని వెన్నెల కిరణాలను నలుపక్కలా ప్రసరింపచేసే చందమామలాంటి బిడ్డ "దృప్తా తల్లి" ఒడిలో భాసిస్తున్నాడు. ఒక్కసారి అతణ్ణి చూస్తేచాలు, అంతరంగం అంతా వేయికోట్ల ప్రభలతో వెలిగిపోతుంది. హృదయాంతరాళాలు ఆ దివ్యానుభూతికి పులకాయమానమౌతాయి.

మళ్లీ ఆమెకు మరికొన్ని దివ్యదృశ్యాలు కనబడసాగాయి. బాలనానక్ తోటి పిల్లలతో దోబూచులాడుతున్నాడు. వృక్షాల చల్లనినీడలో నిద్రపోతున్నాడు. సర్పం తన పడగనువిప్పి అతనికి ఛత్రం పట్టింది. తను విహ్వాలయై అతని పాదాలపైవాలి తన కన్నీటితో అతని పాదాలను కడిగింది. "ఓ, ప్రీతమ్, అమృతాన్ని నింపుకొన్న నీ కళ్లు ఓసారి నన్ను చూడాలి. నీపాదాలపైవాలే అధికారం లేకపోవడానికి ఈ అభాగిని చేసినతప్పేమిటి?. నేను ఎంతమంది చూపుల్లో తప్పించుకుంటూ నీ సన్నిధికి వచ్చాను. నా హృదయేశ్వరా. నువ్వు నీ నేస్తాలతో నీ ఇష్టంవచ్చినట్లు దోబూచులాడు. కాని నేను బలహీనురాల్ని. నిన్ను వెతికి కనుక్కొనేంత శక్తినాలోలేదు. నాతో దోబూచులాడకు. నన్ను నీ సన్నిధానంలో రానివ్వకుండా చేయకు" అని విన్నవించుకోసాగింది.

అంతలోకే ఆకాశమార్గాన ఓధ్వని వినిపించింది. ఎవరో నగారా మీద దెబ్బకొట్టినట్లుగా, తియ్యని వాద్యానికి అనుగుణంగా ఎవరిదో మధురమైన గళంలోంచి మరింత తీయని ధ్వని బయల్దేరి అన్ని దిక్కులూ ప్రతిధ్వనించి ఆ ప్రతిధ్వనితోపాటు యావత్తు బ్రహ్మాండమూ ఏదో అనిర్వచనీయమైన వర్ణనాతీతమైన గంధస్పర్శతో గుబాళించినట్లు అయింది. తన ప్రియుడు ఆకాశమార్గాన దిగివస్తున్నాడు. అతనివెంట మరిద్దరు వున్నారు. అది ఒక రమణీయమైన కొండ చరియ. ఆ చరియలో పూలభారంతో వంగిపోయి మత్తులో మొక్కలు కదులుతున్నాయి. తన ప్రియుడు ఆ ప్రకృతి వనస్థలి మధ్య ఆసనం అలంకరించాడు. అతని అనుచరులిద్దరూ అతనికి రెండువైపులా కూర్చున్నారు.

---

1. గురునానక్ జన్మస్థలం.

తాను పరుగెత్తుకుంటూ వెళ్లి అతని పాదాలు పట్టుకొని కన్నీరు మున్నీరుగా విలపించింది. తన కన్నీటిధారలతో అతని పాదాల్ని కడిగింది. "నా మనోనాథా ! ఈ ఎడబాటు నేను సహించలేను. నీ చరణదాసిగా వుండనివ్వు. ఎవరైనా నీ దగ్గరకు నన్ను రానీయకుంటే వారిని నువ్వేవారించు. ఓ దాతా, నామనస్సును గాయం చేయకు" అని పరిపరివిధాల తన మనోవ్యధను ఆయన పాదాలపై ఒలగబోసింది.

స్వర్గాధిపతియైన ఆ దివ్యపురుషోత్తముడు నిమురుతూ "సుందరీ, నీ మనోరథం నెరవేరుతుంది. నిన్ను ఎవరూ ఆపలేరు. ఎవ్వరు ఆపినా నువ్వాగలేవు. లే, నామాట నమ్ము ... లే" అని అప్యాయంగా అన్నాడు.

అప్పుడు తను అతని పాదాలపై నుంచి లేచింది. తన అంతరంగంలోను బాహ్యరంగంలోనూ ఓ విలక్షణమైన వర్ణనాతీతమైన శబ్దాతీతమైన ఓ దివ్యానుభూతి కలిగింది. తన అణువణువులో అసాధారణ మాధుర్యంతో అమృతసోనలు కురిసి ప్రవహించ సాగాయి. తనచెవుల్లో ఆధ్యాత్మికరసంలో తడిసిన "శబ్దాలు" ప్రతిధ్వనించ సాగాయి. చరాచర జగత్తులోని రాగాలన్నీ ఒక్క మహాసంగీతంలో ఏకమై ప్రకృతిలోని ప్రతి ప్రాణిని మాధుర్యంతో తన్మయపరుస్తున్నట్లుగా అనిపించింది. [1]ఆ శబ్దాన్ని అతని పక్కనేవున్న మహాత్ముడు పాడుతూంటే అతని రబాబ్ [2] లోంచి మనస్సును పులకింపచేసే లయ, తానం ప్రతిధ్వనించేయి.

"హర్ అమృత్ మిన్నే లోయినా, మన్‌ప్రేమ్ రతాన్నా రామరాజే
మన్‌రామ్ కసవటీ లాయియా, కంచన్ సోలిన్నా
గుర్‌ముఖ్ రంగ్ చలూలియా మేరా మన్ తన్ మిన్నా
జన్‌నానక్ ముసక్ ఝకోలియా సబ్ జనమ్ ధన్ ధన్నా."

[హరినామ స్మరణ అనే అమృతరసపానంలో మనస్సు లీనమైంది. ఓ భాయీ, ప్రేమఅనే రత్నాన్ని పొందడానికి మనసు ఆరాటపడుతోంది. సర్వేశ్వరుడు అనే మూసలో కరిగించిన బంగారంలా మనసు మెరవసాగింది. భగవంతుడు అనే కస్తూరీ పరిమళాలు ఆఘ్రాణించి అందరి తనువులు జన్మసాఫల్యాన్ని పొందాయి.]

ఆమె సుందర స్వప్నం కరిగిపోయి మళ్లీ ఈ ప్రపంచంలోకి వచ్చింది. కళ్లు తెరచి చూస్తే తను ఆ గడ్డి గదిలోనేవుంది. తలుపు సందులోనుంచి తొంగి చూసింది. రాగీలు అసాదీవార్ [3] పాడడం ప్రారంభించారు. మొదటి షట్పదిపూర్తికాగానే "వార్‌స

---

1. సూక్తి. 2. ఒకరకమయిన వాయిద్యం.
3. ఉదయాన్న చేయు గురుగ్రంథ సాహెబు పారాయణం.

లోకం నాల్‌నలోకే మహల్లే పల్లేకే ..." అంటూ గురునానక్‌దేవ్ మహిమను పాడడం మొదలెట్టారు.

సుందరి అక్కడే బానిపట్టు వేసుకొని కూర్చుని ఆ సంకీర్తన శ్రద్ధగా వింటోంది. జీవితంలో మొదటిసారి ఆమె గురుగ్రంథసాహెబును దర్శనం చేసుకుంది. కాని దాని సమక్షంలో వెళ్ళి శిరస్సువంచి మొక్కడం ఎలా? మోకరిల్లాలనే కోరిక ఆమెలో క్షణ క్షణానికిబలీయమౌతుంది. ఎక్కడా ఆమెకు కాలు నిలువడం లేదు.

కీర్తనలు వింటూవుంటే ఆమెలో ఉత్సాహం పరవళ్లు తొక్కుతోంది. పొద్దుబాగా ఎక్కింది. ఆసాదీవార్ పఠనంలో యింక నాలుగైదు శ్లోకాలే మిగిలాయి. జనం కొద్దిగా ఒక్కొక్కరే గురుద్వారాకు రావడం మొదలెట్టారు. ఈ రోజు యిలాగే శాశ్వతంగావుండిపోతే ఎంతబాగుండును అనిపించింది ఆమెకు. తన మనస్సును సద్గురు పాదాల ముందు అర్పించి అలాగేవుండిపోతే? ఈ రోజు ఆ సంకీర్తనలను వినకుండా తనను ఏశక్తి కూడా ఆపలేదు.

గ్రంథపారాయణం అయిపోవచ్చింది. ఇంకా భోగం పెట్టడానికి సంగత్[1] రాలేదు. రాగీలకు ఆశాభంగం అయింది. కొంచెంసేపటిలో ఎవ్వరూ రాకపోతే ఈ పర్యాయం గురుపర్వం వృథాగా పోతుంది. వారిలో ఒకరులేచి భాయీజీవద్దకు వెళ్ళి "భోగం పెట్టాల్సిన వేళ మించిపోతుంది. సంగత్ ఇంకారాలేదు". అనిచెప్పారు. భాయీజీ కూర్చొనే కునుకుతీస్తున్నాడు. రాగీ మాటలు విని అదిరిపడిలేచాడు. కళ్ళు నలుపుకుంటూ "ఏమన్నారు?" అని ప్రశ్నించాడు. రాగీసింగు మళ్లీచెప్పాడు.

"వీళ్ళంతా పల్లెటూరివాళ్ళు. వెళ్ళి పిలుచుకొస్తాను" అంటూ బయటికి వెళ్లాడు భాయీజీ.

చాలినంతమంది జనం వచ్చాక భోగం పెడితేనే బాగుంటుందని రాగీలు ఇంకా కీర్తనలు పాడుతూనే వున్నారు. భాయీజీ తిరిగివచ్చాడు. మళ్ళీ బయటికివెళ్ళాడు. మళ్లీ తిరిగి వచ్చాడు. మళ్ళీ మూడవసారి బయటకు వెళ్లాడు.

మధ్యాహ్నంఅయింది. వండినప్రసాదం చాలా దూరంవరకు వాసనవిరజిమ్ముతోంటే నెమ్మది నెమ్మదిగా జనం గురుద్వారానికి రాసాగారు. సంగత్ కూడా రావడంచూసి జనంలో కొంతమంది రాగీల పక్కకుచేరి 'తొందరగ భోగం పెట్టండి, మేమింకాదూరం వెళ్ళాలి" అంటూ మోచేతుల్తో కుదిపారు.

---

1. భక్తబృందం.

చివరిభోగం పెట్టగానే అర్దాసా[1] చేయడానికి భుజాలుఎగరేస్తూ భాయీజీ ముందుకు వచ్చాడు. ఇవ్వాళ ప్రసాదం చాలా చేయించారు. నేతితోఘుమఘుమ లాడిపోతోంది. పదకొండురూపాయల ప్రసాదం ఒక్క పాలాసింగు ముతాయే చేయించింది? ఇది కాక పంచాయతీ అధ్వర్యంలో చేయించిన ప్రసాదం వేరుగావుంది.

"సిక్కు పఢ్‌దే సుచిదే సర్‌బత్ లాహే వంద్, జో ఆవే సో రాజీ జాయే. గురు నానక్‌నామ్ చఢదీ కలా, తేరే భాణే సరబత్ దాభలా"

ఏ సిక్కయితే నీ కీర్తనలు వింటాడో, నీ యశోగాథను పాడుతూ ఎవ్వరై తేవస్తారో, అతని మనోరథం ఈడేరుగాక ! గురునామం అనేది ప్రవర్థమానమయ్యేటి కళలాంటిది ఆతనికి ఎవరిపై అనుగ్రహం కలుగుతుందో వారికి మేలు చేకూరుతుంది.

పార్థన సమాప్తమయింది. సంగత్‌లోని సభ్యులంతా గురుగ్రంథసాహెబుకు మోకరిల్లారు.

అంతలో దభాలున శబ్దంచేస్తూ గడ్డివున్న గదితలుపు తెరుచుకొని గడ్డిఅంతా ఇవతలి గదిలోకి కుప్పగా వచ్చిపడింది. దానితోపాటు ఓపిల్ల తూలుతూవచ్చి నేలమీద బోర్లా పడిపోయింది. మిగతా గడ్డిఅంతా ఆమెమీదపడి ఆమెను పూర్తిగా కప్పివేసింది. అయితే అలా నేలమీదపడడంలో ఆమె తల సరిగ్గా గురుగ్రంథసాహెబు ముందు మోకరిల్లేస్థానాన్ని తాకింది.

కనురెప్పపాటులో జరిగిపోయిన యీ సంఘటనకు అక్కడ చేరినజనం తుళ్ళిపడ్డారు. కోతులు ఆడించే అలగాజాతిపిల్ల గురుద్వారాలోకి వచ్చిందన్న విషయం తెలియడంతో అందరూ రెచ్చిపోయారు. ఇచ్చేవాడు భగవంతుడు. పుచ్చుకునేవాడు భక్తుడు. మధ్య వాళ్ళెవరు ? కాని అక్కడ వూరుకొనేవారు కూడాలేరే ? అంతా ఒక్కుమ్మడిగా ఆ పసిదానిపై విరుచుకపడ్డారు. ఇష్టం వచ్చినట్లు తలా ఓ తన్ను తన్నారు. చెంపలు పగల గొట్టారు. గుద్దులు గుద్దారు. చావమోదారు. పిండిపిండి చేశారు. మొదలే ఆమె అంటే వూరివాళ్ళకు కోపం. దానికితోడు ఆ అంటరానిజాతిపిల్ల గురుద్వారాలో ప్రవేశించే సరికి దేగిశాల నిండా వండిన ప్రసాదం అంతా అపవిత్రమైపోయింది. ఇక అది కుక్కలకూ కాకులకూ వేయవలసిందేకదా అని వాళ్ళందరి మంటాను. ఆ అమ్మాయిని ఇంకా చావమోదేవాళ్ళే. కాని తీరా ఆ పిల్ల ఇక్కడే చచ్చిపోతుందేమో అన్న భయం వాళ్ళలో కొంతమందికి కలిగింది. మొన్ననే ఒక కేసులో తలదూర్చి బయటకు

---

1. దైవ ప్రార్థన

లాక్కునేసరికి వాళ్ళకు తలప్రాణం తోకకు వచ్చింది. మళ్ళీ ఇంతలోనే మరో విపత్తును కొనితెచ్చుకోడానికి వాళ్ళు ఇష్టపడలేదు.

నోటికి వచ్చినట్లల్లా తిడుతో బరబరమని ఆ పిల్లను ఈడ్చుకుంటూ ముంగిట్లోకి తీసుకొచ్చారు. ఆ పిల్ల ముక్కులోంచీ, నోట్లోంచీ, తలమీదనుంచీ జలజలమని రక్తం కారసాగింది. చూస్తుండగానే ఆ రక్తంలో ఆమె గుడ్డలన్నీ తడిసిపోయాయి. ఆమె ఇక బతకదని చాలామంది అనుకున్నారు. కొంతమందిమాత్రం సానుభూతితో తమలో తాము చెవులు కొరుక్కున్నారు. సరిగ్గా అప్పుడే బయట నుండి బచన్‌సింగు గురుద్వారాలోకి వచ్చాడు.

బచన్‌సింగును చూడగానే వాళ్ళలో అణగివున్న క్రోధజ్వాలలు ఒక్కసారిగా భగ్గుమన్నాయి. అతనిమీద పగతీర్చుకోడానికి ఎప్పుడు అవకాశం వస్తుందా అని ఇన్నాళ్ళు వాళ్ళెదురుచూస్తూ కూచున్నారు. ఇప్పుడు వాళ్లకు మంచి అవకాశం దొరకనే దొరికింది. ఇదంతా బచన్‌సింగే తెరవెనుకవుండి నాటకం ఆడించాడన్న సందేహం వాళ్ల మనస్సులో నాటుకుంది.

రక్తం మడుగులో స్పృహతప్పి పడివున్న సుందరిని చూడగానే బచన్‌సింగుకు ఎక్కడలేని ఆవేశమూ వచ్చింది. అతనిలోని రక్తం సలసలకాగిపోయింది. "ఈమెను ఎవరు కొట్టారు ? అసలామెచేసిన అపరాధం ఏమిటి ? " అని గద్దించి అడిగాడు అక్కడి జనాన్ని ఉద్దేశించి.

" దానికి ఇక్కడ ఏంపని ! " " అసలది ఇక్కడకు ఎలారాగలిగింది ? " " మాకందరికి తెలిసిపోయిందిలే " " ధర్మచ్యుతి అయిపోయింది ". " కలికాలం. ఏం చేస్తాం ? " " ఇకమాకు పరలోకగతులు లేకుండా చేసేసింది " " ఇన్ని దేగిశాల ప్రసాదం ఏంచేయాలి ? " అంటూ ఒక్కసారిగా ప్రశ్నల వర్షం కురిపించారు బచన్‌సింగు మీద.

సుందరిని వదిలేసి బచన్‌సింగును చుట్టుముట్టారు. ఎలుకను చంపేముందు క్రూరంగా చూసే పిల్లిలాగ వాళ్లంతా బచన్‌ను చూడసాగారు. అంతమందీ ఒక్కసారిగా తనమీద విరుచుకుపడ్డాకూడా బచన్‌సింగు ఏమాత్రం చలించలేదు, ఆవగింజంతన్నా తగ్గలేదు. కోపంతో అతను కంపించిపోతున్నాడు. " ఇంతకన్న కసాయివాడే మేలు. భగవత్ కీర్తన వినాలని వచ్చిందే అనుకోండి. అంతలోనే ఏమంత మునిగిపోయింది ? అమానుషంగా అంత నిర్దాక్షిణ్యంగా కొడ్తారా ? " అని గట్టిగా అడిగాడు. అతని గొంతు బొంగురుపోయి కళ్ళకొనల్లో నీళ్ళు నిలిచినట్లు.

అతను చేసిన నీతిబోధ వాళ్లకు ఎక్కలేదు. సారాదుకాణంలో కూర్చుని ఒళ్ళుమరచి తాగుతున్న వాడిదగ్గర వేదపఠనం చేస్తూంటే వాడేమైనా తొణుకుతాడా? పిచ్చి ప్రలాపం అనుకొని వాళ్లంతా హేళనగా నవ్వడం మొదలెట్టారు. "ఏమన్నావ్ సర్దార్జీ, పారాయణం వినాలని వచ్చిందా? ఈ కల్లబొల్లిమాటలు ఇంకెవరికైనా చెప్పు" అని గుంపులోంచి ఒకాయన అన్నాడు. "అసలే దొంగ. అందులో టక్కరి" అంటూ ఇంకొకడు అందుకున్నాడు. "మన పరువంతా గంగలో కలుపుతాడని మేము అనుకుంటూనే వున్నాం. దొంగతనం, రంకుతనం ఎన్నాళ్లు దాగుతుంది?" అని ఓ విసురు విసిరాడు మరొకడు. "ఆయన చెప్పిందల్లా విని ఆయనతో చేతులు కలపడానికి పాపం మనల్ని కూడా జ్ఞానీజీ అనుకున్నాడు కాబోలు. ఇటువంటి అప్రాచ్యపు పనులు ఇక్కడ భాయీజీ సాగనివ్వడని తెలియదు కాబోలు" అన్నాడు ఇంకొకడు.

తలాతోకలేని వాళ్ల ఎత్తిపొడుపులూ, ఈటెల్లాటి మాటలూ బచన్‌సింగుకు అర్థం కాలేదు. వాళ్లచేసే విచిత్రమైన చేష్టలు చూసి ఖంగారు పుట్టుకొచ్చింది.

సుందరి జ్ఞాపకంరాగానే అవన్నీ మరచిపోయాడు. వీళ్లతో వాదిస్తూ కూర్చుంటే సుందరి బతుకుతుందోలేదో అన్న భయంతో ఆమెను గభాలున తన చేతుల్లోకి ఎత్తి తీసుకుని—

"సరే నే నామెకు నా యింటికే తీసుకుపోతున్నాను. పోండి. నన్ను వెలేస్తారా? వెయ్యండి. మీరంటే నాకు పరమ అసహ్యం" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

"హి హీ హి... అంటూ" అందరు ఎగతాళిచేస్తూ, అట్టహాసంచేస్తూ, కేరింతాలు కొడుతూ నోటికి వచ్చినట్లు వాగడం మొదలెటారు వాళ్ళు.

శత్రువు ఆపదలో చిక్కుకొంటే చూసి ఆనందించడం మానవనైజం. దానివల్ల మనకు నష్టం కలుగుతున్నా అదంత బాధాకరంకాదు మనకు. బచన్‌సింగుతో పేచీ పెట్టుకోవాలని చూస్తోన్న ఆ వూరివాళ్ళకు వాళ్ళ ప్రమేయం లేకుండానే ఆపని నెరవేరేటప్పటికి ఇప్పుడు ప్రత్యేకంగా గిల్లికజ్జానికి దిగాల్సిన అవసరం గూడా లేకపోయింది. అందువల్ల వాళ్ళ కోపం గూడా ఎక్కువసేపు నిలువలేదు.

సంగత్, అపవిత్రమైన ప్రసాదాన్ని తీసివేశారు. అప్పటికప్పుడు మళ్ళీ దినుసుల్ని తెప్పించి ప్రసాదం చేయించారు.

అప్పటికే బాగా పొద్దు ఎక్కిపోయింది. వచ్చినవాళ్ళంతా
ఎప్పుడెప్పుడు ప్రసాదం తీసుకొని ఇళ్ళకు వెళ్దామా అని ఆదుర్దాగా వున్నారు. అప్పుడే

నంబర్‌దార్[1] నత్థాసింగు చిన్న కొడుకు గురుద్వారాలోకి వచ్చాడు. అతనితోపాటు ఓ కుక్కపిల్లకూడ తోక ఆడించుకుంటూ లోపలికి వచ్చింది. అక్కడ నత్థాసింగు కనబడ గానే అది ఎగిరి ఆయన ఒళ్లో కూర్చుని నాలుకసాచి మూతిని అటూ యిటూ తిప్ప సాగింది. అప్పుడే వండించిన ప్రసాదం వాసన దానిక్కూడా తగులుతూన్నట్లుంది. నత్థాసింగు ఆప్యాయంగా దాన్ని చేత్తో నిమురుతూ దాని మూతిపట్టుకొని కిందకువంచి చిన్నపిల్లమాదిరిగా ముద్దాడ సాగాడు.

అతని దగ్గరగానే కూర్చొన్న జ్వాలాసింగు ఆకుక్కపిల్ల వీపును తడుతూ "దీన్ని ఎక్కడ సంపాదించావ్? చూడడానికి మంచి జాతిదానిలా వుందే" అని అడిగాడు.

తన కుక్కపిల్లను ఎవరు పొగడుతారా అని ఎదురుచూస్తున్నాడు నత్థాసింగు. "అవును జ్వాలాసింగూ, ఎంతో సిఫారసు మీద తేగలిగాను దీన్ని. తహసీల్దారు టేకుచంద్ లేడూ? నాన్నగారికి ఆయనతో చాలా రోజుల్నుంచి బాగా పరిచయంవుంది. కిందటి సంవత్సరం ఆయన మిత్రుడు విదేశాలకు వెళ్తూ తనదగ్గరున్న కుక్క తాసీల్దారు గారికి ఇచ్చి వెళ్ళాడు. ఆ కుక్క ఈనాక ఓ పిల్లని తను తీసుకుంటానని ముందే చేప్పేశాడు నాన్నగారు. నేను కూడా అయిదారుసార్లు అక్కడికి వెళ్ళాను. పాతిక రూపాయలు సమర్పించుకోడమే కాక ఎంత ప్రాధేయపడ్డాననుకున్నావ్. మేలుజాతి కుక్కయ్యా. నాన్నగారు చెప్తూండేవారు. ఓ పర్యాయం తహసీల్దారుగారి గేదెను ఎవరో దొంగిలించా రట. దీని తల్లివెంటనే ఆ దొంగను పసికట్టి అతని ఇంటి నుండి గేదెను దానంతట అదే విడిపించుకొని వచ్చిందట".

కొంచెంసేపు ఆగి నంబర్‌దారు మళ్ళీ తన వుపన్యాసం కొనసాగించాడు. "రోజూ అర్థసేరు మాంసం వేస్తాం. ఇక పాలు దానికి ఎంతకావాలంటే అంత. దాని మూతిలోకి వేళ్లు పోనిచ్చినా కరవదు. ఎలా ఆడించినా ఏమీ అనదు, గీరదు. కాని బయటి మనిషి ఇంటికొచ్చాడంటేచాలు. ఇల్లు పైకప్పువూడిపడేలా మొరుగుతుంది. గొలుసు తెంచుకోవాలని ఒకటే గింజుకుంటుంది".

ఇంతలో ప్రసాదం పంచిపెట్టడం ప్రారంభించారు. నంబర్‌దారు కుక్కకు పెట్టిన ఫలహారాన్ని దానికి తినిపించాడు. తన కొచ్చిన భాగంలో కూడా మూడొంతులు మళ్ళీ దానికే తినిపించాడు. మిగిలినది తను నోట్లో వేసుకున్నాడు.

ప్రసాదం పంచిపెట్టిన తర్వాత రాగీలకోసం చందా వసూలుచేయడం మొదలెట్టారు. ఇటువంటి పనులకు సాధారణంగా నంబర్‌దార్, లద్దాసింగును ముందుంచుతారు. ఆరోజు కూడా అతన్నే ముందుంచారు.

---

1. పంజాబులోని జమీందారు.

అందరికన్నా ముందుగా భాయీజీ లేచి నిల్చుని అక్కడ వున్న వారిని వుద్దేశిస్తూ అన్నాడు.— " సిక్కు సోదరులారా. మన రాగీ సోదరులు ఏంతో మధురంగా సంకీర్తనం చేశారు. ఇప్పుడు వాళ్ళకు ఏదో మన శక్త్యానుసారం సమర్పించుకొని మన జన్మల్ని తరించుకొందాం ".

అందరి కళ్లు లద్దాసింగువైపు మళ్ళాయి. నంబర్‌దార్ ఏమిస్తాడో చూద్దాం అని కాసుకొని వున్నారు. "నువ్వంటే నువ్వు" అని చాలాసేపు వరకు అనుకోడంతోనే సరిపోయింది. చివరకు లద్దాసింగే తన తలపాగాలోంచి ఓ అర్థ రూపాయి బిళ్ళ తీసి వాళ్ళకు ఇచ్చాడు. ఆ నాణేన్ని చూడగానే రాగీల మొహాలు చిన్నబోయాయి. లద్దాసింగు వెనుకగా కూర్చోన్న దేవాసింగు వఁడంగి లేచి ముందుకొచ్చి ఓరూపాయివేసి యథా ప్రకారం తనస్థానంలో కూర్చున్నాడు.

వడ్రంగి దేవాసింగు తనకన్న తక్కువజాతివాడు, తనకంటే ఎక్కువ చందా యివ్వడం చూడగానే లద్దాసింగుకు ఒళ్లుమండింది. వెంటనేలేచి వెళ్ళి వాడికి రెండు వడ్డిద్దాం అనుకున్నాడు. కాని మళ్ళీ యేమనుకున్నాడో ఇంకోసారి చూచుకోవచ్చులే అన్నట్లు తమాయించుకున్నాడు.

అక్కడ కూర్చున్న వారిలో కరమ్‌సింగు తాత చాలా నిజాయితీపరుడు. కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడేరకం. ఏమాటైనా మొహాన్నే అనేస్తాడు. వెంటనే అనేశాడు— "భాయీ లద్దాసింగూ, నువ్వు మా తల కొట్టేశావు కదయ్యా. ఇవ్వదలచుకొన్నప్పుడు బోడి అర్ధరూపాయా ఇవ్వడం? ఆ దేవాసింగు చూడు. పేకముక్క మాదిరిగా తకా మని ఓరూపాయతీసి విసిరి పారేశాడు ".

మొదటి అవమానాన్ని ఎలాగో అతికష్టంమీద దిగమింగి కూర్చున్న లద్దాసింగుకు మరో అవమానాన్ని మింగాల్సివచ్చేసరికి అతనిలో ఓర్పు నశించింది. "ఇదిగో తాతా! ఎవరితోన్నా మాట్లాడేప్పుడు ఒళ్ళు దగ్గిరవుంచుకోమని ఎన్నిసార్లు చేప్పానునీకు? నీ బుర్ర సరిగా పనిచేయకపోతే అది వున్నవాళ్ళదగ్గిర నుండి అరువు తెచ్చుకొని వాడరాదూ? పెద్దగొప్పలు చెప్పొచ్చావ్, నీ గొప్పతనం నాకు తెలీనిదా! దియాలాకోమటి ఆరోజు నీగొడ్డూ గోదా అన్నీ జప్తు చేయిస్తూంటే నువ్వు మానాన్న కాళ్ళమీదపడి భోరున ఏడిచావు. జ్ఞాపకంలేదా? ఆరోజే నాన్న అడ్డం రాకపోతే నువ్వు దమ్మిడీకి కూడా కొరగాకుండా పోయేవాడివి" అని కరమ్‌సింగును బాగా జాడించాడు.

కరమ్‌సింగు కొడుకులు ఇద్దరూ అక్కడే కూర్చునివున్నారు. తమతండ్రిని అంతోటి మాటలనేసరికి వాళ్ళకు కోపంవచ్చింది. "ఏయ్! నంబరుదారూ, ఒళ్ళు దగ్గరపెట్టుకొని

మాట్లాడు. బిళ్ళకుడుంలాటి రూపాయి నీకు సమర్పించుకోవడమే కాక జైలుకు పోదానికి షబ్జాకుమ్మ రోడనుకున్నావా ? ఇంకోసారి మానాన్నను పల్లెత్తుమాటైనా అన్నావంటే చూడు. నోరు విప్పేవో వూరుకొనేదిలేదు. నేనసలే మంచోణ్ణికాదు. ఎవరిగౌరవం వాళ్లు కాపాడుకోవాలి. నువ్వు గౌరవం యిస్తే నీకూ గౌరవం యిస్తాం" పెద్దకొడుకు బేలాసింగు తగులుకొన్నాడు.

నంబర్‌దార్ సమాధానం చెప్పడానికి నోరు తెరిచాడు కాని అంతలోనే అతని అన్న కొడుకు ఫౌజాసింగు "ఇకతగ్గవోయ్. గులకరాళ్ల డబ్బాలా ఒకటే వాగుతున్నావ్. మాటలుచూస్తే కోటలు దాటుతున్నాయే. ఏం చేస్తావేం ? నేనూ చూస్తాను. నువ్వు మాటగాచెప్తే మేం చేతల్తో చెప్తాము. మేం చేసిచూపిస్తాం. ఎవడిసొమ్ము మేం తింటంలేదు, మాటలేంపడివుండడానికి."

కరమ్‌సింగు చిన్నకొడుకూకూడా ధైర్యం వచ్చింది. "అవునురా, నువ్వు ఎన్నైనా మాటలు నేర్చావ్. మీ తాతయే తిండికి మొహంవాచి చచ్చాడు. నువ్వేమో బీరాలు పలుకుతున్నావ్. ఎవడికి తెలియని సంగతిది" అన్న ఫౌజాసింగునుచూసి—

" నాసంగతి నీకేంతెలుసోయ్ ?" అని నంబర్‌దార్ కనుబొమలెగరేస్తూ అడిగాడు.

కరమ్‌సింగు తాలూకు మనుషుల్లో ఒకతను కలగచేసుకొంటూ "ఎందుకనవూ, కొడుకూ గోదాలేవి వూరివాళ్ళ ఆస్తులన్నీ రాయించుకొన్నావ్. పిల్లల్ని అమ్ముకొని ఆమిగతా కొరవా పూర్తిచేసి పెంచుకున్నావ్. ఎందుకు బలవదూ ! ఆరోజులు మరచిపోయావా ? ముగ్గురన్నదమ్ములూ దొంగతనంలో పట్టుపడిపోతే మాఇంటికొచ్చి ఆఘోరించాడు మీ నాన్న. ఆరోజు మేం ఆదుకోకపోతే నీకొడుకు కట్టుకున్న పెళ్ళాల చీరల్తోసహా సర్వం వేలం వేసేవాళ్ళు."

"ఒరే నోరుమూయరా, కుక్కా."

"పోరా ఎదవనాయాల. నువ్వే నోరుమూసుకో."

"వాణ్ణి పట్టుకోరా, ఎలాపోతాడో చూద్దాం."

"అలానా ?"

"ఆఁ !"

"సరే కానియ్."

"ఊఁ."

అక్కడికక్కడే మహాభారత సంగ్రామం మొదలైంది. చూస్తూండగానే చేతులు చేతులు కలిశాయి. అందరు గురుద్వారాలో వుండడంచేత ఎవరిచేతుల్లోనూ కర్రలూ,

కత్తులూ, గొడ్డళ్లూలేవు. లేకపోతే అప్పటికప్పుడే ఎన్నోఖూనీలు జరిగివుండేవి. కొద్ది సేపు రాగిలతబలాలూ, వాయిద్యాలు ఆయుధాలుగా వుపయోగించారు. కాని అవి ఎక్కువ సేపు వాళ్ళధాటికి తట్టుకోలేక పోయాయి. వాటితో అవతలవాడి తలమీద మోదగానే వాళ్ల వాళ్ల తలలు పగలకముందే అవే పగిలి పోయాయి!

ఆ యుద్ధకాండ చూసేసరికి ఖాయీజీగుండె ఆగినంత పనైంది. గురుపీఠం వెనక్కు వెళ్ళి దాక్కున్నాడు. రాగీసింగులు 'దొరికి నంతవరకేచాలు. బతికివుంటే బలుసాకు అమ్ముకోవచ్చు" అన్నట్లుగా వసూలైన పైకం మూటకట్టుకొని చెప్పులు కూడా వేసుకో కుండా రైల్వేస్టేషన్ వైపు కాళ్లకు బుద్ధిచెప్పారు.

సాయంకాలం అయ్యేసరికి పోలీసులు వచ్చారు. దొరికినవాళ్లను చిన్నా పెద్దా— అందరినీ పట్టుకుని తీసుకెళ్లారు.

ఇంతకూ చివరకు తేలిన పర్యవసానం అందరికీ తెలిసినదే! కొద్దిరోజుల్లోనే ఆగ్రామంలోవున్న డబ్బూ దస్కం కొంతమంది ప్లీడర్ల జేబుల్లోకీ, కోర్టు ఆఫీసుల్లోకి పోయింది! మిగిలిన అడుగూ బొడుగూను పోలీసువాళ్ళు గుటకాయస్వాహా చేశారు!!.

---

# [ 19 ]

బచన్‌సింగు సుందరిని తిన్నగా తన ఇంటికి తీసుకొచ్చాడేకాని కొరివితో తలగోక్కు న్నట్లయింది అతని పరిస్థితి. అటవి తల్లీ అసలే సుందరి వ్యవహారంలో కొడుకు తలదూర్చినందుకు చింతిస్తోంది. ఏకంగా అతను సుందరిని ఇంటికే తీసుకొచ్చేసరికి ఆమె ప్రైప్రాణాలు పైనేపోయాయి. ఏదిక్కూతోచలేదు. బచన్‌సింగుకు ఎదురుచెప్పలేదు. ఆ ఎరుకల పిల్లకూ అతనికీ మధ్యగల స్నేహాన్ని తుంచాలని ఎన్నో వుపాయాలు ఆలోచిస్తూవుంది. ఇప్పుడామెను ఇంట్లోనే తెచ్చిపెట్టాడు. అటు నుయ్యి ఇటు గొయ్యి లాగుంది, ఆమె పరిస్థితి.

అదీ కాక ప్రతి ఇంటా బచన్‌సింగు చేసిన పని గురించి గుసగుసలు బయలు దేరాయి. వూరివాళ్ళంతా ఆ తల్లీకొడుకుల్తో మాట్లాడడం బొత్తిగా మానుకున్నారు. బచన్ సింగుకు తల్లి ఎలాబాధపడుతుందో తెలుసు. గ్రామస్థులు తాటిని తెగేదాక లాగుతారనీ తెలుసు. అన్నీ తెలిసీ కూడా అతను సుందరిని ఇంటికి తెచ్చాడు. తెచ్చీతేవడంతోనే మంగలివాణ్ణి పిలిపించి ఆమెకు కట్టుకట్టించాడు. ఆ తర్వాత రోడూ దగ్గరకు వెళ్ళి జరి గిందంతా చెప్పి అతన్ని యింటికి తీసుకొచ్చాడు.

సుందరి పరిస్థితి చూసేసరికి రోడూకు మూర్ఛవచ్చినంత పనయింది. ఇప్పటికే తమగురించి వూరివాళ్ళచేత నానా మాటలూ పడుతూన్న బచన్‌జీ ఇప్పుడు సుందరిని ఇంటికే తీసుకొచ్చాడే—దీనికి యింకెంత పెద్ద రాద్ధాంతం జరుగుతుందోనని రోడూగుండెలు భయంతో విలవిల్లాడుతున్నాయి. బచన్‌సింగు కాళ్ళమీదపడి అతనుచేసిన మేలుకు కృతజ్ఞత తెలుపుకున్నాడు. సుందరిని స్పృహతప్పివున్న ఆ పరిస్థితిలోనే తన యింటికి తీసుకుపోతానన్నాడు. సుందరికి ఇక్కడ జరిగినంతగా తన గుడిసెకు తీసుకువెళ్తే జరగదనే విషయం రోడూకు తెలియకపోదు. మామూలు మందూ మాకూ కూడ ఇప్పించలేనవీ తెలుసు. కాని దాని కోసం బచన్‌సింగు గౌరవప్రతిష్ఠల్ని బలిచేయడం కన్న తనే యిబ్బందిపడడం వుత్తమమనుకున్నాడు. కాని అతను ఎన్నిసార్లు ప్రాధేయ పడినా సుందరిని తీసుకెళ్లడానికి బచన్ ఏంతమాత్రమూ అంగీకరించలేదు.

సుందరికి స్వస్థత చిక్కేవరకు బచన్ ఇంట్లోనే వుంటుందని నిశ్చయమై పోయింది. కాని రోడూకు మరో సంకటం వచ్చిపడింది. సుందరి ఎడబాటును అతను సహించ

లేదు. బచన్ ఇంట్లోవుంటే ఆమెకు తను పరిచర్య చేయవలసిన అవసరంలేదు. కాని ఆమె బాగుకోసం గుండెరాయి చేసుకొని, కొన్ని రోజులు సుందరి బచన్ ఇంట్లోనే వుండడానికి ఒప్పుకున్నాడు.

రెండు మూడు రోజులు వరుసగా సుందరిని చూసి వస్తుండేవాడు రోడూ. కాని ఎందుకో అకస్మాత్తుగా వెళ్ళడమే మానేశాడు. అతను కోతిని ఆడించడానికి వీధుల్లోనూ గొందుల్లోనూ తిరుగుతూవుంటే ఆనోటా ఆనోటా సుందరి బచన్లగురించి వాళ్లుచేసే ఎగతాళీలు వినలేక చెవులు మూసుకోవలని వచ్చేది అతనికి.

ఇక్కడ బచన్‌సింగు పరిస్థితికూడా అలానేవుంది. కాని అతను జంకేరకంకాదు కనుక తన లక్ష్యంనుండి తప్పుకోలేదు. తన ధ్యేయాన్ని విడిచిపెట్టలేదు. అడుగడుగునా ప్రజల ఎత్తిపొడుపులూ, వెటకారాలూ ములుకుల్లా వచ్చి తగుల్తున్నా అతని అడుగు మాత్రం తడబడలేదు. సుందరికి దగ్గరుండి జాగ్రత్తగా చికిత్స చేయిస్తున్నాడు.

రెండు రోజులపాటు సుందరికి స్పృహరాలేదు. మధ్యమధ్య కళ్ళు తెరువుడు పడి వెంటనే మూతపడేవి. మూడోరోజు రోడూ తాత రహస్యంగా ఎవరికి తెలీకుండ బచన్‌సింగు ఇంటికివచ్చి ఆమె తలవద్ద కూర్చున్నాడు. అప్పుడు సుందరి పక్కకు ఒత్తిగిలింది. ఆరోజు పొద్దున్న కూడా ఆమె అలాగే రెండు మూడు పర్యాయాలు కదిలింది. ఏదోగొణిగింది. నెమ్మదిగా సుందరి కళ్లు తెరిచింది. చుట్టూవున్న వస్తువుల్ని చూడసాగింది. సుందరికి తెలివిరాగానే రోడూకు పోయిన ప్రాణం తిరిగివచ్చినట్లయింది. ఆమె నుదుటిమీద చేత్తో నిమురుతూ బొంగురు పోయిన కంఠంతో 'సుందరీ' అని పిలిచాడు.

"ఊఁ" అని మెల్లగా అంది సుందరి.

"తల్లీ, ఇటు చూడు నన్ను"

సుందరి పక్కకు తిరిగి తన్ను పోషించి పెద్దచేసిన తాతను చూసింది. తలగడ దగ్గిర కూర్చొని ఎంతో ఆతృతగా తననే చూస్తున్నాడు. మెల్లగా తన చేతుల్ని అతని వైపుకుసాచింది. అతను ఆ చేతుల్లో తలను దాచుకున్నాడు.

"నేనిప్పుడు ఎక్కడున్నాను తాతా" అని అడిగింది సుందరి.

"నువ్వు నీ ఇంట్లోనేవున్నావమ్మా" అన్నాడు రోడూ.

"లేదు తాతా, ఇది మన ఇల్లుకాదు. మన ఇంట్లో మంచంలేదుకదా" అంటూ ఆశ్చర్యంగా చుట్టూ చూడసాగింది. కొద్దిసేపు అయ్యాకకానీ తన తలకికట్లు కట్టినట్లు ఆమె గ్రహించలేదు.

"తాతా, నన్ను ఇక్కడకు..." అంటూ తన చేతుల్ని రోడూ తలలోకి పోనిస్తూ మళ్లీ ఆగిపోయింది. ఆమె ప్రశ్నలకు జవాబు దానంతటదే ఆమెకు దొరికింది. ఆరోజు జరిగిన దుర్ఘటన పూసగుచ్చినట్లు వరుసగా ఆమెకు జ్ఞాపకంవచ్చి ఇలా అంది- "తాతా, నేను తెలివితప్పానుకదూ ?"

"అవును తల్లీ".

"పద తాతా, మనింటికి వెళ్ళిపోదాం."

"వెళ్దాంలేతల్లీ, కొంచెంసమయం కానియ్"

"వద్దూ తాతా, నేను బాగానే వున్నాను."

ఆమె నెమ్మదిగా లేచి మంచంమీద కూర్చోబోయింది. రోడూలేచి ఆమెను పట్టుకొని మంచంమీద కూచోపెట్టాడు. ఆమె తలను ఆప్యాయంగా నిమురుతూ "రేపు తీసుకెడతాలే తల్లీ" అన్నాడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకొంటూంటే కొంచెం దూరంలో కూర్చుని బచన్ అంతా వింటు న్నాడు. రోడూ అతనికి నమస్కారంచేసి "సర్దార్జీ. సుందరికి తెలివివచ్చింది. పొద్దున్నేవచ్చి ఇంటికి తీసుకెళ్ళిపోతాను" అన్నాడు.

"మీరు ఆమెగురించి బెంగపెట్టుకోవద్దు. పూర్తిగా బాగయ్యేవరకు ఇక్కడే వుం టుంది. మీరు వెళ్ళండి" అని బచన్‌సింగు ధైర్యం చెప్పాడు.

అంతలో మళ్ళీ సుందరి మగతగా కళ్ళుమూసుకుంది. ఓసారి సుందరి మొహాన్ని తృప్తిగాచూసి రోడూ తన కర్ర తట్టుకుంటూ బయటికి వెళ్లాడు. రోడూవెళ్ళిన అర్థ గంటకు సుందరి పక్కకు వత్తిగిలిచూసి మంచినీళ్లు కావాలని అడిగింది. దగ్గరే కూర్చున్న బచన్‌సింగు గ్లాసుతో నీళ్లతెచ్చి ఆమెకు ఇచ్చాడు.

సుందరి బచన్‌సింగును కన్నార్పకుండా చూసింది. "నన్ను ఇక్కడకు మీరు తెచ్చారా"? అని అడిగింది.

"అవును" అని సమాధానం ఇచ్చాడు. పక్కమీద దుప్పటి సరిచేస్తూ "నువ్వు ఆ విషయం అట్టే ఆలోచించకు. ఇప్పుడప్పుడే నువ్వు ఎక్కువగా కదలకూడదు. ఎక్కు వగా మాట్లాడకూడదు తెలుసా" అన్నాడు తిరిగి బచన్.

ఎప్పుడూ ఆడుతూ పాడుతూ గంతులేసే చిలిపి సుందరిని కదలకుండా కట్టిపడేయడం కష్టమే. ఆమె కాస్తచిలిపిగానే "నాకేం. నేను బాగానేవున్నానుగా" అంది. అని, ఓసారి రక్తంపోయి పాలిపోయిన అరచేతుల్ని చూసుకుంది.

"అయితే నన్నిక్కడకు తెచ్చింది మీరే అన్నమాట !"

"అవును."

"ఎందుకు ?"

"నువ్వు స్పృహతప్పి పడివుంటే ఎత్తుకొని..."

"అంటే మీరునన్ను ముట్టుకొని యిక్కడకు తీసుకొచ్చారా ?

"ఏం, నిన్ను ముట్టుకోకూడదా ?"

"మేము తక్కువజాతివాళ్ళం కదా ?"

"నా దృష్టిలో నువ్వు అందరికన్న ఎక్కువజాతి దానివే. సుందరీ, నేను నిన్నెప్పుడూ తక్కువజాతి స్త్రీగా భావించలేదు"

"నిజంగానా !"

"ఔను."

"మరైతే ఎలాభావిస్తున్నారు ?"

"నాలాంటి మనిషివే నువ్వుకూడా. ఈ మాటలకేంగాని నువ్వు గురుద్వారాలోకి ఎలా వెళ్లగలిగావు ?"

ఏ ప్రశ్న అతను అడగకూడదనుకుందో దాన్నే అతను అడగనే అడిగేశాడు. ఆమెకు కొంచెం భయంవేసింది. మొదటే ఆమె పశ్చాత్తాపంతో బాధపడ్తోంది. 'ఆరోజు గురుద్వారాకు ఎందుకు వెళ్లాను. పంతానికి అక్కడికి వెళ్లాను. వెళ్ళినందుకు గురుబాబా నాకు తగినశాస్తి చేశాడు" అని తనని తాను నిందించుకుంటూ అంది. మళ్ళీ ఆ వెంటనే " నావల్ల పొరపాటుఅయిపోయింది " అంది పశ్చాత్తాపం పడ్తూన్న ధోరణిలో.

" నా వుద్దేశం అదీకాదు. నువ్వక్కడకు వెళ్ళడానికి అభ్యంతరమని కాదు. నువ్వు లోపలికి ఎలా వెళ్ళగలిగావని ? ఎవరూ నిన్ను అడ్డగించలేదూ ? "

అప్పుడు కాని సుందరికి ధైర్యం రాలేదు. జరిగిన కథ అంతా చెప్పింది— " ... రాగీలు సంకీర్తనం చేస్తున్నారు. తలుపు వెనుక కూర్చొని నేను వింటున్నాను. ప్రార్థన ప్రారంభంకాగానే నేను కూడా చేతులు జోడించి నిలబడ్డాను. నేను తలుపుదగ్గరవున్నాననే విషయం జ్ఞాపకం రాలేదు. మోకరిల్లుదామని తల వంచేసరికి తలుపు గభాలున తెరుచుకుంది. తలుపుకు ఆనుకొనివున్న గడ్డి గదివైపుకు ఒరిగి నామీద వచ్చిపడింది. ఏస్థానంలో ఐతే నేను తలవంచి మొక్కుదామనుకున్నానో సరిగ్గా అక్కడే నా తల ఆనింది. గురుదేవుడు నా మొక్కయితే స్వీకరించాడు కాని నా సాహసానికి తగిన శాస్తికూడా చేశాడు ".

గురుదేవునిపట్ల ఆమెకున్న శ్రద్ధాభక్తుల్ని, నమ్మకాన్ని, త్యాగనిరతిని వజ్రసంకల్పాన్ని చూసి బచన్‌సింగు హృదయం ప్రేమతో వుప్పొంగిపోయింది. సుందరిచేతిని తనచేతిలోకి తీసుకొని అన్నాడు—

"సుందరీ! నువ్వు నిజంగా అదృష్టవంతురాలివి. నువ్వంటే నాకు ఎంతో గౌరవం".

ప్రపంచంలో తనను ప్రేమతోచూసే ప్రాణులు రెండేరెండు అనీ, రోడూతాత, లచ్చో — ఆ ఇద్దరేననీ, మిగతా వాళ్ళందరికి తనంటే అసహ్యమనీ నేటివరకు అనుకొనేది సుందరి. అందుకేనేమో ప్రేమ అంటే ఏమిటో, దానికి ఎన్నిపొరలున్నాయో ఆమె తెలుసుకోడానికి ఇష్టబడలేదు. పెద్దకుటుంబంలో పుట్టికూడా బచన్ తన్ను ప్రేమిస్తున్నాడనే భావంకలగగానే ఆమెలో ఓనూతన ఆనందం, ఉత్సాహం వచ్చాయి. పధ్నాలుగు, పదిహేనేళ్ళ సుందరికి ప్రేమ విలువ తెలియక పోవచ్చు. కాని ప్రేమలోని వైవిధ్యం మాత్రం ఆమె తెలుసుకుంది.

ఎంతో శ్రద్ధగా బచన్ సుందరికి చికిత్స చేయిస్తూ వున్నాడు. ఆమె గాయాలు తొందరగానే నయమైపోతున్నాయి. దానికి కారణం మందుమాకూ కావచ్చు. లేక బచన్ ఆమెపట్ల చూపుతూన్న నిర్మలమైన ప్రేమైనాకావచ్చు. ఆమె రోజురోజుకూ ఆరోగ్యాన్ని పుంజుకుంటోంది. తనకోసమని వూరివాళ్ళ కోపతాపాలకు లోనైన బచన్ క్రమక్రమంగా ఆమె మనసులో చోటు చేసుకొంటున్నాడు.

పదిహేనేళ్ళ యీ లేత హృదయంలో ప్రకృతి ఎంత కోమలత్వాన్నీ, పవిత్రతనూ, ఉదాత్తతనూ నింపిందీ చూసి బచన్ కూడా ఆమెవైపుకు రోజురోజుకూ ఆకర్షించబడుతున్నాడు.

స్త్రీ హృదయం ఓసారి నల్లచేవరాయి అయితే మరోసారి నవనీతమౌతుంది. సదా కౌర్ విషయంలో గూడ అంతే. ఆమెగూడ సుందరంటే ఒకప్పుడు కాఠిన్యం వహించేది, అసహ్యించుకునేది. కాని దెబ్బలు తగిలి వళ్ళంతా గాయాలతో నిండిన సుందరి దేహాన్ని బచన్ ఇంటికి తీసుకొచ్చినరోజు ఆమెపట్ల ఆవూరివాళ్లు ఎలా ప్రవర్తించినదీ, ఎంతక్రూరంగా హింసించినదీ కొడుకు నోట విన్నది. అప్పటి నుండి సుందరంటే ఆమె మనస్సులో ప్రేమా వాత్సల్యం చోటుచేసుకున్నాయి. అయితే హంతకుల్ని చూసినట్లు సంఘం తమవైపు చూస్తూవుంటే ఆమె భయపడేది. సంఘంపేరు విన్నప్పుడల్లా రక్తంగడ్డ కట్టినట్లువుండేది.

ప్రకృతి సుందరిలో క్రమక్రమంగా సౌందర్యాన్ని నింపుతోంది. సన్నజాజిలా సన్నని తెల్లని తీర్చిదిద్దిన ఆమె శరీరం, చంచలత్వానికి ఆటపట్టైన ఆమె కళ్లూ, అమాయకత్వం తొణికిసలాడుతూన్న ఆమె ముఖం చూసిన ఏవ్యక్తి అయినా — మగ వాడైనా ఆడవారైనా సుందరిని సహజంగా ద్వేషించలేరు.

పదిహేను రోజులు గడిచాయి. సుందరిగాయాలు చాలావరకు మానిపోయాయి. ఆమెకు ఇంచుమించు పూర్తిగా స్వస్థత చిక్కింది. నుదుటిమీద తగిలిన దెబ్బ పెద్దదేమో, అది మాత్రం పూర్తిగా మానలేదు. కట్లు విప్పడానికి ఇంకా రెండుమూడు రోజులు పట్టవచ్చు.

సుందరి నుదుటిమీద గాయం ఎప్పుడు మానుతుందా అని ఎదురుచూసేవాడు బచన్ సింగు. గాయం పెద్దదనికాదు. అతని ఆదుర్దా అంతా ఆగాయంవల్ల ఆమె అందానికి ఎక్కడలోపం వస్తుందో అని. కట్టు విప్పిన రోజు ఆమె నుదురుచూసి అతని ఆశ్చర్యా నికి అంతులేదు. గాయం మానినచోట అర్ధచంద్రాకారంలో ఓ మచ్చ ఏర్పడి ఆమె ముఖానికి మరింత వన్నెతెచ్చింది. ఆమె ముఖంలోని అందమంతా ఆగుర్తులోనే యిమిడి పోయినట్లనిపించింది.

రాత్రి సుమారు పదిగంటలైవుంటుంది. అందరూ నిద్రపోయేవేళ. సుందరి మంచం, ముంగిట్లోవున్న వసారాలో వేసివుంది. బచన్, అతని తల్లి సదాకౌర్ — వాళ్ళిద్దరి మంచాలు వెనుక వరండాలో వేసి వున్నాయి. పగలంతా ఇంటిపనితో అలసి పోయిన సదాకౌర్ అప్పటికే నిద్రపోయింది. సుందరి ఇంకా నిద్రపోలేదు. ఆమెకు ఇప్పుడు పూర్తిగా స్వస్థత చేకూరింది. ఆమె పడుకొని తీవ్రంగా ఏదో ఆలోచిస్తోంది. తలుపువైపు నిక్కబొడుచుకొని వున్న ఆమె చెవులు ఏదో శబ్దాన్ని వినాలని ఆపేక్షిస్తు న్నాయి. రేపు ఎలాగైనా తను ఇంటికి వెళ్ళిపోతూంది. వెళ్ళేముందు బచన్‌తో మనస్సు విప్పిమాట్లాడాలనే కోరిక ఆమెలో చాలాబలంగా వుంది. ఏమని మాట్లాడడం? ఏం మాట్లాడాలో తెలీదుకాని అతణ్ణి విడిచిపోవడం మాత్రం శరీరం నుండి ప్రాణం విడిచిపోతున్నట్లుగా చెప్పలేని దిగులు ఆవరించింది.

బచన్‌సింగు ఇంకా ఇంటికి రాలేదు. ఎందుకురాలేదు చెప్మా అని ఏమాత్రం అలికి డైనా తలుపువైపు కళ్లు పెట్టుకుని చూస్తోంది. సదాకౌరుకు బచన్ గురించి చింతలేదు. అతని స్వభావం ఆమెకు బాగా తెలుసు. ఒక్కొక్కసారి అతను అర్ధరాత్రికిగాని వచ్చే వాడు కాదు. "

పదకొండు గంటలైంది. బచన్‌సింగు ఇంకా ఇంటికిరాలేదు. సుందరికి ఆదుర్దా ఎక్కువైంది. మంచంమీద వుండలేక వరండాలో కొచ్చి అటూ యిటూ పచార్లు

చేస్తోంది. ఇవ్వాళ ఆమె చాలా ముఖ్యమైన విషయాలు బచన్‌ను అడగాల్సివుంది. మనస్సులో ఎన్నో ఆలోచనలు, ఎన్నోమాటలు పోగైవున్నాయి. కానీ అవన్నీ అతను వచ్చినదాకా జ్ఞాపకం వుంచుకొని అతన్ని అడగడం ఎలా అన్న ప్రశ్నే అన్నిటికన్నా ముఖ్యంగా ఆమెను వేధిస్తూవుంది. అంతలోనే తలుపు కొట్టినచప్పుడైంది. వెళ్లి తలుపు గడియ తీసింది. వేగంగా అడుగులు వేసుకుంటూ బచన్ లోపలికివచ్చాడు. బచన్ అంతవేగంగా అంగలు వేస్తూంటే చిలిపి సుందరికి నవ్వొచ్చింది.

"ఇవ్వాళ మీరు చాలా ఆలస్యంగా వచ్చారేం?" అంది. బచన్ వెంటనే సమాధానం ఇవ్వలేక సుందరి మంచం ప్రక్కనేవున్న కుర్చీమీద కూలబడ్డాడు. అతనివెంట సుందరి కూడా వెళ్ళి మంచంమీద కూర్చుంది. కిటికీలోంచి చల్లగాలి వస్తూన్నట్లు బచన్ గ్రహించాడు. ఆమె అడిగిందానికి సమాధానం చెప్పకుండానే "చలిగాలి వీస్తోంది. పద, నీ మంచాన్ని గదిలో వేస్తాను" అని అంటూ సుందరి చేయి పట్టుకొని మంచంమీంచి లేపాడు. ఆమె చెయ్యి మంచుగడ్డలా చల్లాగావుంది.

"అయ్. నువ్వు చలిలో తిరుగుతున్నావా? మళ్ళీ మంచంపడాలనివుందా?" అంటూ సుందరి మంచాన్ని ఎత్తితీసుకెళ్లి గదిలోవేశాడు. తర్వాత ఆమె పక్కచుట్ట పట్టుకెళ్లాడు. తాను కూర్చుండే కుర్చీకూడా తీసుకెళ్ళి అక్కడవేశాడు. ఆమెను మంచంమీద పడుకోబెట్టి రగ్గు కప్పుతూ "ఇలాగైతే నువ్వు మళ్లీ మంచానపడ్తావుసుమా" అని కోపాన్ని నటిస్తూ అన్నాడు.

సుందరి ఏమీ మాట్లాడలేదు. ఏమిటీవిషయం అని ఆమె జబ్బ పట్టుకొని వూపుతూండగా సుందరి కళ్ళలోంచి కన్నీళ్లు జలజలరాలాయి. తాను ఎందుకు అంతగట్టిగా కోపడ్డానా అని పశ్చాత్తాప్పడ్డాడు. కుర్చీమీంచి లేచి మంచంమీద కూర్చుంటూ ఆమె రెండుచేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని నొక్కాడు.

"నేను అలా అన్నానని కోపంవచ్చిందా" అని ప్రశ్నించాడు.

సుందరి ఈ లోకంలోలేదు. ఏదో స్వప్నజగత్తులో విహరిస్తూంది. "బచన్‌కు తనంటే ఎంతప్రేమ! తనంటే ఎంత ఆప్యాయతనీ, సానుభూతినీ చూపిస్తున్నాడు. చెయ్యి చల్లగావుంటేనే అంతలా గాభరాపడ్డాడు. నిజంగా తాను ఎంత పుణ్యం చేసుకుందో. తాను ఎంత అదృష్టవంతురాలు - కాదు - ఎంత దురదృష్టవంతురాలు..." ఆలోచనల్లో మునిగి తేలుతూన్న సుందరి బచన్ ప్రశ్నకు సమాధానంగా తన తల అతని ఒళ్లో పెట్టుకొనిగొల్లుమంది.

బచన్ ఆమె రెండు చేతులు తీసుకొని గట్టిగా పట్టుకొంటూ "సుందరీ" అని ఏదో చెప్పబోయాడు. అతని కంఠం మూగవోయింది. అతను మహానందంలో తేలిపో

తున్నాడు. అతనికి ఈ లోకం స్పృహేలేదు. బహుశా అందువల్లనే నేమో సుందరి చేతుల్ని గట్టిగా నొక్కిగలిగాడు.

మళ్ళీ సుందరి మనోఫలకంమీద మరికొన్ని బొమ్మలు కనిపించసాగాయి. ఎదురుగా కూర్చున్న బచన్‌సింగు ఆమెకు కనబడడంలేదు. పూరిగుడిసెలో చిరిగిన బొంత మీదపడి వున్న తన శరీరమే ఆమెకు కనిపిస్తోంది. బచన్ లేకపోతే ఆమె ఏకాకి. రేపు వుదయమే వచ్చి తనను ఇంటికి తీసుకవెళ్తానని రాత్రిచెప్పి మరీవెళ్ళిన రోషూ తాత ఈ రోజు ఇంటికి పంపించమని కబురంపాడు.

ఆమె శరీరంలో కొత్తగా పెరుగూతూన్న శూన్యాన్నీ, దుర్బలత్వాన్నీ ఆమె గ్రహిస్తూనేవుంది. బచన్ తన జీవితంలో అడుగుపెట్టి ఆ జీవితంలోంచి విడదీయడానికి వీలులేనంతగా కలిసిపోయాడు. ఒకవేళ మానసికంగా శస్త్రచికిత్సచేసి విడదీస్తే ఆమె కూడా బతకదేమో !

కాని ఈ మాటలు బచన్‌కు చెప్తే ? చెప్పడానికి తనకు అర్హతవుందా ?

సుందరి ఈ ఆలోచనల్లో మునిగిపోయింది. అంతకుముందుగా ఆమె చేతుల్ని గట్టిగా అదిమి పట్టుకున్న హస్తాల్లోంచి అమృతధారలు కారుతూ ఆమె శరీరాన్ని తడిపివేస్తున్నట్లు అనిపించింది. "సుందరీ, ఓ నా సుందరి, నువ్వు మాట్లాడకుండా మూగనోము పడితే ఎలా ? ఇవ్వాళ నీకు ఎన్నో మాటలు చెప్పాలి" అని బచన్ ఆమెను కదుపుతూంటే ఆమె మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది.

అతన్నోట 'సుందరీ' అని ఆప్యాయంగా పిలవడం ఆమె చాలాసార్లు వింది. కాని ఈరోజు "ఓనా సుందరీ" అని అతను సంబోధించగానే ఆమె శరీరంలో ఓ విచిత్రమైన గగుర్పాటు కలిగింది. ఆమె కళ్లల్లో సన్నసన్నని మత్తు వ్యాపించి ఆమె శరీరంలో అణువణువూ ఆనందంతో రాగం తీయసాగింది. ఆ సంబోధన నిజంగా వర్ణనాతీతం, శబ్దాతీతం, రాగాతీతమైనది. "ఓనాసుందరీ!"

సుందరి తలెత్తి బచన్ కళ్లల్లోకి చూసింది. అతని కళ్లు ఏదో కథను చెప్తున్నాయి. అతని కళ్లల్లోకి తన కళ్లు కలిపి ఆ కథను కళ్లతోనే చదవసాగింది. చదువుతూంటే అతని కళ్ళు చెప్పే కథను చదువుతున్నదీ లేక తన కళ్ల కథనే చదువుతూన్నదీ కూడా మరచిపోయింది. ఆ కథకో మంచి శీర్షికవుంది. అదే "ప్రేమ". ఇద్దరూ అలా ఒకరి కథను ఒకరు చాలాసేపు చదువుకొన్నారు. బచన్‌సింగు చేతివున్న గడియారం చూసుకొనే సరికి పన్నెండున్నర గంటలయింది. గంటన్నరసేపు ఎలా గడిచిందా ! అనుకున్నాడు.

"సుందరీ, ఇవ్వాళ నీతో చాలా మాటలు మాట్లాడాల్సివుంది" అన్నాడు బచన్

"వుందా. అంటే ఇప్పుడు లేదన్నమాట" చిలిపిగా అంది సుందరి.

"చాలా రాత్రి అయింది సుందరీ"

"అలానా. మీకు నిద్రవస్తోంటే ..."

"నాకు నిద్ర ! రావడంలేదు. నువ్వు మేల్కొన్నావనే నా చింత"

"నాకు నిద్రా! ఇవ్వాళ రానన్నది."

"ఎందుకో ?"

సుందరి సమాధానం చెప్పలేదు.

"సుందరీ !"

"ఆఁ చెప్పండి"

"నువ్వు వెళ్లిపోతావు కదూ?"

సుందరి మాట్లాడలేదు.

"వెళ్లాల్సివుంటే ఎందుకొచ్చావు ?"

సుందరి ఓ వేడి నిట్టూర్పు విడిచింది.

"సుందరీ, నువ్వు నా జీవితాన్ని అమృతమయం చేశావ్"

ఆమె మెదలకుండా వుంది. పెదవి మెదపకుండానే అన్ని ప్రశ్నలకు మనస్సు ద్వారా సమాధానం ఇస్తూవుంది. పెదిమలు కూడా విప్పాలనుకుంది. కాని విప్పలేక పోయింది. బచన్ చెప్పింది అర్థం చేసుకోగలిగింది. అర్థం చేసుకొంటూనే వుంది. కాని మాటలనే చట్రాల్లో వాటిని బిగించలేకపోతోంది. ఆమె మనసులోని భావాల్ని మాటల్లో పెట్టడానికి వాక్కు సహాయం చేయలేకపోతోంది. అందువల్ల ఆమె పెదవి మెదపకుండా, మెదలకుండా వుంది.

"సుందరీ. మౌనంగానే వుండిపోయావు. మాట్లాడవా ? పోనీ నేను వెళ్తాను" అంటూ బచన్ మంచంమీంచి లేచాడు.

సుందరి అతని చొక్కా పట్టుకొని ఆపింది. కూర్చో పెడ్తూ "ఈరోజు ఇంత ఆలస్యంగా వచ్చారేం ?" అని అడిగింది.

బచన్ మాట్లాడితే వినాలని తహతహలాడిన సుందరి ఈ రోజు తీరా అతను మాట్లాడుతూంటే ఆ మాటల మార్గాన్నే మళ్లించడానికి వేరే ప్రసంగంలోకి దిగుతోంది. అందుకే ఈ రోజు మీరు ఆలస్యంగా వచ్చారేం అని మాట మార్చడానికి ప్రయత్నిం

చింది. అసలు సుందరి తన మనసును బయటపెట్టదలచినట్టున్నాక్షే బచన్ తన మనో భావాల గొడుగును ఆమె ముందు విప్పుతున్నాడు. ప్రకృతి సహజంగా స్త్రీకి ఎంతో విశాలమైన హృదయాన్ని ప్రసాదించింది. అపారమైన సహనాన్ని యిచ్చింది. సముద్ర మంత లోతైన భావాలనూ, మేరు పర్వతమనంత ఎత్తయిన ఆలోచనల శిఖరాలనూ మనస్సనే చిన్న పాత్రలో ఇముడ్చుకొని మూసివుంచ గలుగుతోంది.

తనకూ బచన్‌కూ మధ్య అంతస్తుల తారతమ్యాలకు అతీతంగా పెరుగుతోన్న ప్రేమ అనే తుఫాను ధాటికి తట్టుకోలేనన్న భయంతో ఆమె తన నోరు మెదపలేకపోయింది. పెల్లుబికి వస్తోన్న వెల్లువను పైకి రానివ్వకుండా గొంతుదగ్గరే అణచివేసింది.

సుందరి ప్రసంగాన్ని మార్చాలనే వుద్దేశంతో మాటల ధోరణి మార్చడానికి ప్రయత్నం చేసినా బచన్ ఆ ప్రసంగాన్ని మళ్ళీ మొదటికే తెచ్చాడు. "నీవల్లనే ఆలస్యం అయింది. సాయంత్రం భోజనం చేశాక తిన్నగా బావి దగ్గరకు వెళ్లాను. అక్కడ కూర్చుని నీ గురించే ఆలోచిస్తూ ఆలోచిస్తూ నన్ను నేనే మరచిపోయాను. అక్కడే పదిగంటలైపోయింది" మళ్ళీ కూర్చుంటూ అన్నాడు బచన్.

"నా గురించా ?" ఆశ్చర్యపోతూ అడిగింది సుందరి.

"అవును సుందరీ, నీ గురించే"

"సుందరిని ఇంటికి తీసుకవచ్చి మెడకు గంగడోలు తగిలించుకున్నాననేగా మీ ఆలోచన ?"

"అది కాదు".

"మరి ?"

"నా ఆలోచనంతా నువ్వు రేపు వెళ్ళిపోతావు కదా అని"

"అలాగా !"

"సుందరీ నేను ... "

"సిగ్గుపడతారేం, చెప్పండి."

"నిన్ను విడిచి వుండలేను. నా మనసు ... "

"ఆఁ మీ మనస్సు ? ఏమిటో చెప్పండి."

"సుందరీ, నువ్వు వయసులో చిన్నదానవు. ప్రేమ అంటే ఏమిటో నీకు తెలీదు నీకు తెలిసివుంటే నాచేత చెప్పించుకోకుండానే నా పరిస్థితి గ్రహించి వుండేదానివి"

"ఎందుకు గ్రహించలేనూ ? మీరూ, జ్ఞానీజీ నాకు చదువు నేర్పారు. ప్రేమ గురించి నాకు తెలియదా ? మనం అందరినీ అన్నిటినీ ప్రేమించాలని నాకూ తెలుసు. "ఎవరైతే ప్రేమిస్తారో వారికే ప్రభువు లభిస్తాడు" అని గురువాణిలో చెప్పలేదూ ?"

ఆమె అంత తేలికగా ఇచ్చిన సమాధానం విని అతను మెదలకుండా వూరుకొన్నాడు. కొంత ఆశాభంగం కూడా కలిగింది. అల్లుతూ వదిలేసిన ఆలోచనల్లకొసన మళ్ళీ మాటల్ని గుచ్చుతూ "కానీ, నా వుద్దేశ్యం ప్రేమకుండే మరో స్వరూపం..." అని అన్నాడు బచన్.

"మరో ప్రేమా ?" విస్మయంతో అడిగింది సుందరి. "అది ఎలావుంటుందో మీరు నాకు ఎప్పుడూ నేర్పలేదే ?"

"ఇటువంటివి చదువులో రావు".

"మరి కాలేజీల్లో, స్కూళ్లల్లో ?"

"నువ్వు వుత్త అమాయకురాలివి".

తన మనోభావాల్ని చెప్పడానికి వేరే వుపాయం లోచకపోయేటప్పటికి "సరేలే ఈ విషయం అలా వుండనివ్వుగాని రేపు వెళ్తావుగదూ నువ్వు ?" అని విషయాన్ని మార్చాడు.

" అవును. తాత కబురుపంపించాడు. "

" ఒకవేళ పంపకపోతే ? "

" అప్పుడు వెళ్లేదాన్నికాను. "

" మీ ఇంటికి వెళ్ళిపోయాక నన్ను అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటావా సుందరీ ?"

" ఏం మీరు రారేమిటి ? "

" రాను ".

" రారా " అని ఆమె దిగులుగా చూసింది అతన్ని. " మరి నాకు చదువు ఎవరు చెప్తారు ?" అని తిరిగి ప్రశ్నించింది.

" నువ్వు చదువుకోడానికి వేరే ఏర్పాటు చేస్తాను. "

" మరొకరిదగ్గర నేను చదవను. "

" ఎక్కువ చదివి కూడా చేసేదేమిటిలే. నీకు పంజాబీ బాగా రాయడం చదవడం వచ్చు. చాలా వాణీలు గూడ నీకు కంఠస్తమే ".

" మీరే అన్నారుకదా పదిఫరళకు చదివిస్తానని ".

" ఇంకా చదవాలనుకుంటే పట్నంలో ఏదైనా ఆడపిల్లల స్కూల్లో చేర్పిస్తాను "

" మీరు కూడా అక్కడికి వస్తారా ? "

" నేనా. ఇల్లొదిలి నేనెక్కడికి వెళ్తాను ? "

సుందరి మౌనం వహించింది. తాను ఏదో తప్పుడు ప్రశ్న వేసినట్లుగా భావించింది.

" సరేకాని, నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా ? "

" ప్రేమ " అనే పదం వినేసరికి ఆమె పెదవులమీద చిరునవ్వు మధురంగా నాట్యం ఆడింది. బచన్ భుజంపై తన తల ఆనిస్తూ " మీరూ... నేనూ... " అంటూ మధ్యలోనే ఆగిపోయి ఆ వాక్యాన్ని మరిక పూర్తి చేయలేకపోయింది.

కాని బచన్‌సింగుకు తన ప్రశ్నకు సమాధానం దొరికింది. ఆమె ప్రతి కదిలికకూ ప్రేమకెరటాలు లేచి అతన్ని ఆలోచనల నావలో సుందరతీరాలకు తీసుకుపోయాయి. ఒకరి ఎదుట ఒకరు హృదయకవాటాలను తెరుచుకోవాలన్న వాళ్ల ఆలోచన అలాగే వుండిపోయింది. తెరుచుకొనే అవసరం గూడాలేదు. ఇప్పుడు వాళ్లు యిద్దరుకాదు ఒక్కరే !

బచన్ వాచీకేసి చూశాడు. రెండున్నర అయ్యింది.

" సుందరీ, నువ్వు నిద్రపో చాలా రాత్రయ్యింది " అంటూ ఆమె అరచేతిని ముద్దెట్టుకొన్నాడు. బచన్‌సింగు పెదవులు ఆమెను తాకుతున్నాయ్.

...బచన్‌సింగు ఎప్పుడు వెళ్లిపోయాడో కూడ ఆమెకు తెలియదు.

---

# [ 20 ]

సాయంకాలం వెలుగు కరిగిపోయి మసకచీకటి ముసురుకొంటోంది. మాఘమాసం చల్లనిగాలి రఁయ్ రఁయ్ మంటూ వీస్తోంది. అటువంటి వాతావరణంలో కూడా దీవాన్‌పూరు వూరి బయట బావి వద్ద జనం వున్నారు. బొక్కెనలు క్రిందికీ పైకీ తిరుగుతూన్నాయి. ఏతాము లాగా ఎడ్లకాడిమీద కూర్చున్న కుర్రాడు నిమిషనిమిషానికి ఎడ్లను "హఁయ్ హఁయ్" మని అదలిస్తూ వెనక్కూ ముందుకు తోలుతున్నాడు. ఆ ప్రశాంత వాతావరణంలో ఏతాముచేసే చప్పుడు లయబద్ధంగానూ, అందంగానూ వుంది.

బొక్కెన్ల నుండి నీళ్లు కారేచోట బావిఒడ్డుకు దగ్గిరగా గ్రామంలోని స్త్రీలు చాలామంది గుంపుగా కూర్చున్నారు. వాళ్లకు దగ్గర్లోనే చిన్నచిన్న పిల్లలు రాళ్లేరుకుంటూ ఆడుకొంటున్నారు. ఏతాంకు అనుకొని పత్తిచేనువుంది. ప్రస్తుతం పత్తివేయని కారణంగా మొక్కలన్నీ ఎండిపోయి ఒక్కకాయగానీ పూతగానీ లేకుండా ఎండినచెట్లు మాత్రం ఆ చేలో కనబడుతున్నాయి. పత్తితీసిన కాళీకాయలు చెట్లనిండా యింకా కనుపిస్తూనే వున్నాయి. గాలి వాటిమీద నుండి వీచినప్పుడు గరగరమని శబ్దం చేస్తున్నాయవి.

దాని పక్కనే పల్లంవుంది. దానిలోమాత్రం ముల్లంగి పాదులు కళకళ లాడుతూ ఏపుగా పెరిగాయి. నేలను చీల్చుకుని సగానికి బయటికొచ్చిన తెల్లని దుంపలపై పచ్చ పచ్చని ఆకులు గాలికి తలలూపుతూ రాకుమార్తెలకు చామరం వీచినట్లుగా వూగుతున్నాయి.

ఎండిన పత్తిపొలంలో కళకళలాడే ఆ మాగాణి చూస్తూంటే ముసలితండ్రి ఒళ్లో కూర్చుని అతని గారాలపట్టి ఆడుకొంటూన్నట్లుగావుంది. గాలి గట్టిగా వీచినప్పుడు ఆ దుంపలు మొక్కలు వలిచిన పత్తికాయలమీదకు వంగి ఆనుతున్నాయి. అవి చూస్తూంటే పిల్లాడు భయపడి తన తండ్రివైపు చేతులు సాచినట్లుగా వుంది.

ముల్లంగి దుంపల పొలంగట్టుమీద ముగ్గురు మనుషులు కూర్చున్నారు. గట్టుమీద కూర్చున్న వాళ్లల్లో ఒకతను ఓదుంపను ఊడపెరికి దానికి అంటుకున్న మట్టిని దులుపుతూ మిగతా వాళ్లవైపు చూస్తూ అన్నాడు —"అయితే ఈ కొట్లాట తెగదన్నమాట. రోజూ వాడు మన గుండెలమీద కుంపటి పెట్టి నిప్పురాజేస్తుంటాడన్నమాట"

"నిజమేకాని పాలాసింగూ, దీనిలో మనదోషం ఏముంది? నువ్వే అన్నావుగా అటో ఇటో తేల్చమని. మళ్లీ నువ్వే దాన్ని నానపెడ్తున్నావు" అన్నాడు రెండోవాడు,

పాలాసింగు అందుకున్నాడు— "అటో ఇటో తేల్చవద్దని నేనెప్పుడన్నాను. మీరు ఎందుకూ పనికిరాని చవటలు. కాకపోతే నిన్న మొన్నటి కుర్రకుంక ఆ బచన్‌గాడి పని పట్టించడానికి కూడా యింత ఆలస్యమా ? మీ వల్ల ఏమవుతుందిలే, నా బొంద ?"

మూడోవ్యక్తి అందుకున్నాడు — పెద్ద పెద్ద దొంగతనాలన్నీ జంకులేకుండా చేసిన పాలాసింగు బచన్ అంటే ఎందుకు బెదురుతున్నాడో నాకర్థం కావడంలేదు ? "

వాళ్ళిద్దరి ఎత్తిపొడుపు మాటలు పాలాసింగు పౌరుషంమీద ముళ్లలా గుచ్చుకున్నాయి. కోపంతో అతనికి వొళ్లు మండిపోయింది. "నేనా భయపడుతూంట ! గురువుమీద ఒట్టేసి చెప్తున్నా. వాణ్ణి తన్నడమే ప్రధానమైతే ఎప్పుడో వాణ్ణి పులుసులోకి దుమ్ములు లేకుండా చితకగొట్టేవాణ్ణి. కాని చూస్తున్నారుగా ఆ ఎరుకల్ది వాడంటే ప్రాణం ఇస్తోంది. మనం బచన్‌గాణ్ణేమైనా చేశాం అనుకో. ఎవరికోసమైతే మనం యింతశ్రమ పడతామో ఆ ఎరుకల్ది రేపొద్దున్న ఏ అఘాయిత్యానికైనా తలపడొచ్చు. అందుకని వూరుకుంటు న్నాను. భాయీ సవాయీసింగూ, ఏదైనా ఉపాయం ఆలోచించు. ఒక్కబాణానికే రెండు పిట్టలు పడాలి. ఆ బచన్‌గాడి పీడవిరగడవ్వాలి. ఈ సొగసుకత్తె మన వలలో చిక్కుకుపోవాలి. "

"మరి ఆ మెల్లకన్నోడి సంగతి ? "

"వాడి గురించి నువ్వేమీ పట్టించుకోనక్కరలేదు. ఆ ముసలాడిదేముంది. ఒక్క చేత్తో నలిపి నులిమేస్తా. వాడు చస్తే ఎవ్వడూ రిపోర్టుకూడా చేయడు. ఇవ్వాళ్టికిచస్తే రేపటికి రెండనుకో " అన్నాడు పాలాసింగు.

"చాల్లే ఆ కోతలు. ఇంతకీ అసలు సంగతి ఏమిటి ? మమ్మల్ని ఎందుకు పిలి పించినట్లు? తొందరగా కానీయ్. పైన మంచు కురుస్తోంది". విషయం ఏమిటో తెలిసి కోవాలన్నట్టుఅడిగాడు సవాయీసింగు.

"మంచూలేదు చలీలేదు. అసలు విషయం నీ నోరుచేదు కావాలంటోంది. అవునా ? ఆ సంగతి తిన్నగా చెప్పిఏడవరాదూ " అన్నాడు పాలాసింగు.

పాలాసింగు మాట వినగానే వాళ్లు నవ్వారు. పాలాసింగుమళ్ళీ ప్రారంభించాడు. "చలికి కూడా మందుందిలే. ఆరోజు తాగిన బాపతు ఇంకా ఒకటిన్నర సీసామిగిలింది."

"ఒకటిన్నర సీసా" అని వినగానే స్నేహితుల ముఖాలు చేటంత అయ్యాయి. వెంటనే వీరాసింగు "నువ్వు మాకేం పరాయివాడివికావు. నీకు బాసికం కట్టేంత వరకూ మేం నిద్రపోయేదిలేదు" అని అభయం ఇచ్చాడు.

"ఏమో, మరదలు పిల్ల వచ్చేసరికి ఒడ్డుచేరి తెప్ప తగిలెయ్యడుకదా ?" అన్నాడు సవాయీసింగు.

స్నేహితులు అతన్ని అలా పొగిడేస్తూంటే పాలాసింగుకు సారాపట్టించకుండానే మత్తువచ్చింది. నవ్వుతూ "అలూలేదూ చూలూలేదూ కొడుకు పేరు సోమలింగమట. అదేమో ఇంకా బచన్ గాడి ఇంట్లోనేవుంది. ఇక్కడేమో మీరు పగటి కలలు కనేస్తున్నారు".

"ఎవరూ అంట ? దాన్ని ముసలాడు తీసుకొచ్చి ఐదురోజులైతేనూ" అని వీరాసింగు ఏదో పెద్ద రహస్యాన్ని కనుక్కొన్నట్టుగా కల్పించుకొన్నాడు.

"అలాగా, వెళ్లివుండొచ్చు. నీకు తెలుసుగా వారంరోజులైంది నేను వూరు విడిచిపెట్టి. ఇవ్వాళేగా దిగింది" అని పాలాసింగు అన్నాడు. "ఐతేదానికి దెబ్బలు తగిలిన తర్వాత చూడలేదన్నమాట". అని అడిగాడు వీరూ.

"లేదూ".

"ఇప్పుడు చూడాలి దాని అందం. దాని తస్సాదియ్యా. ఏం రంగు వచ్చిందనుకున్నావ్. అచ్చంగా గంగసింధూరంలాగ వుందనుకో. మల్లెతీగెలా పెరిగిపోయింది. ఓరేయ్, నువ్వు గనుక దాన్ని చేజిక్కించుకున్నావంటే నీ అదృష్టంపండిందనుకో".

పాలా : "మొదలే అదంటే నేను పడిచస్తున్నాను. ఇప్పుడు నిద్రకూడా పోనీయదు గాబోలు. ఈ భారమంతా మీమీద వేశాను. ఇంతమాత్రం పనికూడా మీవల్ల జరక్కపోతే మీ ఇద్దరి పుణ్యమా అని ప్రాణాలు తీసుకుంటాను".

సవాయీ : అదేమంత ఘనకార్యమనీ ! భగవంతుడు మేలుచేస్తే చిటికెలో అయిపోతుంది. ముందు బచన్‌గాడి సంగతి చూడు. వాడున్నంతకాలం అది మన గిరిలోకి రాదు".

పాలా : "కాని ఒక్కమాటడుగుతాను. సవాయీసింగూ, బచన్‌గాడు దాన్ని పెళ్లిచేసుకొంటాడంటావా?"

వీరూ : "లేకపోతే. దాన్ని ఇంకా చదివిస్తూ వేదాంతిగా తయారుచేస్తాడేమిటి" !

పాలా : నాకాశ్చర్యంగానేవుంది. బచన్‌గాడికి పెళ్లిచేసుకోవాలంటే పిల్లలే కరువయ్యారా! పన్నెండో తరగతిదాకా చదువుకున్నాడు. ఆడికి పెద్దపెద్ద సర్దార్ల కుటుంబాల నుండి సంబంధాలు వస్తున్నాయంటగా ? ఆ ఎరకలదాని వెంట పడ్డాడేమిటి ? అలాటిది, వెనుకా ముందూ లేని నాలాంటి తిరుగుబోతుగాడికి జోడుగానీ. ఏమంటావ్?"

సవాయీ : "నువ్వు చేప్పేది నిజమే అనుకో. ఎత్తుకోరా అంటే ఎవడుబరువు ఎత్తుకొంటాడు ? బరిలోకి దిగిన తార్వాత ఎవరుగెలిస్తే వాళ్ళకే దక్కుతుంది !"

వీరూ : "మీరు పొల్లు కబుర్లతో టైమంతా పాడుచేస్తున్నారు. పనికొచ్చే మాటేమైనా వుంటే చెప్పండి. లేకపోతే నేను శలవు తీసుకొంటా. చలికి నాకాళ్లు బిగుసుకుపోతున్నయ్. "

పాలాసింగు కాస్సేపు ఆలోచనలో పడ్డాడు. ఏదో వుపాయం తట్టినట్లుగా "నా వుద్దేశం బచన్‌గాడిని ఏదైనా కేసులో ఇరికించాలి. ఆ పనిచేయగలిగామంటే మన పని తేలిగ్గా అయిపోతుంది." అన్నాడు. "అవునౌను. నేనూ అదే అనుకుంటున్నాను" అన్నాడు వీరూ. "సరిగ్గా నేను కూడా యిలానే అనుకున్నాను సుమా. ఇంకా మీకు చెప్పాలనుకుంటున్నాను కూడా ఇంతట్లోకి మీరే చెప్పేశారు నా మనస్సులో మాట. కాని మునలాణ్ణి...?" అంటూ సవాయీ సింగు నసుగుతూ ఆగిపోయాడు.

ఆ తర్వాత పాలాసింగు ఒక్కొక్కర్ని దగ్గరకు పిలిచి వాళ్ళ చెవుల్లో విడివిడిగా గుసగుసలాడాడు. ఆ తర్వాత అందరూ కలిసిమాట్లాడుకుని ఓ నిర్ణయానికి వచ్చి ఎవరిదారిన వాళ్లు పోయారు.

---

# [ 21 ]

సుందరి బచన్‌సింగు ఇంటి నుంచి వచ్చి చాలారోజులు గడిచాయి. బచన్ రోజూ రోడూ ఇంటికివచ్చి వెళ్తున్నాడు. అతని సహాయంతో సుందరి చదువు బాగానే సాగుతోంది. ఓరోజు మధ్యాహ్నం బచన్ బావినుండి తిరిగివచ్చేసరికి తల్లిచాలా దిగులుగా కనిపించింది. ఎందుకలావున్నావని తల్లిని అడిగాడు.

"ఏమీలేదు నాయనా" అంది తల్లి నిట్టూర్పు విడుస్తూ.

"లేదమ్మా, నువ్వు నాదగ్గిర ఏదో దాస్తున్నావు. చెప్పు. ఏంజరిగిందేమిటి?" అని మళ్ళీ రెట్టించాడు.

"చూస్తున్నావుగా నాయనా, ఒకప్పుడు ఈ ఇల్లే ఎంతో కళకళలాడుతూ వుండేది. రాత్రింబవళ్లు వచ్చేవాళ్లూ పోయేవాళ్లతో మహాసందడిగా వుండేది. ఇప్పుడు దీనిమొహం ఎవరూ చూడ్డంలేదు. సురేన్ కొడుకు హోషియార్‌పూరునుండి శెలవుమీద వచ్చాడట. పొద్దున్న మన ఇంటికొచ్చాడు. మన ఇంటిముందు వెళ్తూ ఓసారి పలకరించిపోదాం అని లోపలికి వచ్చాడు. నాకేంతెలుసు. మజ్జిగతెచ్చి ఇచ్చాను. తాగి వెళ్లిపోయాడు. అతను మనయింట్లో మజ్జిగతాగుతూంటే ఎవరో తలుపుసందుల్లోంచి చూశారుగాబోలు. ఇంటికి వెళ్ళివెళ్ళగానే అతడెనకాలపడ్డారట. నువ్వు వాళ్లింట్లో మజ్జిగ ఎందుకుతాగావని? వాళ్లను కులంలోంచి వెలేసేమని, వాళ్లతో మేమంతా తెగతెంపులు చేసుకొన్నామని అన్నారట. దీనానాథ్ పురోహితులవారు గంగాజలం తెచ్చి అతనిచేత తాగించిన తర్వాత కానిఅతన్ని గుమ్మంలోకి రానీయలేదట" అంటూ అతనితల్లి సదాకౌర్ దిగులుతో చెప్పింది.

చాలా రోజుల్నుంచీ వూరివాళ్ళ ప్రవర్తన మారడం బచన్ గమనిస్తూనే వున్నాడు. కాని వ్యవహారం ఇంతగా ముదురుతుందని అతను అనుకోలేదు. వూరివాళ్లు తనమీద చూపిస్తోన్న యీ విరోధభావానికి అతను ఎంతగానో నొచ్చుకున్నాడు. తనగురించి తల్లి లోలోపలే కుళ్లడంచూసి మనస్సుకు తీవ్రమైన బాధకలిగింది. ఆ బాధను నిగ్రహించుకొని "అయితే ఏమయిందమ్మా. తెగతెంపులు చేసుకుంటే చేసుకోనీయ్. తిండిపెట్టమని ఎవరికళ్ళకూ మనం తిరగక్కరలేదు" అన్నాడు, కాస్తగట్టిగానే.

"అదికాదు నాయనా, తిండికి పోతామనికాదు. నలుగురితో కలిసిమెలిసివున్నప్పుడే మనిషికి గౌరవం ప్రతిష్ఠానూ. నలుగురితో నారాయణా కులంతో గోవిందా అని వూరికే అన్నారా. మనం మనుషులంకదా. చెట్లూ చేమలమూ కాదాయె. నీకు ముందుముందు ఎంతో తతగం జరగాల్సివుంది. ఇంతకుముందు ఎక్కడెక్కణ్ణుంచో సంబంధాలు మన గుమ్మం వెతుక్కుంటూ వచ్చేవి. ఇప్పుడు చూడు మనమొహం ఎవరూ చూడ్డంలేదు. ఇప్పుడెక్కడికని వెళ్ళనూ ?" అని సదాకౌర్ గుడ్లనీరుకుక్కుంది.

ఇంతవరకూ బచన్ ప్రతి పనినీ తనకు తోచినట్లుగానే చేసేవాడు. కాని ఈరోజు తల్లి హృదయం గాయపడడాన్ని కళ్ళారా చూశాడు. విషయం గ్రహించాడు. కాని తల్లి మాటలకు ఏమని ఎదురు చెప్పతాడు ? ఏమీ చెప్పలేక పోయాడు.

"ఐతే నన్నిప్పుడేం చేయమంటావ్ ?" దిక్కులుచూస్తూ బచన్ అడిగాడు.

"బంధువర్గాన్ని ఒదులుకోలేం. ఆ రోజూ మనుమరాలితో మనకేంపని ? నలుగురి లోనూ వేలెత్తి చూపించుకుంటున్నాం తప్ప ఇంకేమైనా ఒరిగిందా? అదే అన్ని తగా దాలకు మూలం. ఖర్మకాలి వాళ్ళు మనవూరికే దాపురించాలా !- మనకెటిప్పలే వచ్చేవి కావు."

సుందరిమాట ఎత్తగానే బచన్‌కు కోపం వచ్చింది. "పాపం, ఆ అమ్మాయిని నిందిస్తే మనకేం ఒరుగుతుందమ్మా. తల్లిలేని ఓ పేదపిల్ల ప్రాణం కాపాడ్డమే అంత పాపమైతే, దానికే ఈవూరు ఇంతశిక్ష విధిస్తే, అటువంటివి వందసార్లు శిక్ష అనుభవించ డానికి నేను సిద్ధంగా వున్నాను" అని అనేశాడు.

కొడుక్కి కోపంవచ్చిందని తెలియగానే సదాకౌర్ ఇంటిపనులు చూసుకొంటూ లోప లికి వెళ్లిపోయింది. బచన్‌కూడా ఆకోపం నుంచి తేరుకోడానికని బయటికి వెళ్ళిపో యాడు. అలా ఇలా తిరుగుతూ తిరుగుతూ రోమూతాత గుడిసెవద్దకు వెళ్ళాడు. తాత ఇంట్లోలేడు. సుందరి దిగులుగా కూర్చొనివుంది. సుందరీ అని కేకేశాడు.

"ఆఁ" అని వులిక్కిపడింది సుందరి.

"ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు ?"

"ఏమీలేదు. మీకోసమే ఎదురుచూస్తున్నాను. ఇంతలోకే మీరు వచ్చేశారు."

బచన్‌సింగు ఆమె ముఖకవళికను పరీక్షగా చూశాడు. అప్పుడే ఏడ్చినట్లుగా ఆమె కళ్ళు ఉబ్బివున్నాయి.

"ఏమిటి ! నువ్వు ఏడుస్తున్నావా ?" అని అడిగాడు ఖంగారుగా. సుందరి సమా ధానం చెప్పలేదు. అతని ఖంగారు మరింత ఎక్కువయ్యింది. "సమాధానం చెప్పడం నీకు అభ్యంతరమని తెలిస్తే అడిగివుండేవాణ్ణికాదు . ."

" మీకు చెప్పడానికి అభ్యంతరం ఏముంటుంది ? " బలవంతంగా నవ్వు తెచ్చుకుంటూ బచన్ వైపు చూపి " మా లచ్చి కనబడ్డంలేదు " అని చెప్పింది.

" కనబడ్డంలేదూ ? ఏమయింది ? అది ఎక్కడికీ పోయేదికూడా కాదే. దాన్ని కట్టేయాల్సిన పనికూడా వుండదే " అన్నాడు.

" ఏమో " అని నిట్టూర్పు విడిచింది ఆమె. "అదైతే వెళ్ళదు. దాన్నెవరో ఎత్తుకపోయారు. నిన్నరాత్రి నుంచి కనబడ్డంలేదు. తాత రాత్రి నుంచి ఒక్క మెతుకన్నా ముట్టలేదు సరికదా ఏడుస్తూ కూర్చున్నాడు. పొద్దున్నే దాన్ని వెతకడానికి బయల్దేరి వెళ్ళాడు. అదీకాక ... "

" ఇంకేమిటి ? "

" తాత మీ యింటికి వెళ్ళాలనుకొంటున్నాడు. నేనే వెళ్ళనివ్వలేదు. మీరొస్తారని నాకు తెలుసు ".

" ఎందుకని ? ఏదైనా అవసరమైన పనివుందా ? "

సుందరి ముఖంపై విచారం కమ్ముకుంది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె వాలకం చూసి బచన్ గాభరాపడ్డాడు. జేబులోని రుమాలుతో ఆమె కళ్లను తుడుస్తూ " సుందరీ, ఏమిటి సంగతి ? " అని అడిగాడు.

అతని చేతిలోంచి రుమాలు అందుకుంటూ " మనం ఇక్కణ్ణుంచి వెళ్ళిపోదామని తాత అంటున్నాడు " అని చెప్పింది.

" వెళ్ళిపోతారా ? " అని మతిపోయినట్లుగా చూసి " ఎక్కడికి ? " అని తిరిగి ప్రశ్నించాడు.

" వేరే వూరికి పోతాం "

"ఎందుకని ?"

జేబురుమాలును వేలుకు చుట్టుకుంటూ మనస్సులోని బాధను బైటికి రానీయకుండా ప్రయత్నిస్తోంది. అతను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పాలని తలఎత్తిచూసింది కాని ఎందుకో సమాధానం మాత్రం గొంతులోనే వుండిపోయింది.

" చెప్పు సుందరీ, త్వరగా చెప్పు " అని తొందరపెట్టాడు బచన్.

కడుపులోని మాటను కక్కాలనే ప్రయత్నం చేస్తూ చివరకు " ఈవూరి వాళ్ళు మమ్మల్ని ఇక్కడ బతకనిచ్చేట్లులేదు " అని అనగల్గింది.

" ఏం, ఎందుకు బతకనివ్వరూ ? "

" రోజూ వచ్చి గోల చేస్తున్నారు. "

సుందరి మాటలు పూర్తిగా అతనికి అర్థంకాలేదు. అంతకన్నా లోతుగా అడిగి తెలుసుకొనే సాహసం కూడా అతన్లోలేదు. ఆమెను వూరడించే ధోరణిలో " మీ లచ్చోను తీసుకొని వెళ్ళితే వాళ్లకేం కలిసొస్తుంది ?" అన్నాడు.

ఇంకా ఏమేమి చెప్పాల్సివస్తుందో అనుకుంది సుందరి. బచనే స్వయంగా ప్రసంగం మార్చేటప్పటికి ఆమె తేలిగ్గా గాలి పీల్చుకుంది. " ఏం కలిసొస్తుందో మనకేం తెలుసు ?" అని మాత్రమే సమాధానం చెప్పింది.

రోడూతాత వచ్చాడు. బచన్‌సింగు " సత్ శ్రీ అకాల్ " అని అభివందనంచేసి పక్కగావచ్చి కూర్చున్నాడు. లచ్చోజాడ ఏమైనా తెలిసిందా అని అడిగాడు బచన్. దానికి రోడూ సమాధానం యివ్వలేదు. వెక్కి వెక్కి ఏడుస్తూ వుండిపోయాడు.

సుందరి తాత దగ్గరికెళ్ళి అతని మెడలో రెండు చేతులు వేసి " ఏం జరిగింది తాతా ? " అని అడిగింది. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు స్పష్టంగా తెలుస్తున్నాయి.

పంచెకొంగుతో కళ్లు తుడుచుకుంటూ చెప్పాడు– " సుందరీ, నీ లచ్చో యిక తిరిగి రాదమ్మా. అది చచ్చిపోయింది తల్లీ ."

ఆమాట వినగానే పిచ్చిగా కేకవేసింది సుందరి. అతని భుజాన్ని పట్టికుదుపుతూ "ఎలా చచ్చిపోయింది ?" అంది. ఆమె కంఠంలో ఆందోళన, ఆశ్చర్యం ద్యోతకమయ్యాయి.

"ఎవరో దాన్ని బావిలో పడేశారు తల్లీ."

"బావిలోనా !"

దూరదర్శినిలోంచి ఒకేపర్యాయం రెండు వస్తువుల్ని చూసినట్లుగా వాళ్లిద్దరి మనోవ్యథను బచన్ మనస్సు అర్థంచేసుకుంది. ఇద్దరూ విడవకుండా ఏడుస్తున్నారు. అలా చాలాసేపు విలపించగా మనస్సు కొంచెం తేలికపడింది. హృదయభారం కొంత తగ్గింది. బచన్‌వైపుతిరిగి రెండుచేతులూ జోడించి రోడూతాత ఇలా అన్నాడు–"సర్దార్జీ, తమరు మామీద చాలా అనుగ్రహం చూపారు. నూరు జన్మలెత్తినా మీఋణం తీర్చుకోలేను. సుందరికి చదువుచెప్పి దాన్ని ఒకమనిషిగా చేశారు. దానిప్రాణం కాపాడడానికి మీరు ఎన్నో కష్టాల్ని ఎదుర్కొన్నారు. అవమానాల్ని సహించారు. నేను మీకెలా కృతజ్ఞత తెల్పుకోగలను ? నా బ్రతుకు తెల్లారిపోయేంతవరకు మీ ఈ పాదాలముందే గడి

పేద్దామనుకున్నాను. కాని మాకూ ఈ వూరికీ ఋణంతీరిపోయింది. మేము ఇక్కణ్ణుంచి మరోచోటికి ఎక్కడికైనా వెళ్లిపోవాలని ఆ సర్వేశ్వరుని ప్రార్థించండి''.

దైన్యంతో రోడూ పలికిన ఒక్కోమాట వాడిబాణంలా వచ్చి బచన్ హృదయంలో గుచ్చుకుంది. అతని గుండెను ఎవరో కలియపెట్టినట్లయింది. ''కాని తాతా, ఎందుకు మీరు వెళ్లిపోవాలనుకుంటున్నారు?'' అని ప్రశ్నించాడు.

సుందరిని చూపిస్తూ ''ఏం చెప్పమంటారు సర్దార్జీ, ఈ పిల్లదాన్ని పెంచి పెద్దజేయడానికి ఎన్నో కష్టాలుపడ్డాను. నేను సుందరిని ఇంటికి తీసుకొనివచ్చినప్పుడు పాలపిట్ట లాగా చిన్నగా వుండేది'' అని మొదలెట్టి సుందరి ఎలా ఎక్కడ ఏపరిస్థితుల్లో దొరికిందీ అన్నీ వివరించి ఓ కథగా చెప్పాడు బచన్‌కు. ''లోకంలో సొంత బిడ్డల్ని ఎలా ప్రేమిస్తారో నాకు తెలియదు. ఈ పిల్లఅంటే నాకు ఎంతప్రేమో చెప్పలేను. దీనికి ఊహ రానంతవరకు దాన్ని ఎలా పోషించాలి ఎలా పెంచాలన్న చింతేవుండేది. మీకు తెలుసుకదా. ఇప్పుడు దానికి ఊహ వచ్చింది. వూహతో పాటు వయసూవస్తూంది. ఇక నేనా ఓ బికారిని. వీధులంట అడుక్కుతిని బతికేవాణ్ణి. రోడ్డుమీద విసిరిపారేసిన విస్తరాకుకైనా కదలడానికి ఎగరడానికి శక్తి వుంటుంది. కాని నాకు అదికూడా లేదు. మీరే చెప్పండి. నేను ఎవరికి ఏ అపకారం చేయగలనో?'' అతని కంఠం బొంగురుపోయింది. అతను మాట్లాడలేక పోయాడు. కొద్దిసేపయ్యాక తిరిగి అతను చెప్పుకపోయాడు—''కొంతకాలం నుంచి చూస్తున్నా. వూరివాళ్లకు మేమంటే గిట్టడంలేదు. రాత్రిళ్లు చాలామంది కుర్రాళ్ళు మాగుడిసె ముందు చేరుతారు. గిద్దా ఆడతారు. నానా మాటలూ అంటారు. మాకు వినపడేలా ఏవేవో కూతలు కూస్తారు. అవన్నీ వింటూంటే గుండె రగుల్కొనిపోతుంది. మధ్యమధ్యలో మీ పేరును గూడా లాగి...'' అంటూ ఆగిపోయాడు.

తల్లిమాటలు విన్నప్పుడు బచన్‌కు చాల బాధకల్గింది. నొచ్చుకున్నాడు. ఈ అపనింద నుండి తప్పించుకోవడం ఎట్లాఅని ఆలోచిస్తూంటే రోడూ గాధవింటే తన కష్టాల్నే మరచిపోయాడు. చాలాసేపు ఆలోచిస్తూ కూర్చుని చివరకు నిస్పృహాయతను ప్రదర్శిస్తూ—''ఇది అంతా వింటూంటే నాకు చాలా విచారంగా వుంది. కాని దీనికి విరుగుడు ఏమిటో తోచకుండా వుంది నాకు. మీరేం ఆలోచించారు?'' అంటూ వాళ్ళవైపు చూశాడు బచన్.

''వెళ్ళిపోతాం'' అని రోడూ పూర్తిచేసి— ''సర్దార్జీ, ఏం చేయడానికీ పాలుపోవడం లేదు. సుందరి లేకపోతే చచ్చేవరకు నేనిక్కణ్ణుంచి కదిలేవాణ్ణికాదు. ఈ స్థలంఅన్నా ఈ వూరి గుడిసెఅన్నా నాకు మమకారం. దీన్నివదిలేస్తే నాగతి ఏమౌతుందో చెప్ప

లేను. కాని అంతకన్నా చేయగలిగిందిలేదు. ఈడొచ్చినపిల్ల ఇంట్లోవుండగా అటు వంటి పాడు కూతల్ని విని ఎవరు సహిస్తారు ? సుందరి సంగతికూడా ఆలోచించాలిగా. పెంటకుప్పను ఇంట్లోంచితీసినా దాన్నితిరిగి పెంటకుప్పమీదే వేయాలికదా ! అని ఆగాడు.

కానేపుఆగి మళ్ళీ రోడూ ప్రారంభించాడు—''అదీకాక సర్దార్జీ, ఈ మంచి ముత్యాన్ని బంగారు సరంలోనే గుచ్చాలి. పూసల్తో కలపలేనుకదా. అదే ఇప్పుడు నాకొచ్చిన పెద్దసమస్య. మీదయవల్ల ఇంతచదువు చదువుకొన్న తర్వాత దీన్ని ఏ ఎరుకలోడికో, గారడీవాడికో అప్పగించలేను. సుందరికి తగ్గట్టు మంచి మొగుణ్ణే చూడాలనివుంది. కాని అందుకుకూడా పుణ్యం చేసుకుపుట్టాలిగా.''

రోడూ చెప్పుకపోతూంటే పరధ్యాన్నంగా వింటూనే తీవ్రంగా దేన్నిగురించో ఆలో చిస్తున్నాడు బచన్. అలా ఆలోచించి ఆలోచించి కొద్దిసేపటికి ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా రోడూను వుద్దేశించి ''తాతా, మిమ్మల్ని నేను వెళ్ళనివ్వను'' అని నిర్మోహమాటంగా చెప్పేశాడు.

రోడూ మాట్లాడలేదు.

''సుందరిని పెంటకుప్పలో పడేయడానికి విధాత సృష్టించలేదు. ఆమె ఇంకా తన చదువు కొనసాగించాలని నా వుద్దేశ్యం'' అన్నాడు తిరిగి.

జీవిత పర్యంతం జైలుశిక్ష పడిన ఖైదీని పిలిచి నిన్ను విడిచిపెట్టే పూచీ నాది అంటు వకీలు హామీ ఇస్తే ఆ ఖైదీ పరిస్థితి ఎలావుంటుందో బచన్ యిచ్చిన హామీవిన్నరోడూ పరిస్థితి కూడా అలాగే అయింది. దడదడలాడే గుండెతో '' సర్దార్జీ మీరు మావిషయంలో అంతకుముందు ఏలోటు రానివ్వలేదు. మాకోసం మీరు ఎన్నోకష్టాల్ని కొనితెచ్చుకొని సహించారు. మీ పరువూ ప్రతిష్ట దెబ్బతినకూడదు. మీరు సౌఖ్యంగా వుండాలి. మాగురించి ఎందుకు విచారిస్తారు ? ఏం పర్వాలేదు. నొసట ఎలారాసివుంటే అలా జరుగు తుంది. మా గురించి విచారించకండి. మమ్మల్ని మాదారిన పోనివ్వండీ''. అని రోడూ నివేదించుకొన్నాడు.

''కానీ తాతగారూ ఈ ప్రజల దుర్మార్గాన్ని సహించను'' అన్నాడు దృఢంగా.

రోడూ కంఠం బొంగురు పోయింది. ''సరే మీ ఇష్టం. నేనైతే... ...కాని మీరంతా విన్నారుగా... ...'' అని మాత్రం అనగలిగాడు.

''ఇదంతా సుందరి ఇక్కడున్నందువల్ల జరుగుతోంది. సుందరిని ఏదైనా స్కూల్లో చేర్పిస్తాను''.

బచన్ సింగు మాటలు వింటూన్న సుందరికి బతుకుమీద ఆశ వదులు కొన్న రోగికి ప్రాణదానం చేస్తానని ఎవరో ముందుకు వచ్చినట్లుగా అనిపించింది. చిరునవ్వు నవ్వుతూ ఆమె బచన్‌ని చూసింది. సమాధానంగా బచన్‌గూడా నవ్వుతూ అక్కడ్నుంచి వెళ్లాడు.

---

# [ 22 ]

రోడూ అన్నమాటే నిజం. తగాదా అంతా సుందరి గురించే బయల్దేరింది. దీవాన్ పూర్ నుండి సుందరి ఏరోజు వెళ్లిపోయిందో ఆ రోజు నుండి ఆమె గురించి అనుకొన్న వాడు లేడు. కాని ఒక్క పాలాసింగుకు మాత్రం దిగులు పట్టుకుంది. సుందరిని ఎలా లేవదీసుకుపోవాలా అని పన్నాగాలు పన్నుతోంటే ఇప్పుడు సుందరి కంటికే కనబడ కుండా పోయింది.

బచన్ అంటే మొదట్నుంచి పాలాసింగుకు కడుపు రగులుతూ వుండేది. కాని అతను తను కన్నేసిన పిల్లచుట్టూ తిరుగుతూండడం చూసినప్పటినుంచి అది భగ్గున మండసాగింది. సుందరిని ఎలా తిరిగి యిక్కడకు లాక్కురావాలా అన్న ఆలోచన తప్ప పాలాసింగుకు మరో ఆలోచనలేదు. మిగతా విషయాలన్నీ అతనికి సుందరి ముందు దిగదుడుపు అయిపోయాయి. ''సుందరిని యిక్కడకు ఎలా తీసుకురావడం ? ఎంత ఆలోచించినా ఏ మార్గమూ తోచలేదు.

రోడూ తాత మీద గానీ, బచన్‌సింగుమీద గానీ ఏదో పెద్దవిపత్తు వచ్చిపడ్తేతప్ప చదువు వదలి సుందరి ఇక్కడికిరాదు. అప్పుడుగాని తన వలలో చిక్కదు. ఆ ప్రయత్నం లోనే అతను మునిగిపోయాడు. అతని ప్రయత్నం మూడేళ్ళకు కాని ఫలించలేదు.

లాహోర్ లోని కన్యా ఆశ్రమంలో సుందరిని చేర్పించిన తర్వాత తనతలమీద నుంచి ఓ పెద్ద బరువు దించినట్లనిపించింది బచన్‌కు. దీనివల్ల రాబోయే అనేక అన ర్థాల్నుంచి బయటపడడమైతే పడ్డాడుకాని అతని విరోధులు లోలోపల ఏమేమి కుట్రలు పన్నుతున్నారో ఏమని ఆలోచిస్తూన్నారో తెలుసుకోలేక పోయాడు. నివురుకప్పిన నిప్పులా ఆ వ్యవహారం తాత్కాలికంగా కప్పడి పోయింది.

సుందరి ఎడబాటుతో బచన్‌కు అత్యంత అప్తమైనదేదో పోగొట్టుకున్నట్లనిపించింది. ప్రతినెలా సుందరికి డబ్బుపంపించేవాడు. ఇక్కడ రోడూ గురించిరోజూ వాకబుచేస్తూ క్షేమ సమాచారం కనుక్కొంటువుండేవాడు. రోడూగుడిసెకు వెళ్లి రోజూ ఓ అర్ధ గంటో పావుగంటో కూర్చొని అ ఈ మాటలుచెప్తూ మనుమరాలుమీద బెంగపోగొట్ట డానికి ప్రయత్నించేవాడు.

కాలచక్రం మెల్లగా తిరుగుతూంది.

సుందరి పూర్తిగా మూడు సంవత్సరాలు చదువు సాగించింది. పది పాసయిన తర్వాత దీవాన్‌పూరు రావాల్సివచ్చింది. ఆమె ఎలావచ్చిందీ, ఎప్పు డొచ్చింది ? ఈ మూడు సంవత్సరాల ఎడబాటులో బచనూ సుందరీల పరిస్థితి ఎలావుంది ? ఇదంతా వాళ్ళిద్దరిమధ్య నడచిన వుత్తర ప్రత్యుత్తరాలవల్ల తెలుస్తుంది. పవిత్రప్రేమ అనే సిరాతో వాళ్ళిద్దరూ ఒకరికొకరు రాసుకున్న ఆ వుత్తరాలు వాళ్ళిద్దరి మనోభావ ప్రకటనకు మధురాతి మధురమైనసాధనాలు. ఆ వుత్తరాలు ఇదిగో ఇక్కడ వున్నాయి. చదవండి. కొంతమందికి ఇవిఅంతగా రుచించక పోవచ్చు. అటువంటివారు వీటిని చదవకుండానే ముందుకు వెళ్ళిపోండి. ఈ ఇరువురి ప్రేమికుల మధ్య నడిచిన కొన్ని వుత్తరాలైనా ఇక్కడ ఇవ్వడం సమం జసం అనిపించింది. వాటిని ముట్టుకోకుండా మిమ్మల్ని కప్పదాటు వేయించడం నాకు యిష్టంలేదు. ఆ వుత్తరాల్లో వాళ్లమనసులు మెల్లమెల్లగా ఒకదానినొకటి ఎలా అల్లుకు పోయి ఏకమైపోయిందీ అతిమనోహరంగా చిత్రించబడింది. హృదయాన్ని కదిలించి వేసేవాళ్ళ వెచ్చటి నిట్టూర్పులూ, మనసుల్ని ఉద్రూతలూగించే మధురమైన ఊహలూ యీ వుత్తరాల్లో నిండుగా వున్నాయి.

(మొదటి ఉత్తరం)

కన్యా ఆశ్రమం,
లాహోరు.

పూజ్యులైన నా...

ఉపాధ్యాయునులందరూ నేనంటే ప్రాణం యిస్తున్నారు. క్లాసులోని పిల్లలు నన్ను చెల్లెలితో సమానంగా చూసుకుంటున్నారు. బోర్డింగు సూపర్నెంటు ఒక్క ఘడియ కూడ నన్ను విడిచివుండలేదు. ఇక్కడ దేనికీ ఇబ్బందిలేదు. అన్నీ వుండీ కూడా ఏదో వెలితిగా వుంటోంది. మనస్సు వ్యాకులంగా దేన్నో పోగొట్టుకొన్నట్లుగానే వుంటుంది. ఎందుకిలా అనిపిస్తోంది ? దీన్ని నివారించే వుపాయం ఏదైనా చెప్పండి.

మనసుకు ఏమాత్రం సంతోషం వుండడం లేదు. ఇప్పుడు మీకు ఈ వుత్తరాన్ని మనస్సును చిక్కబట్టుకొని మరీరాస్తున్నాను. ఇలానె ఎప్పుడూ రాస్తూనే వుండిపోవాలని మనస్సు ఆరాటపడుతోంది. రాస్తూ రాస్తూ మళ్ళీ ఎందుకో ఆగిపోతాను. మీ వుత్తరం ఎప్పుడొస్తుందా అని తహతహలాడుతూ ఎదురు చూస్తుంటాను. తాతగారికి నా తరపున "సత్‌శ్రీ అకాల్" చెప్పండి. గురువు కటాక్షం, మీ అనుగ్రహం మినహా ఇప్పుడు తాతగారికి ఏమాధారం వుంది ?

ఇట్లు
సుందరి.

(రెండో ఉత్తరం)

ఢీవాన్‌పూరు.

సుందరీ,

సరిగ్గా నీ గురించి నేను ఆలోచిస్తూన్నప్పుడే నీ వుత్తరం అందింది. ఏం ఆలోచ నంటావా ? అది నేను చెప్పలేను. నీ వుత్తరం చదివిన తర్వాత ఆనందమూ, దుఃఖమూ రెండూ కలిగాయి. నువ్వు ఎట్టిపరిస్థితిలో వుత్తరం రాశావో నేను కూడా సరిగ్గా అలాటి పరిస్థితిలోనే వుత్తరం రాస్తున్నాను. నీ విచారం గురించి చదువు తుంటే నాకు దుఃఖం వచ్చింది కాని ఇదేమీ కొత్త విషయం కాదు. కొత్త స్థలానికి పోయినప్పుడు తనవాళ్లను తలచుకొని మనసు అదోరకంగా వుంటుంది. జీవితంలో ఎప్పుడు బయటకు అడుగుపెట్టనివాళ్ళు కొత్త చోటికి పోగానే అలాకావడం కొత్తేమీ కాదు. అది సహజం. నువ్వు త్వరలోనే ఢీవాన్‌పూరు వూరును మరచిపోగలవని ఆశిస్తున్నాను. నిన్ను పెంచి పెద్దచేసిన తాతను వదిలి దూరంగా వెళ్లిపోవడం వల్లనే నువ్వు యీ విధంగా దిగాలుపడిపోయావేమో.

శ్రద్ధగా చదువుకో. నువ్వు ఇంకా చిన్నపిల్లవికావు. నీ మంచి చెడ్డలు యితరుల కన్నా నీకే బాగాతెలుసు. నువ్వు సాధ్యమైనంత తొందరగా విద్యాభ్యాసం పూర్తిచేసి జ్ఞానం సంపాదించాలి. నీవు మెట్టిన యింటికి శుభం చేకూర్చాలి. నిన్ను పొందినవాడు నీ అందచందాలకే కాక నీ విద్యాబుద్ధుల్ని చూసి కూడా మురిసి పోవాలి. ఇదే నేను నీనుండి కోరేది.

తాతగారు క్షేమం. ఆయన గురించి నువ్వు ఏ ఆందోళనా పడనక్కర్లేదు.

—బచన్‌సింగు.

(మూడో ఉత్తరం)

కన్యాఆశ్రమం,
లాహోరు.

గౌరవనీయులైన ...

చాలారోజుల తర్వాత మీరు రాసిన వుత్తరం అందింది. జరిగిందేమిటంటే నా వుత్తరాన్ని పోస్టుడబ్బాలో వేసీవేయగానే మీ వుత్తరం ఎప్పుడొస్తుందా అని ఎదురు చూడ్డం మొదలెట్టాను. మీ వుత్తరం చూసినతర్వాత నా మనస్సు పరిపరివిధాలా పోయింది. ఇవ్వాళ మీకు వుత్తరం రాద్దామని కూర్చున్నప్పుడు చాలా పేజీలు రాసేస్తా నని అనుకున్నాను. కాని తీరాకలంతీసి కూర్చునేసరికి రాయాలనుకున్నది కూడా తోయలేక

పోతున్నాను. ఏదో అజ్ఞాతశక్తి రాయనీయకుండా అడ్డుపడ్తోంది. ఎన్నో కాగితాలు నలువుచేసి చించిపారేశాను!

మీకు నాగురించి చింతపట్టుకుందా? నాలో ఏ విషయంచూసి మీకు చింతకలుగుతూంది. నేను చిన్నపిల్ల కానవి రాశారు. నిజంగానేను అర్థంచేసుకోలేనంత చిన్నదాన్నికాను. మీ మానసికాందోళనను నేను అర్థంచేసు కొంటున్నాను. మిమ్మల్ని పూర్తిగా తెలుసు కొంటున్నాను. దిక్కూ మొక్కూలేని ఓపిల్ల ప్రాణం కాపాడటమేకాక ఆమెకు విద్యా గంధం అబ్బించి అజ్ఞానంలోంచి బయటికిలాగి జ్ఞానపీఠంమీద ఎత్తుగా కూర్చోపెట్టడానికి మీరు పడినశ్రమ, సంఘర్షణ చూస్తుంటే దానికిబదులు తీర్చలేను సరికదా, వర్ణించడం కూడా నాకు చేతకావడం లేదు.

మీరు ఎన్నిఆపదలనుంచి నన్ను కాపాడేరో అన్ని ఆపదల్లోనూ మీరు చిక్కు కున్నారు. ఇంకా ఎన్నిఆపదలు మిమ్మల్ని చుట్టుముడ్తాయో తెలియదు. ఈ విషయాలన్నీ నాకు తెలియదా? అలాంటి పరిస్థితుల్లో వున్న మీకు ఆందోళన కాకపోతే మరెవ్వరికి వుంటుంది?

ఇవన్నీ తల్చుకుంటుంటే భూదేవి రెండుగా చీలిపోయి నన్ను తనఒడిలో తీసుకుంటే ఎంతబావుండును అనిపిస్తుంది. మీ కష్టాలుకూడా గట్టెక్కుతాయి. చీకూ, చింతా దానంత టదే పోతుంది. కాని ఏం చెయ్యను? మొండి సాహసంతో బతుకుతున్నా.

కొత్త స్థలానికి వెళ్లినందువల్ల నా మనస్సు అదోలావుందని మీరు రాశారు. అదేమీ కాదు. మీ నీడ - మీరక్ష నాకున్నంత వరకు అగ్నిపర్వత శిఖరంఅయినా సరే నాకది స్వర్గతుల్యమే. నా విచారానికి కారణం అది కాదు.

దీవాన్‌పూరే మరచిపోతానంటారా? క్షమించండి. బహుశా నా హృదయపు లోతుల్ని చూడడానికి వుద్దేశ పూర్వకంగా రాసివుంటారనుకుంటాను. దీవాన్‌పూరును ఈ జన్మలో మరవలేను. అవూరితో నాకున్న పరిచయాన్ని జన్మజన్మలకూ గుర్తుంచు కుంటాను. పెంపుడు తాత మమకారాన్ని మర్చిపోవడం అంతతేలికకాదుగదా, కానీ...

మీవుత్తరంలోని చివరి పంక్తుల్ని చూసి నా హృదయం కుంగి పోతోంది. ఈ క్షణం వరకు నేను నా వివాహాన్నిగూర్చి ఆలోచించలేదు. నాలో వుంజుకొన్న ఆ ఉత్సాహం అంతా నీరుకారిపోయే ఆ ఘడియల్ని నేను చూడాల్సి వస్తుందా? అటువంటి ఘడియ నా జీవితంలో అడుగుపెట్టకముందే నేనీ ప్రపంచంలోంచి వెళ్ళిపోతాను. నన్ను బతికి వుండగానే ఆ చిచ్చులో పడత్రోయాలనేనా ఇన్నాళ్ళు మంచి మీరు నాకు ఉపకారం మీద ఉపకారం చేస్తున్నారు?

అబ్బా ! ఈ విషయం గూర్చి రాయడానికి నేనింకా తెలివిలోనే వున్నాను. అటు వంటి తెలివితక్కువ పని ఎన్నటికీ చేయను. ఇంతేసంగతులు.

సుందరి.

( నాలుగో ఉత్తరం )

సుందరీ,

నీ వుత్తరం చేరింది. నా అజ్ఞానంచేత నీ మనస్సును నొప్పించానని తెలిసి సిగ్గుతో కుంగిపోతున్నాను. నేను చాలా అనాలోచితంగా అసభ్యంగా ప్రవర్తించాను. మనస్సు తప్పుడు దోవ పడ్తూవుంటుంది. ఏ మొక్కకు నీడపోసి దాన్ని సంరక్షిస్తూ, నా శక్తి నంతా ధారపోశానో, కోసినంత మాత్రంచేత సౌందర్యం నశించిపోతుందని ఏపువ్వు నైతే ఇంతవరకు ముట్టుకోలేదో, దాని ఒక్కగుబాళింపుకే నేను మత్తెక్కిన వాణ్ణయి పోయి ఇది నాది అంటూ దానిమీదే నా ఆధిపత్యాన్ని చలాయించాలనుకొన్నాను.

సుందరీ, మనిషి మనసు చంచలమైంది. నిలకడలేనిది. కాస్సేపు ఆకాశంలో విహరిస్తుంది. మరికాసేపటిలోనే ఎవరిపాదాలకో అర్పితమయిపోతుంది. అసలు నా ఈ మానసిక బలహీనతను నీముందు బైటపెట్టదలచుకోలేదు. నీనుంచే కాదు — నా నుంచి కూడా. అందుకే నీకురాసే వుత్తరం గుండెరాయి చేసుకొని రాసేవాడిని. నువ్వు నన్ను నీచంగా భావించు, సభ్యత అంటే తెలియని మనిషి దాపురించాడని అనుకో.

నా హృదయంలో దాగి వున్న భావాల్ని నీ ముందు ఎప్పుడూ బహిర్గతం కానివ్వను. నా ఆత్మనిగ్రహాన్నంతా వినియోగించి వాటి దారికి అడ్డు తగుల్తాను అని ఇప్పటివరకూ అనుకొంటూండేవాణ్ణి. కాని ఒక్క ఆలోచన నా మనస్సును నిరంతరం నలిపేస్తూవుంది. నేను నా సిద్ధాంతాల్ని త్యజించి పతితుణ్ణయితే చేసినశ్రమా, పడిన పాట్లూ అన్నీ బూడిదలో పోసిన పన్నీరైపోతాయి. వుత్తరంలో నీ దిగులును గురించి నేనే ప్రస్తావించాను. కాని దాన్ని వేరేవిధంగా భావించావు. ఇకపోతే నేను వుపకారాలు చేశానంటూ ఎంతో ఋణపడిపోయినట్టు రాసావు. అది చాలా అన్యాయం. ఈ తప్పును నేనెన్నడూ క్షమించను. నేను నీ కోసం ఏమిచేసినా అది ఒక మనిషిగా నా కనీస ధర్మాన్ని నిర్వర్తించాను.

కాని సుందరీ ఒక్కమనవి. దేన్ని పొందాలని తల్లడిల్లిపోతున్నానో అదే స్వయంగా నావైపు ఆకర్షింపబడుతూంది. సదుద్దేశ్యంతో కాని స్వార్ధంతో కాని నేను వెనక్కు కాళ్లు తీసుకోకపోతే ఆమె సౌఖ్యానికే ప్రమాదం వాటిల్లవచ్చు. అందుకే నేను నా నిజ స్వరూపాన్ని నీ ముందు వుంచాలనుకున్నాను.

గురుద్వారా గుమ్మంవద్ద నేలమీద నువ్వు అక్షరాలు రాస్తుండడం చూసినప్పటి నుంచి నీలో విపురుకప్పిన నిప్పులా వున్న సంస్కారంనాలో చెరగని ముద్రవేసింది. కాని ఇప్పుడు నీ అధ్యాత్మిక గుణసంపద కూడా నా మనస్సులో చోటుచేసుకొంది. ప్రయత్నించి కూడా నేను ఇప్పుడు నీ నుండి వేరుకాజాలను.

వేరు కాలేనప్పటికీ మన ఇద్దరి మధ్య ఓ ఇనుపగోడ. అది చూసి ప్రకృతే మనం ఇద్దరం కలవాలని నిశ్చయించలేదను కుంటాను. మన మిద్దరం శాశ్వతంగా దూరంగా వుండిపోవాల్సివస్తుంది. మనం యీ ప్రయాణంలో కలిసి ముందుకు పోవడం కంటే ఇప్పటి నుంచే వెనక్కు మరలడానికి ప్రయత్నిస్తే బావుండదా?

నీ

బచన్‌సింగు.

(ఐదో ఉత్తరం)

కన్యాఆశ్రమం.

లాహోరు.

ప్రాణేశ్వరా!

మీ సహచర్యం నా జీవితాన్ని ఒక కొత్త మూసలో మలిచింది. ఈ సారి మీరు మీ వుత్తరంలో ఎలారాశారో నేనూ అదేవిధంగా నిన్న మీకు రాశాను. మీరు నిన్న వుత్తరం రాస్తూన్నప్పుడే బహుశా నేను కూడా వుత్తరం రాసి వుండవచ్చని భావించి వుంటారనుకుంటాను. మీ వుత్తరాల్లో స్వచ్ఛమైన మీ హృదయమే ప్రతిఫలిస్తూవుంటే చూసిన నా హృదయంలో ఆనందం కట్టలు తెంచుకొని పొరలుతూవుంది. దానిలో నా సందేహాలూ, సంశయాలూ, చిలిపితనం, చంచలత్వమూ, అన్నీ కొట్టుకుపోతున్నాయి. పరిశుద్ధమైన ఒక్క మానసిక భావనతప్ప అన్నీ దానిలో కలిసిపోయాయి.

నేనేమి రాస్తున్నానో మీరు తెలుసుకోవాలను కుంటున్నారా? అయితే వినండి. చెప్తున్నాను. నేను నా వుత్తరానికి మీ సమాధానం కోసం వేచివుండకుండానే మళ్లీ కూర్చుని మరో ఉత్తరం రాస్తున్నాను.

నేను మిమ్మల్ని మోసగించలేను. మనస్సులో ఒకటి బయట ఒకటిగా ప్రవర్తించ లేను. ఇంతకుముందు అలా ప్రవర్తిస్తే అది నా అపరాధం. కాని ఆ అపరాధాన్నిక చెయ్యను. ప్రపంచంలో కేవలం మిమ్మల్నే ప్రేమించగలుగు తున్నాను. అది ఎప్పటినుంచో నాకే తెలియదు. కాని ఈ మనస్సులో మరొకరికి చోటులేదని, మీరు తప్ప మరొకరెవరూ నా హృదయపు లోతుల్లోకి యిక ముందుకూడా తొంగిచూడలేరని నాకు తెలుసు.

కాని ఒకటే సందేహం. పర్వతంపై వుండే ఎత్తయిన శిఖరాన్ని ఎక్కాలని నా ఆరాటం. మరి నేనెంతవరకు ఎక్కగలనో! అవును. ఆసంగతి నాకు చక్కగాతెలుసు. అక్కడికి ఎక్కడం అటుంచి అక్కడకు వెళ్తానని ఆలోచించడం కూడా అసాధ్యం నాకు. అయినా నాకు నిరాశా నిస్పృహలు కల్గడంలేదు. కాని నా మనస్సు ఎక్కడ కైతే చేరుకుందో నేను ఆలోచించే ప్రతి ఆలోచనకూ నేను విడిచే ప్రతి నిట్టూర్పుకూ ఏదైతే కేంద్రంగా వుందో అక్కడికి నేను శారీరకంగా వెళ్ళకపోయినాసరే, భౌతికంగా దూరంగా వున్నాసరే, మానసికంగానైనా ఆ చందన వనంలోకి వెళ్ళి నన్ను నేను పరిమళింప చేసుకోగలను. ఆవుత్తరం సారాంశం కూడా ఇదే.

ఏమన్నారూ, మన ఇద్దరిమధ్య ఇనుపగోడా? అటువంటివి నేను అంగీకరించను. అటువంటి గోడ ఏదైనావుంటే అది మనపెళ్లే... మీరు ఎంత అమాయకులు. ఈ ఆలోచన మనస్సులోంచి తొలగించుకోండి. పైన రాసినదాన్ని చదివితే మీకే సమాధానం దొరుకుతుంది. కాని ఒక్క విషయం రాస్తాను. మీరు సంతోషంగా వివాహం చేసుకోండి. త్వరలోనే మీ ఇంట ఒక ఆడపడుచును మెట్టనివ్వండి. అమ్మగారికోరిక తీర్చండి. మీరు పెళ్ళిచేసుకొంటే నాకు ఎంత ఆనందమో కాలమేచెప్తుంది.

మీ ...

సుందరి.

(ఆరో ఉత్తరం)

దీవాన్‌పూరు.

సుందరీ,

నీ లాంటి అమృతమూర్తి ప్రేమను పొందగలిగాను. నేను చాలా అదృష్టవంతుణ్ణి. నీ పవిత్ర భావాలూ, ఉన్నతమైన నీ ఆలోచనలూ అన్నిటికన్న మించిన నీ అలౌకికమైన ప్రేమా చీకటిలో తడుముకుంటూన్న నాకు వెలుగు ప్రసాదించాయి. నా అంతరంగంలో ఏదో తీయని ప్రపంచాన్ని సృష్టించాయవి. నాలో ఏదో మధురమైనరాగం ఆలాపనచేస్తూ నా హృదయవీణలోని ప్రతితీగను మీటి నా అణువు అణువులో ఎప్పటికీ ఆగని తియ్యని స్వరాల్ని పలికిస్తున్నాయి. నీ వుత్తరంలోని ప్రతిమాటా నందనోద్యానంలో పూచిన ఒక పుష్పం. అది నా మనస్సును గుబాళింపచేసింది. ఆసన్నసన్నని సువాసన ముందు ఐహిక సుఖాలు, ఈ ఐశ్వర్యాలూ తుచ్ఛంగా కనపడసాగాయి.

మన ఇద్దరిమధ్యా ఓ ఇనుపగోడ వుందని రాశాను. వేమ పాటికులంవాళ్ళకు భయపడి నిన్ను వివాహంచేసుకోలేక పోతున్నానని తప్పుగా భావించావు. అటువంటి భయాలకు ఎప్పుడో తర్పణం వదిలాను. జ్ఞానీజీ వుపదేశాలు విన్నతర్వాతా, నాముందు నిల

బడివున్న కర్తవ్యాన్ని చూసిన తర్వాతా, నా జీవితాన్ని సంఘసేవకు అంకితంచెయ్యాలని ప్రతిజ్ఞచేసాను. నా వుత్తరంలోని వుద్దేశం అంతే. అమ్మ జీవించినంతవరకు ఇక్కడే వుంటాను. ఆమె కన్నుమూయగానే ఆలక్ష్యసాధనకు పూర్తిగా అంకితమైపోతాను.

నాముందు క్రూరమైన సంఘం భయంకరంగా నిలిచివుంది. రోజూ ఎన్నో లేలేత మొగ్గలు ఆ సంఘదావానలంలో ఆహూతి అయిపోతున్నాయి. ఆ కారణంగానే నేను వైవాహిక బంధంలో పడదల్చుకోలేదు. అలాచేస్తే నా లక్ష్యానికి నేను దూరమైపోతానేమోనన్న భయం. నేను మనస్సు చంపుకోకుండా పట్టుదలవహిస్తే జీవితంపట్ల నీకున్న కొద్దిపాటి రుచీ, ఆసక్తి చచ్చిపోతాయి. నువ్వు నానుండి శాశ్వతంగా దూరమన్నా అయిపోవాలి, లేదా నాతోవుంటూ ఆకలిదప్పులూ, అంతులేని ప్రయాణబడలికా, విశ్రాంతిలేమితో జీవితాన్నైనా గడపాల్సివుంటుంది.

కాని నీ వుత్తరం చూసినతర్వాత నా సంశయాలన్నీ పటాపంచలయ్యాయి. ఈ విషయంలో నేను ఓనామాలు చదువుకొనే ఓ విద్యార్థినే. నాకన్నా నాలుగాకులు ఎక్కువ చదివిన వ్యక్తితోనే పోటీపడ్డానికి ప్రయత్నించానని తెలిసి సిగ్గుపడుతున్నాను.

నువ్వునా ప్రశ్నలన్నిటికి వూరడిస్తూ సమాధానమిచ్చావు. నువ్వు నా దానివయ్యావని అనుకున్నరోజు నా జీవితంలో ప్రవేశిస్తే నేను అదృష్టవంతుణ్ణే. ప్రపంచమంతా ఏకమై అడ్డుకొన్నాసరే నన్ను ఆపలేరు. ఇందులో ఎన్నికష్టాలు పడాల్సి వచ్చినాసరే సహిస్తాను. అలా సహించడంలోనే నా గొప్పతనం, శక్తి ఇమిడివున్నాయి.

నీ...
బచన్‌సింగు

(ఏడో వుత్తరం)

కన్యా ఆశ్రమం,
లాహోరు.

ప్రాణనాథా,

నా జీవనాధార మీవైపు మళ్ళేకొద్దీ ఈ ప్రపంచానికి అవతలఏదో అలౌకికరాజ్యంలోకి వెళ్ళుతూన్నట్లుగా అనిపిస్తోంది. హృదయంలోంచి ప్రేమ అనేక వుపనదుల్ని సృష్టించుకుంటూ పారుతోంది.

మనం వీటన్నిటినీ సందేహంతో చూస్తున్నాము. వీటికి సమాధానంకోసం నేను మిమ్మల్ని, మీరు నన్నూ అడుగుతున్నాదు. దీన్నిబట్టితేలిన విషయం ఏమిటంటే అప్పుడు మనకు ఏదైతే సందేహంగా కనబడిందో నిజంగా సందేహంకాదు. ఇద్దరి

హృదయాలు అనాదిగా పుణికిపుచ్చుకొంటూన్న ఉత్సాహమూ, అభిలాష అల్లా సందేహం కలుగజేసింది.

మీరే నా జీవనసర్వస్వం. మీ ఔదార్యం నన్ను నేను ఆశించిన దానికన్న వేలరెట్లు ఎక్కువ భాగ్యశాలిగా సుఖసంతోషాలతో వుండేదానిలా చేసింది. అది చూసి నాకెంత ఆనందం కలిగిందో నేను ఏమని వర్ణించను!

ఏవస్తువైనా ఓ హద్దు దాటిన తర్వాత తన గొప్పతనాన్ని కోల్పోవడం ఆరంభిస్తుం దంటారు. ఎవరైనా ఓమనిషి హద్దూ పద్దూ లేకుండా విరగబడి నవ్వుతూంటే చివరకు అతని నవ్వు ఏడ్పుగా మారి అతని కళ్ళల్లోంచి అశ్రువులు రాలతాయి అంటారు. ఇదే గనక సత్యమైతే ఆ భావనంటేనే నా మనస్సు కలవరపడుతోంది, భయంతో కేకలు వేస్తాను. మనసులోనూ బయటా వణుకు పుట్టుకొస్తుంది. నా ఆనందమూ, కోరికలూ హద్దుమీరి నెరవేరుతున్నాయనిపిస్తూంది. నా హృదయంలో వీటన్నిటినీ పదిలపరుచు కోడానికి చోటులేకుండా పోతోంది. కుండలో ఎక్కువగా నీళ్లుపోస్తే బయటకు పొరలి నట్లు సంతోషం మనస్సులోంచి కట్టలు తెంచుకొని బయటకు పొంగుతోంది.

ఇక్కడకు వచ్చిన తర్వాత ఎందుకో కాని విచారం నా చుట్టూ చీకటిలా అల్లుకుంటోంది. నాలో అశాంతిని రేపుతోంది. ఒక్కోపర్యాయం అది పెరిగిపోతూంటే దాని భీకరాకారాన్ని చూసి నా మనస్సులో అణిచిపెట్టుకున్న ఆనందపు వెలుగంతా హరించిపోతోంది. చంచలమైన నా మనస్సు నన్నునేను సమర్థించు కోడానికి ఎన్నో మిషల్ని కల్పించుకొంటోంది. తోటలోని మొగ్గలు కనుకొనల్నుండి తన వైపు చూసి నవ్వుతూ సౌరభాన్ని విరజిమ్ముతూంటే ఏవైపునుంచో మలయమారుతం చూసి ప్రేమ అనే మత్తులో తన్నుతానే మరచి ఆ మొగ్గలతో సరసాల్లాడడం ప్రారంభిస్తోంది. ఆ ప్రేమనాటకాన్ని ఆ లేతమొగ్గ సంభాళించుకోలేక గంగవెర్రెత్తి పోతోంది. ఆ మైకంలో అది విడిపోగానే అంతకుముందు హొయలు ఒలకపోసిన ఆ మలయమారుతమే విడిపోయిన ఆ మొగ్గ రేకుల్ని మెల్లమెల్లగా తుంచి దాని జీవితాన్ని సమాప్తంచేస్తోంది.

మీరు నా ప్రాణనాథులు. మీరు నన్నా విచారవారధిలో మునిగిపోకుండా రక్షించండి. ఆ భావన చొచ్చుకోలేని స్థానంలో నన్ను మీలో ఇముడ్చుకోండి.

వుత్తరంలో ఏదో రాయాలనుకొని ఏదేదో రాసేశాను. బహుశా రాయడానికి మరేమీ లేకపోవడం వల్లనో, లేదా జీవితాంతం రాసినా తరగిపోనన్ని ఆలోచనలు ఈ చిన్న హృదయంలో చోటుచేసుకొనివుండివుండొచ్చు. ఏమాట రాసినా రాసేముందు మీ మనస్సుఅద్దంలో దాని ప్రతిబింబం చూసుకుంటాను.

మాటిమాటికి మీరు వివాహ ప్రసక్తి ఎందుకెత్తుతున్నారు? అస్తమానం వివాహమే మానవుని జీవితాన్ని సుఖమయంగా చేసేదని అంటారు? అదే గనక నిజం అయితే దానికి దూరంగా వుండాలనే కోరుతున్నాను. మీ ప్రేమా ఔదార్యంలో నాకు ఆనందం లభిస్తూవుండగా వేరే సుఖసంతోషాలు కావాలని కోరలేను సరికదా వాటిని కనీసం వూహించలేను కూడా. మొదలే మీకు చెప్పాను నా మనస్సులో ఇంకచోటులేదని. మీరు మీ జీవితాన్ని ఏదోమార్గంలో మలుచుకుంటారని రాశారే ఆ మార్గంలో మీరు ఏకాకిగా వెళ్లలేరు. ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేరు. ఒంటరిగానే వెళ్లాలని ఎంత పట్టుదలా? ఇతరులను కష్టపెట్టకుండా వుండాలనే ఎంత ఔదార్యం మీలోవున్నాయి!

ఏ సంఘం మీకీ దుర్గతి పట్టించిందో ఆ సంఘం మీద మీ మనస్సులో ఇంకా దయారసంవుంది. కిందటి జన్మలో మీరేదో ఋషిపుంగవులై వుంటారు. సంఘం మీద నాకుండే అభిప్రాయాల్ని మీ రెండు పంక్తులు మార్చివేసినాయి. వినండి చెప్తాను. ఏ పాపమూ ఎరుగని నా హృదయేశ్వరుణ్ణి ఇన్ని తిప్పలుపెట్టి అతనిమీద అన్నిదురాగతాలుచేసిన ఈసంఘంపైన కసితీర్చుకుంటాను. దీనికిపెత్తందారులుగాచెలామణి అవుతూన్న వారిని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించి ఆజన్మాంతం ప్రజలకు గుర్తుండేట్టుచేస్తాను. మిమ్మల్ని నాలాగే తయారు చేద్దామని అనుకొన్నాను. ఇంత విషాన్ని నేను ఇన్నాళ్ల నుండి కడుపులో దాచుకున్నాను. కాని మీరు దాన్ని అమృతమయంచేశారు.

ఇప్పుడు మనిద్దరి జీవితాల మధ్య హద్దులు కలిసిపోతున్నాయి. దీన్ని మీరేవిధంగా మలచదల్చుకుంటే ఆవిధంగానే అది మలుచుకపోతుంది. కాని ఒక్కమాట చెప్తున్నాను. ముళ్లతో నిండిన ఈ మార్గంలో మీరు ఒంటరిగా వెళ్లకండి. నన్ను కూడా తోడుగా తీసుకెళ్లండి. నేను మీ దారికడ్డమౌతానన్న సందేహం మీకొద్దు.

వివాహం అనే ప్రసక్తిని మనసులోంచి పీకిపారెయ్యండని మరోసారి మనవి చేస్తున్నాను. వివాహానికి కొంతత్యాగం కావాలి. కొంతకాలం తపస్సు చేయాలి. తర్వాత ఒక్కటైపోయి ప్రళయం తర్వాతకూడా కలిసి వుండొచ్చు. పైన నేను వెల్లడిచేసిన అనుమానం నిరాధారం అని భావించకండి. ఒకే గుటకలో ఇంత ఆనందరసామృతాన్ని ఎవరూ మింగలేరు.

మీ … …

సుందరి.

( ఎనిమిదో ఉత్తరం )

దీవాన్‌పూర్,

సుందరీ,

ఇవ్వాళ నీకు దారుణమైన ఓ సంఘటన గురించి రాస్తున్నాను. వినగానే నీ మనస్సుకు చాలా బాధకలుగుతుంది. నువ్వు సహించలేవేమో! రాయడానికే నా చేతులువణికి పోతున్నాయి. ఈ చెడ్డవార్త ఇంకొకరి ద్వారా నీకు తెలుస్తే బావుండేది. కానీ నా దురదృష్టం కొద్దీ ఈ బాధ్యత నాపైనేపడింది. అనుక్షణం నీపేరుజపించే నీపెంపుడు తాత నీకు చివరిసారిగా తన ప్రేమను పంచిపెడ్తూ నిన్ను చూడాలనే చివరికోరికను మనస్సులోనే అణుచుకొని – శాశ్వతంగా ఈ ప్రపంచాన్ని వదలిపెట్టాడు.

అంతకన్నా హృదయవిదారకమైన విషయం మరొకటుంది. ఎట్టి భయంకర పరిస్థితుల్లో మృత్యువు జరిగిందో నీకు తెలిస్తేచాలా ఆందోళనపడ్తావు. నీకు ఏమని రాయమంటావు! చాలా రోజుల్నుంచి ఆయన బాగా నీరసించి పోయాడు. గుడిసెలోంచి బయటికి రావడానికి కూడా ఓపికవుండేదికాదు. రోజూ మాదిరిగా సాయంకాలం భోజనం తీసుకు వేళ్లాను. నేను వేళ్లేసరికి ఏడుస్తూన్నాడు. ఎందుకు ఏడుస్తున్నారని అడిగితే " సుందరిని చూడాలని మనసు ఆరాటపడ్తూంది. ఎన్నిరోజులు జీవిస్తానో చెప్పలేను. ఓసారి పిల్లదాన్ని చూసివస్తేబావుండును" అన్నాడు. తాతగారూ, అదేమంత బ్రహ్మాండమైన విషయమండీ, రేపు వుదయాన్నే వెళ్లి సుందరిని తీసుకువస్తానని ఊరడించాను.

నేను వెళ్లడానికి ఆయన అంగీకరించలేదు. "దాని చదువు చెడిపోతుంది. పైగా ఇక్కడికి పిల్లను తీసుకరావడం అపాయం కూడా. సుందరిని తనకిచ్చి పెళ్ళిచేయమని పాలాసింగు నా వెంట పడ్డాడు. మొదట నాకెన్నో ఆశలు చూపించాడు. నేను ఒప్పు కోకపోయేసరికి అనేక విధాలుగా బెదిరించడం మొదలెట్టాడు. నువ్వు నామాట ఒప్పు కుంటేసరి లేకపోతే మావాళ్లు నిన్ను బ్రతుకనివ్వరు" అని చెప్పి వెళ్ళాడు. నువ్వు చచ్చిన తర్వాత ఎలాగా సుందరి రాకమానదు. అప్పుడు దాన్ని ఎత్తుకపోతాను" అని కూడా పాలాసింగు మీ తాతను బెదిరించాడట.

సుందరీ, నీ తాత ఈ మాటలుచెప్తూంటే ఆయన మొఖం చూడలేక పోయాను. కోపంతో వణకిపోయాను. "తాతగారు, నేనుండగా మీ సుందరిని తాకడానికి ఎవడికి గుండెలున్నాయ్" అని మీ తాతకు ధైర్యం చెప్పాను.

మా ఇంటికి తీసుకెళ్దామని చాలా ప్రయత్నించాను కాని ఆయన ఒప్పుకోలేదు. "సర్దార్జీ, నాదేముంది. నేను ఒడ్డున మొలిచిన చెట్టును. ఎప్పుడైనా ప్రవాహంలో కొట్టుకొనిపోక తప్పదు. కాలూ, చేయీ ఆడుతున్నప్పుడే నన్ను తీసుకెళ్ళమని దేవుణ్ణి

రోజూ వేడుకుంటున్నాను. నాయనా బచన్, నాశరీరంలో సత్తువ బొత్తిగా నశించింది. సుందరి గురించే నాఆందోళనంతా. ఇప్పుడు మీ అనుగ్రహం వలన అదికూడాలేదు" అంటూ అక్కడనుంచి కదలడానికి యిష్టపడలేదు. "నాతో లాహోరురండి. నేను సుందరిని చూపిస్తా" నని ఎన్నోచెప్పాను. చివరకు ఆయన్ను ఒప్పించగలిగాను. మర్నాడే మీ దగ్గరకు రావాలని నిశ్చయించుకున్నాం.

ఆరోజు అర్ధరాత్రి మెలకువవచ్చింది. "నిప్పంటుకుంది, నిప్పంటుకుంది" అని కేకలు వినపడ్తూంటే ఖంగారుగా లేచి బయటికి వచ్చాను. మంటల దిక్కుగా పరుగెత్తుకుంటూ వెళ్ళాను. తాత వుండేపాక అది. చాలామంది జనం అక్కడ మూగారు. కాలిపోయిన తాతదేహాన్ని కొంతమంది ఆమంటల్లోంచి బయటికి తీసుకొచ్చారు. చూస్తూండగానే గుడిసె చాలాభాగం కాలి బూడిదైపోయింది. నీళ్ల చల్లారేమో మిగిలిన కట్టెలూ వాసాలూ సగం ఆరిపోయి సన్నగా మండుతున్నాయి. జనాన్ని చీల్చుకుంటూ దగ్గిరకెళ్లాను.

కాలిపోయిన దేహం గురించి ఇంకా బీభత్సంగా వర్ణించి పాడైపోయిన మీ మనస్సును మరీ నొప్పించతలచుకోలేదు. నేనా దృశ్యాన్ని చూడలేకపోయాను. అయినా గుండె దిటవుచేసుకొని ఆయన శరీరాన్ని ముట్టుకున్నాను. ఇద్దరు జవాన్లతో ఒక పోలీసు అధికారి అక్కడకు వచ్చాడు. తాత చచ్చిపోయాడనే అందరూ అనుకొన్నాం. కాని కొంచెంసేపటి తర్వాత ఆయన శరీరంలో సంచలనం కలిగింది. చాలాసార్లు పిలిచాను. పిలవగాపిలవగా కళ్లెత్తి నన్నుచూసి "సర్దార్జీ"అన్నాడు. నేను ఊకొట్టి మాట్లాడదామనుకొనే సరికి పోలీసువాళ్లు వాజ్మూలం తీసుకోడానికి ఇదే అదనుగా భావించి నన్ను మాట్లాడనివ్వకుండా తామే ప్రశ్నలు అడగడం మొదలెట్టారు. కొద్దిగా తెలివివచ్చినట్లయింది. నిప్పు అంటించినవారెవరని పోలీసు అధికారి తాతను ప్రశ్నించాడు. కాని మీతాత సమాధానంగా ఆకాశం వైపుచూశాడు. హంతకుని పేరుచెప్పి అతణ్ణి అపఖ్యాతి పాలుచేయడం ఇష్టంలేక ఇదంతా భగవత్ సంకల్పమని అనుకొని వూరుకొనివుండాలి. తర్వాత మాట పడిపోయింది. సౌంజ్ఞచేసే శక్తికూడా నశించింది. తన చుట్టూచేరిన జనాన్ని ఓసారి కలియచూశాడు. నామీద అతని దృష్టి లగ్నమైంది. "తాతా, ఏమైనా చెప్తావా" అంటూ గుంపులోంచి ముందుకు వెళ్లాను.

అతనేమీ మాట్లాడలేక కళ్ళల్లోంచి నీళ్లు కారుస్తున్నాడు. ఏదో మాట్లాడాలనుకుంటున్నాడు, కాని మాట్లాడలేక పోతున్నాడు. నాకేమీ అర్థంకాలేదు. నన్నుదగ్గిరకు రమ్మనమని సౌంజ్ఞచేశాడు. మరీ దగ్గరకెళ్లి అతని నోటిదగ్గరగా చెవులుపెట్టి వింటానికి

ప్రయత్నించాను. అతి కష్టంమీద "సుం...ద...రి" అని మూడుఅక్షరాలు మాత్రమే వినగలిగాను.

"సుందరిని చూడాలని వుందా ?" అని అడిగాను.

చేతిలో డమరుకాన్ని తిప్పుతున్నట్లుగా చేతిని నెమ్మదిగా తిప్పాడు. నాటకం అయిపోతోంది. ఇంక తెరపడిపోతుంది. సుందరిని యింక ఏం చూడగలను అని అతని ఉద్దేశ్యంగా గ్రహించాను. "మరి సుందరికి ఏమైనా చెప్పాల్సి వుందా?" అని మళ్ళీఅడిగాను.

అతనేమీ సమాధానం ఇవ్వలేదు. కన్నీటితోనిండిన ఆయనకళ్ళు నా మొహాన్నే కన్నార్పకుండా చూస్తున్నాయి. ఏదో నావద్దనుంచి సమాధానం కోరుతున్నట్లుగా కనిపించాడు. అతని మనస్సులోని భావం గ్రహించి "తాతగారూ, మీరు సుందరి గురించి చింతించకండి. నేనామెను వివాహం చేసుకొంటాను"- అని చెప్పాను.

నానోటినుంచి ఆ మాటరాగానే ఆతనికళ్ళు తళుక్కుమని మెరిసేయి. పెదవులపై సన్నని నవ్వు పొడచూపింది. నాకు కృతజ్ఞత తెల్పుకోవడంకోసం రెండుచేతులు ఎత్తి జోడించనున్నట్లుగా చేతుల్ని కలిపాడు. రెండు చేతుల్ని దగ్గరకు తీసుకురావడానికి విశ్వ ప్రయత్నం చేసాడు. కాని ఓబెత్తెడుదూరం వుండగానే ఆయన రెండు చేతులూ మళ్ళీ విడిపోయి ఛాతిమీద పడిపోయాయి. అతనిమెడ భుజంమీదకు ఒరిగిపోయింది. నానుండి ఈ సమాధానం కోసమే ఆయన ప్రాణాలు నిలిచివున్నట్లుగావుంది. అంతే. శాశ్వతంగా కన్నుమూశాడు.

అనుమానంతో పోలీసులు పాలాసింగుసూ, అతని మిత్రులు మరో నలుగుర్ని యింకా సవాయిసింగూ, వీరసింగూ మొదలైనవాళ్ళను అరెస్టు చేశారు.

అబ్బా ! ఎంతభయానక దృశ్యం ! ఆ ఆకారం ఇంకా నా కళ్ళముందేవుంది. ఈ దారుణం విన్నప్పట్నుంచీ మా అమ్మగారు కంటికి మంటికి ఏడుస్తూనేవుంది. ఆమె మనస్సు బాగా బెంబేలు పడిపోయింది.

సుందరీ, అంతా భగవంతుని సంకల్పం. ఎవరిపైనా పగతీర్చుకొందాం అన్న భావాన్ని గూడా రానివ్వరాదు. పగతీర్చడం ఆ పైవాడి చేతిలోనేవుంది. ప్రపంచంలోని ఏశక్తీ మనల్ని మన సిద్ధాంతాల్నుంచి కిందకు తోయనివ్వకుండా చేసుకోడంలోనే మన శౌర్యపరాక్రమాలు దాగి ఉన్నాయి.

ఈ వుత్తరం చదివిన తర్వాత నీ పరిస్థితిని వూహించగలను. అందుకనే ఇంకా ఎక్కువరాయడంలేదు. వూరకనే దిగులు పడకు. ధైర్యంగా సాహసంతో పరిస్థితుల్ని ఎదుర్కోవాలి.

వుత్తరం రాస్తూండగానే ఇప్పుడే కబురు అందింది. ఏదో పూచీకత్తులు తీసుకొని పోలీసులు పాలాసింగునూ, అతని ముఠానూ ఒదిలేసిందట. దీనిక్కారణం అంతాడబ్బు మహిమా, పూరివారి ఔదార్యమునూ. వాళ్లు అతణ్ణీ, అతని ముఠానూ కాపాడడానికి తీవ్రంగా ప్రయత్నంచేస్తున్నారు. ఇలా జరుగుతుందని నేను మొదటనుంచీ అనుకొంటూనే వున్నాను.

నీ... ...

బచన్‌సింగు.

(తొమ్మిదో ఉత్తరం)

కన్యాఆశ్రమం,

లాహోరు.

ప్రాణేశ్వరా,

మీ వుత్తరం అందింది. అయ్యో! తాత మృత్యువాతపడిన వార్త వినగానే మనసులోని సప్తసముద్రాలూ పొంగినయ్. నా బాధను ఏమని వర్ణించను? తాతను ఆఖరుసారిగా చూడాలన్న కోరిక నేరవేరనేలేదు. నా వీపు మీద వాత్సల్యంతో చేతిని నిమిరేవాడు. పితృప్రేమ ఉయ్యాలలో నేను వూగేదాన్ని. కాని నా ప్రారబ్ధంలో అది రాసిపెట్టిలేదు. హృదయం బావురుమంటోంది. లక్షప్రయత్నాలు చేసినా శాంతించడం లేదు. ప్రతిక్షణం దుఃఖంపొంగుతోంది. హృదయాన్ని చీలుస్తూ లోలోపలే ఇంకిపోతోంది. కాని మీ అండవున్నదన్న భావనతోనే గుండె దిటవుచేసుకొని ఆలోచించ గలుగుతున్నాను.

తాత అదృష్టహీనుడు. ఎవరితోనూ పొరపొచ్చాలు పెట్టుకొనేవాడు కాదు. రోడ్డు మీదవున్న గడ్డిపోచకు కూడా హానిచేయకూడదన్న భీతికలవాడు. అలాంటి ధర్మరాజును కూడా హంతకులు బతకనివ్వలేదు. అలాటి కసాయి వారినిశిక్షించడానికి బదులు అహర్నిశలూ వాళ్ళను కాపాడాలని పూరివాళ్లు తాపత్రయ పడుతున్నారంటే సంఘంలో అలాటి దుష్టశక్తులు తగ్గకూడదని వాళ్లే కోరుకొంటున్నారన్నమాట.

ఓ నాహృదయేశ్వరా, ఇట్టిసమాజాన్నా మీరు సంస్కరించాలని తపిస్తున్నారు? ఇట్టి సమాజంపైనా సంస్కరించాలని ఆశలు పెట్టుకొని కూర్చోడం? పాప పంకిలమైన హృదయాన్ని కడగడం సాధ్యంకాదని ఇంత జరిగిన తర్వాతకూడా మీరు నిశ్చితాభిప్రాయానికి రాలేకపోయారా? అమాయాగ్ని వెదజల్లే హృదయాల్ని, అహంకారవిషంతో నిండిన మనుసుల్ని వెడిపోయిన రక్తంప్రవహించే చేతుల్నీ సంస్కరించాలని స్వప్నాలు కంటున్నారా? ఈ కటిక రాతినేలపై సంస్కారమనే బీజాన్ని నాటితేమాత్రం అది మొలకలెత్తుతుందని ఆశిస్తున్నారా?

# తెల్లని రక్తం

ఒద్దు బాబూ వద్దు. ఆ ఆలోచననే మనస్సులోకి రానీయకండి. మీరు కొండను ఢీకొని దాన్నిపిండి చేయాలని చూస్తున్నారు. అది ఆవిధంగా పిండికాదు. మీ తలే పగిలిపోతుంది. విషతుల్యమైన యీ సమాజ వృక్షాన్ని సమూలంగా వేళ్ళతోసహా పీకి పారెయ్యాలి. దానిచుట్టూ దాన్నిపట్టివున్న మట్టి త్రవ్వేయాలి. రాళ్ళల్లో చెమ్మగా మిగిలిన చెడురక్తాన్ని నిర్దాక్షిణ్యంగా పిండిపారబోయాలి. ఆచెడురక్తం తాలూకు ఒక్క బిందువు వున్నా రాబోయే తరాలపై దాని చెడ్డప్రభావం పడకుండామానదు.

నేనుకోపంతో ఏవేవో రాసేశాను. నాతప్పుల్ని మన్నించండి. నా మనస్సు నా దగ్గరలేదు. మనసు అంతరాంతరాల్లో దాగివున్న భావాలు బైటపడి వుండొచ్చు. కాని అలావుండడానికి కారణం యింకా నా మనసు పూర్తిగా ఎదగకపోవడమే. అందుకే మనసులో పొందికలేకుండా వచ్చే ఈ ఆలోచనల్ని ఎప్పటికప్పుడు తుడిచివేయడానికి ప్రయత్నిస్తూవుంటాను. బహుశా మనస్ఫూర్తిగా తీసివేయనేమో. ఓహద్దువరకు వాటిని అమలుపరచడానికి కూడా పూనుకుంటానేమో! కాని మీసమక్షంలో వున్నప్పుడు పగ తీర్చుకోవాలనే భావనను మనస్సులోంచి బలవంతంగా తీసివేయడానికి సమూలంగా నిర్మూలించడానికి ప్రయత్నిస్తాను.

మీ ఆశయాల్ని భగవంతుడు సఫలం చేయాలని నా ఆకాంక్ష. నా మనస్సులో కూడా హింసకు ప్రతిహింస చేయాలనే దురాలోచన వున్నట్లయితే పాము తలను అణగ కొట్టినట్టుగా దాన్ని అణచివేసి నన్ను నేను విముక్తురాలిగా చేసుకొని మీ ఆదర్శాల బాటలోనే నడవటానికి కావలసిన బలం ప్రసాదించమని గురువును ప్రార్థిస్తున్నాను.

నాకు నా చంచలమైన మనసు మీద విశ్వాసం సడలిపోయింది. అది నన్ను వక్ర మార్గాన్ని పట్టించాలని చూస్తోంది. ఒకొక్కప్పుడు మనస్సులో పగ తీర్చుకోవాలనే అగ్ని జ్వాలలు ఎంత ఉవ్వెత్తునలేస్తాయంటే నన్ను నేను సంభాళించుకోలేను. నేను మిమ్మల్ని ప్రార్థించేది ఒక్కటే. మీఆజ్ఞానుసారం నన్ను నడిపించండి. మీ నీడనే వుండనివ్వండి.

ఇవ్వాళ మనసు బెంగగావుంది. ఇక రాయలేను. రాసిందాన్ని కూడా పంపాలనిలేదు. కాని పంపిస్తున్నాను. మీహృదయం చాలా విశాలమైనది. గాంభీర్యం మీ అణువు అణువునా తొణికిసలాడు తూందని నాకు తెలుసు. మీరు నా తప్పుల్ని క్షమించండి. వచ్చి నన్ను తీసుకెళ్లండి. నన్ను పెంచి పోషించిన నా తాత కాలిపోయిన గుడిసెను చూడాలనివుంది. అదీకాక నాచదువుకూడా ఇంచుమించుగా పూర్తి అయిపోయింది.

మీ ...

సుందరి.

(పదో ఉత్తరం)

దీవాన్‌పూర్.

సుందరీ

నీ వుత్తరం అంతా వ్యాకులంతో, కోపంతో నిండివుంది. కాని నీ కలంలోదాగి వున్న హేతుబద్ధం ముందునేను అన్నీ మరచిపోయాను. నువ్వెంత అమాయకురాలవు! నువ్వు కొండను ఉదాహరణగా ఇచ్చావే — అది చదివి నాకు నవ్వొచ్చింది. నువ్వు చెప్పిందానిలో నువ్వేఇరుక్కుపోయావు. నువ్వేఅన్నావు కొండను పిండిచేయాలంటే డీ కొనికాదని సమాజవిషవృక్షపు వేళ్లను పట్టుకొనివున్న మట్టి లాగెయ్యాలని. కాని నువ్వు సూచించింది తలతో ఢీకొట్టడమే. ఇంకో మాటలో చెప్పాలంటే దెబ్బకు దెబ్బ కొట్టి సంఘం మీదకసితీప్పుకొని సంస్కరించాలని ఆశించడం నిజంగా కొండతో ఢీకొనడమే అవుతుంది. అలాకాక దానికి భిన్నంగా వాస్తవమైన ఉన్నతమైన సిద్ధాంతాల ప్రచారం ద్వారా సంఘాన్ని ప్రభావితంచేసి దాని మనసును మనకు అనుగుణంగా మలచుకొంటే దాని వేళ్లను బలహీనం చేసినట్లవుతుంది.

నీ ఔదార్యానికి ఋణపడివుంటాను. నువ్వు నీ ఆలోచనా సరళిని సమర్థించుకొంటూనే నన్ను అనుసరించాలని అనుకొంటున్నావు. నా ఈ గమ్యం తెలియని ప్రయాణంలో తోటి ప్రయాణీకురాలుగా వచ్చి కలిసినరోజు, ఇవ్వాళటి నీ ఆలోచనా పద్ధతి ఎంత అసమంజసమైందో నువ్వే తెలుసుకొంటావన్న నమ్మకం నాకు పూర్తిగావుంది.

సంఘంలో ఆత్మీయతా భావం రోజుకురోజూ నశించిపోతోంది. దానిలో చెడు రక్తం ఎక్కువయిపోతోంది. కాని దాన్ని శుద్ధిచేయడానికి నువ్వు అవలంబించాలన్న మార్గం పిచ్చి కుక్కకరచిన మనిషిని చక్కగా స్నానం చేయిస్తే ఆరోగ్యవంతు డౌతాడన్నంత అర్థరహితంగావుంది.

సుందరీ, ఒకమాట చెప్తాను. శ్రద్ధగా విను. తెల్లరక్తంతో లుకలుకలాడే రోగుల్ని ఏరి వాళ్ల శరీరంలో ప్రచారం అనే టీకా ద్వారా సదాశయాలనే మందును ఎక్కించాలి. అప్పుడుకాని నిర్జీవమైన ఆ తెల్లకణాలు బయటకు నిష్క్రమించి వాటి స్థానే సజీవమైన ఎర్రకణాలు పుట్టవు.

ఆ పనే చేయాలని నడుంకట్టాను. ఈ మహాత్కార్యంలో నువ్వు సహకరిస్తే ఒకటీ ఒకటీ పదకొండు అయినట్లుంటుంది. నాలుగైదురోజుల్లో నిన్ను తీసుకెళ్లడానికి వస్తున్నాను. అమ్మను నేను ఒప్పించాను. ఆమె నా పనికి అడ్డంరాదు సరికదా నీతో కలసి పనిచేయడానికి అభ్యంతరం పెట్టలేదు. దానికి గాను ఆమె పెట్టిన ఒక్క-

షరతు ఒప్పుకొనక తప్పిందికాదు. ఆమె బతికివుండగా నేనామెకు దూరంకారాదు. నువ్వుకూడా ఈ పని ప్రారంభించడానికి సిద్ధంగా వుంటావని ఆశిస్తున్నాను.

మన కార్యక్రమం, దాని లక్ష్యాలు ఈ విషయాలన్నీ మనం ఇద్దరం కలిసి నిర్ణయిద్దాం. ప్రస్తుతానికి మన వూళ్లోనే ఓ చిన్న కార్యక్రమం వుంది. దీనితో మనం ఈ పనికి ప్రారంభోత్సవం చేద్దాం. కొద్ది రోజుల్లో మనవూరి షావుకారు లాలారలారాం కుమార్తెకు పెళ్లి జరుగబోతోంది. భోగంమేళం, మేజువాణీ, పగటివేషాలూ, తాగుడూ తందనాలూ దుబారా ఖర్చుచేసే ఇంకా ఇలాంటి కార్యక్రమాలు అనేకం పెట్టి మంచి నీళ్లలా డబ్బును ఖర్చుపెట్టడానికి సిద్ధంగా వున్నాడని విన్నాను.

మనల్నికన్న మన పెద్దవాళ్లు భోగంవాళ్ల చుట్టూ కూర్చుని మేజువాణీ వింటూంటే వాళ్లుకన్న సంతానం — కూతుళ్లూ కోడళ్లూ పైన కిటికీల్లో కూర్చొని ఆ దృశ్యం చూడ్డం ఎంత సిగ్గుచేటైన విషయం ? వాళ్లకు లజ్జా సిగ్గూ లేదంటావా ? బహుశా వాళ్లకు చెప్పి నచ్చచెప్తే అటువంటి అసభ్యకరమైన పని విరమించుకొంటారని నా ఉద్దేశం. ఇంకేమని రాయనూ, ఐదురోజుల్లో నీ దగ్గిర రెక్కలు గట్టుకొని వాలుతున్నాను.

నీ... ...

బచన్‌సింగు

అన్నట్లు మరచాను. తీరా వుత్తరం ముగించిన తర్వాత కాని జ్ఞాపకం రాలేదు. ఈ మధ్య పంజాబీ పత్రికల్లో వరుసగా ప్రచురితమౌతున్న నీ కథల్ని చూశాను. ఇవే నా శుభాకాంక్షలు. ఓ రోజు పట్నం వెళ్లితే అక్కడచూసి మతిపోయింది. నువ్వు చాలా అద్భుతాలు చేస్తున్నావన్నమాట. సంఘం దౌష్ట్యాన్ని కొంచెం అతిగా వర్ణించావు. నా సుందరి భవిష్యత్తులో ఓ పెద్ద రచయిత్రి అవుతుందని నా మనస్సు చెప్తోంది.

నీ రచనలకు హృదయపూర్వకంగా శుభాకాంక్షలు తెలుపుతూ ఓ చిన్న సలహా యిస్తున్నాను. దీన్ని మన్నించగలవనే ఆశిస్తున్నాను. నీ రచనల్లో కోమలత్వం, సహనం వుండడం అవసరం. సమాజం పట్టి పీడించిన వ్యక్తి కలంలోంచి ఇదే వస్తుందని ఒప్పుకొంటాను. కాని హింస, దౌర్జన్యం, కాఠిన్యం లేని రచనలు నువ్వు చేయాలని ఆశిస్తున్నాను. హత్యకు సమాధానం హత్య కానేరదు. నువ్వు భవిష్యత్తులో చేయబోయే రచనల్లో ఈ మార్పు తేవడానికి ప్రయత్నిస్తావా ?

బచన్‌సింగు.

# [ 23 ]

దీవాన్‌పూరు వచ్చీ రాగానే సుందరి చేసిన మొట్టమొదటి పని. ఆమె తన ప్రియమైన తాత కాలిపోయిన స్మృతి చిహ్నానికి వెళ్ళి నమస్కారం చేసి అక్కడి మట్టిని నుదురుకు రాసుకోడం. కాలిపోయిన కట్టెల బూడిద యింకా అక్కడ కుప్పగాపడి వుంది. సుందరికి అది కేవలం మామూలు బూడిదకాదు. జరిగిపోయిన సమస్త జీవితానికి అది ప్రతీక. ఆ బూడిద చూస్తూంటే పుట్టినప్పట్నుంచి లాహోరు వెళ్ళినంత వరకు మొత్తం జీవితం ఆమె కళ్ల ముందు కన్పించసాగింది. రోడూ తాత తనపట్ల చూపిన వాత్సల్యం అంతులేని ఆప్యాయత నిండిన ప్రతిక్షణం జ్ఞాపకం వచ్చి ఆమెను కుంగదీస్తున్నాయి. ఆమె శిలాప్రతిమలా అక్కడే ఎంతోసేపు కూర్చుని కన్నీరు మున్నీరుగా మౌనంగా రోదించింది. పదేపదే బచన్‌సింగు చెప్తేకాని ఆమె అక్కణ్ణుంచి లేవలేదు.

సుందరి వుండడానికి బచన్‌సింగు అంతకుముందే ఏర్పాటు చేశాడు. తన యింటికి ఆమెను తీసుకెళ్ళి తల్లి మనస్సు నొప్పించడం అతనికి ఇష్టంలేదు.

కొద్దిరోజుల క్రితం రవాణి గ్రామంలో పిల్లలకోసం ఓ పాఠశాల వెలసింది. అక్కడ కొంతమంది బచన్‌సింగును గౌరవిస్తారు. ఆ వూరిలో నలుగురైదుగురు సాహసంగా పూనుకొని వూళ్లో చైతన్యం తెచ్చారు. అందుచేత బచన్‌కు ఆ వూళ్లో మంచి గౌరవం ప్రతిష్ఠా వున్నాయి. అదే కారణంగా తన ప్రచారానికి కేంద్రంగా బచన్ రవాణీ గ్రామాన్ని ఎన్నుకొన్నాడు.

ఆ స్కూళ్లో సుందరి టీచరుగా చేరింది. తనకూ ఆమెకూ ఇష్టమైన చోటు దొరగ్గానే బచన్ బెంగ దూరమైంది. రవాణీ గ్రామం దీవాన్‌పూరుకు ముప్పాతిక మైలు మాత్రమే వుంటుంది. అందువలన పెద్ద దూరం కూడాకాదు అతనికి.

లాలారలారాంసేటు ఇంటికి పెళ్ళివారు వస్తున్నారు. అప్పుడు జరగబోయే అనర్థాల్ని అరికట్టేందుకు బచన్ చాలా రోజుల్నుంచీ కాలికి బలపం కట్టుకొని తిరుగుతున్నాడు. కాని అతని పని ఫలప్రదం అయ్యే సూచన కనపడ్డంలేదు. అసలే గ్రామం యావత్తూ బచన్‌కు విరోధం అయింది. దానికితోడూ గంటో రెండు గంటలో వళ్లు మరచి మేజువాణీల్లో సారాయి మత్తులో వూగుదామా అని ఆత్రంగా వాళ్ల ఎదురుచూస్తూ వున్నారు.

పిలవని పేరంటం కూడా కాదాయె. లాలారలారాం తన కుమార్తె వివాహానికి మొత్తం గ్రామాన్నే విందుకు పిలిచాడు. ఢిల్లీనుండి మంచిపేరున్న కళావంతురాలు వస్తుందని విన్నప్పుడు వాళ్ల మొహాలు మరింత విప్పారడం ప్రారంభించాయి. ఆ రోజు ఎప్పుడొస్తుందా అని క్షణక్షణం లెక్కపెడ్తున్నారు.

కొత్తగా చేరిన ఇంట్లో సుందరి సామాను సర్దుతోంది. పగలంతా తిరిగి బచన్‌సింగు ఇంటి కొచ్చాడు. తలుపు తట్టి పిలిచాడు. తలుపు తీస్తూ సుందరి అడిగింది. "పొద్దుననగా వెళ్లారు. మళ్ళీ కనపడనుకూడా కనిపించలేదేం" అని.

సుందరి అడిగిన ప్రశ్నకు బచన్‌కు నవ్వొచ్చింది. "ఏం చెప్పమంటావు". "తిరిగి తిరిగి విసిగి వేసారిపోతున్నాను" అంటూ లోపలికెళ్ళి మంచంమీద కూర్చున్నాడు. "ఏం ?" అని గాభరాగా అడిగింది సుందరి.

చొక్కా గుండీవిప్పి జేబు రుమాలతో చెమట తుడుచుకొంటూ "శుక్రవారంనాడు రలారామ్ ఇంటికి పెళ్ళి వారొస్తారని నీకు చెప్పలేదూ ?" అని అన్నాడు.

"అవును. చెప్పారుగా".

"ఇవ్వాళ గురువారం".

"అయితే ?"

"రేపే పెళ్ళివారొస్తారు."

"అలాగా"

"మరి మన కార్యక్రమం గురించి ఆలోచించాలి."

"అయితే ఆలస్యం చేస్తారెందుకూ ?" అంటూ ఆప్యాయంగా బచన్ ముఖంలోకి చూసింది.

"ఈ ప్రయత్నంలో నాకు విజయం లభించకపోవచ్చు"

"ఎందుకని ?"

"కేవలం ఒక రలారామును ఒప్పించడమే అయితే ఏమంత కష్టంకాదు. కాని ఇక్కడి పరిస్థితి దొందుకుదొందే అన్నట్టుగావుంది. సాక్ష్యం యిచ్చే ముద్దాయిలు ఇద్దరూ సోమరిపోతులే. మొత్తం వూరువూరంతా ఆ వేశ్య ఎప్పుడొస్తుందా అని గుటకలు మింగుతూ కూచున్నారు మరి",

"అయితే మనకు ఆదిలోనే హంసపాదు తగిలిందన్నమాట."

"హంసపాదు ఆయినా ఫర్వాలేదు. అసలుకే ఎసరు వస్తుందేమో అని నా భయం,"

"ఐతే మీరేం ఆలోచించారు ?"

"అదే, రలారాం దగ్గిరకు మరోసారి వెళ్దామనుకొంటున్నాను. బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తే పిచ్చుకైనా చిక్కదా ?"

"ఇప్పుడెక్కణ్ణుంచి వస్తున్నారు ?"

"ఒకచోటు నుంచైతేగా చెప్పడానికి. చాల చోట్లకు వెళ్లి మొహం వేలాడేసుకు మరీ వస్తున్నాను."

"ఏమన్నారేమిటి ?"

"అదే. చూద్దాంలే అని."

"మీరు వచ్చేటప్పుడు రలారాంని కలుసుకొంటూ రాకపోయారూ ? మళ్ళీ మైలు దూరం వెళ్ళాలి."

"నిన్నే కలుసుకొందామని రాలేదులే. ఇక్కడ పేరు మోసిన ఇద్దరు పెద్ద మనుష్యుల్ని వెంట తీసుకెళ్దామనుకొంటున్నాను."

కొంచెం సేపయిన తర్వాత బచన్ వెళ్ళిపోయాడు. తీవ్రంగా ఆలోచిస్తూ సుందరి అలాగే కూర్చుండిపోయింది.

ఓ అర్థగంటలో బచన్‌సింగు దీవాన్‌పూరు గ్రామం చేరుకున్నాడు. అతను తిన్నగా రలారాం ఇంటికి వెళ్లాడు. అతనివెంట రావడానికి రవాణీగ్రామం వాళ్లెవరూ సిద్ధపడ లేదు. హడావుడిగా పెళ్ళి సన్నాహాలు చేస్తున్నారు. ఓ పక్క దర్జీ కూర్చుని గుడ్డలు కుడుతున్నాడు. రెండో పక్క ఆ గ్రామంలోని పంచాయతీ పెద్దలు నిలబడి రలారాం చెప్పిన పని చెయ్యడానికి సిద్ధంగా వున్నారు. రలారాం కుమారుడు దీనానాథ్ వాళ్లకు పనులు పురమాయిస్తున్నాడు. లోపల్నుంచి మిఠాయిలూ వంటకాల ఘుమఘుమలు వస్తున్నాయి. పిల్లలు దోలకు వాయిస్తూ పాటలు పాడుతున్నారు.

గ్రామ పెద్దల్లో పాలాసింగూ, అతని సహచరులూ కూర్చున్నారు. వాళ్లను చూడగానే అతనిలో రక్తం వేడెక్కింది. కాని పరిస్థితిని చూసి తమాయించుకున్నాడు. బచన్ లోపలికి రావడం చూసి వాళ్లు ఆశ్చర్యంగా చెవులు కొరుక్కున్నారు.

"సత్‌శ్రీ అకాల్" అని అందరికి నమస్కారం చేశాడు బచన్. ఓ పక్కన ఒదిగి కూర్చున్నాడు. ప్రతివారూ ఏదోపనిలో మునిగివున్నట్లు హడావుడిగా వున్నారు.

ఎవరికీ తలగోక్కోడానికి కూడా తీరికలేదు. తనను ఎవరూ పలకరించకపోవడం బచన్‌కు బాధకలిగించింది. తానువచ్చినపని నెరవేరడం, అటుంచి అక్కడ ఆ ప్రస్తావన

తీసుకరావడానిక్కూడా అతనికి అవకాశం దొరకడంలేదు. చాలాసేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. అంతలో పావుకోళ్ళు టకటక ఆడించుకుంటూ భాయీజీ అక్కడకు వచ్చాడు. భాయీజీని ఎరగనివాడు కాదు బచన్. అయినా భాయీజీ సమక్షంలో తాను ప్రసంగం ప్రారంభిస్తే అతను తప్పక సమర్థిస్తాడన్న ధైర్యంవుంది.

భాయీజీ లోపలికి రాగానే అక్కడ కూర్చున్న వారందరు "సత్ శ్రీ అకాల్" అంటూ పలికి "ఇక్కడ కూర్చోండి" అంటే "ఇక్కడ కూర్చోండి" అనడం మొదలెట్టారు. రలారాంకు కూడ అప్పుడే కొంచెం తీరిక చిక్కింది. అతను కూడ భాయీజీ దగ్గరకువచ్చి పలకరించాడు. అదే మంచిసమయంగా తోచింది. బచన్‌కు.

"షావుకారుగారూ" అంటూ పలకరించాడు.

షావుకారు గారు విసుగ్గా కోపంగా అతనివైపుచూశాడు. వినకతప్పదన్నట్లుగా "ఆఁ ఏమిటీ సంగతి, బచన్‌గారూ" అన్నాడు. బచన్ గురించి పాలాసింగు షావుకారుకు అంతకుముందే బాగా నూరిపోశాడు.

షావుకారు కోపంగా వుండడం చూసి బచన్‌సింగు గాభరాపడ్డాడు. తెచ్చుకొన్న ధైర్యం కరిగిపోతూన్నంత పనయింది. పడిపోయే పాకను భుజంతో ఆపుతూ కొంచెం సేపు దాన్ని నిలబెట్టినట్లు మనస్సుకు ధైర్యం తెచ్చుకుంటూ బచన్ "అదే మీకు మరో సారి విన్నవిద్దామని వచ్చాను" అని అన్నాడు.

"ఊఁ చెప్పండి".

"ఈ వ్యవహారంవల్ల నాకేమీ ఒరిగేదిలేదని మీకు తెలుసు. కాని ఇందులో బంధు వర్గానికి ఒరిగేది చాలావుంది. ఎవరికి ఏం జరిగినా జరగకపోయినా కనీసం వూళ్ళోకి భోగంవాళ్ళు అడుగుపెట్టకుంటే చాలు. దీని ప్రభావం మన కూతుళ్ళా కోడళ్ళమీద పడుతుంది.

షావుకారు కనుబొమ్మల్ని చిట్లించాడు. కోపంతో అతని ముఖం ఎఱ్ఱబడింది.

"బచన్‌సింగు గారూ, మీకు మొదటే చెప్పాను. అనవసరంగా ఈ శుభకార్యంలో తలదూర్చొద్దని. అయినా దీనిలో నా ప్రమేయం కొంచెం కూడాలేదు. అంతా ఆ వియ్యాలవారే ఏర్పాటుచేస్తున్నారు. నాకు సంబంధం లేనిదాంట్లో నేను ఎలా తలదూర్చేది చెప్పండి. వియ్యాలవారితో సంబంధం దారంలా మహాసున్నితం అని మీకు తెలుసు కదా. ఏమాత్రం హెచ్చుతగ్గులు వచ్చినా దాని ప్రభావం ఆడపిల్ల సంసారంమీద పడు తుందిమరి. నిశ్చితార్థంనాడే సీలిగితే నాగవల్లికల్లా తెగిపోతుందట..." సేఠ్ రలారాం చెప్పడం పూర్తవకుండానే అక్కడ కూర్చున్న ఓ వ్యక్తి అందుకొని "ఇది కూడా

చెప్ప తగిన విషయమేనా అంట. మేజువాణీలు, భోగంమేళం శ్రీమంతులూ రాజులకూ వుండవలసిన అలంకారాలు. నాయనా, శుభకార్యంలో విఘ్నంచేయకు. పైగా షావుకారు గారి అదృష్టంకొద్దీ నాలుగు ఇళ్ళకూ ఒక్కగానొక్క ఆడబిడ్డాయె. దాని సరదాలు చూడకపోతే మరెప్పుడు చూసేది. భాయీజీ గారూ, మీరు చెప్పండి. నేను చెప్పింది నిజమా కాదా " అని భాయీజీవైపు చూశాడు.

భాయీజీ నోటితో గోళ్లు కొరుక్కుంటూ వాటిలోని మట్టితీసి చొక్కాకు రాసుకొనే పనిలో మునిగివున్నాడు. తన్ను పలకరించగానే బయటికి పొడుచుకొచ్చిన పళ్ళపై నాలుక తిప్పుతూ తొట్రుపాటుగా " అవునవును. ఇటువంటి శుభసమయాలు మాటిమాటికి వస్తాయామరి " అని సమర్థించాడు.

బచన్‌సింగు ఆశ్చర్యంగా "భాయీజీ, పదిమందికి నీతులు వుపదేశించాల్సిన మీరు భోగంమేళాల్నీ. మద్యపానాన్నీ ప్రచారంచేస్తారా ? ఇదేనా — మన మతం మీకు బోధించింది ? మీరు గురుద్వారాలో గ్రంథిగా వుంటూ మీ ధర్మాన్ని ఈవిధంగా బజారులోకి నెట్టి కళంకం ఆపాదించటం మీ వంటివారు చెయ్యవలసినదికాదు ".

బచన్ అన్నమాటలకు భాయీజీ నిర్ఘాంతపోయాడు. కాని యిదంతా మెదలకుండా కనిపెట్టున్న పాలాసింగు వెంటనే కల్పించుకొని ' దిక్కూ దివాణంలేని నిరాశ్రయులు ఏదో కష్టపడి బతుకుతూంటే వాళ్ళ నోటికాడిది కాస్త తీసెయ్యాలని సిక్కుమతం చెప్పటం లేదే. ఆమె వూరకనే డబ్బు తీసుకోడంలేదూ. తన గానమాధుర్యంతో వందలకొలది మనుష్యుల్ని ఆకట్టుకొని వాళ్ళను రంజింపచేస్తోంది. ఇక మద్యం అంటారా ? దాన్లో ఏం చెడ్డ వస్తువు కలుస్తుందీ ? తుమ్మచెక్క బెల్లమూనూ. "

పాలాసింగుకు సమాధానం చెప్పలేదు బచన్. చెప్పడం అనవసరం కూడా. ఆయనతో చెట్టాపట్టీలు పడితేనే వ్యవహారం. పాలాసింగు తన్ను సమర్థించే సరికి భాయీజీకి ధైర్యం వచ్చింది.

నడుం గీరుకుంటూ " అవునవును. మద్యం అనేదేమీ చెడ్డవస్తువు కాదు. అది ఓ మందులాటిది. మరీ ఎక్కువ పట్టిస్తే చెడ్డదే అనుకోండీ " అంటూ త్రుళికలిపాడు.

వాళ్ళ మాటలు వింటూంటే బచన్ శరీరంలోని ప్రతినరమూ రక్తం వుబికింది. ఈ మనుష్యుల్లో మానె లేదనుకున్నాడు. అయినా భాయీజీ చేసిన వాదానికి సమాధానం ఇవ్వకుండా వుండలేకపోయాడు. " అవునవును. చాలామంచిది. ఏం చెడ్డదికాదు. కొంచెం దీనికి అర్థం చెప్తారా 1" ఝూఠామత్ బూల్‌నా పీచయి జేకా పార్ వసాయే ".

1. అసత్యాన్ని పలికించే మత్తుపదార్థాల్ని పీల్చినంతవరకు సేవించరాదు.

కొంచెంసేపు ఆలోచిస్తూవుండిపోయాడు భాయీజీ. అతనికి ఏమీ పాలుపోలేదు. చెవిన వేలాడుతూన్న కమ్మల్ని చేత్తోతిప్పుతూ "మహాశయా, దాని అర్థం అంతే అనుకోండి. సారాయి తాగకూడదనే అనుకోండి. చేతయినంతవరకు మద్యం ముట్టుకోకూడదు. మరి వీలుకానప్పుడు ఏమిటి చెయ్యడం ?"

భాయీజీ మూర్ఖపు మాటలువిని కోపంలో కూడ నవ్వాపుకోలేకపోయాడు బచన్. కూర్చొన్న వారంతా తాగడంలోనూ మేజువాణీ పెట్టడంలోనూ తప్పేముందీ అని తలా ఒక వాదన చేయడం మొదలెట్టారు. బచన్ చాలావరకు వాదించాలని చూశాడు. తన హితబోధ చెవిటివానిముందు శంఖం వూదినట్టే అనుకొని మరిక వాదించదలచుకోలేదు. నేలవిడిచి సాముచేయడంలో ప్రయోజనం లేదనుకొని మెల్లగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

అతను బయటకు అడుగు పెట్టాడో లేదో హాలంతా నవ్వులతో ప్రతిధ్వనించింది.

"అరే వీరూ, చూశావుగా ఆ గాడిదబుద్ధి" అంటూ పాలాసింగు వీరాసింగు చెవి కొరికాడు.

"బుద్ధిసంగతి అటుంచు. మనం ఎక్కడ కాలుసాచితే అక్కడ పుల్లలు పెట్టి చెడగొట్టాలని తయారౌతాడు. సిగ్గులేదు. ఇంత అవమానం జరిగినా కదలడు చూడు".

"అంత సులభంగా కదుల్తాడా. కుక్కకాటుకు చెప్పుదెబ్బే గురి".

"నా వుద్దేశం ఈ రోజురోజూ వుండే తంటా..."

వేలితో సౌంజ్ఞచేస్తూ "నోరుముయ్యి. చూస్తావుండు. నేను ఎత్తు వేస్తాను. మళ్ళీ నామరూపాలు లేకుండాపోవాలి. వీడిపీడ విరగడైతే కాని ఆ వయ్యారి దొరకదురా". అన్నాడు పాలాసింగు.

---

# [ 24 ]

సాయంకాలం పెళ్ళివారు వస్తున్నారనీ ఢిల్లీ నుండి పేరు మోసిన కళావంతురాలు అన్వర్‌జాన్ వస్తూందనీ వార్త వినగానే పిన్నా, పెద్దా, పిల్లా, పీచూ ఆడా, మగా అంతా పెద్ద వూరేగింపుగా గుమిగూడారు. ఒక్కడీవాన్‌పూరు గ్రామంనుంచే కాక చుట్టు పక్కల వూళ్లనుంచి కూడా జనంవచ్చారు. రలారాం ఇంటికి పెళ్లివారు రావడం సాధారణ విషయం కాదు. ఇక పెళ్లికొడుకు తరపువారు కూడా ఆ ప్రాంతంలోకల్ల పెద్ద అగర్భశ్రీమంతులాయె.

సాయంత్రం ఐదు గంటలకు పెళ్లివారు రైల్లోంచిదిగి సామాను సరంజామాతో మేళతాళాలతో వూళ్లోకి వచ్చారు. అన్‌వర్‌జాన్‌ను చూడగానే ప్రజలు పిచ్చెక్కిపోయారు. వయసు ముప్పయ్ - ముప్పయ్ అయిదు మధ్య పౌడర్లు, స్నోలు బాగా కోటాకొట్టడం వల్ల ఇరవయ్యో ఇరవైఐదు మధ్యవయసు యువతిలా కనబడుతోంది. తెల్లని ఛాయ, గులాబీరంగు పౌడరు పూసుకున్న చెంపలు కాటుక పెట్టుకున్న కళ్లూ, ముద్ద గులాబీల్లాంటి పెదాలు, పొడుగాటి శిరోజాలు వాళ్లందరిని మత్తెక్కించడానికి చాలు అన్నట్లుగా వున్నాయి.

పెళ్లివారు వూరికి వెలుపల పెద్ద తోటలో విడిదిచేశారు. వూరివారంతా మేజువాణి వినడానికి తోటలోకి చేరారు. ముక్కూ మొహం తెలియని ప్రతి అకతాయి కూడ పెళ్లివారిని పలకరించి కుశల క్షేమం అడగడం మొదలెట్టాడు. పెళ్లివారికూడా మేజువాణంటే ఉబలాటంగావుంది. ఎలాగో పెళ్లి కుమారుణ్ణి ఒప్పించారు. తోటలోనే అన్ని సన్నాహాలు చేయసాగారు.

అప్పటికప్పుడే అక్కడికక్కడే ఓ ఖాళీస్థలాన్ని శుభ్రంచేసి జంఖానాలు పరిచారు. మధ్య మాత్రం తివాచీలు పరిచి వాటిపై వాద్య బృందాన్ని కూర్చోపెట్టారు.

అందరికన్న ముందువరుసలో పెళ్లికొమారుడు. అతని అన్నగారూ, వాళ్లతరపున సలహాలివ్వడానికీ పెండ్లితంతు సక్రమంగా నడిపించడానికి వచ్చిన సిద్ధాంతిగారూ కూర్చున్నారు. వాళ్లకు దగ్గర్లో మరో పదిమంది పేరుమోసిన మోతుబరులు కూర్చున్నారు. మిగతా పెళ్లిజనమంతా వాళ్లవాళ్ల హోదా ప్రకారం తమతమ వరుసల్లో బారులు తీరి కూర్చున్నారు. పెళ్ళివారు కూర్చొన్న స్థలం అంతా తీర్చి దిద్దినట్లుగా అలంకరించ

బడివుంది. ఇక పెళ్లికూతురు తరఫువాళ్లు కూర్చున్న ప్రదేశం అంతా బాగా అలంకరించినట్టులేదు. అందువల్ల వియ్యాలవారు ఫలానా అని పెళ్ళికూతురు తరఫువాళ్లు ఫలానా అని స్పష్టంగా తెలిసిపోతున్నారు.

సన్నాహం అంతా పూర్తయిన తర్వాత పెళ్ళికొడుకు అన్నగారు పక్కనేవున్న సిద్ధాంతి గారిని కార్యక్రమం ప్రారంభించడానికి అనుజ్ఞఇమ్మని కోరాడు. తథాస్తు అన్నాడు సిద్ధాంతి గారు. సిద్ధాంతిగారు బాగా ముసలాయన. జీవితం నిచ్చెన ఆఖరిమెట్టుమీద వున్నారు. నడుంబాగా వంగిపోయింది. తలకిందవున్న మొండెంలో పైభాగం ముందుకొచ్చింది. నడుస్తూంటే ఆయన భూమికి నమస్కారం చేస్తున్నట్లుగా చూసేవాళ్లకు కనపడుతోంది. చర్మం అంతా ఎక్కడికక్కడ ముడతలుపడి కండలన్నీ వేలాడుతూ తొడలవరకు దిగజారాయి. చెంపలు లోపలికి పోయాయి. కళ్ళకిందవున్న భాగంలో మాంసం అంటూ లేదు. తలమీద కూడా చర్మం వదులువదులుగావుండి కొన్నిచోట్ల పుర్రెనే వదిలేసినట్లుగా వుంది.

ఖంగ్‌ఖంగ్‌మని తబలాలు మోగాయి. తబలాలు మోగగానే మేఘాలు గర్జించినట్లయింది. మేఘగర్జన కాగానే వాటిల్లోంచి చందమామ బయటికి చొచ్చుకొచ్చింది. అన్వర్‌జాన్ ప్రారంభించిన మొదటిపాటే మహారసవత్తరంగావుండి శ్రోతల్ని ఆనంద సాగరంలో ముంచెత్తింది. అంతాశిలాప్రతిమల్లాగ వింటున్నారు.

నడుం నాజూగ్గా కదుపుతూ నాగసర్పంలాంటి నల్లటి జడను చేత్తో పట్టుకొని వూపుతూ పెద్దపెద్ద కళ్లలోంచి కామవాంఛల్ని లేపుతూ. బాణాలు వదులుతూ, హొయలు కురిపిస్తూ ఒకవరుసలోంచి మరో వరసలోకి వెళ్తోంది. ఏ వరుసలోకిపోతే ఆ వరుసే మంత్రించిన పాములా మారిపోతోంది. ఆమె కవ్వాలీతో ఆనాటి కార్యక్రమం ఆరంభించింది.

తమాషాఁ ఏ దీ కుంధ్ కా
ఏ [1]మసీహా హంభీ దేఖేంగే
కి ముర్దా హోతె హైఁ కిత్నే
యేజిందా, హంభీ దేఖేంగే

(ఓయీ మసీహా! నీసృష్టి అద్భుతాన్ని మేంకూడా చూస్తాం. చచ్చిపోయినవారు ఎంతమంది తిరిగిజీవిస్తారో మేంకూడా చూస్తాం.)

ఆమె వయ్యారాన్నీ, తళుకుబెళుకుల్నీ చూసి అక్కడివాళ్లందరు పిచ్చివాళ్లై పోయారు. పెళ్లికొడుకు అన్నా, సిద్ధాంతిగార్ల విషయం వేరే చెప్పనక్కర్లేదు. ప్రేమే పిడుగై వాళ్ల

1. మరణించినవారిని బతికించే అలౌకికమైన శక్తికలవాడు,

మీద పడ్డట్లుంది. పాటపాడుతూనే అన్వర్‌జాన్ క్రీగంటి చూపుతో తాను విసిరిన బాణాలకు ఎవరు గాయపడిందీ, ఎవరికి ఎంతదెబ్బ తగిలిందీ, ఎవరికి దాహం ఎక్కువగా వేస్తూందీ కనిపెట్టసాగింది. ఎవరిని ఎక్కువ గాయపరుస్తే మనకు ఎక్కువలాభం అని తెలుసుకొని వాళ్లను సరిగ్గా తను గాయపర్చిందీ లేనిది చూసుకొంది. తన చూపుల బాణాలు అనుకున్న లక్ష్యాన్ని తాకి బాగా గాయపరిచాయి అని తేల్చుకోగానే వాళ్లిద్దరిమీదా తన శక్తినంతా కేంద్రీకరించి చిరునవ్వులు వెదజల్లుతూ మధురగాత్రంతో మళ్లీ పాడ సాగింది.

కహాఁమైనేకి మర్జాహూఁ
కియా అఫ్‌సోసీ [1] కాతిల్‌నే
కి కల్ మర్నాహై ఆజ్‌మర్‌జా
జనాజా హాంభీ దేఖేంగె

(నేను చచ్చిపోతానని అన్నాను. అది విని ప్రేయసి విచారం ప్రకటించింది. రేపు ఎలాగైనా చచ్చిపోదామనుకున్న వాడివి ఈరోజే చచ్చిపోకూడదూ ? నీశవం వూరేగింపును చూస్తాను అంది.)

కరమ్‌చంద్ పెళ్లికొడుకు అన్నగారు మత్తెక్కిపోతున్నాడు. పక్కన కూర్చున్న పంతులుగారి విషయం చెప్పనక్కర్లేదు. జేబులోంచి పది రూపాయల కాగితం తీసి అందిచ్చాడు కరమ్‌చంద్. నోటును వేళ్లతో ఒయ్యారంగా తీసుకుంటూ అన్వర్ ఓ క్రీగంటి చూపు విసిరింది. ఇంకేముంది ! కరమ్‌చంద్ మత్తులో చిత్తయిపోయాడు. పెళ్లికొడుకు అన్నగారి పరిస్థితి కనిపెడ్తూనేవున్నాడు. పంతులుగారు సౌంజ్ఞ చేసి చేయి వెనక్కి పెట్టాడు. కరమ్‌చంద్ జేబులోంచి నోట్లు తీసి పంతులుగారి గుప్పిట్లో పెట్టాడు. పంతులుగారు కూడా ఓనోటు అన్వర్‌కు అందించాడు.

నోటును లాఘవంగా తీసుకొంటూ వేలితో పంతులుగారి చేతిని కొద్దిగా తాకించింది. ఇంకేముంది ! పంతులుగారు చిత్తు.

అన్ని వైపులనుంచీ నోట్ల వర్షం కురవసాగింది. నోట్లు ఏరుకోడం కూడా కష్ట మైపోయిందిఅన్వర్‌కు. నాట్యం చేయడానికి పాటలు పాడడానికి కుదరడమేలేదు. కొద్ది కొద్దిగా మత్తులోంచి అప్పుడప్పుడే తేరుకొంటొన్న కరమ్‌చందూ, పంతులు గార్లపై మరో కటాక్ష వీక్షణం విసిరింది అన్వర్‌జాన్. మళ్లీ పాడడం ప్రారంభించింది—

1. ప్రేయసి.

"జరా తీరే నజర్ ఫేంకో
జిగర్ ఔర్ దిల్ భీ హాజిర్ హై
కి కైసే మార్‌తే హోతుమ్
నిశానా హమ్‌భీ దేఖేంగే."

[నీవాడి చూపుల బాణాలు కొంచెం సంధించు. మనస్సూ హృదయం రెండూ నీ సేవలో అర్పిస్తున్నాను. నువ్వు వాటిని ఎలా ఛేదిస్తావో మేంకూడా చూస్తాము.]

ఇక పిచ్చివాడై పంతులుగారు వహ్వా వహ్వా అంటూ కేకేలేస్తూ తన దగ్గరవున్న నోట్లన్నీ ఆమెమీద విసిరేశాడు. కరమ్‌చంద్ మాత్రం తక్కువ తిన్నాడా ఏం? అంత కన్న ఎక్కువే విసిరేడు. వాళ్ళిద్దరు నోట్ల వర్షం కురిపిస్తూంటే శ్రోతలంతా వారి ఔదార్యాన్ని చూసి పులకితులయ్యారు అన్వర్‌జాన్‌లోవున్న మాయామోహినీ శక్తిని పొగిడారు.

అన్వర్ జాన్ తిరిగి గజల్ ఎత్తుకుంది.
[1]సాకియా ఘన్‌ఘోర్ పర్
కాలి ఘటా ఛాయీ న హో
మై కిప్యాలీ బన్‌కే దుల్హన్
బాగ్‌మే ఆయీ న హో

(ఓ సాకీ. ఆకాశంలో కారుమబ్బులు కమ్ముకొనకుండా వుండాలి. పెళ్ళి కూతురే మదిరపాత్రగా మారి పూదోటలోకి రావాలి).

అన్వర్ పాడుతూ ఒక్కొక్క గ్లాసులో సారాయిపోస్తూ అందించడం మొదలెట్టింది. ప్రారంభోత్సవం పంతులుగారే చేశారు.

"వాహ్ వాహ్... సుభాన్! ఏం చెప్పాలి? శబాష్!" అంటూ నాలుగు వైపుల్నుంచీ మాటలు ప్రతిధ్వనించాయి.

ఓవైపు సారాయి సంగీతము జనాన్ని మత్తెక్కిస్తూంటే మరోవైపు రూపాయి బిళ్ళలు ఖన్‌ఖన్‌మంటూ ఎగురుతున్నాయి. అటువైపుకూడా సారాయి పంచిపెడ్తున్నారు. చిన్నా పెద్దా, పేదా గొప్ప అనే భేదం లేకుండా అందరికి సమానంగా ఎవరికి ఎంతకావాలంటే అంత తాగడానికి తీర్థం లభించింది. పిల్లి పాల గ్లాసు దొర్లించితే ఎలుకలు పుక్కిలించడం కూడా జ్ఞాపకం చేసుకొన్నాయట. సారాయి మొహం చూడనివాడు కూడా ఉచితంగా

---

1. మదిరను అందించే సుందరి.

పంచిపెడ్తూంటే తలా రెండు మూడు గ్లాసులు తనివితీరా తాగి దాహం తీర్చు కొన్నారు. పెళ్ళికూతురు తరపు జనంలో పాలాసింగూ అతని ముఠా కూడా కూర్చున్నారు. వాళ్ల మధ్య భాయీజీ కూడా ఉన్నాడు.

సారా మత్తులో జనం తూలిపోతున్నారు. వూగిసలాడి పోతున్నారు. అంతతో రెండు పంజాబీ గీతాల్ని కూడ పాడమని షామియాన వెనకనుంచి పెద్దగా అరిచారు. అంతే అన్వర్ తన తీయని కంఠాన్ని సవరించుకొంటూ మొదలెట్టింది—

"మైనూ, కమలీ కమలీ అఖదే
కమలీవాలా తూఁ
మేరేదిల్ కోలోఁ పుచ్ఛ్‌కె దేఖ్ లై
బహుత్ నిహోలా తూఁ
హుణ్ కలియాఁ సేజ్ బిఛానీ అఁ
మై సాకి మైఖానే దీ
బణ్‌మత్‌వాలా తూఁ"

[అందరూ నన్ను "పిచ్చిది పిచ్చిది" అని పిలుస్తారు. కాని నువ్వా పిచ్చిదాని ప్రాణేశ్వరుడవు. కావాలంటే నా హృదయాన్ని అడిగిచూడు. నువ్వు చాలా దయా మయుడవు. నీ కోసం పూలపాన్పు పరుస్తున్నాను. గ్లాసులో మధువును నింపి నీకు తాగిస్తాను. నేను మధుశాలలోని సాకిని అయితే నువ్వు మధుప్రగోలే నావాడివి].

గీతాన్ని పాడుతూ అన్వర్‌జాన్ నిజంగానె సాకి ఐపోయింది. అందరికీ తన స్వహస్తాలతోనే సారా పోసి అందిస్తోంది. ఆ కోమల హస్తాలతో అందించే సారాయి తాగి తందనాలాడని వ్యక్తి అభాగ్యుడే!

పాలాసింగు అతని మిత్రబృందం మొదటినుంచీ తాగుబోతులు. కాని భాయీజీ అలా కాదు. ఎప్పుడూ గ్లాసులో నాలుగోవంతుకన్న ఎక్కువ తాగినవాడు కాదు. సరిగ్గా చెప్పాలంటే అంతకన్న ఎక్కువ తాగడానికి అతనికి దొరకలేదు. కాని ఇవ్వాళ అలాటి అపూర్వావకాశం లభించింది. తాగడానికే కాదు స్నానంకూడా చేయడానికి సరిపడేంత దొరికింది. అందువల్ల తనివితీరా భాయీజీ ఆరోజు సురాపానం చేయడంలో ఆశ్చర్యం లేదు.

కరమ్‌చందూ పంతులుగార్లకయితే జన్మ సఫలమైందన్నట్లుగావుంది. మిగతావాళ్ళకి అన్వర్ సారాగ్లాసు ముంచి అందించేది. కాని కరమ్‌చందుకూ పంతులుగారికి మాత్రం గ్లాసు నింపడమే కాకుండా తానే స్వయంగా వాళ్ళకు తాగించేది. కాస్సేపటికి అన్వర్‌జాన్

ఇంకో అడుగు ముందువేసింది. ఈసారి రెండుగ్లాసులు సారాలో ముంచి తెచ్చింది. ఆరెంటిని ఒక్కొక్క గుక్కతాగి వాళ్ళనోటి దగ్గరకు తీసుకెళ్ళింది. అది కూడ ఎంత వయ్యారంగా హొయలుపోతూ మరీ చేసింది. అంతే ఇద్దరూ గడగడా ఒక్కగుక్కలో తాగేశారు.

కార్యక్రమం క్రమక్రమంగా రంగులుమారసాగింది. మేజువాణీకని వచ్చిన ప్రేక్షకులంతా ఇప్పుడు మరోప్రపంచంలో వున్నారు. ఒకడు కళ్ళు మూసుకొని తూలుతున్నాడు. వేరొకడు మత్తులో అన్వర్‌జాన్‌తో తడబడే మాటల్తో ప్రేమసల్లాపం చేస్తున్నాడు. అక్కడ గుమిగూడిన చాలామంది తప్పతాగి వళ్ళు తెలియకుండా పడివున్నారు.

మేజవాణీ ముగిసింది. వాద్యగాళ్ళను వెళ్ళమని అన్వర్ సౌంజ్ఞచేసింది. సారంగి వాద్యకాడు నేడు అద్భుతంగా వాయించాడు. అతని ఒడి అంతా నోట్లతో నిండిపోయింది. తమ తమ వాద్యాల్ని తీసుకొని కళాకారులంతా లేచి వాళ్ళకోసం ప్రత్యేకించిన చోటికి వెళ్ళిపోయారు. శ్రోతలు ఒక్కొక్కరే నెమ్మది నెమ్మదిగా వూగుతూలేచి వెళ్ళారు. మరీ మితిమించి తాగిపడిపోయినవాళ్ళ గురించి చెప్పనే అక్కర్లేదు.

---

# [ 25 ]

రాత్రి ఎనిమిది గంటలకు బచన్‌సింగు రవాణీ గ్రామం చేరుకొన్నాడు. దిగాలుగా వున్న బచన్ ముఖంలోకి చూసి సుందరికి గాభరా పుట్టింది. అతని చేయి పట్టుకొని "ఏం జరిగింది. అంతా సక్రమంగా జరిగిందా ?" అని అడిగింది.

ఓ నిట్టూర్పు వదులుతూ బచన్ మంచంమీద కూర్చున్నాడు. "సుందరీ, నేను ఓడిపోయాను" అన్నాడు. ఆ ముందునుంచి తాను ఎక్కడెక్కడ తిరిగిందీ, ఎవరెవ్వరిని కలిసిందీ, వాళ్లంతా అతని మాట ఎలాత్రోసి రాజన్నదీ అన్నీ విపులంగా చెప్పాడు. ఆరోజు మేజువాణి గురించి అక్కడ వూరివారంతా ఎలా తప్పతాగి తందనాలాడిందీ. అన్వర్‌జాన్‌మీద వూరివారంతా ఎలా కనకవర్షం కురిపించింది – అన్నీ చెప్పాడు.

బచన్ చెప్పుకపోతూంటే సుందరి గులాబీముఖం వివర్ణమైపోయింది. తన బచన్ ప్రారంభించిన ఈ మొదటి వుద్యమంలో తాను పాల్గొనలేకపోయింది. ఏ వుద్యమాన్నైతే ఇద్దరూ కలసి నిర్వహించుదామనుకొన్నారో దాని బాధ్యత తన ఒక్కడిపైనే వేసుకొని బచన్ ఆదిలోనే హంసపాదును ఎదుర్కొన్నాడు.

దీనికి విరుగుడు ఎలా అని ఆమె చాలాసేపు తీవ్రంగా ఆలోచించింది. చివరకో వుపాయం ఆమెకు తట్టింది. ఆమె ముఖంలో విచారం ఎగిరిపోయి సంతోషం వెల్లివిరిసింది. "ఇక నా వంతు వచ్చింది" అని అప్రయత్నంగానే అనేసింది.

"నీ వంతా" అంటూ ఆశ్చర్యంగా సుందరివైపు చూశాడు బచన్. "నువ్వెలా నిర్వహించగలవు ? ఇన్నిరోజులు శ్రమపడి నేను కృతకృత్యుణ్ణి కాలేని పని నువ్వెలా నిర్వహించగలవు" అని తిరిగి ఆమెను అడిగాడు.

"నిర్వహించలేకపోతే నష్టమేముంది గనక ? నేనూ తిరిగి వచ్చేస్తాను, మనమట్టుకు మనం ప్రయత్నం చెయ్యాలి కదా. అది నెరవేరడం అనేది గురూజీ చేతిలోవుంది." సుందరి మాట్లాడుతూంటే ఆ మాటల్లో ఆమె నిశ్చల మనోధైర్యం ప్రతిధ్వనించింది.

"వద్దు సుందరీ, నువ్వా పనికి పూనుకోవద్దు. ఎంతమాత్రం నా కిష్టంలేదు."

"పోనీ, నేను చెప్పేదైనా వింటారా ?"

"సరే, చెప్పు"

"నాకో వుపాయం తట్టింది."

"ఏమిటది ?"

"కొమ్మల్ని వదిలేసి మానునే పట్టుకుంటే ?"

"అంటే నీ వుద్దేశం ?"

"ఆ అన్వర్‌జాన్ వద్దకే వెళ్ళి ఆమెకు నచ్చచెబితే ?"

సుందరి వుపాయం విని బచన్ నవ్వాపుకోలేకపోయాడు. గట్టిగా నవ్వుతూ "భలే బావుంది సుందరీ ! నీ సలహా భలే బాగుంది. కందిరీగల గూడునే స్వాధీనం చేసుకోలేని మంత్రంతో పామును పట్టాలని చూస్తున్నావ్ ? ఎప్పుడైనా అలా జరిగిందా అంట?"

"తుపాకి గుండుతో మనం ఓ పర్యాయం కుందేలును కూడా వేటాడ లేకపోవచ్చు. కాని అదే గుండు తగిలి సింహం చావకూడదా ఏం ? మీరు 'ఊ' అనండి చాలు".

"నువ్వుకాదుకూడదంటే నేనేం అడ్డురాను. కాని వట్టి శ్రమే మిగులుతుంది. నీళ్ళను చిలికి వెన్న తియ్యాలనుకోడమే ఇది."

"ఏమైనా కానీయండి"

"సరే. నీ ఇష్టం"

"అయితే పదండి. నన్ను వెంటనే దీవాన్‌పూరు తీసుకెళ్ళండి. నేనూ ఒకసారి ప్రయత్నించి చూస్తాను."

"రాత్రి పొద్దుపోయిం తర్వాత నువ్వు ఎలా వస్తావ్ ?"

"తిరిగి రావాల్సిన పనిలేదు. మిగిలిన పొద్దు మీ ఇంట్లోనే గడుపుతాను."

"అయితే పద" అంటూ బచన్ లేచాడు. కొద్దిసేపటి తర్వాత ఇద్దరూ దీవాన్‌పూరుకు వెళ్ళే రోడ్డుమీద నడుస్తున్నారు.

# [ 26 ]

రాత్రి పదిగంటలైంది. అన్వర్ విడిదిచేసిన ఇంటిముందు చాలామంది శ్రీమంతులు గుమిగూడి పడిగాపులు కాస్తున్నారు. తలనొప్పిగా వుందన్న మిషతో అన్వర్ అప్పటికే చాలామందిని వదిలించుకొంది. ఆమె పనిమనిషి తలుపు వేసి యజమానురాలి కోసం పక్కపరిచింది. ఆడిఆడి అలసటగావున్న అన్వర్ పక్కమీద వాలిపోయింది.

ఆమె ఇంకా కన్ను మూసిందోలేదో తలుపుకొట్టినట్టు చప్పుడైంది. " పీడాకారాలు, ఒక్కగడియ కూడా నిద్రపోనివ్వరుకదా. ఇప్పుడే కని విరగడైందను కున్నాను " అంటూ గొణుక్కుంది. నిద్రపోయిందని పనిమనిషితో చెప్పించేదా మనుకుంది మొదట్లో. మళ్ళీ ఎందుకో తలుపు తీయమని చెప్పిపంపింది.

లోపలికి వస్తున్న అడుగుల చప్పుడు విని లేచి కూర్చుంది విసుగ్గా. తీరా పనిమనిషి వెంట పదహారూ పదిహేడేళ్ళ చిన్నది రావడం చూసి ఆశ్చర్యపోయింది. చూడ్డానికి సన్నని తీగలాగ ముద్దులు కురిసే యీ బంగారు బొమ్మకు తనతో ఏంపనో అర్థంకాక ఆశ్చర్యంగా చూసింది అన్వర్. " రా కూతురా, రా, ఇప్పుడెక్కణ్ణుంచి వస్తున్నావూ " అని ఆప్యాయంగా పిలిచింది.

పరాయిస్త్రీ నోట " కూతురు " అన్న శబ్దం సుందరి తన జీవితంలో మొదటిసారిగా వింది. బాల్యంలో ఎవరేనా పిల్లల్ని వాళ్ళ తల్లులు " బిడ్డా " అని సంబోధిస్తూంటే ఆమె మనస్సులో అదోలా వుండేది. మా అమ్మ బతికివుంటే నన్నుకూడా అలాగే పిలిచేదికదా అనుకొనేది. పుట్టినప్పట్నుంచి ఆ సంబోధన వినాలని ఉవ్విళ్లూరేది. ఆమె ఏవేవో భావాలతో మెట్లు ఎక్కి పైకి వచ్చింది కాని " కూతురా " అన్న పదం వినేసరికి నిప్పురాజుకోగానే పొగమాయమైనట్లు అవన్నీ మాయమయ్యాయి!

స్త్రీ గౌరవ ప్రతిష్ఠల్ని నీటకలిపే ఆ నీచమైన కులట దగ్గరకు ఎలా వెళ్ళాలి అని దారిపొడుగునా అనుకొంటూ వచ్చింది. పాపంతో అలకబడిన దాని ఇంటి గోడల్ని ఎలా తాకడం అనుకుంది. దూరంగానేవుండే దానితో మాట్లాడ్తాను అనుకొన్న సుందరి తీరా ఆమె పిలచిన ఆపిలుపు వినగానే తనంతటతానే ఆకర్షింపబడి అన్వర్ కూర్చొన్న మంచం దగ్గిరకు వెళ్ళింది.

సుందరి మంచం దగ్గిర అలాగే నిలబడివుంది.

" నాతో ఏమైనా పనివుందామ్మా " అని అడిగింది అన్వర్‌జాన్.

అన్వర్‌జాన్ మొదటిసారిగా పలకరించినప్పుడే ఆమె మనస్సులో వున్న ద్వేషం, అసహ్యమూ అన్నీ పటాపంచలై పోయాయి. రెండోసారి ఆమె నోటివెంట మళ్ళీ అదే మాట వినగానే సుందరి మనోమందిరంలో పదహారేళ్ళనుండీ బిగించుకొనివున్న మోహ కవాటం ఒక్కసారిగాతెరుచుకుంది. తలవంచుకునే " అమ్మా " అని పిలిచింది.

అంతకు ముందు నుంచి ఆమెను అల్లుకొని వున్న సంకోచం ఒక్కసారిగా విడి పోయింది. అన్వర్‌వైపు చూస్తూ " అమ్మగారూ, ఈరోజు మీకో విషయాన్ని మనవి చేద్దామని వచ్చాను. కాని తీరా..." అని తర్వాత మరికి చెప్పలేకపోయింది. అన్వర్ జాన్ సుందరి మొహం పరిశీలనగా చూసింది. ఆమె మనస్సులోని భావం చదువు దామని కాని చదువ లేక పోయింది. చెయ్యిసాచి సుందరి వీపు నిమురుతూ ఆమె జబ్బ పట్టుకొని దగ్గరకు లాక్కొంది.

" చెప్పమ్మా, ఎందుకాగిపోయావ్ ? "

ఎవరిచెయ్యి ముట్టుకుంటేనే పాపం అంటుకొంటుందని వూహిస్తూ వచ్చిందో ఆవేశ్య చేతి చల్లని స్పర్శతగలగానే ఆమెలో తీయని నునువెచ్చని ఆప్యాయతానురాగాలు గుప్పున ఎగిరాయి. అన్వర్ రెండుచేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని ఆమె భుజంపై తలను ఆనించి " అమ్మా నేను వచ్చిన పని అంత సులభమైంది కాదు. అందుకే చెప్ప డానికి తటపటాయిస్తున్నాను " అంది.

మెల్లగా తన చేతుల్ని విడిపించుకుంటూ సుందరి నడుం చుట్టూవాటిని పెనవేసి "ఎందుకమ్మా, అలా సిగ్గుపడ్తావు. నువ్వు ఏంచెప్పినా వింటానుగా" అనిఅభయం ఇచ్చింది. మాట అయితే తొందరపాటులో అనేసింది. వెనుకముందులు ఆలోచించకుండానే ఎందుకలాచేశానా అని ఆలోచించసాగింది. అన్వర్.

సుందరి అన్వర్‌కు బాగా దగ్గిరగా జరిగి కూర్చుంది. " అమ్మా..." అని మళ్ళీ నోరు మెదపబోయింది కాని అది పెగల్లేదు. "అమ్మ" అనే ఆ శబ్దం అన్నంతమాత్రాన్నే ఆమెకు అమృతాన్ని గుటకవేసినట్లుగావుంది. ఆమె నరనరమూ స్పందించి ప్రేమ, మమతల మధురస్వరాలు ధ్వనిస్తున్నాయి. మళ్ళీమళ్ళీ అదే శబ్దాన్ని అన్వర్ నోట వినాలని ఆమె మనసు ఆరాటపడసాగింది. " అమ్మా " అని మరోసారి తనివితీరా పిలిచింది.

అన్వర్ సుందరి సంబోధన వినిపించుకోలేదు. సుందరిని అలాగే చేతుల్లోకి తీసుకొని తన కాళ్ల మీద కూర్చో పెట్టుకుంది. ఆమె తల్లోకి తన వేళ్లు పోనిచ్చి ఆమె శిరోజాలను నిమరసాగింది. కొంచెంసేపు అలాగే తన్మయత్వంలో వుండిపోయింది. ప్రకృతి మలిచిన ఆ సన్న సన్నని నాజూకైన ఆటబొమ్మను ఆడించడంలో ఆమెకు విచిత్రమైన ఆనందానుభూతి కల్గుతుంది. ఇన్నాళ్లూ మమత కోసం తపించి తల్లడిల్లి ఎండిపోతూన్న ఆమె హృదయాన్ని వాత్సల్యంతో సుందరి తడిపివేస్తోంది.

అన్వర్ హృదయంలో తలదాచుకొంది సుందరి. మళ్లీ ఆమె కళ్లల్లోకి చూస్తూ "అమ్మా" అని మరోసారి పిలిచింది.

అన్వర్ సుందరిని పరీక్షగా చూసింది. సుందరి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. తలగడకింద రుమాలుతీసి సుందరి కన్నీళ్లు తుడిచింది. అప్రయత్నంగా ఆమె పెదవులు సుందరి నుదుటిభాగాన్ని స్పృశించాయి. సుందరి తన రెండు చేతుల్ని ఆమె మెడ చుట్టూ వేసింది. అన్వర్ జాన్ చలించిపోయింది. కాసేటికి సుందరి తన్ను ఏదో అడగడానికి వచ్చిందన్న విషయం ఆమెకు జ్ఞాపకం వచ్చింది.

"చెప్పమ్మా ఏం అడగాలని వచ్చావ్. నువ్వేది చెప్పినా వింటాను" అంటూ సుందరి వీపు నిమరసాగింది.

ఆమె అన్న మాటల్లో నిజాన్ని ఆమె మొహంమీద కొలుస్తూ "అమ్మా, నీకు ఈ పనంటే అసహ్యంలేదూ?" అని ప్రశ్నించింది.

సుందరి కళ్ళల్లో ఏదో చూడడానికి ప్రయత్నిస్తున్నట్లుగా ఆమె "ఈ పని అంటే నీకెంత అసహ్యమో నాకూ అంతే" అంది.

"అయితే నువ్వాపని ఎందుకు మానలేవు ?"

"నాకు ప్రపంచంలో మరెక్కడా చోటులేదు గనక"

అన్వర్ కళ్లలో అమాయకమైన నిర్దోషిత్వం గోచరిస్తోంది.

"అంటే మీ వుద్దేశ్యం ?"

"దీన్ని నువ్వు అర్థంచేసుకోలేవు తల్లీ"

"ఎందుకమ్మా ?"

"నువ్వు వివాహితవుకావు, అవునా ... ... ?"

"అవును" అంటూ కళ్లు కిందకు దించి సుందరి సమాధానం ఇచ్చింది.

"అందుకే నేనంటున్నాను. నువ్వు నా పరిస్థితిని అర్థం చేసుకోలేవని. దానికి కారణాలు చాలా వున్నాయ్. వాటిని నువ్వు గ్రహించుకోలేవు. వివాహమై మేనాలో ఎక్కి

ఎక్కగానే పసుపుకుంకుమ చెరిపేసుకొని, అత్తారింటికి పోగానే వాళ్ళచేత ఛీఛీ అనిపించుకొని, ఇంట్లోంచి నిర్దాక్షిణ్యంగా బయటికి గెంటివేయబడి గుండాలూ, రౌడీలూ దుర్మార్గుల విషవలయంలోకి విసిరివేయబడ్డ ...''అని చెప్తూంటే అన్వర్ ముఖంలో పరాభవాగ్ని ప్రతిక్రియాజ్వాలలు ప్రజ్వరిల్లాయి. ఆమె నుదుటి నరాలన్నీ ఉబ్బి కళ్ళు క్రోధావేశంతో ఎర్రబడ్డాయి.

ఆమె భీకరాకారం చూసి సుందరికి భయం వేసింది. దెబ్బతిన్న సింహం ఎదురుగా నిల్చొని గర్జిస్తూన్నట్లనిపించింది. సుందరి గుండె దడదడమని కొట్టుకోసాగింది. అక్కణ్ణుంచి ఆమెకు పారిపోవాలనిపించింది.

నిప్పులు కక్కుతూ అన్వర్ తెగినతాడును మళ్ళీ కలుపుతూ అంది- ''అడుగడుగునా మోసం, మాయ, ద్రోహం, మానవరూపాలు ధరించి ఎదురుపడి యీ నికృష్ట ప్రపంచంలో నావంటి మందభాగ్యురాలికి పొట్టకోసం శీలం అమ్ముకోవడం తప్ప వేరే దారికనపడలేదు. ఒకడు తండ్రిగా నటిస్తూ మరొకడు తమ్ముడిగా నటిస్తూ ఇల్లూ వాకిలీ లేని నావంటి అనాథ గౌరవాన్ని దోచుకపోయే ఈ ప్రపంచంలో మమకారాన్ని పంచుకొని పుట్టి పాలుతాగే చంటిపిల్లను సైతం మరచి ఆమె హృదయానికి అంటిపెట్టుకున్న ఆ లేత పసికందును బలవంతంగా లాక్కొనిపోయి కాకులకూ గద్దలకూ వేయడానికూడా సంకోచించని కఠినాత్ములున్న ఈ ప్రపంచంలో నా వంటి దానికి ఈ నీచపు వృత్తిలో తప్ప మరెక్కడ చోటు దొరుకుతుంది తల్లీ. ఇప్పుడే నీకు చెప్పాను కదూ నాకీ పడుపు వృత్తి అంటే అసహ్యమని. లేదు. నాకలాంటి అసహ్యంలేదు. శ్రీమంతుల్నీ, కులీనుల్నీ, పెద్దపెద్ద నాయకుల్నీ, జమీందారుల్నీ నా గుమ్మం ముందు మోకరిల్లేట్లు చేసిన ఆ వృత్తి అంటే నేనెందుకు అసహ్యపడాలి? మానవాతీత శక్తులకు మించిన ఓ అద్భుతంగా, భగవంతుని వరప్రసాదంగా యీ వృత్తిని భావిస్తాను. ఈ వృత్తివల్ల నాక్కావలసిన గౌరవం, ప్రతిష్ఠా, ఐశ్వర్యము, భోగం, పలుకుబడీ అన్నీ లభించాయి. ఒకే ఒక్క వస్తువును కోల్పోయాను. పురిటిలోనే నా పిల్లను ఎవరో హంతకుడు నన్ను మభ్యపెట్టి నా నుంచి లాక్కున్నాడు. తలుచుకొంటేనే నా గుండె తరుక్కుపోతుంది. అబ్బా......'' అంటూ అన్వర్ ఒక్కసారి శరీరం అంతా ముక్కలు ముక్కలుగా విడిపోయేలా ఏడ్వడం మొదలెట్టింది. తలగడపై బోర్లగా పడుకొని వెక్కివెక్కి ఏడుస్తూ పక్కమీద పడిపోయింది."

ఆదృశ్యం చూసి సుందరికి మతిపోయింది. భయంతో ఆమెకు ఏమీ కనిపించడం లేదు. వచ్చినపని నెరవేరలేదన్న నిరాశతో సుందరి అన్వర్‌ను ఆ పరిస్థితిలోనే వదలి గబగబా అక్కడనుంచి అవతలకు వచ్చింది.

మెట్లు దిగివచ్చినవైపే మళ్ళింది. పది అడుగులు వేసిందో లేదో ఆమె కాళ్లు మరిక ముందుకు పడలేదు. ఆమెకు తెలీకుండానే కాళ్లు పైకి ఈడ్చుకపోయాయి. మరో నిముషంలో ఆమె అన్వర్‌జాన్ ముందు నిలుచుంది. తను మళ్లీ పైకి ఎందుకు వెళ్ళాలనుకుందో ఆమెకే తెలియదు.

పైగది తలుపు తీసేవుంది. లోపల అడుగు పెట్టగానే చీకటిలో ఆమె దేన్నో ఢీకొని భయంతో ఒక్క అరుపు అరచి నిద్రలో భయపడిన పిల్లాడు తల్లిని కౌగిలించుకొన్నట్లుగా కావలించుకుంది.

సుందరి వెనుదిరిగి వెళ్ళగానే అన్వర్ అలానే కడుపులోని వ్యధను కన్నీరుగా విడుస్తూ వుండిపోయి అంతలోకే తలగడమీదనుంచి తల ఎత్తిచూసింది. తనకోసం వచ్చిన యువతి అక్కడలేదు. తన హృదయాన్ని ఎవరో కదిపి అప్పుడే వెళ్ళినట్లుగా అన్వరుకు తోచింది. అప్రయత్నంగా లేచి మెట్లు దిగింది. హడావుడిగా ఆమె దిగుతున్నప్పుడు ఆ చీకటిలో దేన్నో ఆమె ఢీకొంది. తన హృదయాన్ని కావలించుకొన్న ఆ వస్తువే సుందరి.

ఇద్దరూ మెదలకుండా పైకి వచ్చారు. కొంచెం సేపటివరకు సుందరి అన్వర్ ఒళ్లోనే వుంది. సుందరి కళ్లలోకి చూస్తూ.

''నీ పేరేమిటమ్మా'' అని అన్వర్ అడిగింది.

''సుందరి''

''ఎక్కడుంటావు తల్లీ? ఎందుకో నిన్ను చూస్తూంటే నాలో నిద్రించిన మమత మళ్ళీ రేగుతోంది. కిందే గనక నువ్వు కనబడకపోతే నిన్ను వెతుక్కుంటూ వచ్చేదాన్ని. మీ నాన్న ఏంచేస్తాడు తల్లీ?'' అని అడిగింది.

''నాన్న చచ్చిపోయాడు.'' అంది సుందరి.

''ఏం చేస్తుండేవాడు?''

''ఏమోనండి''

'ఏమోనా?'' అని ఆశ్చర్యంగా అన్వర్ ప్రశ్నించింది.

''అవునండి''

అనుమానంగా సుందరి ముఖాన్ని పరీక్షగా చూసింది. ఎరుకల వాళ్ల కులంలో ఇంత అందగత్తె వుంటుందా అన్న సందేహం ఆమెకు వచ్చి వుండాలి.

''మరీ మీ అమ్మ?''

''మా అమ్మ లేదండి''

"ఏమిటీ! అనాధవా! మీ అమ్మ చనిపోయి ఎన్నాళ్ళయ్యింది?"

"తెలీదండి."

"తెలీదా?"

సుందరి సమాధానం విని అన్వర్ జాలిగా "పాపం! చిన్నతనంలోనే చనిపోయిందా కాబోలు" అంది.

"కాదండి"

"మరి?"

"ఆమె లేనే లేదండి"

"ఐతే నువ్వు ఎలా పుట్టావు?"

"నేను పుట్టలేదండి" ఆలోచించకుండా గబుక్కున అనేసింది సుందరి, కాని వెంటనే తన అజ్ఞానానికి సిగ్గుపడింది.

"నిజంగా లేదండి. తాతే నన్ను ఓ పొద దగ్గిరపడివుంటే ఎత్తుకొని తీసుకొచ్చాడండి" అని చెప్పింది.

అన్వర్ ముఖంలో రంగులు మారిపోయాయి. అది గమనించిన సుందరి అనవసరంగా ఆమె నిద్ర పాడుచేస్తున్నానేమో వెళ్ళిపోతే బావుండును అనుకొంది. "ఇంకనే వెళ్తానమ్మా. మీరు యింకా నిద్రపోవాలి. మీ నిద్రంతా పాడుచేశాను. మీరు ఏదో చింతలో మునిగివున్నట్లున్నారు. మరెప్పుడైనా వస్తాను" అంటూ లేచింది.

"ఆయన నిన్ను ఏ గ్రామం నుంచి తెచ్చాడు?" సుందరి జబ్బ పట్టుకొని కూర్చోబెడ్తూ అన్వర్ ప్రశ్నించింది.

"మరో గ్రామాన్నుంచి కాదండి. ఈ వూరి బయటే తన గుడిసెకు దగ్గర్లోనే."

తర్వాత ఆ స్థలం పేరూ, తాత పేరూ, ఆ వివరాలన్నీ చెప్పింది. తనకు ఊహ తెలిసినప్పటినించి యింతవరకు తన జీవితంలో జరిగిన సంఘటనలన్నిటినీ పూస గుచ్చినట్లు చెప్పింది. అన్వర్ కళ్ళమ్మట ఏకధారగా కన్నీళ్ళు కురుస్తున్నాయి. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది. సుందరి బిత్తరపోయింది. ఆమె కొడుకో, కూతురో ఇలా తప్పిపోయి వుండొచ్చు. లేదా చనిపోయి వుండొచ్చు. అందువల్లే అవన్నీ తలుచుకొని ఏడుస్తోంది గాబోలనుకుంది సుందరి. ఆమెను తనచేతుల్లోకి తీసుకొంటూ "ఎందుకమ్మా, అలా ఏడుస్తున్నావు" అని అడిగింది,

అన్వర్ నిగ్రహం ఆపుకోలేకపోయింది. లోపలినుంచి మమత పొంగుతూంటే సుందరిని గట్టిగా కావిలించుకొంది. ఏడ్చిఏడ్చి ఆమె సొమ్మసిల్లి పోయింది. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది. కాని నోటమాట పెకిలిరావడంలేదు. "తల్లీ, నేనే నమ్మా నీ అమ్మను. విధి నా నుంచే లాక్కొని నిన్ను అడవిలో పారేసింది తల్లీ" అని అతికష్టం మీద అనగలిగింది.

సుందరి ఆశ్చర్యానికి అంతులేదు. "నిజంగానా?" అంది. ఆమె కళ్లు చెమ్మగిల్లాయి ఆ తల్లి కూతుళ్లిద్దరూ అలా చాలాసేపు ఒకరి నొకరు కావిలించుకొని ఏడుస్తూనే వుండి పోయారు. ఏడ్చిన తర్వాత ఇద్దరూ కన్నార్పకుండా అలాగే చూసుకుంటూ వుండి పోయారు. మళ్లీ సుందరిలో దాగివున్న అనురాగమంతా ఒక్కసారిగా పొంగింది. "అమ్మా"అని గొంతెత్తి తనివితీరా పిలిచి తల్లిమెడచుట్టూ పెనవేసుకపోయింది.

అంతలోకే అన్వర్ ఏమని ఆలోచించుకొందో కాని వణుకుతూ సుందరిచేతుల్లోంచి తన్ను విడిపించుకొని దూరంగా జరిగి కూర్చుని "నువ్వీ అపవిత్రమైన మలిన దేహాన్ని తాకి ఎంతపొరపాటు చేశావ్ తల్లీ? అభాగ్యురాలి సంతానానివి. నావంటి కులటకు దగ్గరగారావద్దు. నన్ను అసహ్యించుకో అమ్మా. రాత్రింబవళ్ళు పాపపంకిలంలో యీదులాడే ఈ తల్లి దగ్గర నీవంటి పుణ్యాత్మురాలు నిలిచే హక్కులేదు. వెంటనే వెళ్ళిపోతల్లీ ..." అంటూ తన రెండు చేతుల్తోనూ ముఖాన్ని దాచుకుంది. కొంచెం సేపటిక్రితంవరకు ఆమె హృదయంలో ప్రేమతరంగాలు లేచి ఆత్మనూ, శరీరాన్ని పులకింపచేశాయి. అంతలోనే సిగ్గూ, పశ్చాత్తాపం, విచారం ముంచుకొచ్చి ఆమె మనసును అలుముకొన్నాయి. తన తల్లి ఒక వేశ్య అని తెలుసుకొని కూతురు ఎంతగా బాధపడ్తుందో అన్న భయంతో పిచ్చిదానిలా లేచి మూలకు పరుగెత్తి దాక్కుంది. మళ్లీ సన్నగా వెక్కిళ్ళు పెట్టడం ప్రారంభించింది.

ఏం జరుగుతోందో కొంచెంసేపు సుందరికి అర్థం కాలేదు. అర్థం చేసుకునే స్థితిలో కూడా ఆమెలేదు. అంతా ఓ కలగా వచ్చి కరిగిపోయినట్లయింది. పరీక్ష తప్పిన కొడుకును తల్లిదండ్రులు దండిస్తూంటే తనదేం తప్పులేదని చెప్పుకొంటానికి ప్రయత్నిస్తూ వ్నట్లుగా అన్వర్ మూలలోంచే ఏదేదో అస్పష్టంగా మాట్లాడుతోంది. ఆమె స్వరం కంపించిపోతూవుంది.

తన రెండుచేతులూ సుందరివైపు పాచి వెక్కిళ్ళు పెడ్తూ అన్వర్ చెప్పింది– "లేదు తల్లీ, ఇందులో నా దోషం కొంచెం కూడా లేదు. తెలిసి నేను ఏ తప్పూ చేయలేదు. నువ్వు నమ్మ. నా కథవింటే నీకే తెలుస్తుందమ్మా. నేను నిర్దోషిని."

ఎవరో తన శరీరంలోని ప్రతి అణువునూ ఇనుప ముళ్లతో గుచ్చుతున్నట్లుగా వుంది సుందరికి. ఆమె కడుపులో కత్తులతో కెలుకుతున్నట్లుగావుంది. అమాంతంగా అన్వర్ మీద వెళ్ళిపడింది. తల్లిని వూరడిస్తూ "నువ్వు నిర్దోషివని తెలుసమ్మా. నా తల్లి ఎప్పుడూ దోషికాదని నామనసు చెప్తోంది. ఈ దుర్మార్గానికంతకూ కారకుడు ఎవరమ్మా. నిన్నీస్థితికి తెచ్చిన ఆ నీచుడు ఎవరోచెప్పమ్మా.

కూతురు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పడానికని అన్వర్ మంచం మీద లేచి కూర్చుంది. లోపలి నుంచి పొరలివచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ సుందరిని పసికందుగా అడవిలో వదిలివేసిన క్షణాన్నుంచి ఆరోజువరకు ఆమె జీవితంలో జరిగిన ప్రతి సంఘటననీ చెప్పింది.

సంఘం క్రౌర్యానికి తల్లి ఏవిధంగా బలిఅయిందీ విని సుందరిలో ప్రతీకారాగ్ని భగ్గుమంది. హద్దులేకుండా తనపై అత్యాచారాలు జరిపిన సంఘమే తన ప్రియుణ్ణి తనను చిన్నప్పటినుంచి అష్టకష్టాలుపడి పెంచి పెద్దచేసిన రోడూతాతను నానా యమయాతనలు పెట్టిన ఆ సంఘమే నేడు తన తల్లికి ఈ దుర్గతి పట్టించిందని సుందరి ఆపాదమస్తకం క్రోధంతో కంపించిపోయింది. బచన్‌సింగు ఆమెకు చేసిన నీతిబోధలు ఆ క్షణంలో పనికిమాలినవిగా కన్పించాయి. అక్కడ కూర్చోడమే ఆమెకు కష్టమైపోయింది. ఆవిరి విడిచే రైలింజన్లా దీర్ఘంగా నిశ్వాసాలు విడవసాగింది. తల్లి వృత్తాంతం వినాల్సింది ఇంకా చాలావుంది. అందువల్లే ఆవేశాన్ని నిగ్రహించుకొంటూ "తర్వాత ఏమైంది అమ్మా" అని అన్వరును మళ్ళీ అడిగింది.

అన్వర్ తిరిగి తన కథ చెప్పసాగింది- "పిచ్చుకలాంటి నీ బుల్లి శరీరం మీద నాకు ఎంతవ్యామోహం వుండేదో చెప్పలేను. గద్దలూ రాబందులకు ఆహారంగా నిన్ను విసిరేశారు. నీ దుర్మార్గపు తండ్రి తారాచంద్, రోగంతో నేను మంచానికి అతుక్కొని వుండగా వదిలేసి వెళ్లిపోయాడు. అప్పుడు ఇంట్లో ఒక్కరాగిపైసాకూడాలేదు. వంటింట్లో రెండు మూడు గిన్నెలు మినహాయించి మరేమీలేదు. అవన్నీ అంతకుముందే మూటకట్టుకొని వెళ్లిపోయాడు.

తారాచంద్ పేరెత్తినపుడు అన్వర్ ముఖంమీద హంతకుని కాఠిన్యాన్ని చూసింది సుందరి. ఆమె రొప్పుతోంది. ఆమె వూపిరితిత్తులు కమ్మరివాని కొలిమితిత్తుల్లాగ పెద్దవౌతున్నాయి. మనోవేగాలు పట్టుతప్పిన ఆ తరుణంలో ఆమె అసలు ప్రసంగాన్నే మరచిపోయింది. మంచినీళ్లు తాగి కాసేపు పేద తీర్చుకుంది. కొద్దిసేపయిన తర్వాత మళ్లీ ఆమె చెప్పడం మొదలెట్టింది- "అతను చెప్పకుండా వెళ్లిపోయాడు. నాకు ఏంచేయాలో తోచలేదు. దగ్గరలో హిందువుల ఇల్లంటూ ఒక్కటీలేదు. రాత్రి రెండుగంటలైంది.

పక్కింటి నుండి ఇద్దరు ముస్లిం స్త్రీలు పైకప్పుమీద నుంచి దూకి లోపలికి వచ్చారు. చంటిపాప ఏడ్పువిని వచ్చినట్లుంది. వాళ్లను భగవంతుడు చల్లగా చూడాలి. వచ్చి నన్ను పట్టుకున్నారు. మొండిఘటాన్ని ఇంత జరిగినా కూడా నేను బతికాను. వచ్చిన వాళ్లలో ఒకామెకు పురుడుపోయడం అదీ కొద్దిగా తెలుసు. తనకు చేతనైనంతవరకు నాకు పరిచర్యలుచేసింది.

మర్నాడు వాళ్ల మగాళ్ళు దగ్గర్లోనేవున్న హిందువుల పేటకు వెళ్ళి అంతా చెప్పారు. ఆపేట పెద్దమనిషినికూడా పిలుచుకొచ్చారు. కానీ తీరా ఆయన నా దగ్గిరకొచ్చిన తర్వాత నా దురదృష్టంకొద్దీ నా ప్రాణాల్ని కాపాడిన ముస్లింయువతి భర్త "మేం రాత్రినుండి ఆమెకు సుశ్రూష చేస్తున్నాం" అని వెనకాముందూ ఆలోచించకుండా చేప్పేశాడు. మొదట తెలివిలోకి తీసుకరావడానికి నీళ్ళుతాగించామని, తర్వాత వేడి పాలూ, వేడిపుట్టించే మరికొన్ని వస్తువులు ఇచ్చామనీ, అప్పుడుకానీ నా ప్రాణం నిలబడగల్గిందనీ చెప్పాడు.

అంతే. ఆ పెద్దమనిషి చెవులుమూసుకొని ముసల్మాన్ల చేతితో అన్నపానాదులు పుచ్చుకున్న తర్వాత యిక మా ఇళ్లల్లో అడుగుపెట్టతగదనీ, ధర్మభ్రష్టురాలైందనీ చెప్పి చల్లగా జారుకున్నాడు.

పాపం వాళ్లకేమి తెలుసు. మంచికి పోతే చెడు ఎదురౌతుందని? ఈ హఠాత్సంఘటనకు వాళ్ళు నిర్ఘాంతపోయి ఎందుకు చెప్పాం చెప్మా అని పశ్చాత్తాపపడుతున్నారు. అప్పటికి నేను బాగా తెలివిలోనే వున్నాను. మొదట్నుంచీ నేనంటే ఈ పెద్దమనుషుల వ్యవహారం ఇలాగే కటువుగా వుంటూ వచ్చింది. చౌదరీగారు నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే సరికి నా మనస్సు రాయిక్రింద మారింది. "భాయీజీ, ఈ హిందువులు నాకు ఆశ్రయం ఇవ్వకపోతేపోనీండి. కనీసం మీరైనా పదిరోజులపాటు తలదాచుకోనిస్తారా" అని వాళ్లను ఆవేశంలో నిలదీసి అడిగాను.

వాళ్లలో ఒకతను అందుకొని అన్నాడు— "సోదరీ, పదిరోజులేమిటి, పదేళ్లపాటు నిరభ్యంతరంగా మాదగ్గిరవుండొచ్చు. మా కూతుళ్ళూ, కోడళ్లూ తినే ఆ మెతుకులన్నే వాళ్ళకన్న ముందుగా మీకేపెట్తాం. కానీ ఏమిచేయం? మా వద్ద మీరు వుంటే మీ హిందూ సంఘం ఒప్పుకోదు. అభ్యంతరం పెడ్తుంది."

కోపంతో నా వొళ్ళు రగులుకొని పోతోంది. "నడిబజారులో ఎండిన గడ్డిపోచ కన్నా హీనంగా నన్నుచేసిన ఈ సంఘాన్ని, నేను తప్పుచేయకుండానే నన్నుకాలితో నలిపి నా బతుకే మట్టిపాలుచేసిన ఈ సంఘాన్ని మీరింకా గౌరవించమంటారా? అటువంటి సంఘం అంటే నాకు పరమ అసహ్యం. నా జీవితాంతం దాన్ని ఏవగించుకొంటూనే

వుంటాను. మీలో ఎవరైనా ఈ దేవుని బిడ్డపై ఏకొంచెం సానుభూతైనా వుంటే పదిరోజులపాటు నన్ను మీ దగ్గిరే వుండనివ్వండి " అని ప్రార్థించాను.

వారిలోంచి ఓ వ్యక్తి ముందుకొచ్చాడు. " మీరు మాస్వంత తల్లీ, సోదరిలాంటి వారు. మాకు శక్తివున్నంతవరకు మిమ్మల్ని కష్టపెట్టం. కాని ఏం చేయం ? మేమా కూలీనాలీ చేసుకొనేవాళ్ళం. మీ కోసం వంటమనిషిని పెట్టే స్తోమత మాకులేదు " అని చెప్పాడు.

"ఏం ఫర్వాలేదు. మీరు వండిందే తింటాను. హిందూ సంఘం అంటేనే నాకు పరమ ద్వేషం" అని సమాధానం చెప్పాను.

ఆరోజు నుంచి వాళ్ల శక్తికిమించి నాకు పరిచర్యలుచేస్తూ వచ్చారు. వారి ప్రేమ చూసి నా అణువణువూ వాళ్ళకు ఆశీర్వాదం పలికేది. సుమారు రెండు వారాలు వాళ్ల ఇంట్లోనే గడిపాను.

నువ్వు పుట్టిన పదిహేనురోజులు తర్వాత ఆపేట పెద్దమనిషి మళ్ళీ నా దగ్గిర కొచ్చాడు. "చెల్లీ, ఆ రోజు నుండి నీగురించే ఆలోచిస్తున్నాను. ఢిల్లీలో విధవాశ్రమం వుంది. అక్కడకు పంపడానికి ఏర్పాట్లు చేశాను. ఆశ్రమంలో చదువు నేర్పుతారు. అన్ని సౌకర్యాలూ వుంటాయి" అంటూ ఎంతో ప్రేమ నటించాడు నా దగ్గిర.

పదిరోజుల క్రితం అతను నాతో ప్రవర్తించినతీరు జ్ఞాపకం వుంది నాకు. అతను చెప్పిన ప్రకారం ఆశ్రమానికి వెళ్లడానికి ఒప్పుకోలేదు. కాని ఇటు ముసల్మానులంతా నన్ను అంగీకరించమంటూ ఒత్తిడి చేశారు. చివరకు వెళ్ళడానికి సిద్ధమయ్యాను.

మర్నాడు అతనొచ్చి టాంగామీద కూర్చోపెట్టుకొని తీసుకెళ్ళాడు. ఢిల్లీకి టిక్కట్టు తీసుకొని ఆరోజే రైలెక్కాం. అతని వూరడింపు పలుకులూ, తియ్యగా చెప్పిన మాటలూ నాకు ఎంతో ధైర్యాన్ని ఇచ్చాయి.

రైలు వేగంగా పరుగెత్తుతోంది. కిటికీవైపు వీపుపెట్టి నేను కూర్చున్నాను. అతను నాకు ఎదురుగావున్న బెంచీమీద కూర్చున్నాడు. ఆశ్రమంలోని ఏర్పాట్లను గురించి అతను గొప్పగా చెప్పుకపోతున్నాడు. "అన్నట్టు ఒక విషయం నీతో చెప్పడం మర్చి పోయాను సుమా" అంటూ అర్థాంతరంగా నా ముఖంలోకి చూశాడు.

"ఏమిటది ?" అని అడిగాను. "ఆశ్రమంలో చేరేవారికి పాలుతాగే పిల్లలుండ కూడదని ఆశ్రమ నియమం" అంటూ ఆగి మళ్ళీ నా ముఖంలోకి చూశాడు. అప్పుడు నేను నీకు పాలు తాగిస్తున్నాను. బలీయమైన వాంఛతో నీ ముఖం చూస్తూ "మరి యిప్పుడెలా ?" అని అడిగాను.

"వచ్చే స్టేషనుకు దగ్గిరగానే ఓ బంధువు ఉన్నాడు. నువ్వు అంగీకరిస్తే ప్రస్తుతానికి పిల్లను అతనింట్లో వుంచుతాను. పాలుమానేయగానే పిలిపించుకోవచ్చు" అన్నాడు. అతని మాటలు వినగానే నాకెందుకో భయంవేసింది. రకరకాల ఆలోచనలు నన్ను చుట్టుముట్టేసాయి. ఎన్నో ఎత్తులువేసి కల్లబొల్లి మాటలు చెప్పి నన్ను ఎలాగోలాగ ఒప్పించాడు. స్టేషన్ రాగానే అతను దిగిపోయాడు. నన్నుదిగమన్నాడు. ఓ టాంగా కట్టించుకుని మేము ఓ గ్రామం వెళ్ళాం. ఆ గ్రామమే ఈ దీవాన్‌పూరని నాకు బాగా జ్ఞాపకం.

నన్ను ఈ వూరిబయట ఓచెట్టు క్రింద కూర్చోబెట్టి అతను వెళ్లాడు. కొంచెం సేపయ్యాక "నా పిల్లను పోషించేబాధ్యత మా బంధువులకు అప్పగించి వచ్చాను. నువ్వు పిల్లనుతీసుకొని ఆ పొదలమధ్య అన్నిటికన్న ఎత్తుగా కనిపించే ఆతుప్పమీద ఆచివరగా కన్పించే నీడలో ఆ గుడిశెకు దగ్గరగా పెట్టిరా. వాళ్ళేవచ్చి తీసుకువెళ్తారు. వాళ్లమధ్యకు నిన్ను తీసుకెళ్ళడం అంత బావుండదేమో" అన్నాడు. నేను మొదట్నుంచీ అమాయకు రాల్ని, మనస్సు చిక్కబట్టుకొని అలాగే చేశాను. అతను మోసం చేసాడని తర్వాత గాని నాకు తెలిసిరాలేదు. నిజానికి అతను ఎవరికి నా పాపను పోషించే బాధ్యత అప్ప చెప్పలేదు. ఒక్కగాలికితప్ప."

నేను విన్నాదిలిరాలేక అలాగే నుంచొని వుండిపోతే అతను "ఎందుకు అంతగా బాధపడ్తావు. పిల్లకాస్త పెరిగి పెద్దదయ్యాక తెచ్చి నీకు అప్పగించే పూచీనాది" అంటూ ధైర్యం చెప్పాడు. అతనిలా ధైర్యం చెప్పకపోతే నేను అక్కడే కుప్పలాగ కూలి పోయేదాన్ని.

ఢిల్లీ చేరింతర్వాత ఓ పెద్ద రూములో మేము దిగాం. ఖరీదుగల సామానుతో అగది అలంకరించివుంది. అక్కడ ఎవరూలేరు. తన స్నేహితుని ఇల్లని చెప్పాడు. రాత్రి ఓ పనిమనిషిని నా వద్ద ఒదిలి వెళ్ళాడు. పొద్దున్నే వచ్చి విధవాశ్రమంలో చేర్పిస్తా నన్నాడు. వుండి వుండి మువ్వే జ్ఞాపకం వచ్చేదానివి. రాత్రంతా కునుకుపట్టలేదు. పని మనిషి పరిచర్యలు బాగానే చేసింది. కాని నాకెందుకో నిద్రపట్టలేదు. ఏడుస్తూనే గడిపాను.

వుదయం స్నానంచేసి కూర్చోగానే ఓ ముసలామె వచ్చి నాపక్కనే కూర్చుంది. వేషంచూస్తే వేశ్యలా అనిపించింది నాకు. నేను ఆమెను పలకరించకముందే "కూతురా, రాత్రి బాగా నిద్రపట్టిందా. తీరికలేక రాత్రి రాలేకపోయాను. అయినా ఈ ముసలి నౌకరు చాలా నమ్మకస్తురాలు. నీకు అన్ని సౌకర్యాలు సమకూర్చి వుంటుందను కొంటాను" అంది.

ఆమె మాటలధోరణి చూసి ఆశ్చర్యపోయాను. ఆమెను కిందనుంచి పైవరకూ పరీక్షగాచూసి "ఈ ఇల్లు మీదా" అని అడిగాను. "అవును తల్లీ, ఆ భగవంతునిది" అని అంది. "లాలాజీ ఇంకా రాలేదా" అని అడిగాను. "ఏలాలాజీ" అని ఆశ్చర్యంతో చూసింది నావైపు: "అతనేనండి. విధవాశ్రమంలో నన్ను చేర్పిస్తానని తీసుకొచ్చారే ఆయన" అని చెప్పాను.

నామాట విని ఆమె పగలబడి నవ్వింది. "కూతురా, ఈ ఇంట్లోకి ఎంతోమంది లాలాజీలు, ఖాన్‌సాహెబులు వచ్చిపోతుంటారు. ఎంతమందినని లెక్కపెట్టాం. రోజూ వందలకొద్దీ వచ్చి పోతుంటారు కదా! నీసంగతి నాకు అర్థమయిందిలే. నిన్ను నాకు అమ్మేసి వెళ్ళిపోయిన ఆ మనిషిని గురించేనా అడుగుతున్నావు. అతను రాత్రిపండికే వెళ్లిపోయాడు. నిన్ను విధవాశ్రమంలోనే చేర్చివెళ్లాడు. మరెక్కడ చేర్చలేదులే. నీవు అనుకొనే విధవ ఆశ్రమం అది నిజమైందికాదు. అసలు విధవాశ్రమం అంటే ఇదే. మన దేశంలోని వేలకొద్ది లక్షలకొద్దీ విధవరాళ్ళు భోగభాగ్యాలతో కూడిన జీవితం గడిపే విధవ ఆశ్రమం ఇదే అంది."

ఆమె మాటలు వింటూంటే నాకు మతిపోయినట్లయింది. కాని వాళ్ళచేతిలో చిక్కుకుపోయాను. ఏం చేయడం? ఎంతగానో ఏడ్చాను, పెడబొబ్బలు పెట్టాను, చాలా రోజులు తిండితినలేదు. కాని ఎవ్వరికి నామీద దయకలగలేదు. ఆ ముసల్దిరోజూవచ్చి ఏవేవో ఆశలు చూపించేది. బంగారుకలలు కనిపించేది. నన్ను తనవైపు తిప్పుకోడానికి ఎంతగానో ప్రయత్నించేది. అప్పటికనేను లొంగకపోతే నా బాధ్యతను ఒకామెకు అప్పగించింది. ఆమె ఎప్పుడూ నాతోనేవుంటూ ఎన్నెన్నో కబుర్లు చెప్తూ నవ్వుతూ నవ్విస్తూ మెల్లగా నా మనసుకు దగ్గిరిదైపోయింది. చివరకు నన్ను ఈ దారిలోకి లాక్కొచ్చింది. అప్పటికీ నేను మంకు వదిలేదాన్ని కాదేమో. ఆమె తన జీవిత వృత్తాంతం వినిపించింది నాకు. ఆమె కూడా ఒకప్పుడు బ్రాహ్మణ కన్యట. పెద్ద కుటుంబంలో ఇచ్చారట. కాని ఈ సంఘం ఆమెపై అత్యాచారాలూ చేసి అక్రమాలు చేసిందంట. దాని ఫలితంగా ఆమె ఈ నీచవృత్తిలోకి వచ్చిందట. ఆమె గాధవిని నేనుకూడా మెత్తపడ్డాను. నాశీలాన్ని అమ్ముకోడానికి తయారయ్యాను.

నేను కూడా నా జీవితగాధ ఆమెకు చెప్పాను. నాగాధ విని ఆమె చాలా విచారించినట్లు కనపడింది. నన్నుదించదానికి ఆమెకు మంచిసాధనం దొరికింది. "నీవు అపరాధం చేయకుండానే నిన్ను ఆకాశం నుంచి పాతాళానికి తన్ని తోసినవారికోపం నీళ్లొదిలిన చేపలా ఎందుకు గిలగిల కొట్టుకుంటావు? అటువంటి వాళ్ళ బతుకులు బజారులోకి ఈడ్చి

వాడవాడనా వాళ్ళ బండారం బయటపెట్టడమే మన కర్తవ్యం..."అంటూ హితబోధ చేసింది.

అసలే పతితను. ధర్మాన్నీ, మానమర్యాదల్నీ ఏనాడో కాలితో నలిమి పారేశాను. ఇప్పుడిక ఆలోచన ఎందుకు? గుర్‌దేయీగా వున్న నేను అన్వర్ను అయ్యాను. నాట్యంచేయడం, పాటపాడడం నేర్చుకొన్నాను. అందాన్ని ఆ భగవంతుడే నాకు స్వతహాగా ప్రసాదించాడాయె. అతి బహుకొద్దిరోజుల్లోనే నా వృత్తిలో ఆరితేరి పదిమంది లోనూ పేరు మోసాను.

సుందరీ, నువ్వు కళ్లారా చూస్తున్నావుగా, ఈ హిందూ సమాజం ఎంత అధోగతికి దిగజారుతోందో? నేను హిందూమతంలో వుండి ఏ పాపం ఎఱుగని గృహిణిగా వున్నంతకాలమూ ఈ సంఘమే చెప్పుదెబ్బకొట్టి చచ్చిన ఎలుకపిల్లను పారేసినట్లు దూరంగా విసిరిపారేసింది. కాని ఇప్పుడు నేను ముసల్మానును. వేశ్యను. అదే సంఘం పెత్తందార్లు—నాగరికతనీ ధర్మాన్నీ గుత్తకు పుచ్చుకొన్నామనే ఆ సంఘం పెత్తందార్లే నాదగ్గరకొచ్చి నా చెప్పులు నాకుతున్నారు. అలా చేయడంలోనే తమ గౌరవం వుందని భావిస్తున్నారు. ఇంకోవిధంగా చెప్పాలంటే నా శరీరంలో ఆరోగ్యం అందమూ వున్నపుడు, ఈ సంఘమే నన్ను మురికిగుంటలోకి నెట్టేసింది. కాని ఇప్పుడు కుళ్లిపోయి దుర్వాసన భూయిష్టమైన యీ శరీరాన్నే ముద్దుపెట్టుకొంటానికి, నాకడానికి తలమీద పెట్టుకోవడానికి ఉబలాటపడుతోంది.

ఈ పెళ్లి హంగామా అంతా ఎవరికోసమో తెలుసా తల్లీ నీకు? ఇది నా సవతి బిడ్డదే. నువ్వు ఒక్క అర్ధగంట ముందు వచ్చివుంటే నీకు వూహించలేని ఒక వింతను చూపించే దాన్ని. నాసవతి పెద్దకొడుకు - పెళ్లికొడుకు అన్న — నాకు తిండి పెట్టాల్సివస్తుందని ఒక్కరాత్రి ఉత్తములైన ఓ ముసల్మాన్ల ఇంట్లో వున్నందుకు గాను నన్ను చావగొట్టి ఇంట్లోంచి తన్ని తరిమేసిన కరమ్‌చంద్ — ఇంతకు ముందే ఇక్కడకు వచ్చి వెళ్లాడు. అతనితో ఆ పీడాకారపు ఆ పాపిష్టి పంతులు కూడా వున్నాడు. వాళ్లిద్దరూ ఇక్కడికి ఎందుకొచ్చారో తెలుసా? కరమ్‌చంద్ తనతల్లితో ప్రేమకలాపం చెయ్యడానికి, ఒక వేశ్య కాళ్లపైపడి ప్రేమభిక్ష పెట్టమని అర్థించడానికి వచ్చాడు. ఆ ముసలినక్క — మొదట నన్ను అమ్మాయ్ అమ్మాయ్ అని సంబోధిస్తూ నాకు ఆశ్రయమిచ్చి నన్ను మోసగించి ఏ పాపిష్టి తండ్రి తారాచంద్‌కు అమ్మేసిన ఆ గోముఖ వ్యాఘ్రం — తన యజమానుల కుటుంబాల్లోని కన్యనైను ప్రేమదానం చేయమని యాచించడానికి వచ్చాడు. ఆహా! నీ చూపు నన్ను గాయపరిచింది. నీ ఒయ్యారం, నీ కులుకు నన్ను పిచ్చెత్తి

స్తోంది అంటూ వాళ్లు చేసిన ప్రేమగోల నువ్వు వినివుంటే — ఒక కొడుకు తన తల్లిని ప్రేమ భిక్షపెట్టమని ఎలా అడిగేదీ, ఒక తండ్రి కూతుర్నే మోహించి ఎలా ప్రేమదానం కోరేదీ ఆ దృశ్యాలు భరించలేక నిలుచున్న పాళంగా భూమాత ఒళ్లోకి కుంగిపోయేదానివి. నేను "రేపు చూద్దాంలే" అని అనకపోతే వాళ్లు యీ యింటి చూరుపట్టుకొని ఇక్కడే రాత్రంతా వేలాడేవాళ్లు.

అయితే నేను ఇక్కడికు ఎందుకొచ్చానని నువ్వడగవచ్చు. మేజువాణీకా? అది ఇటువంటి వాళ్లమధ్యనా? ఎప్పటికీరాను. నిలువనీడలేకుండా తింటానికి తిండిలేకుండా నా జీవితాన్నే బుగ్గిపాలుచేసిన ఆ కర్కోటకుడి అంతు కనుక్కోందామన్న బలమైన కోరికతో ఇక్కడకొచ్చాను.

తల్లీ సుందరీ! నేనీ ఇద్దరి నరరూప రాక్షసుల్నీ చంపి రక్తదాహం తీర్చు కుందామని వచ్చాను. ఆ ఉద్దేశంతోనే చాలాకాలం నుండి ఈ వివాహానికి ఎదురు చూస్తూ వున్నాను. ఈ వ్యవహారం కనిపెట్టేందుకు ఇద్దరు దళారుల్ని కూడా నియమించాను. ఇక మూడో కసాయివాడు — నన్ను వేశ్య దగ్గరకు తీసుకొచ్చి ఆమెకు అమ్మేసినవాడు. వాణ్ణి ఎప్పుడో శ్మశానానికి పంపేశాను. దీని విషయం బయటికి పొక్కకుండా చేశాను. అదొక పెద్దకథ. అదంతా నీకు చెప్పి సుకుమారమైన నీ హృదయాన్ని పాడుచెయ్యను. ఒక్కకోరిక మాత్రం తీర్చుకోలేక గుండెలో దాచుకొనే చనిపోతానేమో. ఆ కసాయి తారాచంద్ రక్తంతో నా చేతులు కడుపుకొనాలని వుంది. ఎన్ని ప్రయత్నాలు చేసినా వాడు దొరకలేదు. ఎక్కడైనా దొరికితే... ..."

అన్వర్ చెప్పుకపోతూంటే సుందరి కళ్లూ, చెవులూ రెండూ అప్పగించి వింటూవుంది. ఆమె శరీరం అంతా ప్రతీకారాగ్నితో భగభగమండసాగింది. అంతకన్న ఆ విషాద గాథను సుందరి వినలేకపోయింది. బచన్‌సింగు చేసిన నీతిబోధలు ఆమెను కొద్దిగా మార్చాయి. కాని ప్రచండమైన తుఫానులో గాలి విసురుకు చుట్టూవున్న కంచెను కూడా దాటుకుంటూ వేళ్లతో సహా ఎగిరిపోయిన చిన్న మొక్కలా ఆమె ఆశయాలు మాయ మైనాయి. భూమి కదలిపోతున్నట్లుగానూ, ఆ ఇంటిలోని ప్రతివస్తువూ తన గుండ్రని కళ్లలో తిరిగిపోతున్నట్లుగానూ కనిపించింది.

అన్వర్ చెప్పుకపోతుంటే మధ్యలోనే ఆమె ప్రసంగానికి అడ్డుతగిలి సుందరి ఆవే శంతో ప్రతిజ్ఞచేస్తున్నట్టుగా "నేను ఆ దుర్మార్గుడి రక్తం తాగుతానమ్మా, నేనే నీబిడ్డ నైతే వాడి రక్తంతాగి నీలోనూ నాలోనూ ప్రజ్వరిల్లుతూన్న ఈ మంటల్ని ఆర్పుతాను.

ఇప్పట్నుంచే వాడ్ని వెతికి పట్టుకొనే పనిలో వుంటాను"- అంటూ చరచర మెట్లుదిగి పోయింది. తనకేదో పిచ్చిఎత్తినట్లుగా అనిపించింది సుందరికి.

సుందరి దిగివెళ్ళిన తర్వాత చాలా సేపటివరకు శిలాప్రతిమలా కూర్చుండిపోయింది అన్వర్. "నేను ఆదుర్మార్గుడిరక్తం తాగుతానమ్మా" అన్నమాటలు అన్వర్ చెవుల్లో మారుమ్రోగుతూ వున్నాయి. ఇవ్వాళ జరిగిన సంఘటనఅంతా కలలాగావచ్చి కరిగి పోయినట్లనిపించింది ఆమెకు.

కింద తనకోసం ఎదురుచూస్తూ పచార్లుచేస్తూన్న బచన్‌సింగును సుందరి చూసింది. రాత్రి రెండుజాములైంది. బచన్ సుందరిని ఇంటికి తీసుకవెళ్లేసరికి మూడోజాము ప్రారంభమైంది.

---

# [ 27 ]

పొద్దు పొడవడానికి ఇంకా ఓ జాముంది. అలాగే పిచ్చాపాటీ మాట్లాడుతూ బచన్ సింగ్, సుందరీ రాత్రంతా గడిపారు.

లాంతరు వెలుతురులో సుందరిని చూడగానే బచన్‌కు భయంవేసింది. సుందరికళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. ఆమె నవ్వులోకూడా భయంకరమైన కరకుతనం, పిడివాదపదునూ కన్పించాయి.

సుందరి జబ్బపట్టుకుని కదుపుతూ, ''సుందరీ, ఏం జరిగింది ?'' అని అడిగాడు.

''అబ్బే, ఏం లేదండీ. అంతా సవ్యంగానేవుంది'' అని జవాబిచ్చింది. ఏడ్చేడ్చి జేవురుబారిన తన ముఖాన్ని బచన్ కనిపెడ్తున్నాడనిపించింది ఆమెకు. కడుపులోంచి పెల్లుబుకుతూన్న వరదను ఎంతో నిగ్రహంతో ఆపుకోకలిగింది. ఆమె ప్రసంగాన్ని మారుస్తూ —''అయితే మీరు పెళ్ళివారిదగ్గిర కెళ్లారా ?'' అని అడిగింది.

''లేదు. ఇంట్లోనే వున్నాను. అదిసరే. నీకళ్ళు ఎందుకుఅంత ఎర్రగా వున్నాయి? ఏమిటీ విశేషం?''

నిద్రలేమిని నటిస్తూ మెటికలువిరచి ''ఇదంతా తమ ప్రభావమే'' అంది.

''అదెలా ?''

''మీరు నామీద కార్యభారాన్ని మోపారుగా. ''

సుందరి మాటల ఒరవడిచూసి కొంతవరకైనా కార్యక్రమంలో కృతకృత్యురాలైందనుకున్నాడు బచన్. వూరడిస్తూ ''అవునవును ఎంతవరకొచ్చిందీ ?'' అని అడిగాడు.

''అయిపోయింది లెండి.''

''అంటే, గెలిచావన్నమాట. '

''ఆహా ! పూర్తిగా''.

''అది అసంభవం.''

''సంభవంకంటె ఎక్కువగానే.''

''అంటే ?''

దీనికి సమాధానంగా తాను అన్వర్‌వద్ద నుంచి మేజువాణీ పెట్టనని మాటతీసుకొన్నానని మాత్రమే చెప్పింది సుందరి. సుందరిచెప్పినా బచన్‌కు నమ్మకం కుదరలేదు. ఇంకా సందేహంగానే ఆమె కళ్ళల్లోకి చూస్తూ "ఏమో నేను నమ్మలేకున్నాను. నీకు లోకరా యివ్వడానికి అని వుంటుంది." అన్నాడు. సుందరి మొఖంలో నిశ్చలత్వం తొణికిస లాడింది.

"ఏమైనా కానీయండి. ఆమె ముమ్మాటికి మేజువాణీ చేయదు. మీకే తెలుస్తుందిగా." అంది.

"నువ్వు చెప్పిందే నిజమైతే ఇసుకలోంచి చమురు పిండావన్నమాట. వుదయం చేయకపోతేనేం ! అప్పుడే వియ్యాలవారు వెళ్ళిపోరుగా! ఆమె దివాన్‌పూర్‌లో వున్నన్ని రోజులు మేజువాణీ చేయనని మాట తీసుకోవాల్సింది నువ్వు".

"అంతకన్న పెద్దవాగ్దానమే తీసుకొన్నాలెండి" నవ్వుతూ అంది సుందరి పెద్ద రహస్యాన్ని దాచుకొన్నట్లుగా.

"ఏమని ?"

"అమె బతికివున్నంతకాలం ఈ జన్మలో మేజువాణీలు చేయనని. ఆమె ఈవృత్తిని శాశ్వతంగా విడిచిపెడ్తుందనే అనుకుంటున్నాను. నిన్నచేసిన మేజువాణీ ఆమె జీవితంలో ఆఖరుదన్నమాట."

"అదెలా సంభవం ?" సుందరి తనతో వేళాకోళంగా మాట్లాడుతుందేమోనన్న సందేహం కలిగింది బచన్‌కు. సుందరి కళ్లల్లోకిచూస్తూ "రాబందుల్ని శవాల్ని పీక్కు-తినడం మాని దుంపల్ని భుజించమన్నట్లుంది" అని వెటకారంగా అన్నాడు.

బచన్‌కు తను చెప్పింది నిజమని ఒప్పించగలిగింది కాని అన్వర్‌కూ తనకూ మధ్య జరిగిన వృత్తాంతం ఏమీ చెప్పలేదు. తల్లిఎదుట తాను ఏమని ప్రతిజ్ఞచేసి వచ్చిందో అది కనక బచన్‌కు తెలిస్తే ఆమెను ఎగతాళిచేయడమే కాకుండా ఆమె ప్రతిజ్ఞా ప్రయత్నాన్ని ఏదోవిధంగా విరమింపచేయడానికి ప్రయత్నిస్తాడు. అందువల్ల ఆ విషయాలు ఏమీ అతని ముందు ప్రస్తావించడం ఆమెకు సమంజసంగా తోచలేదు. మొదటినుంచే సుందరి ఇంత ఘనకార్యం సాధించకలుగుతుందని అతను కలలోకూడ వూహించలేదు. తీరా ఆమె సాధించివచ్చేసరికి అతని ఆనందానికి హద్దులులే

"ఐతే మనం తప్పకుండా జయించితీరుతాం" అని ఉద్వేగంతో అన్నాడు బచన్.

"అలాకాదు. జయించేశామనుకోండి" బచన్ తూచివాడిన మాటను గ్రహిస్తూ సుందరి స్పష్టపరిచింది.

"సుందరీ, మనం ఇద్దరం ఒకటైపోదామా ?"

"ఒకటిగా ఎప్పుడో అయ్యాం."

"లేదు సుందరీ. ఇంకా ఇద్దరం ఇద్దరంగానే వున్నాం. ఇద్దరం ఒకటి కావాలనే ప్రయత్నంలో మనం ఇంకా కృతకృత్యులంకాలేదు. ఇప్పుడేకదా మనం తొలిసారిగా ముందడుగువేసింది.

"ఒకటికాలేదా ? లేదండి స్వామీ. మనం ఎప్పటికీ ఒకటేనండి. మన మధ్య ఈ ఏకత్వం శాశ్వతమైంది. దీనికి చావులేదు."

"మానసికంగా మనం ఏకమయ్యాం. అది నిజమే. కాని సంఘం దృష్టిలో మనం ఇంకా ఒకటికాలేదే ?

బచన్‌సింగు చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ సుందరి అంది - 'సంఘమా ? ఏ సంఘం గురించి మాట్లాడుతున్నారు ? వేర్పాటూ, ఈర్ష్యా, దుర్మార్గమూ వంటిరోగాలతో కన్నుచూపు పోగొట్టుకొన్న అసంఘ దృష్టి గురించా మీరు మాట్లాడుతూంది ? అటువంటి సంఘం దృష్టిలో మనం ఒకటికాకపోయినా మనం ఒకటికాలేదనా మీ ఉద్దేశ్యం ? సంఘానికి ఒకటి ఒకటిగా కనపడింది ఎప్పుడు ? దానికెప్పుడూ ఒకటిరెండుగానే కనపడుతోంది. అది దానిదృష్టిదోషం. కోటిజన్మాలెత్తినా దాని కళ్ళు బాగుపడవు. ఈ సంఘాన్ని మీరు మానవ సముదాయం కింద పరిగణిస్తున్నారా ? కాని నేను మాత్రం ..." అంటూ సుందరి ఉద్వేగంతో మరికమాట్లాడలేక పోయింది. ఆమె ముఖం ముద్దకుంకంలా ఎర్రబారింది. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు బరువుగా సాగుతున్నాయి.

ఆమె ముఖకవళిక గమనించిన బచన్ గాభర పడ్డాడు. పిచ్చిదికాలేదు కదా అన్న సందేహం కలిగింది అతనికి.

రోగాల్లో కొన్నింటిని "క్రానిక్ డిసీజెస్" అంటారు. అంటే ఇవి దీర్ఘకాలంనుండీ పీడించుకు తింటుంటాయి. నయంకానట్టివి. అథవా ఎవరైనా సమర్థుడైన వైద్యుని దగ్గర చికిత్సపొందితే కొంచెం నయమైనట్లుగా కనపడి మళ్ళీ ఏదైనా కొద్దిగా అవుపత్యం చేస్తే మళ్ళీతిరగపెడ్తాయి. మళ్ళీ మొదటికివస్తుంది. సుందరి పరిస్థితి కూడా అలానే వుంది. ఎంతో కష్టపడి బచన్ సుందరిని తప్పుడు తోవనుండి మళ్ళించి సవ్యమైన మార్గంలోకి తీసుకురావడానికి సిద్ధంచేశాడు. ఆమె దారికిరాలేదు సరికదా, ఇంతలోనే అన్వర్ సంఘటన ఆమె ఆలోచనా సరళిని మళ్ళీ మొదటి చోటికి తీసుకవెళ్ళింది.

"సుందరీ, నువ్వీరోజు అదోలావున్నావు ?" అని ఆమె భుజంపూపుతూ "ఈ రోజు మళ్ళీ నువ్వు నరసింహావతారం తాల్చావేం ?" అన్నాడు నవ్వుతూ.

అంతలోనే "అది సరేగాని మన భవిష్యత్ కార్యక్రమమేమిటి?" అని అడిగాడు ఆమెను ఆ ప్రసంగం నుంచి మరలిద్దామని. లేకపోతే ఆ ప్రసంగం అలాగే సాగదీస్తే ఆమె మరీ పిచ్చిదానిల ప్రవర్తించవచ్చు.

అప్పటికి సుందరి ఆవేశాన్ని కొంచెం నిగ్రహించుకుంది. తను దుర్బలత్వానికి పశ్చాత్తాపం చెందింది. ఏ వ్యవహారం గురించి బచన్‌సింగుకు వాసనగూడ దొరకకుండా చేయాలనుకుందో తన తొందరపాటువల్ల అది బయటపడిపోయింది. దాన్ని పొడిగిస్తూ పోతే ఇంకా ఏమేం మాటలు తననోట్లోంచి దొర్లిపోతాయో అని దాన్ని వదిలేసి బచన్ సింగు అడిగిన దానికి సమాధానం చెప్పింది – "మీరు ప్రస్తుతం కొంతకాలంవరకు మీ తల్లిగార్ని విడిచి బయటకు వెళ్ళలేనని కిందటి వుత్తరంలో రాసేరు. మరి అట్టిపరిస్థితిలో ..."

"నిజమే అనుకో. కాని ఇక్కడున్నంతవరకు మనకు ఏదో కార్యక్రమం అంటూ వుండాలిగా. మొదటిసారిగా మనం చేపట్టిన పనిలో జయం నీవల్లే లభించింది. దాంతో మనం ముందుకు పోవడానికి ధైర్యంవచ్చింది. వారాలకొద్దీ తిరిగినా సాధించలేని కార్యాన్ని నువ్వు ఒక్కసారి వెళ్లి సాధించేశావు. అందుకనే నేననేది మనం ఇద్దరం సాధ్యమైనంత తొందరలో ..."

"బచన్ మాటముగించకముందే సుందరి అందుకొంది "నేనేమి సాధించానండీ. ఏదో కొద్దిగా సాధించినా అదంతా మీరు నాకు నేర్పిన విద్యాబుద్ధులూ, మీ సహచర్యం చలవవల్లేకదా. మీరేగాని లేకపోతే ఓ కోతులాడించేవాడి మనుమరాలు ఏం చేయగలదు చెప్పండి. అవునా?"

"నేను ఇందాకే చెప్పానుకదా నీకు అనవసరంగా ఆవేశం వచ్చిందని"

"అంటే?"

"అదే. వివాహం అంటూ ఓ తంతు వుందిగా. దాన్ని ముందు పూర్తికానివ్వాలి. తర్వాత మన కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికి ఇద్దరం స్వేచ్ఛగా రంగంలోకి దిగొచ్చు."

బచన్ చెప్పినది వింది సుందరి. కొంచెం సంకోచంగా నవ్వుతూనే

"ఆ తతంగం జరక్కపోతే మనం రంగంలోకి దిగరాదా?" అని అడిగింది.

"వద్దు సుందరీ. అది అసంభవం."

"కాని నా దృష్టిలో అదేమీ అసంభవంకాదు."

"ఇంతకీ నీ వుద్దేశం ఏమిటి?"

మనం కొన్నాళ్లువిడివిడిగా పనిచేయాలని నావుద్దేశం. మన కార్యక్రమం పూర్తి అయిన తర్వాత ఏకం కావచ్చు."

"సుందరీ, నీమాటలు వింటూంటే నాకు భయం వేస్తోంది. నిన్ను అర్థంచేసుకోడం చాలా కష్టం"

"ప్రేమ పరిచిన మార్గంలో భయంగూడా వుంటుందా. మీనోట ఈమాటలు వింటుంటే వింతగావుంది. నేను చెప్పేది..." అంటూ సుందరి ఆగిపోయింది. ఆమె మౌనంచూసి బచన్‌కు గాభరా మరింతహెచ్చింది.

"ఏమిటీచెప్పు" అన్నాడు బచన్.

"చెప్పేదేమీలేదు. కొన్నిరోజులపాటు మీరునన్ను మరచిపోండి."

"నిన్ను మరచిపోవడమా ! గిలగిల్లాడాడు బచన్. "అన్వర్ యింటికి పోయివచ్చిన తర్వాత నువ్వు మారిపోయావు సుమా" అని మనసులోని మూగవేదనని బైటికి వెళ్ళ కక్కేశాడు.

"నిజంగానన్ను మరచిపోండి" అంది సుందరి అతని మాటల్ని ఆలకించనట్లుగా. "ఓవేళ మీరు మరిచిపోలేకపోతే కనీసం నా స్మృతినే సుందరిగా భావించి మీమనో మందిరంలో కొంతకాలం ప్రతిష్ఠించుకోండి."

ఆమె నిర్మోహమాటంగా మాట్లాడేసరికి బచన్‌కు దుఃఖంవచ్చింది. ఆమె చేతిని పట్టుకొని చెమ్మగిల్లిన కళ్ళతో "సుందరీ, భగవంతునిమీద ఒట్టు అటువంటి మాటలు మాట్లాడవద్దు. ఇలాటి మాటలు వింటూంటే నా మనసు ఏమైపోతుందో గమనించు" అని ప్రాథేయపడుతున్నట్లుగా కోరాడు.

బచన్ చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకొని దాన్ని గట్టిగా అదిమిపట్టుకొంది సుందరి. మనస్సును బాధిస్తూన్న వ్యధను అణచుకుంటూ "ఏమిటలా అయిపోతున్నారు ? నేనెప్పటికీ మీదాన్నే. ఒక్క మీదాన్నే. మీరు కంటతడిపెట్టి నా నిగ్రహాన్నీ, ఓర్పునూ పరీక్షించకండి. ఏమాత్రం పట్టుదప్పినా అది కట్ట తెంచుకొని ప్రవహిస్తుంది. నా ప్రతిజ్ఞ నెరవేర్చుకోనివ్వండి" అంది.

బచన్‌సింగు మనసులో రగుల్కొంటూన్న దావాగ్నిని ఆర్పడానికి ఆమె ఒక్కత్తె దగ్గిరే నీళ్లున్నాయి. కాని దానిలోనూ అగ్ని అంటుకుంది. నిప్పును నిప్పుతో ఆర్పేయాలని చూస్తోంది. తన మనస్సులో రగుల్కొనే ఆ నిప్పు ఆర్పడానికి కూడా నీళ్ళు అవసరం. కాని అటువైపూ నీళ్ళకు బదులు నిప్పే రాజుతూంది. ఇల్లు కాలిపోతూవుంది. దాన్ని ఆర్పే ఇంజను గూడా కాలుతోంది.

"సుందరీ, నాచేత పొడుపు కథలు విప్పించకు. నీ మనస్సులోది వున్నది వున్నట్టు చెప్పేయ్" అన్నాడు బచన్.

బలవంతంగా నవ్వు తెచ్చిపెట్టుకుంటూ సుందరి సమాధానం చెప్పింది - "స్పష్టంగానే చెప్తున్నాను. కేవలం నాగురించి మీరు ఎన్నెన్నో కష్టాలు పడ్డారు. అవన్నీనాకు తెలియనివికావు. కాని ఈ కష్టాలు ఇక్కడితోనే ఆగిపోతే ఓర్చుకోవచ్చు. ఇవి ఇంతటితో ఆగడంలేదు. నా గురించి మీరు ఇంకా ఎన్నోకష్టాలు పడాల్సివస్తుంది. అందుకనే కొన్నాళ్ళపాటు మీరు వేరుగావుండిపోండి. మీ అమ్మగారు బతికివున్నంతకాలం, ఆమెకు సేవచేయండి. ఇంటికి కోడలువస్తే ఆమె కష్టాలన్నీ గట్టెక్కుతాయి."

సుందరి తుఫాను వర్షంలా మాట్లాడుతూంటే బచన్‌సింగును ఎవరో గునపాలుపెట్టి పొడుస్తున్నట్లుగావుంది. ఒకచేయి కళ్ళమీదకు పోనిచ్చి రెండోచేత్తో ఆమెను అపుచేయమని సౌంజ్ఞచేస్తూ బచన్ - "ఇంకాపు. సుందరీ యింక అపు. నిన్ను కాక ఇంకొకర్ని వివాహం ఆడమంటే అది వివాహంకాదు. నాచావే అనుకో. ఇంతకన్న నీకునేను చెప్పను. నువ్వింకేం చెప్పినానేను వినదల్చుకోలేదు."

ఈ మాటలు సుందరి చెవికి ఎక్కినట్లులేదు. ఆమె ఏదో తీవ్రంగా ఆలోచిస్తూవుంది. ఆ సమయంలో అంతకన్న ఎక్కువగా మాట్లాడడం వుచితం కాదనుకొన్నాడు బచన్. లేచిపోవడానికి తయారయ్యాడు. సుందరి మామూలు మనిషి అయినతర్వాత ఆమె మనస్సు బాగావున్నప్పుడు మళ్ళీ ఈ ప్రస్తావన తీసుకొచ్చి ఆమెను ఒప్పించవచ్చుననుకున్నాడు.

సుందరి ఆలోచిస్తోంది. ఎలాగైనా బచన్‌సింగుకు నచ్చచెప్పి తన భావాలకు అనుగుణంగా అతణ్ణి ఒప్పించి అలౌకికమైన బాంధవ్యాన్ని అలాగే నిలుపుకోవాలి. ఏదైనా మంచి కుటుంబంలోని పిల్లతో అతను పెళ్ళిచేసుకొంటే చూడాలి. ముళ్ళతోనిండివున్న అతని జీవితం మళ్ళీ పూలబాట కావాలి.

చీకటి తెరలు మెల్లమెల్లగా తొలగిపోతున్నాయి. ఆకాశం నిండా పల్చటి వెలుగు పరచుకుంటోంది. బచన్‌సింగు లేచి తన గదివైపు వెళ్తూండగా ఆప్యాయంగా చూస్తూ "వెళ్తున్నారా?" అని అడిగింది.

"ఇంకో పర్యాయం నీ మనస్సులో నాటుకున్న ఆ మూఢనమ్మకాల్ని తొలగించడానికి ప్రయత్నం చేస్తాను. భగవంతుడు మేలుచేస్తే, నీ భావాలు మూఢనమ్మకాలే అవుతాయి," అంటూ బచన్ తన గదిలోకి వెళ్ళిపోయాడు. సుందరికి విచారిస్తోంది. ఆమె నిద్రకళ్ళల్లో అన్నారే తిరుగుతోంది. అలా కొంతసేపయిన తర్వాత సుందరికి కునుకుపట్టింది.

— — —

# [ 28 ]

మూడు జాములు మాట్లాడుతూ మేల్కొన్న సుందరికి, నాల్గోజాము పిల్లగాలి తగల గానే కునుకుపట్టింది. కునుకుకాదు నిద్రేపట్టేసింది. అయితే ఆ నిద్ర ఆమె మామూలు నిద్రపోయే నిద్రకాదు. ఎంతో భయోత్పాతాన్ని పుట్టించే భీతావహమైన నిద్ర. నిద్రా దేవి ఆమెను తన హస్తాల్లో ఎత్తుకొని వెళ్ళి హంతకుల ప్రపంచంలోకి గిరాటేసింది. ఆ మరో ప్రపంచంలో నేల, నింగీ, చంద్రుడూ. సూర్యుడూ అందరూ రక్తంలోనే తడిసి పోయారు. కత్తులూ. కటారులూ, గండ్రగొడ్డళ్ళూ, బరిసెలూ కుప్పలు కుప్పలుగా ఆమె కళ్ళల్లోంచీ, చెవుల్లోంచీ మెదడులోకి దూసుకుపోతున్నాయి. నేల ప్రతిచెరగూ హత్య హత్య అంటూ మూలుగుతూవుంది. చెట్ల మీద కూర్చొన్న పక్షులూ హత్యహత్య అంటూ పాడుతున్నాయి. నదులూ, నూతులూ, సరోవరాలన్నీ రక్తమయం అయిపోయాయి. ఎక్కడకు వెళ్లినా ఏడ్పుగీతాలే ఆమె చెవుల్లో వినపడ్తున్నాయి. ఆమె ధరించిన దుస్తుల్లోంచి, శిరోజాల్లోంచీ. నోటిలోంచీ రక్తమే కారుతోంది. ఆమె రక్తసరస్సులు ముందుకు నడుస్తోంది. లోతుల్లోకి దిగుతోంది. అక్కడవున్న చేపలు మొదలు తిమింగిలాల వరకు - అన్నిటి కడుపుల్లోనూ రక్తమే నిండివుంది. ఈ మనుషులకు మాదిరిగా ఆ జలజంతువులకూడా నోళ్లూ, నాలుకలూవున్నాయి. 'హత్య హత్య' అంటూ అరుస్తూ గోలచేస్తూ ఒక దాని వెనుక ఒకటి పరుగెత్తుతున్నాయి. పారిపోతూ వున్నాయి. హంతకుడు, వేటకాడు, అందరినోళ్ళపై ఒక్కటేమాట హత్య హత్య హత్య !

సుందరి తాను రక్త సరస్సు అడుగు భాగానికి చేరినట్లు అనిపించింది. లోతుకు వెళ్తూండగా ఆమెకు వూపిరిసలపలేదు. గాభరాపడ్తూ పెద్దగా అరుస్తూ ఒక్కగావుకేక పెట్టింది. కాని ఆమె పెట్టినకేక నోట్లోంచి బయటికి రాక మునుపే లోపలనే అణగారి పోయింది. ఆమె కలవరిస్తూ పక్కకు ఒత్తిగిల్లింది. కొద్దిగా మెలకువ వచ్చింది. రెండు చేతులూ ఆమె ఛాతిపై వున్నాయి. గదిలో సూర్యకిరణాలు పడుతున్నాయి. ఎప్పుడూ పచ్చగా వుండే కిరణాలు ఆనా డెందుకో రక్తంలా ఎర్రగావున్నాయి. లేచిన తర్వాత కూడా అర్ధనిద్రావస్థ ఇంకా తొలగలేదేమో ఆమె చెవుల్లో 'హత్య హత్య' అన్న శబ్దమే మారు మోగుతోంది.

ఆమె కళ్ళు తెరచింది. మళ్ళీ భయంతో వెంటనే మూసుకుంది. "హత్య హత్య" అన్న మాట ఒకటే గందరగోళాన్ని సృష్టిస్తూ ఆమె చెవుల్లోని పొరల్ని బద్దలు కొడ్తూంది. ఆమె మళ్లీ కళ్లు తెరచింది. లేచి మంచంమీద కూర్చుంది. బాగా పొద్దుఎక్కింది. ఇల్లంతా మనుషులతోనిండి వున్నట్లూ అన్ని దిక్కుల్నుండి "హత్య హత్య" అన్నమాటలు వినపడుతున్నయ్.

వెంటనే గదిలోంచి బయటికివచ్చింది. గ్రామం యావత్తూ బచన్‌సింగును చుట్టు ముట్టివుంది. పోలీసులు బచన్‌చేతులకు బేడీలు వేశారు. అతని తల్లీ ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోతోంది. 'బచన్‌సింగు మొత్తం మూడు ఖూనీలు చేశాడు - వేశ్యనూ, ముసలిపంతులుగార్నీ, పెండ్లికూమారుని అన్నగారైన కరమ్‌చంద్‌నీ" అంటూ ఎవరో పెద్దగా చెప్తున్నారు.

పోలీసులు బచన్‌ను స్టేషనుకు తీసుకొని పోతున్నారు. సుందరి తన కళ్ళనుతానే నమ్మలేకపోయింది. ఆమె ముందు దట్టంగా చీకటి అలుముకొంటూన్నట్లనిపించింది. వేగంగా పోలీసుల వెనుకపరుగెత్తుతూ జనాన్ని చీల్చుకొంటూ వెళ్ళిబచన్‌ను కావ లించుకొంది. పెద్దగా ఓకేకవేసి అతని పాదాలపై స్పృహలేకుండా పడిపోయింది. జనం స్పృహతప్పిపడిపోయిన సుందరిని అక్కడే ఒదిలేసి ముందుకు సాగిపోయారు.

అంతా కలగాకనిపించింది బచన్‌కు. సుందరి పరిస్థితి చూసి అతని మనస్సు స్వాధీనం తప్పిపోయింది. ఎన్నోసార్లు అతను వెనుక్కు తిరిగిచూశాడు. ఒకటి రెండుసార్లు నిలబడడానికి ప్రయత్నించాడు. కాని పోలీసులు అతణ్ణి ముందుకు తోస్తూంటే ఏమీ చేయలేకపోయాడు. చూస్తుండగానే అంతా శ్మశానంగా మారిపోయింది.

"బచన్‌సింగు ఒక్కరాత్రిలోనే ముగ్గురిని హత్యచేశాడు" అన్నవార్తవూరంతా వ్యాపించిపోయింది.

సుందరికి స్పృహవచ్చి చూసేసరికి రవాణీ గ్రామంలో తనగదిలోవుంది. ఆమె స్పృహా తప్పిపడిపోయిన తర్వాత రవాణీ గ్రామస్థులు కొంతమంది సుందరిని చూపి అపస్మారకంలోనే ఆమెను ఇంటికి చేర్చారు. తెలివి వచ్చేవరకు కొంతమంది కూర్చు న్నారు. ఆమె లేచికూర్చుంది. "బచన్‌సింగు మూడు హత్యలు చేశాడు" అని ఎవరో అన్నారు.

సుందరికి కళ్ళు తిరుగుతున్నాయి. ఆమె తలలో బాంబుప్రేలి బద్దలైనట్లు ఆప్రేలుడికి ఆమె శరీరమంతా తుత్తునియలై చెల్లాచెదురుగా పడిపోయినట్లనిపించింది. ఐదు నిము షాలపాటు ఆమె అలాగే వుండిపోయింది, ఆలోచించేశక్తి కూడా ఆమెలో నశించి

పోయింది. ఆమెతల మళ్ళీతిరగడం ప్రారంభించింది. మళ్ళీ స్పృహకోల్పోయింది. అలాటి స్థితిలో ఆమెచాలా సేపువుంది. రెండోసారి తెలివివచ్చినప్పుడు బచన్‌సింగు హత్యచేశాడన్న విషయాన్ని కలలో విన్నట్లు అనిపించింది ఆమెకు.

పిచ్చిదానిలా పడుతూ లేస్తూ తూలుతూ దీవాన్‌పూర్‌కు వెళ్ళే రోడ్డెక్కి నడవసాగింది ఆమెను ఆపుచేయడానికి చాలామంది ప్రయత్నించారు. కాని ఆమె ఆగలేదు. రోడ్డు మీద ఓ టాంగా వెడ్తూంటే గబగబదాన్లో ఎక్కి కూర్చుంది.

తిన్నగా బచన్‌సింగు ఇంటికెళ్ళింది. అతని తల్లి మంచంమీద తెలివితప్పి పడి వుంది. చుట్టుపక్కల అమ్మలక్కలు అక్కడచేరి ఆమెకు తెలివి తేవడానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నారు. వాళ్ళందరినీ సుందరి వెర్రిదానిలా చూడసాగింది. కాని ఎవ్వరూ ఆమెను పలకరించలేదు. ఎవ్వరూ పిలవలేదు. బచన్‌తల్లి మెల్లగా కళ్ళు తెరచింది. అంతే ఒక్కపరుగున సుందరి ఆమె మంచం దగ్గరకు చేరుకుంది.

సుందరిని చూడగానే సదాకౌర్ శరీరంలో అగ్నిరగుల్కొంది. ఆమె ముఖం కోపంతో ఎర్రగా అయిపోయింది. చేత్తో ఒక్కవిసురు విసురుతూ "ఇక్కణ్ణుంచి అవతలకిపోవే పాపిష్టిదానా. నీతీజాతీలేనిదానివి. ఈ అనర్థాలన్నిటికీ నువ్వేకారణం. అపశకునపక్షి! ఏరోజు నా బిడ్డ నీ చండాల ముఖాన్ని చూశాడో అనాట్నుంచి నా బంగారం మట్టిపాలయింది. కర్మంకాలినదానా! నువ్వురాకపోతే నా ప్రపంచమే నాశనం అయ్యేది కాదు.పో.ఆ భంగవంతుడు యిహపరాలు రెండింటిలో తగినశాస్తిచేస్తాడు" అంటూ పెద్దగా అరుస్తూ నోటికొచ్చినతిట్లూ తిట్టింది. ఆవేశం అవధులుదాటి ఆ ఆవేశంలో మంచంమీంచి కూడా లేచి నిలబడి శాపనార్థాలు పెట్టడం ప్రారంభించింది.

మరొకప్పుడైతే సదాకౌర్ అలాటిమాటలు మాట్లాడితే సుందరి ఏమైనాచేసేది. కాని యిప్పుడు మాత్రం బోనులో బంధింపబడిన సింహాన్నిచూసి బోను అవతలనుంచి కోతులూ కొండముచ్చులూ వెక్కిరిస్తుంటే ఏమీ చేయలేక నిస్సహాయురాలిగా చూస్తోన్న సింహంలా సదాకౌర్ అన్నమాటలన్నిటినీ విని కోపాన్నంతా దిగమ్రింగింది. ఆమెకు జవాబుకూడా చెప్పకుండానే పోలీసు స్టేషన్‌వైపుకు పరుగెత్తింది. శరీరానికి దెబ్బతగిలినప్పుడు ఆ వేడిలో వెంటనే దాని బాధ తెలీదు. దెబ్బతగిలిన కొంచెంసేపటికి గాని ఆవేడి చల్లారి నొప్పి తెలిసిరాదు. సుందరి పరిస్థితికూడా అలాగేవుంది. స్టేషన్‌కు వెళ్తూంటే ఆమెకు జ్ఞాపకం వచ్చింది అది ఖూనీకేసని. ఎదురుగా తుపాకులు గురిపెట్టిన వేటకాళ్ళు వెనుక భాగంలో కాలిపోతూన్న అడవీ, కుడివైపు ప్రవహిస్తూన్న నదీ, ఎడమవైపు వూరూ వాడా వీరందరి మధ్య చిక్కుకొనిపోయిన లేడిలావుంది ఆమె.

తన పరిస్థితి తలుచుకొంటే ఆమెకు భయంవేసింది. తనకు కొత్తసామ్రాజ్యాన్ని సృష్టించి ప్రసాదించిన తన సర్వస్వమూ అయిన ప్రియుడు తల్లిని దిక్కులేనిదానిగాచేసి తప్పుడు ఖూనీకేసులో ఇరుక్కొన్నాడు. ఇప్పుడు సదాకౌర్ చుట్టూ మూగి మొసలి కన్నీరు కారుస్తున్న ఆ జనం కపటంతో కుత్సితంతో కడుపునింపుకొనే మనుషులు. పైగా వూరు వూరంతా బచన్‌కు బద్ధశత్రువు. అందువల్ల బచన్ ఖూనీచేశాడని వాళ్ళు నమ్ముతున్నారంటే అందులో ఆశ్చర్యంలేదు.

సుందరి ఓ పడవలో కూర్చుంది. ఆ పడవనడిపే సరంగూను మొసలిమింగేసింది. ఆమెకూర్చున్న పడవ భయంకరమైన సుడిగుండంలో చిక్కుకొని బొంగరంలా గిరగిర తిరుగుతోంది. రోడూకూడాలేదు. అతన్ని పొట్టనపెట్టుకున్నారు వూళ్ళోవాళ్లు. తల్లి కూడా ఆమెకు దొరికినట్లే దొరికి ఆకాశంలోని మెరుపులా ఓ క్షణంపాటు కనబడి అదృశ్యమైపోయింది. ఒక్కర్తేమిగిలింది. రవాణీ గ్రామస్తులు కూడా ఆమెను తమ వూళ్ళో వుండనివ్వరు. పాలాసింగూ అతని మిత్రులు అంటే వాళ్లకు భయం. అందు వల్లే వాళ్ళకు బచన్‌సింగ్ అంటే గౌరవమున్నా ఇప్పుడు ఆమెకు కించిత్తు సహాయం కూడా చెయ్యలేదు. బచన్‌సింగుకు అండదండలు ఇస్తాం అని విర్రవీగినవారు కూడా తెలియనట్లుగా తప్పుకున్నారు.

పరిస్థితినంతా అవగాహనచేసుకుంది సుందరి. నేనింక ఇక్కడ వుండడంవల్ల లాభం లేకపోగా అపాయంకూడా వాటిల్లవచ్చు. నా జీవిత సర్వస్వమే మృత్యువు కబంధహస్తాల్లో గిలగిల లాడుతూంటే ఎక్కడికి పోవడం? డీవాన్‌పూర్ ఎలావెళ్ళడం? ఒకవేళ యిష్టపడేవాళ్లు వున్నారంటే వాళ్ళది ఎంతసేపూ తన యవ్వనంపైపే దృష్టి.

స్త్రీ జాతి ఎంత బలహీనమైందో, ఎంత అసమర్థురాలో జీవితంలో మొదటిసారి సుందరి తెలుసుకొంది.

అన్నెం పున్నెం ఎరగని బచన్ అన్యాయంగా జైలుకు వెళ్ళవలసి వచ్చింది అన్న బాధ ఆమె గుండెల్ని పిండుతోంది. ఎంతగా ఆలోచించినా ఆమె ఓ నిశ్చయానికి రాలేక పోయింది. ఆపదలో వున్న తన ప్రియుడికి ఏవిధంగానూ సహాయం చేయలేక పోయా నన్న చింత ఆమెకు పట్టుకుంది. కష్టాలకార్చిచ్చులో చిక్కుకుని యీ బాధను భరించడం కన్న తన జీవితాన్ని అంతం చేసుకోవడమే మేలనిపించింది. ఈ జీవితం ముగించు కొంటే ఈ దుఃఖాలూ యాతనల నుంచి ముక్తి లభిస్తుంది. కాని ఆమెలో దాగివున్న ఏదో అజ్ఞాతశక్తి సుందరిని అపని చేయనివ్వలేదు. "అమ్మ తొందరపాటుతో ఎంత అఘాయిత్యం చేసింది" ఈ ఆలోచనే పూటికి పూటికి ఆమెను వేధించసాగింది. తన

శత్రువుల్నే తుదముట్టించి తాను ఆత్మహత్య చేసుకోవాలన్న ఉద్దేశమేవున్నపుడు ఓ వుత్తరం ముక్కరాసి పడేస్తే ఎంతబావుండేది? అమాయకులైన వారికి ఈ విపత్తువచ్చి పడేదికాదు కదా?

ఆలోచిస్తూ సుందరి పోలీసు స్టేషను చేరుకుంది. బచన్‌ను కలుసుకోవడానికి చాల ప్రయత్నం చేసింది. పోలీసువాళ్ళ తిట్లూ తోపులూ మినహాయించి ఫలితం కలగలేదు. రోజంతా కాలికి బలపం కట్టుకొని తిరిగింది. గ్రామంలో పలుకుబడి కల కొంతమంది వద్దకు వెళ్ళి మొరపెట్టుకుంది. తలబాదుకుంది — బచన్‌ను చూడనివ్వడానికి పోలీసులకు చెప్పమని. కాని ఒక్కరూ ఆమె ప్రార్ధన ఆలకించలేదు. ఎక్కడకు వెళ్ళినా ఎవరిని కలుసుకున్నా వెటకారాలు, చివాట్లూను.

తిరిగి తిరిగి అలసిపోయి సాయంకాలానికి రవాణీ గ్రామంలో తన గదిలో కూలి పోయింది. ఆకాశంలో అంతులేని ఆనందంతో ఎగిరే పక్షిని బలవంతంగా పట్టుకొని అమాంతంగా దాని రెక్కలు విరిచి పారేసినట్టు రాత్రంతా నిద్రాహారాలులేక తపించింది. ఎవరూ ఆమెను పలకరించడానికి రాలేదు. ఆ అవసరం కూడాలేదు ఆమెకు.

ఇంకా సరిగా పొద్దుపొడవలేదు. చీకటి తెరలు పూర్తిగా వీడలేదు. ఎవరో ఆమె తలుపు తట్టారు. తలుపు తీయగానే ఓ పోలీసు "బచన్‌సింగు మీకు వుత్తరం పంపిం చాడని" చెప్తూ ఆమె చేతిలో పెట్టాడు. అతను వెళ్ళగానే తలుపువేసుకొని వుత్తరం విప్పింది సుందరి.

సుందరీ,

నేను స్వప్నంలో కూడ ఊహించని విపత్తు జరిగిపోయింది. హృదయంలో ఆరని కోరికలూ వాంఛలపై వడగండ్లవాన కురిసింది. నేను అరెస్టు అయినందువల్ల నీపరిస్థితి ఎలావుంటుందో వూహించుకోగలను. ఎంతో కష్టంమీద నాకో మణి దొరికింది. దాన్ని జాగ్రత్తగా పదిలంచేసుకుంటూ నా కంఠసీమన అలంకరించుకొందామనుకున్నా. ఎంతో వ్యయ ప్రయాసలతో దొరికిన ఆ మణి నేడు మట్టిలో దుమ్ముకొట్టుకుంటూ పడివుంది. దానికి పట్టిన దుస్థితి చూసి నా హృదయం తరుక్కుపోతోంది. నాలో కుంపటి రగులు తోంది. ప్రపంచం! ఈ మూర్ఖ ప్రపంచ దృష్టిలో ఆ మణి విలువ గవ్వకన్నా తక్కువ.

సుందరీ నిన్ను ఒక్కసారి సుఖపెట్టివుంటే ఎంతబావుండేది. కాని నేను అందుకు నోచుకోలేదు. నేనో అదృష్టహీనుణ్ణి. నాలాంటి అభాగ్యుని నొసట అంత మహద్భా గ్యం ధాయలేదు. సుందరీ, ఆనాడు నువ్వు వుత్తరంలో రాసిన ఆ మాటలు చూసి హేళనగా నవ్వాను. కాని ఈనాడు అవి అక్షరాలా నిజమయ్యాయి. "పుష్పం — మలయ

మారుతం " గురించి నువ్వు చెప్పిన వేదాంతం చాలా నిగూఢమైంది. ఈరోజు గాని దాన్ని అర్థంచేసుకోలేకపోయాను.

మనం శాశ్వతంగా విడిపోతున్నామని మనసు అంటోంది. మనం ఇంతవరకూ అనుభవించిన సౌఖ్యమే మనకు రాసిపెట్టివుందని అంతర్వాణి చెప్తోంది. ఒక్కసారిగా మూడు హత్యలు చేశానని నామీద పెట్టిన కేసు మామూలు కేసుకాదు సుందరీ. దీన్లోంచి బయట పడతానన్న ఆశలేదు. గ్రామస్తులు ఏవిధంగా దీనికి చిలవలూ పలవలూ జోడిస్తున్నారో, వారింకా ఏవేమి చేయదలచుకున్నారో చూస్తోంటే మన యిద్దరి సహచర్యం విధాత యింత వరకే రాసిపెట్టాడేమో ననిపిస్తోంది.

కాని సుందరీ, ఒక్కమాట విన్నవిస్తున్నాను. నా నిజాయితీలో నీకు నమ్మకముందా ? లేక నేను హంతకుణ్ణని నీ మనస్సు కూడా చెప్తూందా ? నేను హంతకుణ్ణని లోకం మొత్తం కోడైకూసినాసరే, న్యాయస్థానం కూడా నన్ను దోషిగా ఎంచి ఉరిశిక్ష విధించినాసరే నాకేమీ చింతలేదు. కాని నువ్వు కూడా నన్ను హంతకుడిగా భావిస్తే నాకు ప్రళయమేగతి.

ఎక్కువగా రాయడానికి అవకాశంలేదు. ఈ వుత్తరం నీ వద్దకు పంపడానికూడా చాలా కష్ట పడాల్సివచ్చింది. ఈ వుత్తరం తెచ్చినవ్యక్తే మళ్లీ నీదగ్గరకొస్తాడు. వుత్తరానికి జవాబురాసి పంపించు. ఈ విషయం ఎవరికి తెలియకూడదు. తెలిస్తే అతని గౌరవనికి వుద్యోగానికే ముప్పురావచ్చు. దీనితోనే జ్ఞానీజీకి కూడా ఓ వుత్తరం రాశాను. ఇప్పుడు వారు హరిద్వార్‌లో వుంటున్నారు. వెంటనేవచ్చి నిన్ను తీసుకు పోతారు. దీవాన్‌పూర్‌లోకాని ఆచుట్టుపక్కల కానీ నువ్వుండడం అంతమంచిదికాదు.

నువ్వు నన్ను కలుసుకోవాలని ప్రయత్నించవద్దు. అలాటి ఆలోచననే నీదరిదాపులకు రానివ్వవద్దు. అదేమనిద్దరికి మంచిది. వుత్తరాలు ఏదోవిధంగా రాస్తుంటాను. వుత్తరాలు చూసే నన్ను కలుసుకున్నట్లు భావించు. నువ్వు కలుసుకోవడానికివస్తే నిన్ను చూడగానే నా మనోధైర్యం సడలిపోతుంది. దుఃఖం కట్టలు తెంచుకుంటుంది. అసలైన చావురాకముందే చనిపోతాను. దీనివల్ల నీకుకూడా ఏ ప్రయోజనమూ కలగదు.

ఈ అగ్నిపరీక్షలో నీ మనస్సు ఎంత దృఢంగా వుంటుందో నేను చూడాలని కోరుకొంటున్నాను. నీధైర్యం గురించి రాస్తున్నానే కాని ఇక్కడ నా మానసిక పరిస్థితి అంతకన్నా అధ్వాన్నంగావుంది. పోలీసు స్టేషన్లో గడియారం ప్రతిగంటకొకసారి ఖంగ్ ఖంగ్‌మంటుంటే నాకేదో కొత్తవిపత్తును కొనితెచ్చి పెడ్తూన్నట్టుగావుంటుంది. మనసు బాధతో గిలగిల్లాడుతుంది. నా మనసు నా స్వాధీనంలోవుండదు,

సుందరీ, ఇక్కడ నా మానసిక స్థితిని ఏమని రాయను ! నీకైతే ధైర్యం చెప్తున్నాను కాని నాకు అదికూడా చెప్పేవారులేరు. సరే ప్రారబ్ధంలో ఏమి రాసివుందో ? జరగవలసింది జరగకమానదు.

నీకు వుత్తరం రాస్తూంటే నీముందు నుంచొని మాట్లాడుతున్నట్లే అనిపిస్తోంది. ఈ సంభాషణవల్ల ఎంతహాయిగావుంది ! ప్రపంచంలోని కష్టాలన్నీ, రాబోయే దుఃఖాలన్నీ క్షణంపాటు దూరమైపోతాయి.

నీ

బచన్‌సింగు.

వుత్తరం చదువుతూండగా సుందరి ముఖం రకరకాలుగ మారింది. ఎన్నోభావాలు ప్రస్ఫుటించాయి. వుత్తరం చివర చదువుతున్నప్పుడు ఆమె ముఖం మరింత వికసించింది. ఆమెకళ్లలో ప్రతిహింస తాండవించింది. నరనరాల్లో ధైర్యం పుంజుకుంది.

వెంటనే కలం సిరాబుడ్డీ తీసుకొని వుత్తరానికి సమాధానం రాయడం ప్రారంభించింది. నాజీవిత సర్వస్వం అయిన బచన్‌గారికి —

వుత్తరం చదివాను. తమరు అంతతొందరగా గాభరాపడి పోయారు. మీరు మగవారు. నిర్దోషులైవుండీ ఎందుకలా గాభరా పడ్తారు ? ఎందుకాభయం ? దేన్నిచూసి ?

మీరు చాలా అమాయకులు. మళ్ళీ ఆ ప్రసంగం ఎత్తకండి? మిమ్మల్ని కలుసుకోకముందు నా హృదయం పూలరేకులాగ మృదువుగా వుండేది. తాత చనిపోయిన తర్వాత మీ మీద సంఘం రోజు రోజుకు చేస్తూన్న అత్యాచారాల్ని చూసినప్పటి నుండి నా మనసు పాషాణమైపోయింది. మీ వుత్తరం చదివిన తర్వాత అది ఉక్కులా మరీ మోటు దేరిపోయింది.

ఈ ప్రపంచం నన్ను చిల్లిగవ్వతో సమానంగా చూస్తే నేను స్వార్థపూరితమైన ఆ ప్రపంచాన్ని గుడ్డి గవ్వకన్న హీనంగా చూస్తాను. మీరు నన్ను సుఖపెట్టలేకపోయారా? అక్కడే మీరు పొరపడుతున్నారు. మీరు నాకిచ్చిన సుఖాన్ని నేనొక్కదాన్నే అనుభవించాను. "పుష్పం - మలయమారుతం" గురించి నేను మీకు వేదాంతం రాసినప్పుడు ప్రేమ అంటే ఏమిటో నాకు తెలియదు. కాని ఇప్పుడు దాని గొప్పతనం తెలుసుకోడమే కాకుండా నా జీవితానికి పట్టుకొమ్మగా చేసుకొన్నాను. అందుకే అప్పటి నా వేదాంతం ఇప్పుడు మెట్ట వేదాంతంగానూ, అనుభవశూన్యంగానూ కనపడుతోంది.

మొదటి నా ప్రేమ మీ శరీరానికి మాత్రమే పరిమితమైవుండేదీ. దానివల్ల చాలా అపాయాలు వుండేవి. కాని నేను ఇప్పుడు మీ ఆత్మను ప్రేమిస్తున్నాను. దానిలో

ఏ అపాయమూలేదు. ప్రళయం వచ్చినా నన్ను మీ నుంచి ఎవరూ వేరుచేయలేరని నాకు తెలుసు.

మృత్యువాత పడుతున్నానని భయపడుతున్నారు కదూ! ప్రాపంచిక భాషలో "మృత్యువు"గా మనం అర్థం చేసుకున్నది నిజానికి ఈ జీవితం పరిసమాప్తి అయ్యే స్థితికాదు. అది మానవుని అనంత జీవనయానంలో ఓ మజిలీమాత్రమే. ఈ మజిలీ అంటే మీరు ఖాతరన్నా చేయకుండా వుండాలి. లేదా అది వుందని మీకు తెలియక పోవడం అన్నా జరగాలి. ఏమజిలీకి చేరి మనం ఇద్దరం ఏకాత్మగా అయిపోతామో, ఎక్కడకు చేరింతర్వాత ప్రపంచం తన ఈర్ష్యా దృష్టిని మన మీద సారించి మనకు విఘ్నాలు కల్పించలేదో, ఎక్కడ యధేచ్ఛగానూ, నిర్విఘ్నంగానూ, దాంపత్య సామ్రాజ్యం ఏలడానికి మనకు సింహాసనం లభిస్తుందో అక్కడకు చేరిం తర్వాత మనం శాశ్వతంగా కౌగిలిలో కరగిపోదాం. త్రిమూర్తులుకూడా విడదీయలేని బిగికౌగిలి అది. దాన్ని మీరు మృత్యువంటున్నారా? ఇది చాలా అన్యాయమండీ. ఘోరమైన అన్యాయం.

మనం శాశ్వతంగా దూరమై పోతున్నామని అనుకొంటున్నారా? ఎన్నటికీకాదు. మనం దగ్గరకే వస్తున్నామని నా మనసు చెపుతోంది.

మీ నిజాయితీపై నాకెలాంటి సందేహమూలేదు. అలా సందేహించడం అసంభవం. మీరు నిర్దోషులని తెలుసు, అసలు హంతకుడు ఎవరో కూడా నాకు తెలుసు. కాని ఎవరి దగ్గర చెప్పుకోను. నా గోడు వినేవారెవరు? నామాట ఎవరు నమ్ముతారు?

వాళ్ళిద్దర్నీ అన్వరే చంపి తాను ఆత్మహత్య చేసుకొందని నాకు గట్టి నమ్మకం. నేనామెతో మాట్లాడివచ్చిన తర్వాత అన్వరే వాళ్ళిద్దర్నీ పిలవనంపించి వుంటుంది. వాళ్ల రాగానే ఈపని చేసి వుంటుంది. కాని ఈ సత్యాన్ని న్యాయస్థానంలో ఎలా ఋజువు పరచడం? మీరు జ్ఞానీజీని రమ్మనమని కబురంపారు. మంచిదే. కాని మిమ్మల్ని మృత్యువుకు అప్పగించి నేను హరిద్వారం వెళ్ళడం అసంభవం. మిమ్మల్ని కాపాడ్డానికి నేనేమీ చేయలేనా? నావంటి అనాధ, అబల ఏమీ చేయలేదని నాకు తెలుసు. కాని మీరు వదలి వెళ్ళిన సంఘ సంస్కరణ కార్యక్రమాన్ని పూర్తిచేయకుండా ఎలా వెళ్ళడం? ఏమీ చేయలేకపోతే నా కలానికే పదును పెడ్తాను. దేశాన్ని సంస్కరణలనే వరదతో ఎత్తి ముంచేస్తాను. సంఘంలో వుండే ఈ కుళ్లూ, దుర్గంధం ఆవరదలో కొట్టుకపోవాలి.

కాని మీ హృదయం ఇంత బలహీనమైనదన్న ఆలోచన నాకెప్పుడూ రాలేదు. నేను మీకు బోధించగలిగింది ఒక్కటే. మనసును చిక్కబట్టుకోండి. భయాన్ని మీ దరి దాపులకు రానీయకండి. మిమ్మల్ని కలుసుకోడానికి రేపట్నుంచే ప్రయత్నిస్తాను. తమరు

కలవడానికి అభ్యంతరం చెప్పారు. కాని ఒక్కసారైనా మిమ్మల్ని చూడాలనే బలీయమైన వాంఛను తీర్చుకోనివ్వండి. నన్ను క్షమించండి.

అగ్ని పరీక్షను ధైర్యంగా ఎదుర్కోమని నాకు వుపదేశం చేస్తున్నారు. మీరు నా గురించి నిశ్చింతగా వుండండి. ఈ ఉపదేశాన్ని మీరు మీకే ఇచ్చుకోండి.

మీరు నన్ను నిజంగా సుఖపెట్టాలని అనుకొంటూవుంటే దానికి ఒకే ఒక్క ఉపాయం వుంది. అది మీరు మంచి నిబ్బరంతో మనోధైర్యంతో ఈ విపత్తును ఎదుర్కోడమే.

నేను ఏప్పటికీ మీదాననే.

మీ

సుందరి.

---

# [ 29 ]

బచన్ అరెస్టు అయిననాటి నుంచి సుందరి చదువు చెప్పడం మానేసింది. తన్ను గురించి పట్టించుకోడం మానేసింది. పొద్దున్నుంచి సాయంత్రం వరకు ఆ ఇంటికీ ఈ ఇంటికీ కాళ్ళు అరిగేలా తిరుగుతోంది. మాసినగుడ్డలు మార్చుకుందామన్న ఆలోచన కూడాలేదు. ఎంత ప్రయత్నించినా బచన్‌ను రక్షించు కోగలనన్న ఆశ అణుమాత్రం కనిపించడం లేదు. బచన్‌సింగు తల్లివైపు నుంచి ఏవో ప్రయత్నాలు సాగుతున్నాయి. ఆమె బంధువర్గం పైకిమాత్రం బచన్‌ను కాపాడాలని అంటున్నారేకాని లోలోపల ఎప్పుడీ ముల్లును పీకివేద్దామా, ఆకాస్తడ్డం తొలగిపోతే వున్న ఆకాస్త ఆస్తీ దిగమింగేద్దామా అని ఆలోచిస్తూన్నారు.

అటు పాలాసింగు కూడా ఎప్పుడు సుందరిని తనదిగా చేసుకుందామా అని సమయం కోసం వేచిచూస్తున్నాడు. అతని పథకంలో కన్పించిన ఇబ్బందులన్నీ ఇంచుమించుగా తొలగిపోయాయి. పాలాసింగు అతితెలివిగా కల్పించినకేసు చక్కగా అల్లుకొనిపోయి అందులోంచి బచన్ బతికిబట్టకట్టే మార్గంలేకుండా చేసింది.

పోలీసువాళ్లు 302 సెక్షను కింద అభియోగాన్ని దాఖలుచేశారు. అన్వర్‌చేత మేజువాణీ ఆపించమని మమ్మల్నీ చాలా బెదిరించాడని సేఠ్ రలారాం, అతని కొడుకూ పోలీసువాళ్ల ముందు స్టేటుమెంటు ఇచ్చారు. మేము ఎంతకీ వినకపోతే "సరే దాన్ని ఆపుచేసేమార్గం తెలుసులే" అంటూ బచన్ వెళ్ళిపోయాడని కూడా చెప్పారు.

ఇక పాలాసింగు సంగతి వేరే చెప్పనక్కర్లేదు. అంతకుముందు ఒకరోజు బచన్ తన్ను కలిశాడనీ, ఒకేసారి ముగ్గుర్ని ఖూనీచేయగల వ్యక్తి ఎవరైన నీ ముఠాలోవుంటే చెప్పు నూరు నూటఏభైరూపాయలు ఇస్తాను అని తన్ను దరియాప్తు చేశాడనీ నువ్వలా చేయించడం తగదు అని నేను హితవు చెప్తే సరే నేనే స్వయంగా చూసుకొంటాలే అంటూవెళ్లిపోయాడనీ ఓ కట్టుకథఅల్లి పోలీసులకు సాక్ష్యంఇచ్చాడు.

పాలాసింగుతోపాటు అతని ముఠావాళ్ళుకూడా బచన్‌కు వ్యతిరేకంగా సాక్ష్యంఇచ్చారు. ఖూనీ జరిగినరాత్రి బచన్ కత్తితీసుకొని అన్వర్ ఇంటిముందు పచార్లు చేస్తూంటే చూశామనీ, ఖూనీ జరిగిన మార్నాడే వుదయాన రక్తంతో తడిసిన గుడ్డలు వుతుకుతూంటేతాను స్వయంగా చూశాననీ, హత్య జరిగినరాత్రి బచన్ అన్వర్ వుంటూన్న పైగదలోకి

ఎక్కుతున్నాడనీ, ఆ సమయంలో మర్నాటి మేజువాణీ కార్యక్రమం గురించి సంప్రతించ డానికి కరమ్‌చందూ, పంతులుగారూ అన్వర్ దగ్గరకొచ్చారనీ ముఠావాళ్లు తలాఓరకంగా సాక్ష్యం ఇచ్చారు. దీనికితోడు ఆవూరి కమ్మరి రక్తంతో తడిసిన కత్తినిచూసి ఇది నా దుకాణంలోంచి కొన్నదేననీ, బచన్‌సింగే తన దగ్గర కొన్నాడనీ సాక్ష్యం ఇచ్చాడు.

కేసుఅంతా బచన్‌సింగుకు వ్యతిరేకంగావుంది. సుందరైతే బచన్‌సింగు తల్లిపెట్టిన ప్లీడరు ముందు తాను అన్వర్‌ను కలుసుకున్న విషయం అక్కడ జరిగిన సంభాషణ అంతా చెప్పాలనుకొంది. కానీ ఈ రహస్యాన్ని బయటపెట్టేముందు దాన్ని బచన్ సింగ్‌కు తెలియజేయడం అవసరంఅని భావించింది.

రెండు మూడురోజులు తీవ్రంగా ప్రయత్నం చేయగా బచన్‌ను కలుసుకోడానికి ఆమెకు అనుమతి లభించింది.

---

# [30]

జైల్లో చీకటికొట్లో బచన్ బంధింపబడ్డాడు. ఏ పోలీసు ద్వారా సుందరికి వుత్తరం పంపి ఆమె నుండి మళ్ళీ జవాబు తెప్పించుకోగల్గాడో అతని సహాయంతోనే ఈ రోజు సుందరి అతన్ని చూడబోతోంది.

సాయంత్రం ఐదుగంటలవేళ కలుసుకోవాల్సిన ఖైదీలను బయటి కటకటా లున్న వరాండాలోకి తీసుకొచ్చారు. వాళ్లలో బచన్ కూడా వున్నాడు. కటకటాల్లోంచి బయటికి చూస్తూ బచన్ నిలబడ్డాడు. అతను సుందరి రాకకోసం నిరీక్షిస్తున్నాడు. దూరంగా సుందరి తనవైపువస్తూన్నట్లుగా కనబడింది. సుందరి వాలకాన్ని చూడలేకపోయాడు. ఆమె శరీరంలో రక్తంవున్నట్లేలేదు. నడుస్తూంటే కాళ్లుతడబడుతున్నాయి. ఎక్కడపడిపోతుందో అనిపిస్తోంది. జీవచ్ఛవంలావుంది. సుందరి మిగతా ఖైదీలను వెతుక్కోకుండానే అతని దగ్గరకు రాగలిగింది.

"సుందరీ, ఏమిటిలావున్నావ్? నాకు ధైర్యంచెప్పి నువ్వే బెంబేలు పడిపోయావు" ఇనుపచువ్వల్లోంచి చేతిని పోనిచ్చి సుందరి జబ్బపట్టుకుని వూపుతూ బచన్ అన్నాడు. కాని సుందరి పలకలేదు. తానే ఎంతో ధైర్యంగా నిబ్బరంగా వున్నట్లూ ఇన్నాళ్ళనుంచి అనుకుంది. కాని తీరా బచన్ సమక్షంలోకి రాగానే ఇన్నాళ్లనుండి దిగమింగిన కన్నీరు ఒక్కసారిగా జలజలాకారిపోవడం మొదలెట్టింది.

"సుందరీ, మనకు కలుసుకోవడానికి ఇచ్చిన వ్యవధి తక్కువ" సుందరిని వూరడిస్తూ అన్నాడు బచన్. తాను కాలాన్ని వృధాపరుస్తున్నట్లు గ్రహించింది ఆమె. కళ్లు తుడుచుకొంటూ "నేను కాలాన్ని చాలా పాడుచేశాను కదూ" అంది.

"లేదులే. ఐదునిమిషాలే గడిచింది. ఇంకా ఇరవై అయిదు నిమిషాలు వుంది. అందుకనే మనం కలుసుకున్నందువల్ల ఏమీ ప్రయోజనం వుండదని నీకు రాసిపంపాను". జీరవచ్చిన గొంతు సవరించుకుంటూ బచన్ అన్నాడు.

"ఏం చేయమంటారు? ఒక ముఖ్యమైన విషయం మీతో చెప్పాలని రావలసి వచ్చింది" నిట్టూర్పు విడుస్తూ సుందరి సంజాయిషీ చెప్పుకొంది.

"ఏమిటో ముఖ్యమైన పని?"

"నేను వాస్తవాన్ని మీ దగ్గిర దాచాను. మిమ్మల్ని మోసం చేశాను."

"అంటే!?"

ఆ రాత్రి జరిగిన వృత్తాంతమంతా సుందరి పూసగుచ్చినట్లు బచన్‌కు చెప్పింది. ఆమె మాటలు విని బచన్ ఆశ్చర్యపోయాడు. తన్ను ఇరికించడానికే పాలాసింగూ అతని ముఠా ఖూనీలు చేశారనీ, ఇదంతా వాళ్ల కుట్రేననీ ఇన్నాళ్ల నుంచీ బచన్ అనుకోంటూ వచ్చాడు. కాని తనను ఇరికించడమో అన్వర్ నగల్ని దోచుకోవడమో పాలాసింగు వుద్దేశ్యమైతే కరమ్ చందునూ, పంతులుగార్నీ ఎందుకు ఖూనీ చేయవలసివచ్చిందన్న సందేహం అతనికి అప్పుడే కలిగింది. అన్వర్‌ను ఖూనీ చేసింతర్వాత వీళ్లిద్దరూ అక్కడకు వచ్చి వుంటారు. తన నేరం ఎక్కడ బయటపెడ్తారేమోనని వాళ్లను కూడా హత్యచేసి వుంటాడు అని బచన్ సమాధాన పరుచుకొన్నాడు.

కాని ఈరోజు వాళ్లిద్దరినీ అన్వరే హత్యచేసి తను ఆత్మహత్య చేసుకొందన్న యథార్థం తెలిసి కంపించిపోయాడు. అన్నిటికన్న మించిన ఘోరం సుందరి తల్లి అన్వర్ ఇంత భయంకరమైన చావుచావడం. చాలాసేపటివరకు అతని నోటి నుండి మాటరాలేదు. తను వేశ్య కూతురని తెలిసి అతను మౌనంగా వుండి పోయాడేమోనని సుందరి భావించి దించిన తల ఎత్తలేకపోయింది.

సుందరి మనో భావాన్ని గ్రహించిన బచన్ ఆ ప్రసంగం మళ్లీ ప్రస్తావించ తలచు కోలేదు. "ఐందేదో అయిపోయింది. కాని వ్యవహారం మొత్తం విచిత్రంగా తయారైంది. జ్ఞానీజీ ఇంకా రాలేదా ?" అని ప్రశ్నించాడు సుందరిని.

"లేదండీ. సాయంకాలానికి రావచ్చు"

"అయితే రేపు ఉదయం బండికి వారితో వెళ్తావుకదూ ?"

"లేదండి. నేనప్పుడే వెళ్లలేను"

"ఏం ?"

"న్యాయస్థానంలో నేను వాస్తవాన్ని చెప్పాలి"

"ఏమని ?"

"నే నిప్పుడు మీకు విన్పించినదే. దీనివల్ల మీరు నిర్దోషులుగా ఋజువవుతుంది."

"నీ మాటలు ఎవరు నమ్ముతారు ? అన్వర్ తానే హత్యచేసినట్లు ఏదైనా చీటీగానీ వుత్తరంగానీ రాసివుంటే, కనీసం పోలీసువాళ్ల ముందు ఏదైనా స్టేటుమెంటు ఇచ్చి వుంటే నన్ను కాపాడ్డానికి అవకాశం వుండేదేమో. అలాంటిదేదీ లేనప్పుడు నువ్వు

కేవలం యీ విషయం చెప్పినంతమాత్రాన ఎవరూ ఆలకించరు. నువ్వు నవ్వులపాలు కావడం మినహా వేరే ప్రయోజనం లేదు."

"అయితే కానీండి. సుందరి ఒక వేశ్య కూతురని నవ్వుతారు. నవ్వనీండి. వందసార్లు అంటారు. వెయ్యిసార్లు అంటారు. అననివ్వండి. నాకేం ఫర్వాలేదు" ఆవేశంతో సుందరి అంది.

"వద్దు సుందరీ. ఈ రహస్యం తెలిసిపోవడం నేను సహించలేను. నేనంటే నీకు నిజంగా ప్రేమవుంటే దయచేసి ఆ రహస్యాన్ని రహస్యంగానే వుండనివ్వు. పైగా వ్యాయస్థానం నువ్వు చెప్పినదానిని ఒప్పుకోదు. దాన్ని ధృవపర్చడానికి నీ వద్ద ఏ సాక్ష్యాధారమూ లేదుకదా" అన్నాడు బచన్. అంతలోకే మళ్ళీ "అన్వర్ ఏమీ రాసిపోకుండా ఎందుకు ఆత్మహత్య చేసుకొందో నా కర్థం అవడంలేదు సుమా" అన్నాడు.

"అలా చేస్తే నా ప్రసక్తి కూడా తీసుకరావలసి వచ్చేది. అందువల్లనే ఏమీ రాసిపోలేదు గాబోలు. సుందరి తన కూతురని పదిమందికి తెలియడం ఆమెకిష్టం వుండకపోవచ్చు. అదీకాక ఆమె చేసిన ఈ నేరాలకు మిమ్మల్ని ..." ఆమె మాట పూర్తికాకుండానే గొంతు బొంగురుపోయి ఆగిపోయింది.

ఆ రెండు హృదయాలూ ఇంతే మాట్లాడుకోగలిగాయి. ఇద్దరిమధ్య చెప్పుకోవాల్సిన గాధలు ఇంకా చాలా వుండిపోయాయి. కాని సమయమైపోయింది. గంటకొట్టేశారు. ఖైదీలందరూ తమతమ గదుల్లోకి వెళ్ళిపోయారు. బచన్‌సింగు ముందు తాను విప్పుదామనుకొన్న దుఃఖాల మూటలు అలాగే మూతపడి వుండిపోయాయి. బచన్ తన్ని ఒదిలి లోపలికి పోతూంటే ఆమె కళ్ళముందు చీకటి వ్యాపించసాగింది. బచన్ అక్కణ్ణుంచి ఎప్పుడు వెళ్ళిందీ, వెళ్ళేటప్పుడు అతను చివరిసారిగా అన్నమాటలు ఏమీ ఆమె గమనించనేలేదు.

# [ 31 ]

సుందరి మనస్సంతా నిరాశా నిస్పృహలతో నిండిపోయింది. ఆమెకు ప్రపంచమంతా నిరాశామయంగా కన్పించసాగింది.

జ్ఞానీజీ కూడా మర్నాడు వచ్చేసారు. అమృత్‌సర్ కోర్టులో కేసు నడుస్తూన్న కారణంగా జ్ఞానీజీ సుందరీ అమృతసర్‌కు వెళ్ళి అక్కడే వున్నారు. ఇంక యిప్పుడు సుందరి రవాణీ గ్రామంలో వుండడం అనవసరం. అపాయకరం కూడా.

బచన్ కేసును క్రిందికోర్టువారు విచారిస్తున్నారు. తీర్పు ఎలా వుంటుందో అందరికీ తెలుసు. పరిస్థితుల ప్రభావం వల్ల బచన్‌ను తప్పించడానికి వీలులేనిదిగా ఆకేసు తయారయింది. మేజువాణీని వ్యతిరేకిస్తూ అతను కొద్దిరోజుల ముందు నుంచీ తిరిగిన తిరుగుడే అతణ్ణి హంతకునిగా నిరూపించడానికి ప్రబలమైన ఆధారంగా మారింది. అదీకాక హత్య జరిగిన రాత్రి అతను అన్వర్ ఇంటిబయట తారట్లాడుతున్న విషయం గూడా ధృవపడింది. ఈ ఒక్క విషయమే నూరు సాక్ష్యాలకు సమానంగా పరిగణించ బడింది. దీనికితోడు పాలాసింగూ అతని మిత్రులూ, వాళ్ల పోగుచేసిన సాక్షులూ - వీళ్ళందరూ కలిసి కేసులో వున్న ఆకాస్త వెలితీ లేకుండా చేశారు.

అసలు ఆ హత్యలు ఎలా జరిగాయంటే... ఆరోజు రాత్రి సుందరి అన్వర్ ఇంటి నుంచి వెళ్ళిపోగానే అన్వర్ ఓ వాద్యగాణ్ణి పంపి కరమ్‌చంద్‌నీ, పంతులుగార్నీ రమ్మన మని కబురంపింది. స్వయంగా అన్వరే తమను పిలవనంపడం మహాద్భాగ్యంగా భావించారు వాళ్లు. సంతోషంతో ఉబ్బితబ్బిబ్బై వెంటనే ఆమె యింటివైపు పరుగెత్తారు. అన్వర్ వాళ్లను ఖూనీచేసే ముందు వాళ్లముందు ఎంతో ప్రేమను ఒలకబోసి నాటకం ఆడింది. అసలే వాళ్ళిద్దరూ సారాతాగి తూలుతూంటే వాళ్ళకి పీకలమొయ్యా పట్టించింది అన్వర్. పూర్తిగా నిషా ఎక్కి మైకంలో పడిపోగానే బొడ్లోంచి కత్తితీసి చెరొక పోటూ పొడిచి ఇద్దర్నీ అంతంచేసి తానూ ఆ కత్తితోనే ఆత్మహత్య చేసుకొంది.

ఉదయం అన్వర్ పనిమనిషి లోపలికి రాగానే ఆభీకరదృశ్యం చూసి పెద్దగా కేక పెట్టింది. ఆమె కేకకు అదిరిపడి చుట్టుపక్కలవాళ్లు పోగయ్యారు. చూస్తుండగానే అక్కడ పెద్ద గుంపు చేరిపోయింది. గదంతా రక్తంమడుగు కట్టింది. ఆ మడుగులో మూడు శవాలు పడివున్నాయి.

ఈ వార్త అనోటా అనోటా పాకి పాలాసింగూ అతని మిత్రులకూ తెలిసింది. వాళ్ల ఆనందానికి మేరలేకుండా పోయింది. వెంటనే పోలీసు స్టేషన్‌కు వెళ్ళి రిపోర్టుఇచ్చారు. బచన్ ఈ మూడు ఖూనీలు చేశాడని నాటకంఆడి ఆ నాటకానికి బచన్నే నాయకుడ్ని చేశారు.

ఖూనీలు ఎప్పుడు జరిగిందీ ఎవరుచేసిందీ ఈ రహస్యం సుందరికితప్ప ఎవ్వరికీ తెలీదు. కాని నూటికి తొంభైతొమ్మిది మందికి బచన్‌సింగుపైనే అనుమానం. అను మానం ఎందుకు...? అన్వర్ని సంస్కరించలేక పోయాననే ఉద్రేకంలో ఖూనీచేశాడు. కాని మిగతా ఇద్దరిని ఎందుకు...? వాళ్ళతో అతనికి పరిచయం లేదు. శత్రుత్వం అంతకన్నా లేదు. ఎందుకు ఖూనీచేసినట్టు? కాని దానికి సమాధానంగా కొంతమంది సాక్షులు చెప్పిన కథనం సరిపోయింది. మర్నాడు అవబోయే మేజువాణీ ఏర్పాట్ల గురించి కరమ్‌చందూ రాధాకృష్ణ పంతులూ ఇద్దరూ అన్వర్‌తో సంప్రతించడానికని వెళ్ళారు. అప్పటికే అన్వర్ని ఖూనీచేసి బచన్ తిరిగి వస్తున్నాడు. అతని చేతిలో నెత్తురుతో తడిసిన కత్తిని వాళ్ళిద్దరూ చూశారు. అంతే, రహస్యం ఎక్కడ బయటపెడ్తారో అని బచన్ అదే కత్తితో వాళ్ళిద్దర్నికూడా చంపేశాడు. సాక్ష్యం సరిగ్గా అతికింది. అందుకని బచనే నేరస్థుడని అందరికీ గట్టిగా నమ్మకం కలిగింది. అటు సదాకౌర్ దుఃఖంలో మంచానికి అతుక్కుపోయింది. ఇకసుందరి పరిస్థితి ఒకకాలు కోర్టులోనూ మరోకాలు ప్లీడరుగారి ఇంట్లోనూ - ఇలా రెంటికీ మధ్య ఊగిస లాడుతోంది.

సుందరి ప్లీడరు ఆమెను డిఫెన్సులో సాక్ష్యానికి తీసుకొన్నాడు. బచన్‌సింగు కేసు విచారణకు వచ్చింది. సుందరి సాక్ష్యం చెప్పింది. ఆమె మొదటినుంచీ చివరిదాకా జరిగిన వృత్తాంతమంతా ఏకరువు పెట్టింది. కాని ఏంలాభం? ఆమెచెప్పే కథకూ హత్యకూ లంగరు కుదర్లేదు. ఏ మాత్రం అతకనే అతకలేదు. అన్వర్ ఎవరు? పంతులూ, కరమ్‌చంద్ ఎటువంటివాళ్లు? వాళ్ల ప్రవర్తన ఎలాంటిది? ఎలాటి పరిస్థితుల్లో అన్వర్ వేశ్యాజీవిం చాల్సివచ్చింది? ఈ ప్రశ్నలన్నిటికీ వివరంగా సుందరి సమాధానాలు చెప్పింది. ఆకార ణాలను వెతికి చూపించడానికి ప్రయత్నంచేసింది. కాని వాటి నిజాయతీ నిరూపించేం దుకు ఆమె వద్ద ఒక్క రుజువుకూడాలేదు. ఈ సంగతుల్లోని నిజాన్ని బయటపెట్ట గలిగిన ముగ్గురూ చనిపోయారు. గుర్దేయాని ఢిల్లీకి మోసగించి తీసుకొచ్చి వేశ్యా లయానికి అమ్మిపోయిన పెద్దమనిషిని కూడా అన్వరే చంపేసినట్టు సుందరి చెప్పింది. మిగిలింది ఒక్కగానొక్కడు - తారాచంద్ - అతను బతికున్నాడా? చనిపోయాడా? బతికున్నంటే ఎక్కడవున్నదీ జాడ తెలియదు.

డిఫెన్సు పక్షం వకీలు నిరాశతో సుందరితో అనేశాడు - "నీ తండ్రి బతికివుంటే మన వాదానికి కొంతబలం వచ్చేది. ఎలాగైనా నువ్వాతణ్ణి వెతికి కనుక్కోగలిగితే బచన్‌ను కాపాడొచ్చు. ఇంకా మించిపోలేదు".

ఇక మిగిలింది హత్య ఎవరు చేశారన్నది? తన తల్లే వాళ్ళిద్దర్నీ చంపి కసితీర్చు కొంటానని తన ఎదుట ప్రతిజ్ఞచేసింది. ఈ విషయం సుందరి కోర్టులో చెప్పింది. కాని కోర్టు నమ్మడానికి ఆధారం...? హత్య జరిగినప్పుడు అక్కడ సుందరిలేదు. అందు వల్ల సుందరి ఇచ్చిన సాక్ష్యం అంతా కల్పితం, అని కోర్టు అభిప్రాయం. కేసు సెషన్సుకు ట్రాన్స్‌ఫరు చేశారు.

సుందరికి ఇన్ని పాట్లుపడిన తర్వాత లాభించింది ఏమిటంటే - మొదట కోతు లాడించే ఎరుకలపిల్ల అనేవాళ్ల ప్రజలు. ఇప్పుడు బోగందాని కూతురు అనడం మొద లెట్టారు.

న్యాయ సూత్రాలు కూడా పేదవాళ్ళను పెద్దవాళ్ళను సమానదృష్టితో చూడవు. పెద్దలకు అవి వూడిగంచేస్తాయి. పేదలకయితే వారిమీద పెత్తనం చెలాయిస్తాయి.

కేసు విచారణ జరిగినంతకాలం జ్ఞానీజీ, సదాకౌర్, సుందరి - ఈ ముగ్గురు బచన్ సింగును అప్పుడప్పుడు కలుసుకోడం జరిగింది. కేసు పూర్వాపరాలు విచారించి సెషన్సు కోర్టువారు బచన్‌కు ఉరిశిక్ష విధించారు. అభాగ్యురాలు సదాకౌర్ ఈ దుర్వార్తవినగానే ఆమెగుండె ఆగిపోయినంత పనైంది. కన్నతీపి చాలా బలవత్తరమైంది. తన ఇంటి దీపం ఆరిపోతోందన్న ఆవేదనతో కోర్టులోనే మూర్ఛపోయింది.

బచన్‌సింగు వారసులు హైకోర్టుకు అపీలు చేశారు. సుందరి ఈ దుర్వార్తవిని ఏమాత్రం చలించలేదు. మరొకప్పుడైతే ఆమె గుండెపగిలి అక్కడే ప్రాణాలు వదిలేది. కాని ప్రతీకారం అనే దావానలం ఆమె గుండెలో మళ్ళీ రాజుకొని భగభగ ప్రజ్వరిల్లు తోంది. అందుకని ఆమె మనసును రాయిచేసుకొంది.

---

# [ 32 ]

అమృత్‌సర్‌లో ఓ చిన్న సందులో ఇల్లు అద్దెకుతీసుకొని జ్ఞానీజీ, సుందరీ వుంటున్నారు.

బచన్‌ను కాపాడ్డానికి వాళ్లు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. సెషన్సు తీర్పుకు విరుద్ధంగా హైకోర్టుకు అపీలు చేసుకొన్నారు. అపీలువల్ల ప్రయోజనం లేదని సుందరికి తెలుసు. కిందకోర్టు తీర్పును ఖాయం చేస్తారని తెలిసికూడా ఆత్మసంతృప్తికోసం చేయాల్సివచ్చిందనీ తెలుసు.

తారాచందు ఆచూకీ తెలుసుకోవాలన్న కోరిక రోజుకురోజూ ఆమెలో బలవత్తర మౌతోంది. కాని అది కూడా గాలిలో సాముచేసినట్లుగానేవుంది. తారాచందు రూపు రేఖల్ని గురించి తల్లిని ఎందుకు అడగలేదా అని పశ్చాత్తాప పడింది. మనిషి ఎలా వుంటాడో తెలియకుండానే వెతకడం ఎలా ? ఆ రోజుల్లో సియాల్‌కోటలో ఏదో ఆఫీసులో పనిచేసేవాడని మాత్రమే అన్వర్ చెప్పింది. అక్కడ ఎంక్వైరీ చేద్దామని ఆమె సియాల్‌కోట వెళ్ళింది. ఎన్ని ఆఫీసులకు వెళ్ళినా ఎన్నిరోజులు తిరిగినా ఏమీ జాడ తెలియలేదు. పద్దెనిమిది, పందొమ్మిది సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలు ఎవరికీ జ్ఞాపకంలేవు. నిరాశచెంది తిరిగి అమృత్‌సర్‌కు వచ్చేసింది.

అయినా సుందరి తారాచందు జాడ తెలుసుకొనే ప్రయత్నాన్ని విరమించలేదు. కొనసాగిస్తూనేవుంది. డబ్బుకూడా సంపాదించాల్సిన అవసరం ఏర్పడింది. మళ్లీ రాయడం మొదలెట్టింది. రాత్రీ పగలూ ఏదోపని చేస్తూండేది. తిండీ తిప్పలూ కట్టూగుడ్డా అన్నీ మరచి పోయింది. హైకోర్టు తీర్పుకోసం ఆమె వేచివుంది. ఎన్నో నెలలు గడిచి పోయాయి. ఈ లోపల ఎన్నో కథలు పత్రికలకు మారుపేరుతో రాసింది. అనతికాలంలోనే ఆమె ఓ పెద్ద రచయిత్రిగా పేరుప్రఖ్యాతులు ఆర్జించుకోగల్గింది.

జ్ఞానీజీ సుందరిని కనిపెట్టి వుండేవారు. ఆధ్యాత్మికమైన వుపదేశాల ద్వారా అశాంతి నిండిన ఆమె హృదయానికి ధైర్యంచెప్తూండేవారు. కాని సుందరి మనస్సు ప్రతీకారాగ్నితో రాజుతుండేది. అయన వుపదేశాలు ఏమీ ప్రభావితంచేయలేక పోయాయి. ఆమె రోజురోజుకూ నీరసించిపోతోంది. కాని ఆమె మనసు మాత్రం రోజురోజుకు గట్టిపడి మరింతదృఢమౌతోంది. ప్రపంచమంటేనే ఆమెకు ఏహ్యభావం కలిగింది. జీవితం మోయలేని బరువుగా తయారైంది.

అలావుండగా ఓ రోజు బచన్‌వద్ద నుండి అకస్మాత్తుగా వుత్తరం వచ్చింది. కవరుపై బచన్ అడ్రసు చూసి ఆమె గుండె వేగిరంగా కొట్టుకోసాగింది. గుండెదడతోనే ఆకవరు చింపిచూసింది. "సుందరీ! అఖరివీడ్కోలు" వుత్తరంలోని మొదటి పంక్తి చదవగానే ఆమెకు తలతిరగడం మొదలెట్టింది. కాస్సేపు ఆగి మళ్లీ వుత్తరంచదవడం ప్రారంభించింది.

"అపీలును హైకోర్టువారు తిరస్కరించారు. అంతిమ యాత్రకు తేదీకూడా నిర్ణయించారు - వచ్చే మంగళవారంనాడు ..."

కంపించిపోతూన్న సుందరి చేతిలోంచి వుత్తరంజారిపోయింది. కాళ్లు చేతులూ ఆడడంలేదు. అయినా పళ్ళు బిగబెట్టి మనస్సును చిక్కబెట్టి వుత్తరం చేతిలోకి తీసుకొంది. జ్ఞానీజీ ఆమెకు చేసిన వుపదేశాలు ఉపకరించాయి.

సుందరీ! నా పరిస్థితి వూహించుకొంటే, అబ్బా! నాలాంటి దుస్థితిలోవున్నవాడే నా ఆవేదనను గ్రహించగలడు. ఈ ప్రపంచం ఎంతక్రూరంగా భయంకరంగా కన్పడుతోంది! మామూలు ఖైదీల మాదిరిగా కాక, చీకటికొట్లో బంధించబడ్డ నేను నిజంగా ఎంతస్వేచ్ఛగా వున్నాను. ఆకాశంలోకి ఎగిరి పోతూన్నాను. పుట్టినప్పటి నుంచి యిప్పటివరకు ఒకదాని తర్వాత ఒకటి వరుసగా నా జీవితంలోని ప్రతిఘట్టమూ నా కళ్ళ ముందు తిరుగుతోంది.

జైలు సూపర్నెంటు నాగదికొచ్చి "ఉరిశిక్ష" విధించారనే ఆర్డరు చదివి వినిపిస్తూంటే నా ప్రపంచమే మారిపోయింది. నాలుగక్షరాల ఒక్కమాటలో నిజంగా ఎంతశక్తి వుందీ? ఈ గది గోడలు, ఇనుపచువ్వలతలుపులూ, ఈ నేల, ఈ గవాక్షం అన్నీ ఆనాలుగక్షరాల మాటనే ప్రతిధ్వనించాయి. గదిబయట సెంట్రీ భుజంమీద తుపాకి పెట్టుకొని పచార్లు చేస్తూఏదో నసుగుతున్నాడు. అతను కూడా నా మరణ శిక్షనే రాగంగా పాడుతున్నట్టు తోచింది. ఎదురుగా మల్బరీ చెట్టుమీద కాకులు కావ్‌కావ్‌మని అరుస్తున్నా అవి నా గురించే అంటున్నాయా అనిపించింది.

నేను ఆపాదమస్తకం కంపించిపోతున్నాను. నిజంగా నాకు వణుకులేదు. నా అవయవాలు వణకడంలేదు. కాని నేను వణుకుతూన్నట్లు నా హృదయం, నా మేధస్సు నాలో రేగుతూన్న ప్రతి ఆలోచనా, ప్రతివస్తువూ కంపించిపోతున్నట్లుగా అనిపించింది. ఈ నేల, ఈ పైకప్పు, ఈ ఎదురుగా కన్పించేనడవా, ఆ అవతలిచెట్టు అన్నీ వణికిపోతున్నట్లుగా వున్నాయి.

చాలాసేపు అలావున్నాను. తర్వాత మరోదృశ్యం. ఈసారి నాముందు ఒక స్త్రీ రూపం నిల్చుంది. అవపూవులాంటి పచ్చని శరీరం ఆమెది. డాక్టరు డిస్పెన్సరీలో

పెద్దే ఎముకల గూడులావుంది ఆమె. కాని ఎందుకో ఆమె ముఖం కొత్తవెలుగుతో మిలమిలలాడుతోంది. ఆ వెలుగును చూస్తూ నేను కుంగిపోతున్నాను — ఆమెను చూడగానే నాకు పన్నగా మైకం ముంచుకొచ్చింది. ఆమైకంలో నేను ఉరికంబం ఎక్కబోతున్నానన్న విషయం గూడ మరిచిపోయాను. ఆమె ఎవరో నీకు చెప్పనక్కర్లేదనుకొంటాను.

మళ్ళీ ఆబింబం మాయమైంది. నా కళ్ళముందు ఉరితాడు వేలాడుతోంది. దానికి చేరువలోనే ఒక నల్లని దృఢకాయుడు నిలబడివున్నాడు. అతను వేలాడుతూన్న తాడు పట్టుకొని దానికి దట్టంగా నూనెపట్టించాడు. మళ్ళీ సంచిలోంచి ఏదో వస్తువుతీసి తాడుకు పూస్తున్నాడు. దాన్ని నిర్దాక్షిణ్యంగా మెలేస్తున్నాడు. అదృశ్యం చూడగానే నేను పూర్వం మాదిరిగా కంపించసాగాను. ఏవేవో ఆలోచనల్లో మనసు మునకలు వేయడం ప్రారంభించింది. "మిత్రమా. కొంచెం నిదానించు. అంత తొందరవద్దు. చాలా పనులు పూర్తి కాకుండా మిగిలివున్నాయి, వాటిని పూర్తిచేయనియ్. ఎక్కువ ఆలశ్యం చేయన్లే. ఇదుగో... ఇప్పుడే..." అంటూ గాభరాగా అతనికి చెప్తున్నాను. కాని అతను నన్ను తొందర పెడుతున్నాడు. వెంటనే రమ్మనమని పిలుస్తున్నాడు— "నా పని ముగించుకొని వెళ్ళాలని తొందర నాకు, నీ పని పూర్తిచేసుకోవాలని తొందర నీకు" అంటూ ఉరితాడుకు మళ్ళీ ఏదో పూయడం మొదలెట్టాడు.

రెండు ఒళ్ళనిండుకూవున్న సామాన్ను రైల్లోకి ఎక్కించి తానూ రైలెక్కాలని అనుకొంటూండగానే గార్డు పచ్చజెండా చూసి రైలుకూతవేస్తూ కదలిపోతే, ఖంగారుపడిపోతూ ఏమీ చేసేది లేక నిరాశపడిన ప్రయాణీకునిలా వున్నాను నేను.

మువ్వింతకు ముందు రాసిన ఓ వుత్తరంలో మృత్యువును తెగపొగిడేసినట్లు జ్ఞాపకం. నీపొగడ్త చదివి నేనుచాలా ప్రభావితుణ్ణి అయ్యాను. నేనూ నీధోరణిలోనే ఆలోచించడం మొదలెట్టాను. కాని ఆరోజు —"ఉరిశిక్ష" విధించారన్న ఆర్డరు జెయిలర్ చదివి వినిపించగానే నీ వుపదేశాలన్నీ కర్పూరంలా కరగిపోయాయి. నా మృత్యువు నేను వూహించిన దానికన్న, నేనింతకుముందు ఆలోచిస్తూవున్న దానికన్న వేయిరెట్లు భయంకరంగా కనిపించసాగింది.

అందుకే నువ్వు నన్ను కలుసుకోడానికి ప్రయత్నించవద్దని నీతో మొదటే మనవి చేసుకున్నాను. నువ్వు వచ్చి కలుస్తే లోలోపల దిగమింగుకొన్న దుఃఖం అంతా బైటికి పొర్లిపోతుంది. అణచుకున్న ఆవేదనంతా పొంగుతుంది. పాతవుండు మళ్ళీరేగి బాధ రెట్టింపవుతుంది. కాని ఇప్పుడలాకాదు. నా మానసిక రుగ్మత నిన్ను చూస్తేకాని

తొలగిపోదు. ఉరికంబం ఎక్కేముందు ఒక్కసారి నిన్ను చూడాలనివుంది. నిన్నుచూసి, ప్రశాంతంగా సంతోషంగా — చనిపోతాను.

సుందరీ. ఎవరు ఈమాటలన్నీ రాస్తున్నారు? ఈ భావాలనే అలగలు ఎక్కణ్ణుంచి లేస్తున్నాయి? నా పుర్రెలో ఎవరు పద్మాసనం వేసుకొని ఈభావసర్పాల్ని కలంద్వారా కాగితంమీద చక్కదిద్దుతున్నాడు? నాల్గుగజాల తాడుముక్క ఓ మనిషి రెండు జీవితాన్నే అంతంచేస్తుంది. కళ్ళల్లో కారే ఈ కన్నీటి కాల్వలు ఒక్కగుంజుకే ఎండిపోయి పోతాయి? కరెంటుకన్న వేగంగా రాసే ఈచేరులు ఇంక ఆరురోజుల్లో ఎందుకపనికిరాక పోతాయి? నా మనఃమందిరంలో ప్రతిష్ఠించుకొని రోజూ ప్రేమ పుష్పాలు అర్పించు కొంటూ కొలుస్తూన్న నా ఇష్ట దేవత బోసిపోతుంది.

సుందరీ. నేనెంత అమాయకుణ్ణి! ఇంట్లో నిప్పు అంటుకొంటే పురిసెడు నీళ్ళతో దాన్ని ఆర్పాలని ప్రయత్నిస్తున్నాను.

దుఃఖపూరితమైన యీ వెతలతో నా గుండె బరువెక్కిపోయింది. నేనీ బరువును మోయలేక పోతున్నాను. నిజంగా దప్పికగొన్న వాడికి దప్పిక తీరదుకదా. మనిద్దరికి యింతే రాసిపెట్టాడు విధాత. కాదు. ఎన్నటికీ కాదు. నీతో నా అనుబంధం ఏ ఒక్క రోజుదీకాదు, తెగిపోవడానికి. జన్మజన్మలకూ ఇది చెక్కుచెదరకుండా పవిత్రంగా వుంటుంది.

చూడు సుందరీ, నీ వుత్తరాన్ని అప్పుడు నేను అర్థంచేసుకోలేకపోయాను. ఇప్పు డిప్పుడూ అర్థం అవుతూవుంది. నేను చనిపోయిన తర్వాత నువ్వు కూడ జీవించతలచుకోలేదు. అంతేనా? ఎన్నటికీ అలాచేయొద్దు. అలాచేయడమే తప్పనిసరిగా నువ్వు భావిస్తే దయచేసి నా యీ ఒక్క ప్రార్థనా ఆలకించు. ఒక అస్తురాలి బాధ్యత నీభుజ స్కంధాలపై పెడుతున్నాను. నిరాశ్రితురాలైన నా తల్లి చావూ బ్రతుకుల మధ్య వూగిస లాడుతోన్న నాప్రియమైన తల్లి - బాధ్యత స్వీకరించు. ఆమె ఘటం తెల్లవారేవరకు నీ సంకల్పాన్ని విరమించు. అప్పటి వరకు నీకు నీజీవితాన్ని బలవంతంగానైనా అంతంచేసు కోడానికి హక్కులేదు. వీడని అనుబంధంతో వేలాది యుగాలు కలిసి జీవించబోతూండగా ఈకొద్దిపాటి వియోగాన్ని సహించలేవా? నేను నీకోసం వేచివుంటాను. నీకు అప్ప గించిన ఈ కార్యభారాన్ని నిర్వహించకుండా నువ్వు నాదగ్గరకు రాలేవు.

సోమవారం బంధువుల్ని మంగళవారం నిన్నూ చూడడానికి ఏర్పాటుచేశారు. మంగళ వారం నువ్వూ, జ్ఞానీజీ ఇక్కడకు వచ్చేయండి. నిన్ను స్వేచ్ఛగా కలుసుకోడానికీ, మనసువిప్పి మాట్లాడుకోడానికీ సూపర్నెంటుగారు దయతో అంగీకరించారు,

సుందరీ, వుత్తరం ముగుస్తోంది. అబ్బ! ఎంత బాధకలుగుతోంది? వుత్తరం ముగియగానే నాకీ ప్రపంచంతోనే పనిలేదన్నట్లు అనిపిస్తోంది.

కాగితం కూడా అయిపోయింది. అక్షరాలు ఇరికించి ఇరికించి ఇంతదూరం రాయగలిగాను "తొందరగా ముగించు, సూపర్నెంటుగారు వచ్చేవేళ అయిందని" జమేదారు యమదూతలా నన్ను తొందరపెడ్తున్నాడు.

నీ సుందర రూపాన్ని మనసులో ముద్రించుకొంటూ వుత్తరాన్ని ముగిస్తున్నా. ఆఖరుసారిగా నా సుందరికి ముద్దులు.

నీ

బచన్‌సింగు.

---

# [ 33 ]

ఉరిశిక్ష విధించినట్టు ఆజ్ఞ జారీ అయిన నాటినుంచి బచన్‌సింగు రాత్రింబవళ్లూ గాలి మేడలుకడ్తూ పడగొడ్తూ కాలక్షేపం చేస్తున్నాడు. వరదనీటిలా అనేకరకాల ఆలోచనలు మనస్సులో సుళ్లుతిరిగి పోతున్నాయి. ఎన్ని ఆలోచనలు ముసిరినా చివరకు రేండే రెండుచోట్ల అవి ఆగిపోయేవి. అవి ఉరికంబం, మృత్యువూ. ఇవ్వాళ అతని జీవితంలో చివరిపేజీ రాయబడుతోంది. అతని హృదయం ఏఉద్రేకంలేకుండా ప్రశాంతంగావుంది. అతనిలోని ఉద్రేకాలూ ఉప్పెనలూ అన్నీ పైకిపొంగి పొంగి చల్లారి పోయినట్లుంది. ఇప్పుడు అతని ముందు ఒకే ఒక దృశ్యంకనబడుతోంది. ఉరికంబం ఎక్కకుండానే తను చచ్చిపోయి వేరే ప్రపంచానికి వెళ్ళి వుంటూన్నట్లుగా అతనికి తోస్తోంది. పక్కనే వున్న బేరక్ దగ్గర రెండు మూడు గానుగలు తిరుగుతూ "కిర్ కిర్" మని శబ్దం చేస్తున్నాయి. వాటిని చూస్తూంటే మొగుడు చనిపోయిన విధవరాలు ఏడుస్తున్నట్లుగావుంది. గదిలో ఓ మూల ఓ మిడత "టిఁ టిఁ" అనిఅరుస్తూంది. చచ్చి పోయిన కొడుకు శవాన్ని ఒళ్లోదాచుకొని అతనితల్లి తలబాదుకొంటూ విలపిస్తున్నట్లుంది. ఎదురుగా వున్న మైదానంలో నాలుగైదు పిట్టలు వరుసతీరి 'తీఁ తీఁ' అనుకుంటూ పోతున్నాయి. వాటిని చూస్తుంటే చావు వాటిని తరిమికొడుతూ న్నట్లుగానూ అవి దాని వాత నుండి తప్పించుకోడానికి అరుస్తూ ఎగుర్తూ పారిపోతునట్లు గానూ అనిపిస్తోంది.

లాహోరు సెంట్రల్‌జైల్లోని చీకటికొట్లో కూర్చున్న బచన్‌కు దురదృష్టం దోచుకున్న అతనితల్లి జ్ఞాపకంవచ్చింది. క్రితంరోజే అతనితల్లి కలుసుకోడానికి వచ్చింది. తల్లి తర్వాత సుందరి జ్ఞాపకం వచ్చింది. సుందరి ఆరోజు రావాల్సి ఉంది. ఇనుప వూచలు బిగించిన ఆవెలుతురు రాని గదిలో అలాగే ఆలోచిస్తూ కూర్చుండి పోయాడు బచన్. "సుందరి ఈ పాటికి రైలుదిగివుంటుంది. టిక్కట్టు కలెక్టరుకు టిక్కటు చూపిస్తూంటే ఆమె సున్నితమైన పచ్చని చేతులు కంపించుతూవుంటాయి. కళ్ళకొనల్లో నీరు నిలచి వుంటుంది. కళ్ల కన్నీటితో తడిసిపోయినందున దారిబాగా కన్పడకపోయిఉంటుంది. ఆమె అడుగులు తడబడుతూంటే పక్కనే నడుస్తూన్న జ్ఞానీజీ ఆమె వీపు తట్టుతూ ధైర్యం చెప్పుతూ వుండొచ్చు. చేయిపట్టుకొని టాంగామీద కూర్చోబెట్టి వుంటాడు. వాళ్ళిద్దరూ ఎక్కగానే టాంగాజైలు వైపుగా పరుగెత్తూతూ వుంటుంది. టాంగా ముందుకు వెళ్తూంటే

వెనుకగా పరిగెత్తిపోతూన్న చెట్లనుచూసి దొర్లిపోయిన కాలం తాలూకు సుఖస్మృతులుగా భావించి "వెళ్ళి పోండి మిత్రుల్లారా... శాశ్వతంగా వెళ్ళిపోండి" అని పిచ్చిగా చేయి వూపుతూ వీడ్కోలుఇస్తూ వుండొచ్చు. టాంగా జైలుగుమ్మానికి ఎదురుగావచ్చి ఆగివుంటుంది. టాంగామండి దిగీదిగడంతో సుందరి దృష్టిజైలుదర్వాజాపై పడివుంటుంది. జరగపోయే ఘోరానికి చిహ్నంగా జైలుదర్వాజా నల్లరంగు పూసుకొని ఆమెకు ఆహ్వానం ఇచ్చివుంటుంది. దర్వాజా వద్ద కాపలాకాస్తూన్న ఎర్రటోపీ ధరించిన సెంట్రీ యమదూతలా కనపడివుంటాడు. భయంకర భవిష్యత్తును సూచిస్తూన్న అవిషాద దృశ్యాన్ని తలుచుకొని ఆమెలోవున్న ఆకొద్ది నిబ్బరం కూడా సడిలిపోయివుంటుంది. గుండెపగిలి ఆమె స్పృహతప్పి..."

అంతలో చీకటిగది బయట బూట్లచప్పుడు విని బచన్ లేచి నిలుచున్నాడు. కటకటాల దగ్గర ఇంగ్లీషు సూపర్నెంటూ, ఓడాక్టరూ, ఇద్దరు ఇనస్పెక్టర్లూ, చాలామంది పోలీసులూ నిలబడ్డారు.

కిర్‌మని తలుపుతెరుచుకొంది. ఉరికంబంమీదకు ఎక్కేవేళఅయిందని తెలుసుకొన్నాడు బచన్. వాళ్ళచేతుల్లో బేడీలు చూచి మాట్లాడకుండా బచన్ తన రెండుచేతులు ముందుకుసాచాడు. బచన్ రెండుచేతుల్నీ అతని వీపువైపుకు విరిచి వాటికిబేడీలు తగిలించారు. ముందు అధికారులు మధ్య బచన్ అతని వెనుక పోలీసులూ గది బయటికి వచ్చి నడవసాగారు.

తను నడుస్తున్నది నేలమీదే అయినా గాలిలో తేలిపోతున్నట్లు అనిపిస్తోంది అతనికి. కాళ్ళకింద నేలజరిగిపోతూన్నట్లువుంది. పుర్రెలోని మెదడూ గుండెలో హృదయంపనిజేయడం మానేశాయి. అన్నీ నిర్జీవంగా మారిపోతున్నాయి. అయినా ఆజీవచ్ఛవాన్ని కదిలిస్తూన్న ఏదో అజ్ఞాతశక్తి అతనిలో పనిచేస్తూనేవుంది. అతనికళ్ళు తేలిపోతున్నాయి. అయినా అవి దేనికోసమో చుట్టూ వెతుకుతున్నాయి. బేడీల్లో బందీ అయిన చేతులూ అప్పుడప్పుడు గొలుసును స్పృశిస్తున్నాయి. ఇవి ప్రాణంలేని ఉక్కుతోచేసినవోకావో తెలుసుకుందామనేమో.

అలా కాస్సేపు నడిచిన తర్వాత బచన్‌సింగు ఓ చోటుకు వచ్చి నిలబడిపోయాడు. ఆస్థలాన్ని అతను అంతకుముందు ఎప్పుడూ చూడలేదు. బహూశా అది అతని జీవితానికి భరతవాక్యం పలికే స్థలంకావచ్చు. ఒక్కసారి ఆస్థలాన్నీ, దాని పరిసరాల్నీ కలయచూశాడు. ఆపాదమస్తకం అతని శరీరం కంపించిపోయింది. కాని ఎంతసేపోకాదు. తాను కొద్దిసేపట్లోనే అతను తన్నుతాను సంభాళించు కున్నాడు. ఇప్పుడు అతనికి ఏమీ కనపడటంలేదు. అంతాచీకటి. కేవలం చీకటి.

అతను చాలాసేపు అక్కడే నిలబడిపోయాడు. చావులాంటి నిశ్శబ్దతను చీల్చుకుంటూ అతని చెవుల్లో ఏవో ధ్వనించింది. "వెల్ మిస్టర్ బచన్‌సింగ్, ఏమైనా చెప్పాల్సింది వుందా ?" అని అతణ్ణి అడుగుతున్నాడు సూపర్నెంటు.

అతను ఏమని సమాధానం ఇచ్చాడు ? అతనే ఇచ్చాడా ? ఇచ్చాడో లేదో అతనికే తెలీదు. సమాధానం ఇచ్చినా ఏమని ఇచ్చాడో అతనికే అర్థంకావడంలేదు.

"సరే, వాళ్లను తీసుకొనిరా" అన్న మాటలు అతని చెవుల్లో మోగాయి. శరీరం లోని ఇంద్రియాలు మళ్ళీ పనిచేయడం మొదలెట్టాయి.

కాస్సేపటిలో అతని వెనుకగా ఎవరిదో ఓ కేక వినిపించింది. ఆస్వరం అతనికి సుపరిచితమే. వెంటనే వెనక్కితిరిగి చూశాడు. జ్ఞానీజీ తన చేతుల్లో సుందరిని అతని వైపుగా తీసుకొస్తున్నాడు. జ్ఞానీజీ కోరినమీదట అధికారి బచన్ చేతులకు తగిలించిన బేడీలు తీశాడు. సుందరి అతని ఎదుటికివచ్చి నిలుచుంది. తను స్పృహతప్పిపోకుండ టానికై ఆమె యావచ్ఛక్తినీ వినియోగిస్తూవుంది. జ్ఞానీజీ ఒకచేత్తో సుందరినీ, రెండో చేత్తో బచన్‌సింగునూ పట్టుకొన్నాడు. గుప్పు అప్పగించి ఇద్దరూ ఒకరినొకరు చూసు కొంటున్నారు. ఇద్దరి చూపులు ఒకరినొకరు చూసుకుంటూ వుండిపోయాయి. కళ్ళల్లో స్థిరంగా నిలబడిపోయిన నల్లపాపల్లో ఇద్దరూ తమతమ సూక్ష్మ శరీరాల్తో కనబడుతున్నారు. సుందరి కళ్ళల్లో బచన్‌సింగూ బచన్‌కళ్ళల్లో సుందరీ ఇమిడిపోయారు.

అంతలో తన మెడకు ఏవో చల్లని వస్తువు తగిలినట్లు సుందరికి అనిపించింది. కళ్ళలో సంచలనం తెచ్చుకొని పక్కకు తిరిగి చూసింది. జ్ఞానీజీ రుమాలు ముడివిప్పి ఇద్దరి మెడల్లో పుష్పహారాలు వేశాడు. ఆమెచేయి బచన్‌చేతిలో వుంది. వాళ్ళిద్దరి చేతుల్ని పట్టుకొని జ్ఞానీజీ చెప్తున్నాడు—

"ఓ జగదీశ్వరా ! ఓసర్వేశ్వరా! ఈ ప్రేమదంపతులు శాశ్వతంగా కలిసివుందురుగాక! స్వర్గంలో కూడ వాళ్ళ దాంపత్యం విడిపోకుండుగాక !"

ఇంగ్లీషు సూపర్నెంటు హేటు తీసి చేత్తో పట్టుకొన్నాడు. మిగతావాళ్ళంతా తల వంచి ఒక్కసారిగా [1]"అమేన్ ! అమీన్ !" అంటూ పలికారు.

తర్వాత ఓ క్షణంపాటు బచన్, సుందరి ఇద్దరి నరాల్లోనూ చైతన్యం ప్రవహించింది. అంతే. ఇద్దరూ గాఢంగా పరస్పరం కౌగిలించుకొన్నారు. ఒకనిమిషం - ఐదు నిమి షాలు - పది - పదిహేను - ఇరవై. కౌగిలి వీడలేదు.

---

1. తథాస్తు !

సూపర్నెంటు పొంజ్ఞచేశాడు జ్ఞానీజీకి.

"కాకా బచన్ ! పుత్తర్ సుందరీ ! నా బిడ్డల్లారా !" అన్నాడు జ్ఞానీజీ. అతని గొంతు జీరపోయింది.

వాళ్ళు వీడలేదు. ఇద్దరూ ఈ ప్రపంచాన్నే మరచిపోయారు. చూసిచూసి సుందరి జబ్బపట్టుకొని "నా బిడ్డా" అన్నాడు జ్ఞానీజీ. సూపర్నెంటు బచన్‌సింగ్‌ను వూపుతూ "మిస్టర్ బచన్‌సింగ్" అని పలకరించాడు.

వాళ్ళ కౌగిలి వీడింది. ఇంకా అతను ఆమైకంలో వుండగానే ఒకమనిషి ముందుకు వచ్చి బచన్‌సింగు తలకు పొడుగాటి నల్లటి టోపీ తొడిగాడు. కౌగిలి వీడీవీడగానే సుందరి తూలిపోతుంటే జ్ఞానీజీ తన చేతుల్తో ఆమెను పట్టుకొన్నాడు. సూపర్నెంటు ఆర్డర్ ప్రకారం ఓమంచాన్ని తెచ్చి అక్కడవేశాడు ఓ వార్డెన్.

తెలివివచ్చిన తర్వాత సుందరి కళ్ళుతెరచి చూసింది. అన్ని వైపులా చీకటి వ్యాపించివుంది. భఫ్‌భఫ్‌మంటూ యింజన్లు పొగ ఒదులుతున్నాయి. ప్రయాణీకుల కోలాహలం వినపడుతోంది. "దూద్‌పేడా" అంటూ జంగడీవాళ్ళు ప్లాట్‌ఫారంమీద అరుస్తూ తిరుగుతున్నారు. తను రైల్వేస్టేషన్లో వున్నట్టూ, తను ప్రయాణీకుల విశ్రాంతిగదిలో పడుకున్నట్టూ గుర్తించింది.

సుందరి నెమ్మదిగా లేచి కూర్చుంది. కూర్చోగానే మంచినీళ్లు కావాలని అడిగింది. లోటా తీసుకొని మంచినీళ్ళు తేవడానికి జ్ఞానీజీ వెళ్ళాడు. ఒంటరిగా కూర్చున్నదేమో ఆరోజు జరిగిన విషాదసంఘటన జ్ఞాపకం రాసాగింది. ఆమె తల ఎన్నో మణుగులు బరువెక్కినట్లుగా వుంది. ఆలోచనాశక్తిని కోల్పోయింది. భుజాలమైనేదో బరువును ఏడుస్తూ మోస్తున్నట్లుగా వుంది. సుందరి బతుకు ఎండిమోడైపోయింది. జీవిత సర్వస్వాన్నే పోగొట్టుకొన్న ఒంటరి, ఒకనిరాశ్రిత, అయిపోయింది. ఆమె జీవితం స్థంభాలు విరిగిపోయిన కప్పులా వూగిసలాడుతోంది.

కొద్దిసేపు ఏదో పోగొట్టుకొన్నదానిలా వెర్రిచూపుచూస్తూండి పోయింది. అంతలో లోటాలోనీళ్లు తీసుకొని జ్ఞానీజీ అక్కడకొచ్చాడు. మంచినీళ్లు తాగ్గానే ఆమెకు కొంచెం ఓపికవచ్చింది, జైల్లో పనిచేయడం మానేసిన మెదడులోని ఒక్కోనరం మళ్ళీ పనిచేయసాగింది. ఆమె కళ్లల్లో ప్రపంచం మరో కొత్తరూపంలో కన్పించ సాగింది. తను ఏదో బరువు క్రింద నలిగిపోతున్నట్లుగా అణిగిపోతున్నట్లుగా అనిపించింది.

బచన్‌సింగును కడపటిసారి కలిసిన దృశ్యం ఆమె కళ్ళల్లో తిరిగింది. కాని ఏదో అర్థంకానట్లుగా అస్పష్టంగావుందది.

"ఆయన్ను ఉరితీశారు" అన్న ఆలోచన మెదడులోకి రాగానే ఒక్క వెర్రికేకవేసి రెండుచేతుల్తోనూ ముఖం కప్పుకొని బెంచీపై వాలిపోయింది. ఆమె వేసినకేకకు అక్కడి ప్రయాణీకులు ఆమెచుట్టూ చేరిపోయారు. ఆరోజే ఆమె భర్తను వురితీశారని జ్ఞానీజీ వాళ్ళకు చెప్పగానే సానుభూతి చూపుతూ వూరడించడం మొదలెట్టారు.

సుందరి ఏడవాలనుకొంది. కాని ఏడవలేకపోతోంది. ఆమెకు ఏడ్పురావడంలేదు. ఆమె శరీరాన్ని దగ్ధంచేస్తూన్న మంటలు ఆమె కళ్ళలోని నీరును పీల్చివేశాయి.

సుందరి బేంచీమీంచి లేచి బయటికి వెళ్ళింది. కనుచూపుమేర ప్లాటుఫారం మీద వున్న ప్రయాణీకుల్ని ఒక్కసారి తేరిపారచూసింది. అందరి ముఖాలమీదా విశ్వాస ఘాతం, నమ్మకద్రోహం, కుళ్ళూ, కుసిద్ధం తాండవమాడుతున్నాయి. భగవంతుడు అన్నిటినీ సృష్టించాడు కాని వాటిని పాడుచేయడానికే మళ్ళీ మనుషుల్ని సృష్టించాడు. వీళ్ళకంటే ఆకాశంమీద నడిచే మేఘాలేనయం. నల్లరంగు పూసుకొని కనీసం సానుభూతైనా ప్రదర్శిస్తున్నాయి. వీళ్ళకన్నా నక్షత్రాలే ఎన్నోరెట్లు మెరుగు. ఆమె దుస్థితిని చూడలేక కారుమబ్బుల చాటున దాక్కొన్నాయి. మనుషులకంటే వాళ్ళకు ఆహారాన్ని అందించే ఆ చెట్లే శ్రేష్ఠం. తలలూపుతూ ఆమె విచారాన్ని పాలుపంచుకొంటున్నాయి. ప్రకృతి అంతా శోకిస్తూ సుందరి దుఃఖంతో తాదాత్మ్యం పొందుతూవుంది.

అంతలోనే ఆమెలో అకస్మాత్తుగా ఏదో అజ్ఞాతశక్తిలేచి ఉద్రేకంతో ఊగిపోయింది; వుక్రోషంతో "ఏం చూస్తారు నన్ను? నారక్తం తాగినా మీ కడుపులు నిండలేదా? ఇంక ఇంతకన్న ఏంచెడు చేయగలరు? నాదంటూవున్న ప్రతివస్తువునూ దోచేశారు. నా సర్వస్వాన్నీ పొట్టపెట్టుకున్న తర్వాత కూడా మీ కడుపు మంట..." అంటూ ఏమేమో అనబోతుండగా జ్ఞానీజీ ఆమె జబ్బ పట్టుకొని కూర్చోపెడుతూ ఠల్లీ, తెలివి తెచ్చుకో. అన్నీ దిగమింగుకోవాలి" అని ధైర్యం చెప్పాడు.

సుందరి మాట్లాడే అర్థంలేని మాటలు విని ప్రయాణీకులు అక్కడ నుంచి కదిలి ఎవరి చోట్లల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ఆమె తలను చేత్తో నిమురుతూ "తల్లీ, ఇలా అయితే నీ ప్రాణానికి కూడా ముప్పు తెచ్చుకుంటావ్. జరిగిందేదో..." అంటూన్న జ్ఞానీజీ మాటలకు మధ్యలోనే అడ్డంతగిలింది సుందరి. వెటకారంగా నవ్వుతూ అంది— "నేను ప్రాణానికి ముప్పు తెచ్చుకుంటానా? ఎంతమాటన్నారు? నేనంత త్వరగా చావను లెండి. నేనింకా సాధించాల్సిన కార్యాలు చాలా వున్నయ్. వాటిని ముగిస్తే కాని చావను. అవును జ్ఞానీజీ. మరి వారి దహన సంస్కారం...?"

"అయిపోయింది. నీకు స్పృహ తెప్పించాలని ఎంతో ప్రయత్నంచేశాం. కాని లాభంలేకపోయింది", అని జ్ఞానీజీ జవాబు చెప్పాడు.

" పోనీలెండి "

అమృత్‌సర్ వెళ్ళే రైలుబండి ప్లాట్‌ఫారం మీదకు వచ్చింది. ఇద్దరూ వెళ్ళి రైల్లో కూర్చున్నారు.

అమృత్‌సర్ చేరిన తర్వాత స్టేషన్ బయటికి వచ్చిరావడంతోనే జ్ఞానీజీతో "మిమ్మల్ని ఇంక ఇబ్బంది పెట్టదలచుకోలేదు. కొన్ని రోజులపాటు నన్ను ఒంటరిగా వదిలేయండి " అంటూ తన అభిప్రాయం బయట పెట్టింది సుందరి.

" ఒంటరిగా వదలనా ? ఎందుకుతల్లీ ? " సుందరి మాటలు అర్థంకాక జ్ఞానీజీ అడిగాడు.

" నేను దీవాన్‌పూరు వెళ్ళాలి "

" కాని అక్కడ నీకేంపని వుందమ్మా ? "

" మీకు తెలియదు నాయనగారూ. వారు తనతల్లి బాధ్యత నాకు అప్పగించివెళ్ళారు కొద్దిరోజులపాటు ఆమెగారిదగ్గరవుండి వస్తాను. "

ఎంతనచ్చజెప్ప ప్రయత్నించినా సుందరి పట్టువదల్లేదు. తప్పనిసరిగా జ్ఞానిజీ ఒప్పుకొన్నాడు. చివరకు సుందరి దీవాన్‌పూరు వెళ్లటానికి, ఒకటి రెండు రోజులు అమృత్‌సర్‌లోవున్న తర్వాత జ్ఞానిజీ హరిద్వార్ వెళ్ళిపోవడానికి నిర్ణయమైంది.

---

# [ 34 ]

స్టేషన్‌నుండి బయటికి వచ్చిన సుందరి తన భవిష్యత్తు గురించి ఏవేవో ఆలోచిస్తూ దీవాన్‌పూర్ వెళ్ళేరోడ్డు ఎక్కింది. ఇప్పుడామె మనసు తుఫాను ప్రళయతాండవంచేసి వెళ్ళిన తర్వాత నిర్జనమైన ప్రకృతిలా ప్రశాంతంగావుంది. ప్రతీ నిమిషం బచన్ జ్ఞాపకం వస్తున్నాడు. కాని అప్పటి తపనలేదు. ఆమె ఏడవటంలేదు. ఇనుమును వేడి చేసినప్పుడు ఇతరవస్తువుల మాదిరిగా కరగినా ఇంకా ఎలాగట్టిపడుతుందో బచన్‌సింగు చనిపోయిన తర్వాత కూడా ఆమె మనసు ఇంకా బింకమయింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆమె స్వభావం క్రూరంగా మారిపోయింది.

ఏదైనా రానున్న విపత్తు గురించి మనిషి ఎంతగా తలుచుకొంటాడో అది అంత భయంకరంగా అతనికి కనపడుతుంది. నిజానికి అనుభవంలోకి వచ్చాక ఆలోచించిచూస్తే జరుగుతున్నది జరగబోయేదానంత భయంకరంగా కనపడదు. చన్నీళ్ళలో స్నానంచేసే ముందు ఎవరైనా జంకుతారు. కాని తీరా ఓమునక వేసిన తర్వాత ఎంతసేపు ఆనీళ్ళలో వున్నా అతనికి చలివేయదు. అలాగే బచన్ చనిపోయిన తర్వాత ఎంతకష్టపడాలో అని భయపడిపోయింది సుందరి. ఈ ఏడుపు బ్రతుకు ఎలా తెల్లవారుతుందో అని బెంగ పెట్టుకుంది. కాని ఇప్పుడలాలేదు. బహుశా దీనికి కారణం ఆమె హృదయం మాటి మాటికి ఇటువంటి తాకిళ్ళు తినితినీ తట్టుకోడానికి అలవాటుపడ్డమే అయివుండొచ్చు.

సదాకౌర్ ఆరోజు తనను అవమానించింది. కాని బచన్‌కు తానుచేసిన వాగ్దానం ప్రకారం తను అన్నీ సహించాలి. దీవాన్‌పూరు చేరగానే ముందు సదాకౌర్ ఇంటికే వెళ్ళింది సుందరి. అప్పటికి రాత్రి ఎనిమిది గంటలు అయివుంటుంది. తలుపుతట్టగానే ఎవరు అంటూ సదాకౌర్ తలుపు తీసింది.

" నేనే అమ్మగారూ, సుందరిని " జంకుతూన్న స్వరంలో సుందరి సమాధానం చెప్పింది.

సదాకౌర్ తనను మునుపటికన్నా ఎక్కువగా అగౌరపరుస్తుందని అనుకుంది. సదాకౌర్ దృష్టి మందగించింది. పగలు కూడా మనుషుల్ని వెంటనే గుర్తుపట్టలేని స్థితిలో వుంది. తన్ను చూడగానే ముందు ఏ తిట్టుతిడ్తుందా అని ఎదురుచూస్తోంది సుందరి. కాని

సదాకౌర్ నోట అటువంటి దుర్భాష ఒక్కటీ రాకపోవడం చూసి ఆమెకు ఆశ్చర్యం వేసింది. రెండుచేతులూచాపి "రాతల్లి." అంటూ ఆమెను కౌగలించుకొంది సదాకౌర్.

సుందరి ఆమె కాళ్ళమీదపడి వెక్కి-వెక్కి ఏడ్చింది. అన్వర్‌జాన్‌ను కలిసిన తర్వాత మళ్ళీ మరోసారి సుందరిలో తల్లిప్రేమ పొంగిపొరలింది.

"తల్లీ నీ పసుపు కుంకుమ వుంచడం ఆ భగవంతుడికృూడా ఇష్టం లేనట్లుంది" అని సదాకౌర్ కూడా ఆమెను వాటేసుకుని ఏడ్పులంకించుకుంది.

బచన్‌సింగును చూడ్డానికి వెళ్ళినపుడు సుందరి ఉత్తమ గుణసుందరి అనీ, తను పోయిన తర్వాత తన ప్రతిరూపంగానే భావించి ఆమెను ఆదరించమని కొడుకు చెప్పాడని తెలియజేసింది సదాకౌర్. ఇంకా ఎన్నెన్నో విషయాలు సుందరికి చెప్పింది. ఒకరి దుఃఖం ఒకరికి చెప్పుకొంటూంటే వాళ్ళ గుండె బరువు తేలికయినట్లే అనిపించింది. బచన్ వాళ్ళ సంభాషణలో మరోసారి జీవించాడు.

ఇద్దరూ మాట్లాడుతూంటే అర్ధరాత్రి గడచిపోయింది. భగవంతుడు మా ఇద్దర్ని కల పకపోతే వాళ్ళు ఎలా బ్రతికేవారో వాళ్ళ జీవితాలు ఎలా వుండేవో అనుకొన్నాయి రెండు ప్రాణులూ.

డబ్బంతా అంతకుముందే హరించిపోయిందనీ, ఈకేసు గురించి వున్న నగలూ ఆభరణాలూ అమ్ముడుపోయాయనీ, కొంత పొలం కూడా తాకట్టుపెట్టవలసివచ్చిందనీ, ఆ మిగిలిన పొలాన్నికూడా వారసులు కాజేద్దామని చూస్తున్నారనీ, తనదగ్గర ఇప్పుడు చిల్లిగవ్వకూడాలేదనీ, ముందు ముందు తన బ్రతుకు ఎలా తెల్లవారుతుందో తోచడం లేదనీ సదాకౌర్ ఏడుస్తూ చెప్పింది.

పాలాసింగూ వాళ్ళకు తమమీద తీర్చుకున్న పగ చల్లారక తన మరిదినీ మిగతా వారసుల్నీ రెచ్చకొడ్తున్నారనీ, ఆకాస్తభూమినీ కైంకర్యం చేసుకోడానికి నానాపన్నా గాలూ పన్నుతున్నారనీ తెలియజేసింది.

అసలే దురదృష్టం పొడిచిన తూట్లకు విలవిల్లాడిపోతున్న సుందరికి ఈ విషయం గోరుచుట్టుమీద రోకలిపోటులా అనిపించింది. పాలాసింగు మీద పగతీర్చుకోవాలని ఆమె నరనరమూ రోషంతో ఉబ్బిపోయింది. కొద్దిసేపు కూడా నిశ్చలంగా కూర్చోడం ఆమెకు అసాధ్యమైపోయింది. బచన్‌కు తాను చేసిన బాసలూ, సదాకౌర్ జీవితభారాన్ని తనమీద వేసుకొన్న బాధ్యతా అన్నీ ఆ ఉద్రేకంలో మరచిపోయింది. సదాకౌర్‌కు కునుకుపట్టగానే అల్మారాలో వున్న అగ్గిపెట్టె తీసుకొని ఆ అర్ధరాత్రివేళ ఇంటి నుంచి బయటకు వెళ్ళింది.

పాలాసింగు అతని దుష్టచతుష్టయం ఎప్పుడూ బైఠాయించే బావి దగ్గర కెళ్లింది ఆమె. ఆ చోటు ఆమెకు కొత్తేమీకాదు. అంతకుముందు అనేకసార్లు చూసిందే. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బావికి దగ్గరగావున్న పాలాసింగు గుడిసెకు చేరుకుంది. గుడిసె వెనుకభాగాని కెళ్ళి గోడలో పెద్దకన్నం వున్నచోట ఆ చీకట్లో నక్కికూర్చుని లోపల ఎవరువున్నదీ పరిశీలనగా చూసింది. ఆవిసెనూనె ప్రమిదవెలుతుర్లో పాలాసింగూ అతని మిత్రులూ కూర్చొని సారాసేవిస్తూ కనిపించారు.

"పాము చావనూ చచ్చింది. బడితె విరగనూలేదు" అని వీరాసింగు మత్తులో అంటున్నాడు.

"నువ్వు నిజంగా సదాకౌర్ ఇంటివైపు వెళ్లడం చూశావా లేక సారా నిషాలో వాగుతున్నావా ?" అని పాలాసింగు అడిగాడు.

"గురూ మీద ఒట్టు. నేను నాకళ్ళతో చూశాను."

"అయితే పిట్టఎలా తప్పించుకొంటుందో చూస్తాగా. రేపేదాని పనిపడ్తా. రోజూ ఈ తంటాలు ఎవరు పడ్తారు ?"

"కాని దాన్నెక్కడ ఉంచుతావురా ?"

"అరే. వుంచేదెక్కడరా ? ఎగరేసుక పోవడమే. అంతే."

"కానీ పాలా, మరది కచ్చేరిలో చెప్పింది కదరా ఖోగందాన్ని కూతుర్ని అని"

"అరే పోయెహే, అవన్నీ ఎవరిక్కావాలి. సిక్కోళ్లకు వాటితో ఏంపనంట ? గురుపేరు జపించి రేపురాత్రికే దాన్ని ఎత్తుకొచ్చెయ్."

"జీవాసింగుగాడి దొడ్డివుంది చూశావ్. దాని గోడ పచ్చిగా వుందిరా. దానికి కన్నం వేసి..."

"ఆఁ అంతే, అంతే".

వాళ్ళ మాటలు సుందరి సావధానంగా వింది. జరగబోయే నాటకాన్ని గ్రహించింది. అలాగే వాళ్ళు కాసేపు తప్పతాగి ఒళ్ళు తెలీకుండా పడిపోయారు.

సుందరి దాక్కున్న చోటునుంచి మెల్లగా బయటకు వచ్చింది. అక్కడా అక్కడా వున్న ఎండుగడ్డి పోగుచేసి కుప్పేస్తూ పోయింది. రెండు మూడూ పొన్నలయింది కుప్ప. తను చేయబోయే లంకా కాండకు ఆమాత్రం చాలనుకొంది.

కాసేపటిలో గుడిసె నిప్పంటుకొని ధగధగ మండిపోసాగింది. అసలే పూరిపాకేమో చూస్తుండగానే మంటలు ఉవ్వెత్తున లేచి దూరానికి కూడా కనపడుతున్నాయి. నిద్రపోయే

దీవాన్‌పూరు "మంటలు మంటలు, ఇల్లేదో తగలడుతోంది" అంటూ ఒక్కసారి మేల్కొంది.

గుడిసె దగ్గిరే నిలబడింది సుందరి. మంటల్ని చూస్తూ బిగ్గరగా నవ్వుతోంది. క్రూరంగా నవ్వుతోంది. నవ్వుతూ చప్పట్లు కొడ్తోంది.

జనం మంటలవైపు నిద్రకళ్ళతోనే పరుగెత్తారు. వాళ్ళు అక్కడికి చేరుకొనేలోపు గానే కప్పుపైవున్న గడ్డంతా కాలిపోయి లోపల వున్న దూలాల మీద పడింది.

"అదుగోమంట, ఇదుగోనిప్పు" అంటూ జనం కాలిపోతూన్న ఆ గుడిసెను ఆర్పడం మొదలెట్టారు. మరికొంతమంది ఎవరైనా నిప్పు పెట్టారేమోనని చుట్టుపక్కల వెతకసాగారు.

ఇంతలో ఆ జనంలోంచి ఎవరో అన్నారు ఇప్పుడే ఏటివైపుకు ఒకామె పరుగెత్తు తూండగా చూశానని. అంతే. అందరూ అటువైపే పరుగెత్తారు. అక్కడవున్న పొదల్లో వెదకసాగారు.

"అదిగో చూడండి, వంతెనమీదకు పరుగెత్తిపోతోంది" అని ఎవరో అరిచారు.

జనం వంతెనవైపు పరుగెత్తారు. అంతలోకే వంతెనమీద దట్టంగా అల్లుకొన్న చీకటిలోంచి పెద్దగా మాటలు విన్పించాయి.

"నేనే ఖూనీకోర్ని ధైర్యంవుంటే రండి. నన్ను పట్టుకోండి. రెండు ప్రాణాలకు మూడు ప్రాణాల్ని బలిచేశాను. నా తాతను పొట్టపెట్టుకొన్న ఆ హంతకుల్ని బలితీసు కొన్నాను. నా బ్రతుకును బజారులోకి ఈడ్చారే వాళ్ళంతా తా అయ్యారు. నా పసుపు కుంకుమా చెరిపేశారే, నన్ను ముండమోయించారే! ఆడది నిట్టూరుస్తే రాజ్యాలే నాశన మయ్యాయి. తప్పుడు సాక్ష్యాలు ఇచ్చి నా తాతను పొట్టపెట్టుకొన్న హంతకుల్ని కాపా డిన మిమ్మల్ని ఆ గురువే తగినశాస్తి చేస్తాడులే. అసలు ఖూనీకోరులున్నారే, వాళ్లనే నేను యమలోకానికి పంపింది. రండి. ధైర్యంవుంటే పట్టుకోండి".

ఏటివంతెనమీద నిలబడి సుందరి వెర్రిగా అరుస్తూంటే గ్రామస్తులు నిర్ఘాంతపోయి చూస్తూ నిలబడ్డారు.

పోలీసులు అప్పటికి అక్కడకు చేరుకున్నారు. ముందు పోలీసులూ వెనకగా కొంత మంది గ్రామస్తులూ వంతెనమీదకు నడిచేరు. సుందరిమాత్రం బెదరకుండా అలాగే నిల బడివుంది. బాగా దగ్గరగా వాళ్లంతా వచ్చేసినా ఏ మాత్రం చలించకుండా సుందరి శాపనార్థాలు పెడుతూనేవుంది. పోలీసు ఆమెను బంధిద్దామని ప్రయత్నించగానే చటు క్కున ఆమె ఏటిలోకి దూకేసింది.

సుందరి దూకగానే నీళ్ళు ఉవ్వెత్తునలేచి ఆ చీకట్లో తెల్లగా మెరుస్తూ కింద పడ్డాయి. మళ్ళీ యథాప్రకారంగా ఏరు ముందుకు సాగిపోతూంది. లాంతర్లు నీళ్ళకు దగ్గిరగా పోనిచ్చి ఆమసక వెల్తుర్లో సుందరిని పట్టుకోడానికి విఫలప్రయత్నం చేశారు. కాని సుందరి జాడ తెలియలేదు. వాళ్ళ దృష్టిలో సుందరి శాశ్వతంగా కన్నుమూసింది.

ఈ సంఘటన జరిగిన కొద్దిరోజులకు సుందరి వివరాల్ని తెలుపుతూ కొన్ని గుర్తులతో పోలీసు డిపార్టుమెంటు పేపర్లలో ప్రకటించింది. ఆమె జాడ తెలిపినవారికి బహుమానం ఇస్తానన్నది. ఒకవైపు పోలీసులూ, మరోవైపు దీవాన్‌పూర్ గ్రామస్తులూ ఆమెను వెతకడం ప్రారంభించారు.

చివరన మిగిలినది

గుప్తేశ్వర్ పుటలు తిప్పుతూ తాను రాసిన అసంపూర్ణమైన నవల చదువుతున్నాడు.

నవల చాలా పెద్దది. అయినా ఒక్క పూపునే అంతా వినాలన్న పట్టుదలతో కూర్చున్నాడు శ్యాందాస్‌బాబు.

ప్రయాణీకుడు అలా చదువుకు పోతూంటే శ్యాందాస్ వింటూ కూర్చొన్నాడు. అలా చదవడంలో రాత్రి గడచిపోయింది. నవల చదవడం దాదాపు పూర్తి అయింది. మిగిలిన అసంపూర్ణ అధ్యాయాన్ని చదువుదామను కొంటూండగానే తెల్లవారింది. వాళ్ళు కూర్చొన్న గదిలోకి సూర్యకాంతి రాసాగింది.

మిగిలిన భాగాన్ని చదవడానికి వెంటనే వీలుకుదరలేదు. అది అనేకమైన చిన్నచిన్న కాగితాలమీదా, వార్తాపత్రికమార్జిన్లమీదా రాసివుంది. వాటిని అన్నిటిని వరుసగా సర్దడానికే చాలాసేపు పట్టింది.

ప్రయాణీకుడు ఆ కాగితాల్ని చేతిలోకి తీసుకొని చదివేముందు - శ్యాందాస్‌వైపు చూశాడు. శ్యాందాసు కళ్ళు అశ్రుపూరితాలై జలజల కన్నీళ్ళు కారుతున్నాయి. అతని ముఖం పాలిపోయినట్లుగా వుండి పెదాలు వణుకుతున్నాయి.

''ఓహ్ !'' చేతిలోని కాగితాలు ముక్కాలిపీటపై వుంచుతూ ''అదేమిటి ? మీరేడుస్తున్నారు ! అంతపెద్ద ట్రేజిడీ కాదనుకుంటా'' అన్నాడు ప్రయాణీకుడు.

ప్రయాణీకుడు అన్న మాటలు శ్యాందాను వినలేదు. అతను హృదయాన్ని చీల్చుకుని వస్తోన్న దుఃఖాన్ని ఆపుకోడానికి ఏమాత్రం ప్రయత్నించలేదు.

''సరేలెండి. మిగిలిపోయినదాన్ని తర్వాత చదువుతాను. అయినా అదికూడా పూర్తి కాలేదుగా'' అంటూ అతను పీట మీదవున్న కాగితాల్ని సర్దుకొంటూ అన్నాడు.

"అలాకాదు. మీరు చదవండి. నేను బాగానే వున్నాను." కళ్లద్దుకుంటూ బాగా వున్నట్లు నటించి శ్యాందాసుబాబు మళ్లీ వినడానికి సిద్ధం అయ్యాడు. ప్రయాణీకుని చెయ్యిపట్టుకొని "అబ్బ! ఎంత బాధకరంగా వుంది" అని వ్యాఖ్యానించాడు. శ్యాందాస్ పట్టుదల చూసి ప్రయాణీకుడు మళ్లీ నవల చదవడం ప్రారంభించాడు.

---

# [ 35 ]

(పై సంఘటన జరిగిన రెండు సంవత్సరాల తర్వాత)

గుప్తేశ్వర్ పేరంటేనే ప్రజలకు తెలుసు. ఆయన ఎలావుంటాడనేది ఎవరికీ తెలియదు. కొద్ది కాలంలో - రెండు సంవత్సరాల్లోనే అతని పేరు ప్రతిష్ఠలూ, ప్రజాదరణ సంపాదించాడు. ప్రచురణ కర్తలూ, అతని రచనల్ని ప్రచురించే పత్రికా సంపాదకులూ అతణ్ణి కలవాలని ఎంతో ప్రయత్నించారు. కాని ఆయన జాడే తెలిసింది కాదు. గుప్తేశ్వర్ అన్న పేరుతో వచ్చే ప్రతీ రచనా పోస్టుద్వారానే వచ్చేది. దాని పారితోషికం ఫలానా అడ్రసుకు పంపమని అందులో ఆయన రాసేవారు. అందువల్ల వారంతా "సదాకౌర్, కేరాఫ్ లేట్ జీవాసింగు, దీవాన్‌పూర్ గ్రామం, అమృత్‌సర్ జిల్లా" అన్న విలాసానికి తమకు తోచినంత ప్రతిఫలం పంపించేవారు. చాలా మంది పాఠకులు ఆ విలాసానికి గుప్తేశ్వర్ పేరున ఉత్తరాలు రాసేవారు. కాని అంత గ్రామంలో గుప్తేశ్వర్ జాడే ఎవరికీ తెలిసేదికాదు. ప్రతిఫలం ఏ విలాసానికి పంపుతున్నారో ఆ సదాకౌర్‌ని అడిగి చూశారు. కాని ఆమె కూడా గుప్తేశ్వర్ జాడ తెలపలేకపోయింది.

నిజానికి గుప్తేశ్వర్ ఎనిమిదిఅణాలు అద్దెకు ఓ చిన్నగది తీసుకొని భగతావాలా దర్వాజా ఆవరణలో వుంటున్నాడు. గడియవేసుకొని రాస్తుండేవాడు. రాత్రి మాత్రం బయటకువచ్చి పార్కుల్లోనూ పాడుబడ్డస్థలాల్లోనూ తిరుగుతూండేవాడు. అతను తనలో తాను పాడుకొంటూనో, ఏడుస్తూనో వుండగా చాలాసార్లు తోటమాలీలు చూశారు. చాలా మంది ఆయన్ను " మస్త్ " అని పిలుస్తుండేవారు.

అప్పుడప్పుడు బాగా జనసమ్మర్దం వున్న చోట్లలో కూడా గుప్తేశ్వర్ తిరుగుతుండేవాడు. ఒక్కొక్కప్పుడు దారిన పోయేవాళ్ళను పిలిచి తలాతోకాలేని ప్రశ్నలు వేసేవాడు. చాలామంది అతణ్ణి పట్టించుకోకుండా ముందుకు సాగిపోయేవాళ్లు. కొంతమంది మాత్రం ఆయన దగ్గర చేరేవారు.

బ్రతకడానికి కావలసిన సరంజామా ఏమీ అతని గదిలో కనబడదు. ఓమూల పడుకోడానికి గడ్డిపరిచి దానిమీద ఓ గోనెగుడ్డ పరచివుంది. రెండో మూల మూడు ఇటుకల్ని ఒకపొయ్యిగా చేసివున్నాయి. దాని పక్కనే ఓ చిన్న కుండ, మట్టి మూకుడూ, వాటి పక్కనే ఎండుకట్టెలు, పడుకొనేచోట తలకు దగ్గరగా ఓ ఇటుక నిలబెట్టి దానిమీద

మట్టి ప్రమిదావుంది. అక్కడే మోకాళ్లమీద ఓ వెడల్పాటి చెక్క పెట్టుకొని ఆయన తన రచనల్ని చేసేవాడు.

అతను వుంటూన్న గదికి సమీపంలోనే టాంగాలు రిపేరుచేసే కొట్లూ, హల్వా దుకాణాలూ వున్నాయి.

ఓరోజు వుదయం అతను గదిలో కూర్చొని రాసుకొంటున్నాడు. అతని మోకాళ్ళ మీద ఒత్తుకు ఓ చినిగిన అతుకుల కంబళివుంది. రాత్రిళ్ళు ఆ కంబళే కప్పుకొంటాడు. అతనికి కుడిభాగంలో ఓపక్క స్కూలు పిల్లలు ఒకవైపు కాంపోజిషన్ రాసిన రద్దీకాగితాలు వున్నాయి. వాటివెనకనే అతను రాసిన కారణంగా సిరా ముందువైపుకు ఇంకిపోయి కనబడుతోంది.

సాయంత్రం అయింది. పగలంతా రాస్తున్నాడేమో అలసట అతని ముఖంమీద స్పష్టంగా కనపడుతోంది. కాగితాల్ని వరుసగా పేర్చి గది బయటికి వచ్చి గుమ్మం దగ్గర నిలబడ్డాడు. నొప్పెడుతోన్న నడుం సరిచేసుకొని చేతులు పైకెత్తి వేళ్ల విరిచాడు. రెండు మూడుసార్లు ఒళ్ళు విరుచుకున్నాడు.

మళ్ళీ లోపలికి వెళ్ళాడు. ఆరోజు రాసిన కాగితాలు లెఖపెట్టుకొని వాటిని పైపైగా ఒకసారి చదివి చూసుకొన్నాడు.

అదే ఆఖరి అధ్యాయం. అది కూడా ఇంకా కొంచెం మిగిలివుంది. ఆరోజు దాన్ని పూర్తిచేసి కడగండ్లతో నిండిన తన జీవితాన్ని అంతంచేసుకోవాలన్న ఆలోచన అతని కళ్లలో కనబడుతోంది. అయితే అతని జీవితంలో ఒక్కపనిమాత్రం పూర్తికాలేదు. ఎన్ని ప్రయత్నాలుచేసినా అతను కృతకృత్యుడుకాలేక పోతున్నాడు. అనవసరంగా నేల విడిచి సాముచేశాడు. జీవితంలో పేరు సంపాదించడం అనేది నొసట రాయనప్పుడు ఆ తప్పు అతనిదికాదుగా కానిపనికి అతను ఇంకా జీవితాన్ని పొడిగిస్తూ కూర్చోవడం అవివేకం. అప్పటికే జీవితం అంటే అతనికి కావలసినంత రోతపుట్టింది.

అంతలోనే అతనేదో దీర్ఘమైన ఆలోచనలో పడ్డాడు. రైల్లో ఎక్కిన తర్వాత జేబు తడిమి చూసుకొంటే పర్సుపోయిన ప్రయాణీకునిలా కాగితాలు అయిపోగానే అతనికి ఏమీ తోచలేదు. రాసిన కాగితాల్ని గదిలో ఓమూల అంతకుముందు సర్దిపెట్టిన కాగితాలపై వుంచాడు. తలకింద చెయ్యిపెట్టుకొని కంబళి కప్పుకొని పడుకొన్నాడు.

పట్టణంలో పైసా వుంటేనే జీవితం. పైసాలేకపోతే గాలిపీల్చడం కూడా కష్టమే. అతనిదగ్గిర ఒక పైసా అయినాలేదు. తెల్లవారగానే ఆహారంకోసం పరుగెత్తే రెక్కలు విరిగిన పక్షిలా అతను బయటికి బయల్దేరాడు.

అసలే చలికాలం. అందులో అప్పుడే తెల్లవారింది. ఆ పట్టణంలో ఎముకలు కొరికే చలిని తట్టుకోడానికి అతనిదగ్గిర ఒక లాంగ్‌కోటుంది. అది కూడా అతని సైజుది కాదు. కాజాలు చినిగిపోయాయి. గుండీలు వూడిపోయాయి. శరీరంలో చలి దూరకుండా రెంటిని దారంతో కుట్టేశాడు. మోకాళ్ళవరకు నిక్కరువుంది. నిక్కరు దుమ్ముకొట్టు కొని మాసిపోయి రైల్వే షెడ్డులో పనిచేసే కూలివాడిలా వున్నాడు. అతని ముఖం, చేతులూ అలాగే మాసినల్లపడ్డాయి. అయితే అతనికి సహజంగా వున్న తెలుపురంగు మట్టిలోని మాణిక్యంలా ఆ నలుపులోంచి కూడా మెరుస్తోంది. కాళ్లకు చెప్పుల్లేని కారణంగా అరికాళ్లు బొబ్బలు ఎక్కి అక్కడక్కడ ఆనలుకూడా లేచాయి.

చలికి వణికిపోతూ కొంకర్లు పోతోన్న శరీరాన్ని ఈడ్చుకొంటూ కాగితాల వేటకు బయలుదేరాడు. తన అదృష్టంమీద అతనికే కోపం వస్తోంది. విసుగూ కలుగుతోంది. కాగితాలు ఎక్కడా దొరక్కపోయేసరికి నిరాశతో ఇంటికి తిరిగివచ్చాడు. లోపల ఆకలి దహించివేస్తోంది. గదిదగ్గరకొచ్చేసరికి తాను రాసిన ఆ కాగితాల్ని పరశురామప్రీతిచేసి తన జీవితాన్ని అంతంచేసుకొందాం అన్నంత నిస్పృహ కలిగింది. వెంటనే తలుపుతీసి కాగితాలన్నిటినీ ఒక్కచోట పొయ్యిమీద పేర్చాడు. అగ్గిపెట్టెకోసం గోనెగుడ్డ ఎత్తితే అగ్గిపెట్టె ఖాళీగావుంది. దాంతో అతనికి మరీ విసుగూ, కోపం వచ్చాయి. అగ్గిపుల్లల కోసం గదికి గొళ్ళెం పెట్టి మళ్ళీ బయల్దేరాడు బయటికి. అంతలోనే అతను ఏమను కున్నాడో మళ్ళీ వెనక్కొచ్చి గొళ్ళెం తీసి లోపలికెళ్ళాడు. పొయ్యిమీద అమర్చిన కాగి తాల్ని తీసి యథాస్థానంలోవుంచి కాగితాల వేటకోసం తిరిగి బయల్దేరాడు.

జూదం ఆడేవాళ్లకు అప్పులిచ్చే షావుకారు చటుక్కున అతని మనసులో మెదిలాడు. వెంటనే అతని దగ్గరకు వెళ్ళి ఓ రూపాయి అప్పుకావాలన్నాడు. షావుకారు రూపాయి అయితే అప్పిచ్చాడు కాని రెండురూపాయలకు సంతకం పెట్టించుకొన్నాడు.

తిన్నగా ఇంటికి వచ్చి ఆ కాగితాలన్నిటిని కట్టగా కట్టుకొని చంకన పెట్టుకొన్నాడు. మళ్లీగదికి గొళ్లెం పెట్టి రైల్వేస్టేషనువైపుకు నడిచాడు. కొన్ని గంటల్లో అతను లాహోరుచేరి వీధుల్లో తిరగడం మొదలెట్టాడు. ఎంతోమంది ప్రచురణకర్తల దగ్గిరకు వెళ్ళి తను రాసిన నవల చూపించాడు. ఎవ్వరూ అది కొనడానికి అంగీకరించ లేదు. ఒకరిద్దరు ప్రచురణకర్తలు మాత్రం నవలను అటూఇటూ తిరగేసి, ఆకాగితం ముక్కలా అతని వాలకం చూసి పది పదిహేను రూపాయలు ఇస్తామని అన్నారు. ఇంతబ్రతుకూ బ్రతికి ఇంటివెనక చచ్చినట్లుగా ఆబేరం ఒప్పుకోవడం అతనికి ఇష్టంలేదు. తానే గుప్తేశ్వర్ అని చెప్పుకుంటే తన కాలిధూళికూడా తీసి తలకు రాసుకొనేవాళ్ళు వాళ్ళంతా.

కాని అతనా పనిచేయలేడు. పారిపోయిన హంతకునిలా అతను తన్నుతాను బయట పెట్టుకోలేడు. అందుకే అతను ఇన్నాళ్లూ అజ్ఞాతవాసం చేస్తూవున్నాడు.

లాహోరులో పనికాకపోయేసరికి ఇంటికి వెళ్లామనిపించింది. అతనిజేబులో పావలా బిళ్ళ మిగిలింది. అదికూడా సత్తుది. టిక్కెట్టులేకుండానే రైలెక్కాడు. రైల్లో బెంచీ కింద ఎవరో మర్చిపోయిన ఓ వార్తాపత్రిక కనబడింది. పక్కనే కూర్చోన్న ఓ ప్రయాణీకుని అడిగి పెన్సిలు తీసుకొన్నాడు. పత్రికపైనా కిందనా వున్న రెండంగుళాల ఖాళీభాగంలో నవల మిగతాభాగం రాయడం మొదలెట్టాడు. చివరి అధ్యాయం సగం రాశాడు. అది ఇంకా అలాగే పూర్తికాకుండావుంది ...

శ్యాందాస్ కళ్లలోంచి ధారాప్రవాహంగా కన్నీరు కారుతోంది. అతను ప్రయాణీకుని చేతిలో కాగితాలవైపు పరిశీలనగా చూశాడు. అన్నీ వార్తాపత్రికల రద్దీకాగితాలే. రెండు మార్జిన్లపై అతను పెన్సిలుతోరాసిన రాత స్పష్టంగా కనబడుతోంది. ఎక్కడా ఖాళీలేదు. ప్రయాణీకుని చేతిలో నవల చిట్టచివరిపేజీవుంది. అదేవార్తాపత్రిక మార్జిన్లమీద పెన్సిలుతో రాసిన ఆ వంక్తుల్ని చదివాక ప్రయాణీకుడు యిక చదవడం మానేసి వాటిని ముక్కాలిపీటమీద పెట్టాడు.

కాగితాల్ని పీటమీద పెడుతూ ప్రయాణీకుడు శ్యాందాస్వైపుచూశాడు. శ్యాందాస్ ముఖకవళిక పచ్చగా మారపాగింది.

"రాత్రంతా మేల్కొన్న కారణంగా మీ ఆరోగ్యం బాగాలేదు. కొంచెం విశ్రమించండి" సానుభూతి చూపిస్తూ ప్రయాణీకుడు అన్నాడు.

శ్యాందాస్ ఒకవేడి నిట్టూర్పు విడిచి "కాదులెండి. మీరు చదవండి" అని అతణ్ణి కోరాడు.

"ఈ నవల అయిపోయింది. దీని చివరి అధ్యాయమే సగం మిగిలివుంది" అంటూ గుప్తేశ్వర్ సమాధానం ఇచ్చాడు.

"అయిపోయిందా ? ఇంక రాయాల్సింది ఎంతవుంది ?" అని శ్యాందాస్ ప్రశ్నించాడు.

"చాలాకొద్ది" అని ప్రశ్నార్థకంగా చూశాడు గుప్తేశ్వర్.

"కాని ఓ మాట అడుగుతాను. మీకు కోపంరాదుగా. ఈ నవలప్లాటు మీరు వూహించారా లేక ... ?"

శ్యాందాస్ అంటూండగానే గుప్తేశ్వర్ అడ్డు తగిలాడు—

"అబ్బే లేదండి. నా సొంతంకాదు. ఇది నిజంగా జరిగినవాస్తవం. నాకు ఎవరో చెప్పారు. కేవలం దానికి నవలారూపాన్ని నేను కల్పించాను. తరచుగా యదార్థ సంఘటనల్నే నవలకు ప్లాట్లుగా ఎన్నుకొంటాను. వాటివల్లనవలకే ప్రాణంవస్తుంది".

శ్యాందాస్ రుమాలుతో నుదుటి మీద చెమట తుడుచుకొంటూ మళ్ళీ అడిగాడు-"మీకు ఎవరుచెప్పారో నాకు తెలుపగలరా ?"

"ఈ నవలలోని సుందరే నాకు స్వయంగా చెప్పింది".

ఆ మాటలు విని శ్యాందాసుకు ముచ్చెమటలు పోయసాగాయి. "సుందరే స్వయంగా చెప్పిందన్న మాట. మీరామెను ఎక్కడ కలిశారో, ఎప్పుడుకలిశారో చెప్పగలరా ?" అని శ్యాందాసు అడిగాడు.

"ఓ గ్రామంలో కలిశాను".

"అంతే. కలియగానే ఓ నవల రాసిపారేశారన్నమాట ఆమె జీవితంమీద".

"ఆమె జీవితం నా ప్లాటుకు బాగా కుదిరింది."

కడుపులోంచి వస్తూన్న కోపాన్ని మొహంమీదకు రానివ్వకుండా శ్యాందాసుఅన్నాడు- "క్షమించండి. దీనికన్న శ్రేష్ఠమైన ప్లాట్లు కల్పించడానికి సమర్థులైన మీలాంటి మొదటి శ్రేణికి చెందిన రచయితలు ఈ కథకోసమే ఎందుకు ప్రాకులాడవలసివచ్చిందో నాకు అర్థంకాకుండావుంది".

"మీరు చెప్పింది నిజమే అనుకోండి. కాని ఈ ప్లాటుద్వారా, నా రచనలో ఎంతో సాఫల్యాన్ని పొందగలనన్న ఆశకలిగింది".

"కటువుగా మాట్లాడుతున్నానని అనుకోకండి. వున్నమాట మొహాన అనేసే స్వభావం నాది. మీ రచనలు చదివి నేను మీ భక్తుణ్ణి అయ్యాను. కాని ఈ విషయంలో మాత్రం మీరుచేసిన పనిని హర్షించలేక పోతున్నాను. వెనకటికి ఓ గజఈతగాడు ప్రజలందరికీ తనకు ఎన్నిరకాల ఈతలు వచ్చునో చూపిస్తున్నాడట. ప్రజల్ని ఇంకా బాగా మెప్పించాలని అతను వేగంగా పల్టీలు కొడుతున్నాడట. అతనలా వేగంగా ఈదడంలో అతనికి దమ్ముచ్చి మునిగిపోయి చనిపోయాడట. నీళ్లు బాగా తాగేసినందున నీళ్లలో అడుగు భాగానికి పోయాడట. అందరు చప్పట్లుకొడుతూ "చూడండి అచ్చంగా చచ్చిపోయిన వాడిలా ఏలా ఈదుతున్నాడో" అని తమాషా చూస్తున్నారట. అలాగే నిమిషనిమిషం కష్టాలనే ఎదురుదెబ్బలు తగిలి తగిలి బొప్పికడ్తూన్న ఆమె జీవితాన్ని మీరు కథావస్తువుగా స్వీకరించడం ఏమంత బావుండలేదు. ఇతరుల నిస్సహాయతను మన స్వార్థంకోసం వాడుకోకూడదు. మేకప్రాణం పోతుందని ఏడిస్తే, కసాయివాడు

మాంసానికి పిద్చాడట ! అలావుంది మీతంతు. ఇది మీ రచనాపాటవానికేమచ్చ. మీ కౌశవ్యానికి ఉదాహరణ. ఆదీనురాలికి సాయం చేయాల్సిందిపోయి ఆమె వేడికన్నీటిని అమ్ముకోవాలని చూడడం మానవత్వం అనిపించుకోదు.''

గుప్తేశ్వర్ తలవంచుకున్నాడు. తప్పుచేసినవాడిలా ''అవును. పొరపాటైపోయింది. నా మనస్సుచాలా బలవంతం చేసింది. అందుకని ఆ విధంగా చేయవలసి వచ్చింది'' అని సంజాయిషీ చెప్పాడు.

''సరే ఆమాట అలా వదిలిపెట్టండి. తప్పు చేయనివాడు పరమాత్ము డొక్కడే. మీరు రాసిందాన్నిబట్టిచూస్తే చావబోయేముందు ఈకథంతా సుందరి మీకు చెప్పినట్లుంది''.

''అవునండి. నదిలో దూకేసిన సంఘటన జరగడానికి రెండు మూడు రోజులకు ముందు నాకీకథ చెప్పింది''.

''మరైతే ఏటిలో దూకిందన్న విషయం మీకేలా తెలిసింది ?''

''అప్పుడు నేను అగ్రామంలోనే వుంటూవుండేవాణ్ణి ''.

శ్యాందాసు నరనరం బాధగావుంది. ఎవరో అతని శరీరాన్ని సూదుల్తో గుచ్చుతున్నట్లుగా అనిపించింది. కొంచెంసేపు మౌనంగా ఆబాధ అనుభవించాడు. మళ్ళీ తేరుకొని '' శభాష్ గుప్తేశ్వర్‌గారూ, చాలా అద్భుతంగా రాశారు. మిగతాభాగం బహుశా మీరే పూర్తిచేస్తారనుకొంటాను. మీ రచనా పాటవంతో అది పూర్తిచేస్తారు. అంతేనా ? కాని ఇవ్వాళే పూర్తిచేయండి. అదికాక నేనో మనవి చేస్తాను. దయచేసి నిరాకరించి నామనస్సు విరగ్గొట్టకండి. రేపట్నుంచి మీ మకాం మీ భక్తుని ఇంట్లోనే. మీ పవిత్ర సహచర్యంలో ఈజీవి తన పాపాల్ని కడిగేసుకోవాలి. ఆ దీనురాలి గురించి మీకేమైనా ఇంకా తెలిస్తే నాకు చెప్పండి'' అని ప్రాధేయపడ్డాడు.

'' నేనీ నవల్ని పూర్తిచేయగలిగితే అది నా అదృష్టమే '' సంతోషంతో గుప్తేశ్వర్ అన్నాడు.

'' అంటే మీ వుద్దేశ్యం ?''

'' ఈనవలలోని కథావస్తువు మాదిరిగానే నా జీవితంలో కూడ ఒకేఒక ఘట్టం మిగిలిపోయిందికనక ''.

'' ఏమన్నారూ ? తమరు ... ?''

'' అవును. నేనింక బ్రతకడానికి చోటూలేదు. వ్యవధి అంతకన్నాలేదు. నేను ... '' అంటూ ఆగిపోయాడు గుప్తేశ్వర్. శ్యాందాస్ ఎన్నిసార్లు రెట్టించినా అతను ఆ మిగిలిన వాక్యాన్ని పూర్తిచేయలేదు.

కొద్దిసేపటి తర్వాత "నేను మీకు కొంచెం శ్రమ ఇస్తాను ఏమనుకోరుకదూ. నాకు ఓ చిన్నపని చేసిపెట్టాలి" అన్నాడు గుప్తేశ్వర్.

"మీ పని చేయడం అంటే అది నామహద్భాగ్యంగా భావిస్తాను చెప్పండి. నన్నేం చేయమంటారు ?"

కొద్దిసేపు తటపటాయించి గుప్తేశ్వర్ అన్నాడు. "తమరు మానవాకారంలో సాక్షాత్తు దేవుడిలా నాకళ్లకు కనబడుతున్నారు. తమరంటే నాకెంత గౌరవమో చెప్పలేను. తమకు శ్రమయిస్తున్నాను. పెద్దశ్రమే అనుకోండి. పరోపకారంచేయడానికి కంకణం కట్టుకున్న వారిలా తమరు కనబడుతున్నారు గనుక, ఈ బాధ్యత మీకు అప్పగించకుండా వుండ లేనని అనిపిస్తోంది."

శ్యాందాస్‌బాబు నేలవంక చూస్తూ కూర్చున్నాడు. ఐదునిమిషాల తర్వాత అతను బదులు చెప్పాడు— "తమ జీవిత పర్యంతం ఈసేవకుడు తనను అంకితంచేసుకొన్నా డనుకోండి. తమకు నావల్ల ఏపని అవుతుందనుకొంటారో దాన్ని అప్పగించడంకాదు ఆజ్ఞాపించండి. కాని ఒక్కమాట. మాటిమాటికి తమరు "తమరూ..." అని సంబో ధించడం మానేయండి. నేనొక నీచుణ్ని. నేను చేయరాని పాపాలుచేశాను. నా జీవి తంలో నేనో మహాపచారం చేశాను. తమరు విన్నారంటే గగుర్పాటు కలుగుతుంది. అందువల్లే తమరు నన్నింత మర్యాదతో సంబోధించకండి. నేను తమ ఆదరణ పొందేంత అర్హత కలవాణ్ణికాదు."

కృతజ్ఞతతో గుప్తేశ్వర్ కళ్లు నిండాయి. రెండుచేతులూ జోడించి శ్యాందాస్‌కు నమ స్కారంచేస్తూ "మీరు నన్ను ఆకాశానికి ఎత్తేస్తున్నారు. మీ పొగడ్తలో నూరోవంతు ప్రతిభకూడా నాలో లేదనుకొంటాను. మీ వినమ్రతాభావం చూస్తుంటే మీ పెద్దమనిషి తనం నా మనస్సును ఆకర్షిస్తోంది" అని అన్నాడు.

"మీరు నాకు పరమాత్మస్వరూపులు".

గుప్తేశ్వర్ తలకిందకు వంచుకొన్నాడు.

"సరే తమరేదో శలవిస్తానన్నారు. ఆజ్ఞాపించండి".

"లాహోరులో నేను తాకట్టుపెట్టిన నారుమాలుని ఎలాగైనా మీరు తెప్పించిపెట్టాలి. అతని దుకాణం లాహోరు రైల్వే స్టేషనుకు తిన్నగా వుంది. రెండోది. మీరు నా ఈనవల్ని ప్రచురించడానికి ఏర్పాటు చేయగలిగితే చేయించండి. దానివల్లవచ్చే రాయల్టీ అంతా నవల చివరభాగంలో ప్రస్తావించిన వ్యక్తికే పంపేటట్లు చేయండి."

ఎముకలతోనూ, మాంసపు కండరాలతోనూ నిండిన శ్యాందాసు శరీరం కొయ్యబారి పోయింది. అతనికళ్ళు గుప్తేశ్వర్ కళ్ళనే చూస్తున్నాయి.

దారితప్పి కొంచెం దూరంపోయి మళ్ళీ వెనక్కు తిరిగిన ప్రయాణీకునిలా గుప్తేశ్వర్ వైపు చెవులు నిక్కిస్తూ శ్యాందాసు అన్నాడు-- "క్షమించండి. పరాకుగావుండి మీరేం చెప్పుతున్నదీ ఆలకించలేదు. ఏమి చెప్తూవున్నారు ?"

గుప్తేశ్వర్ మళ్ళీ తన రెండు కోర్కెల్నీ బయటపెట్టాడు.

లోలోన రగులుతోన్న దావానలాన్ని ఆపుకొంటూ "మీ ఆజ్ఞశిరోధార్యం. మీ రెండు కోరికల్నీ మహదానందంతో నెరవేరుస్తాను. మీరేంపేరు చెప్పారు ? సదాకౌర్ కదూ ? ఆమె మీకేమైన బంధువా ?"

"అవునండి".

"మరి మీ నివాసం ?"

"ప్రస్తుతం ఇదే. దీన్ని మీరు కాదన్నా యిదేనాకు ఓ పెద్దమహలు."

"మీ సౌశీల్యంవల్ల మీరలా అంటున్నారు. మీది ఏవూరు ?"

కాగితాలు సర్దుకుంటూ శ్యాందాస్ అడిగిన ప్రశ్నను దాటేశాడు అతను.

ప్రసంగాన్ని మారుస్తూ "మీరు చాలా అలసిపోయారు. కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండి. మళ్ళీ డ్యూటీకి వెళ్ళాలను కొంటాను" అన్నాడు గుప్తేశ్వర్.

"లేదులెండి. ఈరోజు ఆదివారం. సరే. మళ్లీమాట్లాడుకొందాం" అంటూ శ్యాం దాస్‌బాబు కొద్దిసేపు ఆగి "మీరుమాలు సంగతే మరచాను. ఇవ్వాళ ఆదివారంగా వెళ్ళి తీసుకొచ్చి మీకిస్తాములెండి, అన్నట్లు అతని దుకాణం ఎక్కడవుందీ ?

గుప్తేశ్వర్ మళ్ళీ ఆదుకాణం అడ్రసు చెప్పాడు.

"బాబుగారూ, మీరిక్కడ ఎన్నాళ్లనుంచి ఉంటున్నారు?" అని అడిగాడు గుప్తేశ్వర్.

"ఇక్కడికొచ్చి పదిహేడు - పద్దెనిమిది సంవత్సరాలైంది"

"అయితే ఇక్కడమీకు మాంచి పలుకుబడి వుండొచ్చు"

"మీ దయవల్ల చాలామంది నన్నెరుగుదురు".

ఆ మాట వినగానే గుప్తేశ్వర్‌కు ధైర్యం వచ్చింది. వెంటనే అడిగాడు--

"నేనో మనిషిని వెదకుతున్నాను. అతణ్ణి వెదకడంలో మీరునాకు సాయపడగలరను కొంటాను. రెండేళ్ళుగా ఆ మనిషిని వెదుకుతున్నాను. కాని అతనిజాడ యింతవరకు

దొరకలేదు. మీరీ విషయం వింటే నవ్విపోతారు. నేనా మనిషిని ఇంతవరకు చూడను కూడా చూడలేదు. అతను ఎలావుండేదికూడా తెలియదు. అతని రూపురేఖల్ని గురించి తెలిసినా ఈపాటికి అతనిజాడ కనిపెట్టేవాణ్ణే''.

''ఆయన గురించి మీకు తెలిసినంత వరకు నాకు చెప్పండి. ఎలాగోలాగ ఆయన ఉనికిని పట్టేద్దాం. రైల్వేలోవున్నానేమో రోజూ కొత్తకొత్త మొహాలు చూస్తుంటాను. రైల్వేవాళ్ల దృష్టిలోంచి తప్పించుకొన్న మనిషి ప్రపంచంలో ఎవరూ వుండరు. త్వరగా చెప్పండి''.

'' నాకు అతని పేరుమాత్రమే తెలుసు. మరేం తెలీదు అతని గురించి ''.

'' పోనీ పేరు చెప్పండి.''

'' అతనిపేరు తారాచంద్ '' అంటూ చెప్పాడు గుప్తేశ్వర్. అంతలోకే మళ్ళీ '' మీకు వళ్ళు నల్తగా వున్నట్లుంది. నిద్రలేకపోవడంవల్ల కాబోలు. ఈరోజు లాహోరు వెళ్లొద్దులెండి. రుమాలు సంగతి తర్వాత చూద్దాం. మీరు కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండి. ఏమిటి ! మీ ముహం అలా పాలిపోయింది ?'' అని ప్రశ్నార్థకంగా శ్యాందాస్‌వైపు చూశాడు.

శ్యాందాస్ జేబులోంచి రుమాలుతీసి నుదుటిమీద చెమటను తుడుచుకొన్నాడు. ఓ దగ్గు దగ్గి గొంతును సవరించుకుంటూ '' మీరు ఖంగారు పడకండి. నాకు అప్పుడప్పుడు ఇలాకావడం మామూలే. ఆఁ ! ఏం చెప్పారు ? తారాచంద్ మొదట్లో ఎక్కడ ఉండే వాడూ ?'' అని కుతూహలం ప్రదర్శిస్తూ మళ్ళీ అడిగాడు.

'' మొదట్లో ఆయన సియాల్‌కోటలో వుండేవాడు. చూడండి, మీ గొంతు వణుకుతోంది. వంట్లో బాగాలేదేమో. కాస్సేపు మంచంమీద పడుకోండి''.

శ్యాందాసుకు గాభరా హెచ్చింది. రుమాలును విసనకర్రలా వూపుతూ '' ఓహో అతనా ! అతణ్ణి నేను బాగా ఎరుగుదునులెండి '' అన్నాడు. అన్నాడేకాని మొహం వల్లబడింది. చేతులు బిగుసుకుపోతున్నాయి, ఉబ్బసం రోగిలా ఆయాస పడుతున్నాడు.

'' ఏమిటీ ! మీకు అతను తెలుసా ! బాగానా ?'' ఆమాట వినగానే గుప్తేశ్వర్ సంతోషానికి హద్దులేకపోయింది. పోయిన ఖజానా దొరికినట్లయింది. ఉల్లాసంతో ఓ గంతేశాడు. శ్యాందాసు పరిస్థితిని కూడా ఖాతరుచేయలేదు. తొందరపెడ్తూన్న స్వరంలో—

'' అతనెక్కడ ఉండేది దయచేసి త్వరగా చెప్పండి. ఓసారి ఆయన్ను పరిచయం చేస్తారా ?'' అని అడిగేశాడు.

"ఒక్క పర్యాయం కాదు. వందసార్లు పరిచయం చేస్తాను. నాకు అతను బాగా తెలుసు" అంటూ వెర్రివాడిలా కళ్లు పెద్దవిచేసి గుప్తేశ్వర్ ముఖంలోకి చూశాడు.

పుబుకుతోన్న ఆనందాన్ని నిగ్రహించుకొంటూ "అతనెక్కడ ఉంటాడు? ఏంపని చేస్తాడు?" అని మళ్ళీ అడిగాడు.

"లాహోరులో మకాం. అక్కడేదో ఆఫీసులో పనిచేస్తున్నాడు"

"మీకు పుణ్యముంటుంది. ఇవ్వాళే పరిచయంచేస్తారా? ఎప్పుడు రమ్మంటారు మీతో?"

"సాయంకాలానికి తీసుకరాగలననుకొంటా"

"ఎంతమంచివారు శ్యాందాస్‌బాబూ మీరు! నానెత్తిన పాలు పోశారు. మీకు లక్ష సార్లు చేయెత్తి మొక్కుతాను. మీరు నాజీవితంలో ఎంతకీ విడివడని ఓజటిల సమస్యను పరిష్కారం చేసేశారు. నేను మీకెంతో ఋణపడ్డాను. మీరు చాల అలసటగా వున్నారనీ మీ ఆరోగ్యం బాగా లేదని నాకు తెలుసు. అయినా మీకు శ్రమ ఇవ్వకుండా ఉండలేను. మీరు ఎంతశ్రమపడైనా సరే అతణ్ణి చూపించాలి."

ఈ సంభాషణ జరిగిన తర్వాత ఇద్దరూ పడుకొన్నారు. కాని ఎవరికీ కన్ను మూత పడలేదు.

నౌకరు వేళకు వంట ముగించి పిలిచేసరికి ఇద్దరూ లేచి స్నానంచేసి భోజనం చేశారు. నవల పూర్తిచేయమని గుప్తేశ్వర్‌కు చెప్తూ శ్యాందాస్‌బాబు పదకొండు గంటల రైలుకు లాహోరు వెళ్లాడు.

గుప్తేశ్వర్ ఇవ్వాళ ఆనందంతో పూగిపోతున్నాడు. జీవితంలో ఎప్పుడూ అంత ఆనందాన్ని అనుభవించలేదు అతను.

ఆరోజు అతని దగ్గిర కావలసినన్ని కాగితాలు వున్నాయి రాయడానికి. కావలసిన సరంజామా అంతావుంది. రాయడానికి తగిన ఏకాంత వాతావరణం. ఇక మనస్సైతే ఎప్పుడూ లేనంత హుషారుగావుంది. కాని రాయడానికి కావలసిన కథావస్తువేలేదు. వేటకానికి పిట్టదొరికే సమయంలో సాధనాలు లేకుండా వున్నాయి. తీరా సాధనాలన్నీ వాటంతట అవే సమకూరేటప్పటికి వేటాడాలన్న అభిరుచి లేకుండాపోయింది. భోజనంచేసి మంచంమీద పడుకున్నాడు. కాని తారాచంద్‌ను కలుసుకోవాలన్న ఆత్రంలో అతనికి నిద్రపట్టలేదు.

శ్యాందాస్‌బాబు తారాచంద్‌ను వెంటపెట్టుకొని ఎప్పుడొస్తాడా అనుకుంటూ అశుభఘడియలు ఎదురుచూస్తున్నాడు. గంటలూ, నిమిషాలూ, సెకన్లూ గడిచిపోతూంటే లెక్క

పెడుతున్నాడు. అతనిదృష్టి అంతా ఎదురుగా గోడమీద తగిలించిన గడియారం ముల్లు మీదే లగ్నమైంది. అయిదు గంటలైంది. ఏమీ తోచక గుమ్మం బయటకు వెళ్ళి పచార్లు చేయసాగాడు గుప్తేశ్వర్. అటు ఏ టాంగా వెళ్ళినా అతని గుండె ఆదుర్దాతో కొట్టుకోంటుంది. ఎన్నో టాంగాలు అటువైపునుంచి వెళ్ళాయి. కాని అతను ఎదురు చూస్తున్న వ్యక్తిమాత్రం రాలేదు. అతనిఓర్పు సన్నగిల్లుతోంది.

చివరికో టాంగా వచ్చింది. కాని దాన్లోంచి ఒక్క శ్యాందాసుబాబు మాత్రమే దిగాడు. గుప్తేశ్వర్ ఆదుర్దాను గ్రహించి "వారూ వస్తూన్నారు" అని చెప్పాడు.

ఆ మాట వినగానే గుప్తేశ్వర్‌కు ప్రాణం లేచివచ్చింది. "ఏరీ ? ఎక్కడా ?" అని అడిగాడు.

శ్యాందాస్‌బాబు రొప్పుతూ వున్నాడు. అతని ముఖం వివర్ణమైంది. శరీరం యావత్తూ కంపిస్తోంది. అతని పరిస్థితి చూసి గుప్తేశ్వర్ ఖంగారుపడ్డాడు. "ఏమిటీ విశేషం? మీరెందుకు అలా అయిపోతున్నారు ? ఇంకా మీ ఆరోగ్యం కుదుటపడలేదా ? ఆదుర్దాగా అడిగాడు గుప్తేశ్వర్.

మనసులో పెరిగిపోతూన్న గాభరాను దాచుకోడానికి ప్రయత్నిస్తూ కృత్రిమంగా ఓ నవ్వు నవ్వాడు శ్యాందాస్. "విశేషం ఏమీలేదు. బండి రావడం ఆలస్యమైతే లారీలో ఎక్కివచ్చాను. దారిలో లారీ ఏక్సిడెంటు అయింది. ఒక చెట్టుకు గుద్దుకొంది. కొంత మందికి దెబ్బలు తగిలాయి. నాకు పెద్ద దెబ్బేమీ తగల్లేదనుకోండి. కాని ఆ ఏక్సిడెంటును చూడగానే చిన్నషాకు తిన్నట్టయింది. అంతే అప్పటి నుంచీ ఒకటే గాభరాగావుంది".

"అయితే లోపలికి పదండి. కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. వేడివేడి పాలు తెమ్మనమని నౌకరుకు చెప్తాను..." అంటూ గుప్తేశ్వర్ కూడా ఖంగారుపడ్డాడు.

"లేదు మహాశయా, అటువంటిది ఏమీలేదు. నేను స్టేషన్‌దాకా వెళ్ళొస్తాను. మా జనరల్ ఆఫీసరుగారు ఈ రోజు క్యాంపుకు వెళ్తున్నారు. ఈ రూటులోనే వెళ్తున్నారు. అందువల్ల మాస్టాఫ్ అంతా అక్కడవుండడం అవసరం. ఇదిగో మీ రుమాలు తెచ్చాను" అంటూ గుప్తేశ్వర్ చేతిలో రుమాలు పెట్టాడు. అతను మాట్లాడుదామనుకుంటుండగానే వెళ్ళి టాంగా ఎక్కి "మిస్టర్ తారాచంద్ ఆరుగంటలకు వస్తాడు. ఇక్కడే మీరు అతణ్ణి గురించి వేచివుండండి. నాలుగుంపావుకు రైలుంది. బహుశా దానిలో ఎక్కివుంటాడు" అనిచెప్పాడు.

చూస్తుండగానే టాంగా కనుచూపుదాటిపోయింది. ఆరుగంటలు కాదు ఏడుకొట్టినా తారాచంద్‌రాలేదు. గుమ్మంలో నిలబడివచ్చేపోయే వాళ్ల ముఖాల్ని పరీక్షగా చూస్తూ నిల్చున్నాడు గుప్తేశ్వర్.

చీకటి వ్యాపిస్తోంది. అంతలోనే ఆమసక చీకటిలోంచి పొడుగాటి ఓ మనిషి వచ్చి గుప్తేశ్వర్‌కు ఎదురుగా నిల్చోని "శ్యాందాస్ బాబు ఇల్లు ఇదేనా" అని అడిగాడు.

అతడే తారాచంద్ అనుకున్నాడు గుప్తేశ్వర్.

"రాండి రాండి. మీపేరేనా తారాచంద్ ?" అని గుప్తేశ్వర్ అడిగాడు. అవునన్నట్లు తలవూపుతూ అతను లోపలికొచ్చాడు. గదిలో కుర్చీలో కూర్చోమని గుప్తేశ్వర్ సౌంజ్ఞ చేశాడు.

తారాచందు కుర్చీలో కూర్చున్నాడు. ఓవర్‌కోటు ధరించాడు. కళ్ళకు నల్లటి కూలింగుగ్లాసువుంది. తలమీద పాగావుంది కాని చేతకానివాడు కట్టుకొన్నట్లుగావుంది. చలిగురించికాబోలు ఓవర్‌కోటు కాలరు పైకి ఎత్తబడివుంది.

ఇద్దరూ ఎదురు బదురుగా కుర్చీల్లో అలా చాలాసేపు కూర్చుండిపోయారు. చివరకు గుప్తేశ్వర్ ఆనిస్తబ్దతను భంగంచేస్తూ అన్నాడు—

"తారాచందంటే మీరేనా ?"

అతను నోరు కదల్చకుండా అవునన్నట్లు తల ఆడించాడు.

"మీగురించే నన్నమాట నేను ఇన్నాళ్ళు తిరిగి తిరిగి విసిగి వేసారింది. మీరక్తాన్నే కళ్లచూద్దామని ఇన్నాళ్లనుండి నేను జీవిస్తోంది ?" గుప్తేశ్వర్‌కళ్ళు ఎఱ్ఱబారినయ్. గొంతులో తీవ్రత హెచ్చింది.

తారాచందు ఏమాత్రం తొణకలేదు. అలాగే శాంతంగా కూర్చుని సమాధానమిచ్చాడు. "అంటే మీ వుద్దేశ్యం ?"

గుప్తేశ్వర్‌లో క్రోధం హెచ్చిపోతోంది. అతను వణకిపోతున్నాడు. అతని అణువు అణువూ ప్రతీకారాన్ని కోరుతూ ఘోషపెడుతోంది.

"ఏమన్నావురా ! నా వుద్దేశం నీకర్థంకాలేదా ? దానిఅర్థం చెప్పడానికేరా ఇన్నాళ్లు దేశద్రిమ్మరిలా తిరుగుతున్నాను". గుప్తేశ్వర్‌లో విగ్రహం నశించింది. అతనికోపం కట్టలు తెంచుకొంది.

"ఇంతకీ మీరెవరో తెలుసుకోవచ్చా" అని తారాచంద్ ప్రశ్నించాడు.

"తప్పకుండా. గుర్దేయిని ఎరుగుదువా ?" గద్దించి అడిగాడు గుప్తేశ్వర్.

"ఎరుగుదును. కాని నీకు ఆమెకు సంబంధం ... ?"

"సంబంధం నీకు తెలియజేయడానికే ఇన్నాళ్లూ నిప్పు గాలిస్తోంది. అవునవును. ఆమె నాకేమవుతుందీ ?"

"ఆమెనా ఇల్లాలు."

"మరైతే ఇప్పుడెక్కడుంది ?"

తారాచంద్ మౌనంగా కూర్చున్నాడు.

"బతికుందో లేక చనిపోయిందో నీకేమైనా తెలుసా ?" గుప్తేశ్వర్ ప్రశ్నించాడు. తారాచందు చెక్కు-చెదరకుండా జవాబిచ్చాడు— "చనిపోయిందని విన్నాను."

"ఎవరు చెప్పారు ?"

తారాచంద్ మాట్లాడలేదు.

గుప్తేశ్వర్ మళ్ళీ గద్దించాడు. "అబద్ధం. పచ్చి అబద్ధం. నువ్వు కిరాతకుడివి. నీకు ఆమె గురించీ ఏమీ తెలీదు. తెలుసుకోవలసిన అవసరమూలేదు. నీకు తెలిసిందల్లా నువ్వామెను మృత్యుముఖంలో అర్ధరాత్రి వదిలేసి వెళ్ళిపోవడం. అంతే. తర్వాత ఆమె ఏ అధోగతి పాలైందీ నీకు అవగింజలో ఆరోవంతుకూడా తెలీదు."

తారాచంద్ ఆపాదమస్తకం కంపించిపోతున్నాడు. నోటమాట రావడంలేదు.

గుప్తేశ్వర్ కోపాన్ని నిగ్రహించు కోలేకపోయాడు. కుర్చీలోంచి గబాలున లేచాడు. రెండు పిడికిళ్ళు బిగించి సింహంలా అతనిమీదకు లంఘించాడు. ఒకచేత్తో అతనిమెడ గట్టిగా పట్టుకొన్నాడు. రెండోచేత్తో కోటుతగిలించుకొన్న అతని భుజాన్ని గాట్టిగా వూపుతూ "నీచుడా ! నరరూపరాక్షసుడా ! నంగిలా ఎందుకు మాట్లాడవూ ? అమాయకునిలా నటిస్తే నిన్ను వదిలిపెట్టేస్తాను అనుకొన్నావా ? ప్రపంచంలోని ఏ శక్తీ నిన్ను నామంచి కాపాడలేదు" పళ్లు పటపటమని కొరుకుతూ తన కోటుజేబులోంచి కత్తిబైటికి తీసి గర్జించాడు. "ఇప్పుడే ఈ కత్తితో నిన్నుపొడిచి నీరక్తాన్ని దోసిళ్ళతో తాగుతాను. అప్పటుకాని నాదాహం తీరదు. అంతవరకు నాలో ఇనాళ్ళనుంచీ రగుల్కొంటొన్న అగ్నిపర్వతం చల్లారదు. శ్యాందాసుబాబు లాంటి పుత్తముని ఇంటికి నీలాటి ఛండాలుణ్ణి పిలిపించి అతనికి అన్యాయం చేస్తున్నానని నాకు తెలుసు. ఈ పవిత్రమైన స్థానంలో పాపంతో లుకలుక మంటోన్న నీరక్తాన్ని చిందించి నేనాతనికి అపచారం చేస్తున్నానని తెలుసు. కాని ఇప్పుడా మాటలకు నేను విలువఇవ్వను. నువ్వుచేసిన ఘోరపాపాలు గురించి వారికి తెలిసిన తర్వాత వారు నా తప్పును క్షమించడమేకాక నేను మానవ రూపంలో వున్న ఓ దానవుణ్ణిచంపి భూమాత భారంతగ్గించానని మెచ్చుకొంటారు.

చెప్పు తొందరగా !... సరే. నువ్వు చెప్పకపోతే నాకు తెలుసుకోవాల్సిన అవసరం కూడాలేదు. నువ్వు నాతల్లిని పొట్టబెట్టుకొన్న హంతకుడవని తెలియడమే నాకు చాలు.

ఆమె సతీత్వాన్ని – ఆమె శీలాన్ని అపహరించిన దొంగవు. నిన్ను ఐదునిమిషాల్లో అంతంచేయబోతున్నా. ఏమైనా చెప్పుకోవాల్సింది వుంటే వెంటనే చెప్పుకో."

తారాచంద్ అలాగే కంపిస్తూ వున్నాడు. క్రిందకు వంచిన కళ్ళను అతను ఎత్తనే లేదు. ఎన్నిసార్లు గుప్తేశ్వర్ బెదిరించినా అతను సమాధానం చెప్పలేదు. నోరు విప్ప లేదు.

అతని మౌనాన్నిచూసి గుప్తేశ్వర్ సహించలేకపోయాడు. ఉరుములా గర్జించాడు.

" ఒరే ఘాతకుడా ! చెవులు నిక్కపెట్టి విను. ఒక అనాథను – ఆశ్రయంలేని ఒక ఆబలను మోసగించి, ఆమెను వలలో వేసుకొని ఆమె శీలాన్ని దోచుకొంటూ సిగ్గూ ఎగ్గూలేకుండా పచ్చి బాలింతరాలిగా వున్నప్పుడు కొంచెం కూడా కనికరం చూపించక ఆమెనూ, అప్పుడే భూమిపై కళ్ళు తెరచిన ఆమె పసికందునూ ఆ పంచా ఆ పంచా అడుక్కు తినమని చెప్పి కష్టాలు పడండని నిర్దాక్షిణ్యంగా గాలికి వదిలేసి, చివరికామె లజ్జవిడిచి శరీరాన్ని అమ్ముకొని బతికే వారకాంతగా మారి పొట్టపోసుకోడానికి కారకుడైన నీలాంటి పరమదుర్మార్గుడికి – అత్యాచారికి – మనిషి అనిపించుకొనే హక్కు ఎవరి చ్చారు ? మనిషిగా జీవించడానికి ఎవర్రా అధికారం ఇచ్చింది ?"

తారాచందు రాతిప్రతిమలా అలాగే కూర్చున్నాడు.

" అటువంటి ఛండాలుడికి ఇంకా బ్రతుకుతూ భూభారాన్ని పెంచే హక్కుందంటావా? నువ్వే న్యాయం చెప్పు. తొందరగా చెప్పు. అటువంటి పాపికి బ్రతికి వుండడానికి అర్హతవుందా ?" అని గుప్తేశ్వర్ మళ్ళీ రెట్టించాడు.

" లేదన్నట్లుగా రాతిప్రతిమ తల ఆడించింది

" అయితే నువ్వు చావడానికి సిద్ధంగా వున్నావా ?"

అవునన్నట్లుగా రాతిప్రతిమ తలవూపింది.

" అయితే సిద్ధంగావుండు " అంటూ గుప్తేశ్వర్ శరవేగంతో కత్తిఎత్తాడు. గుప్తేశ్వర్ ముఖంపై వుప్పెనగా వస్తోన్న రౌద్రాన్ని చూసి ఇంకొకరైతే భయపడి అక్కడి కక్కడే ప్రాణం వదిలేసేవారు.

అప్పటికి గదిలో చీకటి వ్యాపించింది. కత్తి సరిగా అతని గుండెల్లో గుచ్చుకుంటుందో లేదో అని ఎత్తిన చేతిని అలానే ఆపుచేసి రెండోచేత్తో స్విచ్చి నొక్కాడు గుప్తేశ్వర్. గది అంతా వెలుతురులో ఒక్కసారి ప్రకాశించింది. తారాచందు పారిపోతాడేమోనని అదేచేత్తో తనపక్కనే వున్న తలుపుగొళ్ళెం పెట్టాడు,

ఆ వెలుతుర్లో వణుకుతోన్న చేతుల్తో కమీజూ ఓవర్‌కోటు గుండీలు విప్పుతూ తారాచంద్ కనిపించాడు. అతను నిర్భయంగా చొక్కా గుండీలు కోటుగుండీలు విప్పుతూంటే గుప్తేశ్వర్‌కు మతిపోయింది. ముందుగానే చావడానికి సిద్ధమై వచ్చినట్లుగా తోచింది. అలాకాక తన మనసును మెత్తపరచాలని ఈపథకం వేస్తున్నాడని తనకు తాను సర్ది చెప్పుకొన్నాడు గుప్తేశ్వర్.

ఇంకా ఆలస్యం చేయడం మంచిది కాదని ఒక్కకత్తివేటుతో పనిపూర్తిచేద్దామని అతని మీదకు దూకాడు. కాని అతని కత్తి తారాచంద్ గుండెల్లోకి దూసుకొనిపోయి రక్తం చిందకముందే అతని చేతిలోని కత్తి అలాగే ఆగిపోయింది. తారాచందుమీద దృష్టిపడగానే గుప్తేశ్వర్ హఠాత్తుగా ఆగిపోయాడు. అతని చెయ్యి అమాంతంగా వెనక్కి వగ్గింది. అతను ఒకడుగు ముందుకు వేశాడు. మెడ నొక్కిపట్టడంలో తారాచందు తలకు కట్టుకొన్న పాగా వూడిపోయి తను కళ్ళకు పెట్టుకొన్న చలవకళ్లద్దాలు ఒక భాగం చెవి నుంచి జారి తలపాగాలో ఇరుక్కుపోయాయి. ఒక కన్ను స్పష్టంగా కనపడుతోంది. అతని శరీరాన్ని తాకి చూశాడు గుప్తేశ్వర్. శరీరం అంతా చెమటలో స్నానం చేసినట్లయి మంచుకన్నా చల్లగావుంది.

కెవ్వనకేకవేసి గుప్తేశ్వర్ వెనక్కి తగ్గాడు. అతనికి కళ్లు బైర్లు కమ్మినట్లయింది. మళ్ళీ అతని మొహానికి దగ్గరగా వెళ్ళి కళ్లజోడు తీసేశాడు. "ఆఁ మీరా బాబుగారూ?" అని పెద్దగా అరిచాడు.

గది అంతా తిరుగుతోన్నట్లుగావుంది గుప్తేశ్వర్‌కు. అంతా ఇంద్రజాలంగా వుంది. అలానే అతన్ని గుడ్లు అప్పగించి ఎంతసేపు చూశాడో అతనికే తెలియదు. మళ్ళీ కత్తిని పైకెత్తాడు. అంతలోకే దాన్ని మళ్ళీ దించేశాడు. అతని చేతిలోంచి కత్తి నేల మీదికి జారిపడిపోయింది.

గుప్తేశ్వర్ ఒళ్లు తెలియని వుద్రేకంతో తారాచంద్‌ను గట్టిగా కావిలించుకొన్నాడు. ఆ ఆలింగనాన్ని మరింతగట్టిగా బిగియపట్టి ఏడుస్తూ శ్యాందాస్‌బాబు "ఓ కిరాతకుని దురదృష్టపు కూతురా! నువ్వు నీ కసాయి తండ్రి ఇంకా జీవిస్తూంటే చూసి సహిస్తున్నావా?" అన్నాడు బొంగురు గొంతుతో.

అతని కళ్లు నేలమీద వెతకసాగాయి. ఏదో కనపడింది. అంతే. సుందరిని ఒక్క తోపుతో పక్కకుతోసి శరవేగంతో లేచి నేలమీదకు వంగాడు. మరుక్షణంలో కత్తి అతని చేతిలోకి వచ్చేసింది. కత్తిమొనను గుండెకు గురిచూసుకొని చేతిని వెనక్కిలాగి ఒక్క వూపుతో గుండెవైపుకు పోనిచ్చాడు. కాని అంతలోకే గుప్తేశ్వర్ తన బలాన్నంతా ప్రయోగించి రెండుచేతుల్తోనూ అతని మణికట్టును పట్టుకొన్నాడు. గుప్తేశ్వర్ చేతుల్లు

భయంతో కంపించసాగాయి. ప్రేమలో తడిసిన సన్నని స్వరం అతని చెవుల్లో వినిపించింది. "నాన్నగారూ, మీరాపని చేయవద్దు. జరిగిందేదో జరిగిపోయింది" అంటూ గుప్తేశ్వర్ వేషంలో వున్న సుందరి కళ్ళల్లో భయాన్ని నింపుకొని శ్యాందాస్‌వైపు దీనంగా చూసింది.

శ్యాందాస్ ఆమె గొడవవినే ధోరణిలోలేడు - "నువ్వు తప్పుకో తల్లీ. దుర్మార్గుడైన నీతండ్రిని రక్షిస్తావా? అవును. బతికివుండగానే చచ్చి నీముందు ఈపాపపు జీవితాన్ని మోస్తూ బతకడం వెయ్యిసార్లు చావడంకంటే కనాకష్టం అమ్మా! అందుకే నేను వేషం మార్చి వచ్చింది. అదే వేషంలో వుంటే నువ్వు చంపలేవని తెలుసు. సుందరీ, త్వరగా నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకో తల్లీ. నేనీ పాపాలమూటను మోయలేకపోతున్నాను. బతక నివ్వకు. చచ్చి స్వర్గానవున్న నీతల్లి ఆజ్ఞను పాలించి నీ ధర్మాన్ని నువ్వు చెల్లించుకో. లేకపోతే నీతల్లి ఆత్మకు శాంతి కలుగదు. ఆమె ఆత్మ ఎప్పుడూ క్షోభిస్తూనే వుంటుంది".

సుందరి తండ్రికి చేయూతనిచ్చి ప్రేమతో లేపింది. మంచంమీద కూర్చోబెడుతూ అతని మెడలో చేతులువేసి మెల్లగా అంది—

"నాన్నగారూ, నా కర్తవ్యం పూర్తి అయిపోయింది. నాతల్లి ఎవరిని చంపమని నాకు ఆజ్ఞ ఇచ్చిందో నేను చంపకముందే అతను చచ్చిపోయాడు. అతని చెడుఅల వాట్లూ దుర్వ్యసనాలూ అన్నీ చచ్చిపోయాయి. ఇప్పుడు తన జీవితం ఓ పవిత్రమైన మహావ్యక్తి జీవితంలా మారిపోయింది".

శ్యాందాస్‌బాబు రెండు చేతులూ మొహానికి అడ్డం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్వడం మొదలెట్టాడు. సుందరి అతని దగ్గరగా కూర్చొని తండ్రి తల నిమురుతూ అంది— "నాన్నగారూ. మీరు కలకాలం జీవించాలి. మీరు జీవించడం నాకు అవసరం".

తండ్రి ఏమీ మాట్లాడటం లేదు. సుందరే మరల అందుకుంది — "లెండి నాన్నగారూ, మీ కూతుర్ని ముద్దాడండి. నేనే మీ సుందరిని. నావైపుచూడండి".

తండ్రి విగ్రహం కట్టలు తెంచుకుంది. కూతురి నుదుటి భాగాన్ని శ్యాందాస్ ఎన్నో సార్లు ముద్దాడాడు. కాని నోట్లోంచి ఒక్క మాటకూడా పెకిలిబైటికి రావడంలేదు. అలా తండ్రీ కూతురూ కన్నార్పకుండా ఒకరినొకరు చూసుకుంటూ చాలాసేపు వుండిపోయారు. కళ్ళతోనే అన్ని మాటలూ మాట్లాడుకున్నారు.

"నాన్నగారూ, మీరు నన్ను ముందుగానే గుర్తించారా?" అని అడిగింది సుందరి.

"పూర్తిగా గుర్తించలేదు తల్లీ. కాని నిన్ను చూడగానే మనస్సులో ఏదో సందేహం మొదట్నుంచి కలకవేస్తూనేవుంది. నువ్వు ధుమాలు అడిగిన తర్వాత నా సందేహం బల

పడింది. తర్వాత నువ్వు నేను ఎక్కడ వుండేదీ ఏమిచేసేది అని అడిగిన తర్వాత గుప్తేశ్వరే సుందరని నిర్ధారణ చేసుకున్నాను. నీ రుమాలు చూడగానే నా సందేహం పూర్తిగా తీరిపోయింది".

బచన్‌సింగును వురితీసిన తర్వాత ఆ రుమాలుమీద "అభాగ్యురాలు సుందరి పోగొట్టుకొన్న మణికిరీటపు చివరిచిహ్నం" అని దారంతో తాను కుట్టుకున్న విషయం సుందరికి జ్ఞాపకం వచ్చింది.

శ్యాందాసు చెప్పడం ప్రారంభించాడు -

"స్టేషన్లో నిన్ను పట్టుకొన్నప్పుడే నువ్వెవరవో పరిచితమైన వ్యక్తిలా అనిపించావు. నిన్ను చూడగానే నా కళ్ళలో నీఅమ్మే మెదిలింది. నీ కళ్ళు అచ్చం మీ అమ్మకళ్ల లాగే వున్నాయి. ఒక్కముక్కలో చెప్పాలంటే, పద్దెనిమిది సంవత్సరాల తర్వాత మొదటి సారిగా నిన్ననే నీ కళ్ళలో మీ అమ్మను చూశాను. ఒకర్నిపోలిన మరొకరు ప్రపంచంలో వుండడం సహజంకాదా అనుకొని ఆ విషయాన్ని ఎక్కువగా పట్టించుకోలేదు.

కాని తల్లీ, నీ జీవిత గాధనంతా రాత్రిచదివి వినిపించావుకదా. దాన్లో ఎక్కడా రుమాలు ప్రసక్తిరాలేదేం? అని అడిగాడు తండ్రి.

సుందరి కళ్ళు దించుకొని సమాధానం చెప్పింది. "రోడూతాత దగ్గర ఉంటున్నప్పుడు "వారు" ఓరోజు మాగుడిసెకు వచ్చారని నేను నవల్లో రాశానుకదూ. ఆరోజే మాలచ్చో తప్పిపోయింది. నేను ఏడుస్తూ కూర్చుంటే వారు జేబులోంచి రుమాలుతీసి నా కళ్లు తుడిచారు. అప్పట్నుంచీ ఆరుమాలు నాదగ్గిరేవుండి పోయింది. అదొక్కటే వారి జ్ఞాపకంగా..." అంటూంటే సుందరికళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె మనసు గతాన్ని తలుచుకొని బరువెక్కింది.

కూతురి బాధను పంచుకొన్నాడు తండ్రి. ఓ చల్లని నిట్టూర్పు విడుస్తూ మళ్లీ అడిగాడు. "నువ్వు నదిలోదూకి చచ్చిపోయావని రాశావుకదా మరి ఎలా బతికిబైటపడ్డావ్ ?"

"అవునండి. నేను నదిలో దూకి మునిగిపోయాను. నీళ్ళలో అలా తేలుతూ మునుగుతూ చాలా దూరం పోయాను. ఎవరో ఒకముసలి పడవాయన నన్నుచూసి నదిలోదూకి నన్ను ఒడ్డుకు చేర్చాడు. నా ప్రాణం రక్షించాడు. అతన్ని తలవని రోజు లేదు నా జీవితంలో"

"ఆతర్వాత నువ్వు అమృత్‌సర్ వచ్చేశావన్నమాట."

"అవునండి",

"మరి వేషం ఎందుకుమార్చావ్ ?"

"దానికి చాల కారణాలున్నాయి. ఒకటి - పోలీసులు అరెస్టు చేస్తారేమోనన్న భయంచేత. నేను మూడు ఖూనీలు చేశానుగా. రెండోది - వారి అమ్మగారు జీవించి వున్నంతకాలం ఆమెగారి బాధ్యత నాకు అప్పగించి వెళ్లారు. ఆమె పోషణార్థం నేను రచనలు చేస్తుండేదాన్ని. మూడో కారణం - అన్ని రచనల్తో బాటు నా గురించి రాసిన నవల్లోనూ సంఘంలో పేరుకుపోయిన కుళ్లను చిత్రిస్తూ దానికి నగ్నరూపకల్పన చేయాలన్న పట్టుదల. ఇక నాలుగో కారణం - మిమ్మల్ని ..." అంటూ ఆమె ఆగిపోయి కళ్ళు వాల్చేసింది.

కూతురుతల నిమురుతూ "ఇప్పుడు నువ్వు అనుకున్న పనులన్నీ నెరవేరాయిగా" అని ఆప్యాయంగా అన్నాడు.

కొద్దిసేపు సందేహిస్తూ సుందరి అంది. "అవును నాన్నగారూ, నా పనులు అన్నీ అయిపోయినట్లే. ఇప్పుడు అన్ని బాధ్యతల్నుంచి విముక్తురాలనయ్యాను".

"ఇక శాశ్వతంగా నీతండ్రి కళ్లముందు మెసలుతుంటావు కదూ ?"

"అవును నాన్నగారూ, బతికివున్నంతవరకూ, మీ దగ్గిరేవుంటానండి".

పితృప్రేమతో శ్యాందాసు పులకించిపోయాడు. "నా ముద్దుబిడ్డకు ఇప్పుడే గుడ్డలు కుట్టిస్తాను. నువ్వు నీ మామూలు రూపంలో నాకు కనపడాలి సుమా" అన్నాడు.

"అవున్నాన్నగారూ, రేపు నా అసలు రూపంలో మీకు కనపడతాను".

"నా తల్లిని వాళ్లమ్మరూపంలో చూసి ఎంతమురిసిపోతానో !"

"అవును నాన్నగారూ, మీరు మురిసిపోవాలి. మీకు నిజంగా సంతోషం లేకపోయినా మురిసిపోవాలి. జీవితంలో మీకూతురు సాధించిన ఘనకార్యానికి, రేపు నేను నా నిజ స్వరూపంతో కనపడిపోబోతోందుకూ మీరు తప్పక మురిసిపోతారు".

"కూతురు సింగారించుకొని వచ్చి నిలబడితే, ఏతండ్రి సంబరపడడూ ?".

"అవును నాన్నగారూ, గురూకటాక్షంవుంటే అలానే జరుగుతుంది"

"అవునూ నీ నవల్ని ఎలాపూర్తిచేస్తావ్ ?"

"రేపు పుదయానికల్లా పూర్తిచేసి మీముందుంచుతానుగా"

కొంచెంసేపుఆగి సుందరి అడిగింది - "నాన్నగారూ, మీరు మీ జీవితం గురించి ఏమీ చెప్పలేదు".

"తల్లీ నేను ఎంత మహాపాపినో, ఎన్ని కిరాతకాలకు ఒడిగాట్టానో అవన్నీ నీ ముందు ఏకరువు పెట్టలేను భగవంతుని దయవల్ల అవన్నీ నీకు చెప్పలేదు. నీకూ నాకూ కావలసిన అంశం ఒకటే చెప్తాను. ఆరోజురాత్రి మీ అమ్మను వదిలేసి మూటా ముల్లే కట్టుకొని బయల్దేరిన తర్వాత కొన్నిరోజులు దేశదిమ్మరిగా జీవితాన్ని గడిపాను. ఆపైని నాకీ రైల్వేలో పనిదొరికింది. అది కూడా దైవసంయోగమే అనుకో. ఆరోజుల్లో రైల్వేవాళ్ళంతా సమ్మెచేస్తున్నారు. మెయిలుబండ్లుతప్ప ఏరైలూ నడవడం లేదు. రైల్వేశాఖవారు కొత్తవాళ్ళను భర్తీచేసుకోవడం మొదలెట్టారు. అప్పుడే నాకు ఉద్యోగాన్ని ఇచ్చారు. నా గడించిన జీవితం చాలా ప్రమాదాలతో కూడుకుంది. పేరు మార్చుకోకపోతే ముందుముందు ప్రమాదాల్లో నేను చిక్కుకోవచ్చు. అందుకని పేరు మార్చేసుకొన్నాను. పాత పేరుతోనే వుద్యోగంలోవుంటే నేనంతకుముందు చేసిన కుట్రలకూ అక్రమాలకూ ఎప్పుడైనా కోర్టులో నిలబడాల్సొస్తుంది." అంతకన్న మరింకేమీ చెప్పలేదు అతను."

ఆ తర్వాత శ్యాందాస్ బజారు వెళ్ళి కూతురికి కొత్తబట్టలు తెచ్చాడు. రాత్రిపొద్దు పోయేవరకు తండ్రీ కూతురూ మాట్లాడుతూనే వున్నారు.

తెల్లవారింది. శ్యాందాసు లేచి కూతురు పడుకొన్న గదిలోకి వెళ్లాడు. సుందరి యింకా పడుకొని నిద్రపోతోంది. అతను కూతుర్ని పిలిచాడు. పలకలేదు. గట్టిగా తట్టిలేపాడు. ఆమె కదల్లేదు. మొఖంమీదవున్న దుప్పటి తొలగించిచూశాడు. ఇంకేముంది? సర్వనాశనం అయింది. తలపట్టుకుని కూర్చుండిపోయాడు. సుందరి మరిక లేదు. ఆమె శాశ్వతంగా కన్నుమూసింది. నిన్న తాను తెచ్చిన కొత్తబట్టల్లో ఆమె మెరుస్తోంది. ఆమె ముఖం అపూర్వమైన తేజస్సుతో వెలుగుతోంది. పెదవులమీద విజయంతో చిరునవ్వు నాట్యంచేస్తోంది. నిన్న తాను తెచ్చి ఇచ్చిన రుమాలు ఆమె ఛాతిపై పడివుంది. దీర్ఘవియోగం కలిగేముందు ప్రియుని చేతిని ప్రేయసి గట్టిగాపట్టు కొన్నట్లుగా రుమాలును ఆమె గట్టిగా అదిమి పట్టుకొనివుంది. అనుమానంతో తటాలున ఆమె గుండెలమీద నుంచి రుమాలు తీసాడు. అక్కడ ఆ రుమాలుకింద క్రితంరోజు నాటి బాకుపిడి కనిపించింది. పిడికిందిభాగం అంతా ఆమె గుండెలోకి దూసుకొనిపోయి వుంది. శ్యాందాస్ గుండె పగిలింది. గుండెలు బాదుకుంటూ అక్కడే కూలబడిపోయాడు. ఆ పక్కనేవున్న ముక్కాలిపీటమీదకు అతని దృష్టిమళ్ళింది. దానిమీద ఓ కాగితం మడతపెట్టివుంది. ఆశ్చర్యంతో విప్పిచూశాడు. సుందరి ఆత్మహత్యచేసుకొనేముందు తండ్రికిరాసిన వుత్తరం అది. ఉత్తరాన్ని శ్యాందాసు చదవసాగాడు–.

పూజ్యులైన తండ్రిగారికి, మీరు ఎంతో ధైర్యవంతులూ, సాహసం కలవారునూ. ఇప్పుడు మీకు జ్ఞానోదయం కూడా కలిగింది. నేను మిమ్మల్ని ఇంతత్వరగా వదిలి పోతున్నందుకు మీకు విపరీతమైన బాధకలుగవచ్చు. కాని నాన్నగారూ, మీరు నా కథ వింటే నేను చేసిందానికి మీరు ఆందోళన పడినా మీ మనస్సుకు శాంతి లభిస్తుంది.

నా జీవనాధారాన్ని పోగొట్టుకొన్న తర్వాత కూడా రెండున్నర సంవత్సరాలు జీవితాన్ని నెట్టుకుంటూ గడిపానో మీకు తెలియందికాదు. వారి ఆజ్ఞ పూర్తిచేయవలసిన బాధ్యత నామీద ఉంది. వారు లేకుండా కూడా నేను జీవించివున్నానంటే అది వారి మాటల్లోని మహిమే. లేకపోతే వారి ఎడబాటులో ఒక్కక్షణం ఏమిటి - గాలి కూడా పీల్చడం అసంభవం కదా నాకు.

కాని ఇంత జరిగిన తర్వాత కూడా నా మనసు అంతరాంతరాలలో కుంగిపోతోంది. నేను ఓ పాపం చేశాను. కేవలం పాపమేకాదు. నన్ను ప్రాణం కన్న ఎక్కువగా చూసుకొన్న ప్రాణేశ్వరుని ఆజ్ఞధిక్కరించాను. అందుకు నాకు భగవంతుడు ఎలాగైనా శిక్ష విధిస్తాడు. కాని వారుమాత్రం నన్నుక్షమించరని నాకు భయం.

నేను పాలాసింగునూ, అతని జనాన్నీ కాల్చి చంపిపాపంచేశాను. అప్పుడు క్రోధంలో, ప్రతీకారం చేయాలన్న కసిలో గుడ్డిదాన్నయ్యాను. నా మెదడు మీద అవి దుప్పటి కప్పేశాయి. వారు నాకు ఎంతగానో నచ్చచెప్పడానికి ప్రయత్నించారు ; నచ్చ చెప్పారు. నేను కూడా గ్రహించాను; కాని ఎందుకో వారిని అన్యాయంగా చంపించినవారి మీద కసితీర్చుకోడానికి ఇంతకన్న వేరేమార్గంలేదనిపించింది. కాని ఈ నాడు మిమ్మల్ని చూసి నామనోనేత్రం తెరుచుకొంది. మీతో పగతీర్చుకొన్న మార్గమే అన్నింటికన్న సహజ స్వాభావికమైన మార్గం అని తెలుసుకున్నాను. నా రచనల ద్వారా మీ జీవితంలో విప్లవం సాధించినట్లే అదే ఆయుధాన్ని వాళ్ళమీదా ఆ సంఘంమీదా ప్రయోగించివున్నట్లయితే, హృదయానికి బదులు మెదడుతో కత్తికి బదులు కలంపోటుతో నేను ముందుకు సాగిపోతూవున్నట్లయితే, వాళ్ళ జీవితాల్నే కాక బ్రతుకు బాటలువారి దారితప్పి తిరుగుతోన్న ఎన్నో బ్రతుకుల్ని మార్చగలిగివుండేదాన్ని.

కాని ఏంచేయలేను ? దొర్లిపోయిన గతం తిరిగి తేలేను. నాపై దయచూపమని అన్యోన్యక ర్తను వేడండి.

వారి ముసలి తల్లి బ్రతికి వున్నంతవరకు నేనా బాధ్యత స్వీకరించాలని అప్పటివరకు నేను ఏ అఘాయిత్యానికి తలపెట్టనని వారు చేతిలో చేయి వేయించుకొన్నారు. మీరు నాకు కలిసారు. ఇక ఆమె బాధ్యత అంతా మీకే అప్పగించి నేను నిశ్చింతగా నా స్వామిని కలుసుకోడానికి వెళ్ళిపోతున్నాను.

ఆదేకాక అమ్మకిచ్చిన వాగ్దానాన్ని కూడా చెల్లించుకున్నాను. మీ రక్తంతో శాంతిం చాలనుకొన్న ఆమె ఆత్మ మీ పశ్చాత్తాపం కరిగిన కన్నీళ్ళతో ఇంకా ఎక్కువగా శాంతించగలదన్న గట్టి నమ్మకం నాకుంది.

ఇక మిగిలింది నేను నిర్వర్తించాల్సిన ధర్మం అది - అమాయకపు జీవితాలతో నిర్దా క్షిణ్యంగా ఆడుకొంటోన్న ఈ సమాజం బ్రతుకుని బట్టబయలుచేసి నా కథారూపంలో దాన్ని ప్రపంచంముందువుంచడం. ఆపని కూడా నేను సాధించాను. ఇక నా జీవి తంలో సాధించాల్సింది ఏమీలేదు. అందుకే శరీరం అనే ఈ నిర్జీవ అస్తిపంజరాన్ని సంఘం తలపై బాది నా ప్రియుని కౌగిల్లోకి శాశ్వతంగా వెళ్తున్నాను.

మీరు రాత్రి అన్నారు — " తల్లీ, నిన్ను నీ అసలిరూపంలో చూడాలని వువ్విళ్లూరు తున్నాము " అని. మీరు నన్ను నా నిజరూపంలో చూసి సంబరపడిపోతారని ఆశిస్తు న్నాను.

నేను బతికివుండీకూడా నాతండ్రి సంరక్షణలో జీవిత మధువును చవి చూడలేక పోయాను. కాని నాన్నగారూ, ఇక నేను జీవిస్తూ వుండడం కదురులేకుండా రాట్నం పడకటమే అవుతుంది. విరిగిపోయిన మనస్సు, విరిగి వూడిపోయిన కదురూ ఎలా అతు క్కొంటాయి ? ఎన్ని దెబ్బలని తట్టుకొంటాయి ? యథార్థంగా ఇక నేను ఓ పారిపోయిన హంతకునిలా జీవించాలి. ఉరికంబం ఎక్కడానికి బదులు కత్తిపోటును ఆహ్వానించడం లోనే నాకు ఎక్కువ ఆనందం.

నేను జీవించి వున్నంతకాలమూ మీ సన్నిధిలోనే వుంటానని మీకు వాగ్దానం చేశాను. నా వాగ్దానాన్ని నిలబెట్టుకోవడం మీరే చూస్తున్నారుగా ! ఇంతకుముందు మిగిలిపోయిన నవలాభాగాన్ని పూర్తిచేయమని మీరుఎన్నోసార్లు చెప్పివున్నారు. నా రచనా - నాజీవితం— ఈ రెండూ వేరుకావనీ మీకు తెలిసేవుంది. ఈరోజు నా మిగిలిపోయిన నవలను సమాప్తం చేశాను. దాంతోపాటు నా జీవితంలో మిగిలినభాగం కూడా పరిసమాప్తమైంది.

నేను స్వర్గానికి వెళ్లి నా కోసం వేచివున్న నా ప్రియుని కౌగిలిలో ఇంతవరకు అను భవించిన కడగండ్లను మరచిపోతాను. అనంతకాలంవరకూ నా జీవనాధారం పాదాల్ని సేవిస్తూ వుండాలని మీరు నన్ను మనసారా ఆశీర్వదించండి.

ప్రియమైనతండ్రీ ! ఇదే నీ ముద్దుల కూతురు చేసే చివరి నమస్కారం. జీవితంలో మొదటిసారీ, చివరిసారీ మిమ్మల్ని కలుసుకొని మీనుండి విడిపోతోన్న ఓ పాంథురాలు-

మీ ... ...

సుందరి.

— —

# తయారీలోనున్న పుస్తకములు

## భారత దేశము – ప్రజలు

1. పక్షులు
2. సామాన్య భారతీయ పక్షులు
3. భారత దేశము – ఒక పర్యావలోకనము
4. భూమి, మన్ను
5. కూరగాయలు
6. నాణెములు
7. భారతదేశ భౌతిక భూగోళము
8. మొక్కల తెగుళ్లు
9. ఔషధీ బీజములు
10. అంతరిక్ష యాత్ర

## జాతీయ జీవిత గ్రంథమాల

11. హర్షుడు
12. గురు గోవింద్‌సింగ్
13. స్వామి రామతీర్థ
14. హరినారాయణ ఆప్టే
15. నానా ఫడ్నవీస్
16. ఈశ్వరచంద్ర విద్యాసాగర్
17. సూరదాసు
18. రామానుజాచార్య

## ఇతర గ్రంథములు

19. మీరు మీ ఆరోగ్యము

# వెలువడిన పుస్తకములు

## భారత దేశము - ప్రజలు

| | వెల రూ. పై. |
|---|---|
| 1. భారత దేశ ఖనిజములు | 5 – 75 |
| 2. పెంపుడు జంతువులు | 4 – 50 |
| 3. సామాన్య వృక్షములు | 4 – 25 |
| 4. నికోబార్ దీవులు | 5 – 60 |
| 5. జనాభా | 3 – 75 |
| 6. ఉద్యాన పుష్పములు | 6 – 00 |
| 7. భారత దేశ ఆర్థిక భూగోళము | 5 – 25 |
| 8. ఋతుపవనములు | 3 – 25 |

## జాతీయ జీవిత గ్రంథమాల

| | |
|---|---|
| 9. సముద్ర గుప్తుడు | 1 – 25 |
| 10. శంకరాచార్యులు | 2 – 00 |
| 11. అహల్యాబాయి | 2 – 00 |
| 12. చంద్రగుప్త మౌర్యుడు | 1 – 50 |
| 13. సుబ్రమణ్య భారతి | 2 – 25 |
| 14. గురునానక్ | 2 – 25 |
| 15. త్యాగరాజు | 1 – 75 |
| 16. రాణి లక్ష్మిబాయి | 2 – 00 |
| 17. కబీర్ | 1 – 75 |

## ఇతర పుస్తకములు

| | |
|---|---|
| 18. భారత దేశము నేడు–రేపు | 0 – 75 |
| 19. కల్కి : లేక నాగరకత భవిష్యత్తు | 0 – 75 |

20. జ్వాలాముఖి 3 – 75

21. ఏక ప్రపంచము భారతదేశము 0 – 75

22. ఝాన్సీ లక్ష్మి 1 – 50

23. పోతన 2 – 75

24. విజ్ఞానం విశేషాలు 1 – 50

25. నవభారత విద్యా పునర్నిర్మాణము 1 – 25

26. ప్రాక్ పశ్చిమ పవిత్ర జ్ఞానాలు 5 – 00

27. మహా విప్లవ వీరుడు 4 – 25

## ఆదాన్ ప్రదాన్

28. స్మృతి రేఖలు 6 – 50

29. బిన్‌కర్ నాడి 2 – 75

30. పంజాబీ కథలు 3 – 50

31. తమిళ కథలు 4 – 00

---